# నన్నెచోడుని కవిత్వము





"భాషాప్రవీణ"
అమరేశం రాజేశ్వరశర్మ, B. A.
Dr. D. Veerabhadrayya Memorial Prize Winner.

# విషయ సూచిక

★

# ప్ర వే శి క

నన్నెచోడ మహాకవిని గూర్చిన పలువిషయములు నేటికిని వివాదాంశములు గానే మిగిలిపోయినవి. కుమారసంభవము నందలి యాతని వ్రాతవలన నీక్రింది విషయములు తెలియనగును. ఈతఁడు సూర్యవంశ క్షత్రియుఁడు. ఈతని తండ్రి పాకనా డిరువదియొక్క వేయిటి కధీశుఁడైన చోడబల్లి. తల్లి హైహయాన్వయాంబర శశిరేఖ యగు శ్రీ*సతి. వీరిది కాశ్యప గోత్రము. వీరి పూర్వులు ఒఱయూరి కధిపతులు. ఈతనికి "టెంకణాదిత్యుఁడు", "కవిరాజ శిఖామణి" యను రెండు బిరుదములు గలవు. ఈతని గురువు విప్రమునిపుంగవుఁడగు జంగమ మల్లికార్జునుఁడు.

నన్నెచోడ మహాకవి కుమారసంభవ కావ్యమునే గాక "కలావిలాస"మను మఱియొక గ్రంథమును గూడ రచించెననియు దానిలోని పద్యములు కవిసంజీవని, రత్నాకరము, అథర్వణ చ్ఛందము, లక్షణశిరోమణి యను గ్రంథములం దుదాహృతము లయినవనియు కీ॥ శే॥ శ్రీ మానవల్లి రామకృష్ణ కవి. ఎమ్. ఏ. గారు తమ ప్రథమభాగ పీఠికయందు వచించి వానిలో నాలుగు పద్యము లుదాహరించినారు. అది నేడు లభ్యము గాదు. ఈవిషయమున కుమారసంభవమునం దేమియు నాధారములేదు. కవి యా గ్రంథమును గూడ వ్రాసియున్నచో నది కుమారసంభవము తరువాత వ్రాయబడి యుండవచ్చును. ఇఁక నావిషయము.

నేను గత వత్సర ముస్మానియా విశ్వ విద్యాలయపు M.A. (Previous) పరీక్షకై పాఠ్య గ్రంథమగుటచే నన్నెచోడ మహాకవి కుమారసంభవమును గొంత భాగము చదువవలసి వచ్చినది. అంతకు ముందును గొన్ని ఘట్టములు విద్యార్థులకుఁ బాఠములు చెప్పుటకుఁ జూడవలసి వచ్చినది. ఇట్లుఁ గొంచెము కొంచెముగాఁ జదువుచున్నప్పుడే నాకు కుమారసంభవమును సమగ్రముగా విమర్శన దృష్టితోఁ

---

*ఈ విషయమును వివాదగ్రస్తమే. నేడు మనకు లభించు తంజావూరు లైబ్రరీ యందలి యేకైక మూలప్రతియందు ఈ "శ్రీ" యను నక్షరము స్పష్టముగా లేదనియు నది "కొ" అను నక్షరమును బోలి యున్నదనియు శ్రీ కోరాడ రామకృష్ణయ్య M. A. గారు వచించుచున్నారు. (చూ. విశ్వ విద్యాలయ ప్రతిలోని పీఠిక viii పుటలోని యధోజ్ఞాపిక)

జదువవలెనని కుతూహలము జనించి పోయిన వేసవికాలమంతయు దానికై కొంత పరిశ్రమించుట తటస్థించినది.

వేసఁగి సెలవుల యనంతరము ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమివారి ప్రకటనము పత్రికలలో చూచినప్పటినుండి నా పరిశ్రమ కొక రూపము నీయ వలయునను భావ మంకురించినది. అయ్యు నే నందుకు తగినంత సాహసము లేక యూఱకుంటిని. కాని మిత్రులు, సాహిత్య విద్యా ప్రవీణులు, మా చంద్ర శేఖర, వేంకటేశ్వర శర్మల ప్రోత్సాహము నన్నూఱకుండనీయలేదు. తత్ఫలితమే యీ నా ప్రయత్నము.

నన్నెచోడ మహాకవిని గూర్చి పూజ్యులు శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు కుమారసంభవ ప్రథమ భాగమును బ్రకటించుదనుక నాంధ్రమహాజను లెఱుంగ రనియే చెప్పవచ్చును. తరువాత నీకవి కాలమునుగూర్చి తెలుఁగులోకమున నొక దుమారము రేగినది. తరువాత పండితులు గొందఱు కవిరాజు కవిత్వముపైకిఁ దమ దృష్టిని సారించినారు. తత్ఫలితముగాఁ గొన్ని గ్రంథములు ప్రకటితము లైనవి. మఱికొన్ని పత్రికలందు వ్యాసములు వెలువడినవి. వీనిలోఁ గొన్ని లభించినవానిని నేను చదివి నా రచనమునకు మార్గము వేసికొన్నాను. నా కుపక రించిన గ్రంథముల పట్టికను దీనితో వేఱుగా నిచ్చినాను. తత్కర్త లందఱకు కృతజ్ఞతా పూర్వక నమోవాకముల నర్పించుచున్నాను.

నాకీ రచనమునఁ దోడ్పడిన మిత్రులను బెద్దలను నిట సంస్మరింపకుండుట కృతఘ్నతయగును. నారచనమును సమగ్రముగాఁ జదివి యక్కడక్కడ చక్కని సలహాల నిచ్చినవారు మా చంద్రశేఖర వేంకటేశ్వర శర్మలు. మధ్య మధ్య నా వ్యాసముల నోపికతో వినియు, నుపయుక్తములగు గ్రంథముల నొసంగియు సహాయపడినవారు పూజ్యులగు శ్రీ కురుగంటి సీతారామ భట్టాచార్యులు ఎమ్. ఏ. గారు. పత్రముఖమున నాకృషి నాశీర్వదించి ప్రోత్సాహమొసఁగినవారు పూజ్యులు శ్రీ కోరాడ రామకృష్ణయ్య M. A. గారు. వీరిరువురికి నా నమస్కారములు. ఇదియంతయు నొక్కయెత్తు. పుస్తక ముద్రణ మొక యెత్తు. అజంతా ముద్రణాల యాధిపతులు, శతావధానులు, నయిన శ్రీ శ్రీనివాస సోదరులు సహాయపడని యెడల నా రచన లోకపువెలుఁగును జూడలేక పోయెడిదన్నచో నేను వారికెంత ఋణపడియున్నానో వేరుగా వివరింపఁ బనిలేదు. వారు ముద్రణ కర్తలుగానే గాదు, పండితులుగా నా రచనకుఁ దుదిమెఱుఁగుల నిడుటలోను దోడ్పడినారు. నేను వారి నెంతగా నుతించినను జాలదు. వారికి నా నమస్కారములు. ఇక్కడ

శ్రీ పి. యస్. ఆర్. అప్పారావు ఎమ్. ఏ.గారిని స్మరింపకుండుట భావ్యముగాదు. వారు కీ. శే. శ్రీ మా. రా. కవిగారు ప్రాణపదముగాఁ దాచుకొని యక్కడక్కడ "సవరణ"లు వ్రాసికొని తమకిచ్చిపోయిన కుమారసంభవము 1, 2 భాగములను నాకు దయతోఁ జూడ నిచ్చినారు. అది నా రచనకు మిగుల నుపకరించినది.

ఇక్కడ నొక విషయమును బ్రస్తావించుట యప్రస్తుతముకాదు. శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారి కుమారసంభవమునకు మూలము తంజాపూరి ప్రతియే కాని వారు చెప్పినట్లు ప్రత్యంతరము కాదని పండితులలో నొక భావమున్నది. కాని శ్రీ కవిగారు శ్రీ అప్పారావుగారి కడనున్న కుమారసంభవ ప్రతియందుఁ గావించిన సవరణలను బట్టి వారు 1 భాగమును బ్రకటించిన తరువాతనే తంజాపూరి ప్రతిని జూచిరనియు నంతకుముందు చూడలేదనియుఁ దేలుచున్నది. వారు దీనిని తంజాపూరు ప్రతితో సరిచూచుకొని అందలి విశేషాంశముల నిందు వ్రాసికొనినారు.

ఇఁక రచనలోని గుణదోషముల నిర్ణయింపఁదగినవారు పండితులు. ఎంతవారి కయినను లోపములుండుట తప్పదన్న నావంటివాని సంగతి చెప్పవలయునా? లొసఁగులు చూపినఁ గృతజ్ఞతతో సవరించుకొందునని సవినయముగా విన్నవించుకొనుచున్నాను. నేను నా రచనలో నెవ్వరి మనసునకును నొప్పి కలిగింపకుండుటకై యత్నించితిని. నా యజ్ఞత వలన నెక్కడనయిన నొప్పి కలుగు మాటలు దొరలినచో పెద్దలు నన్ను మన్నింపఁ బ్రార్థించుచున్నాను.

సహృదయులగు నాంధ్ర మహాజనులు నా కృషిని ప్రోత్సహింతురను నమ్మకముతో నీ కృతిని వారిముందుంచుచున్నాను.

4-8-470 గౌలిగూడ
హైదరాబాదు-ఆం. ప్ర.

అమరేశం రాజేశ్వరశర్మ
15-11-1958

# నమస్క్రియ

శ్రీమద్భ్రమరాంబాపతి
నామదిలో నావహిల్లి నన్నియచోడో
ద్దామ కవిత్వ రహస్యా
రామమ్మునఁ దిరుగఁజేసి రాజిలు గాతన్.

కొలఁది యెఱుంగక పూనితి వలదనకను రాజమౌళి వాక్యార్థములన్
గలిగిన మఱుఁగుల్ నెల్లను వెలువఱచి కృతార్థుఁజేయవే నన్నుశివా!

ఓయమ్మ! విన్ను నమ్మి త్వ
దీయమ్మగు కరుణ నాకు నెల్లెడలను నా
ప్యాయమ కూర్చునటంచవి
చేయఁగ నీ కార్య మేను జేకొంటి ధృతిన్.

ఈకవిరాజు కావ్యమున నెన్నిక కెక్కెడుభంగిఁ, దేవియల్
వాకలుగట్టినాఁ జనిన వాక్కులలోని రహస్యభావముల్
లోకుల కందఁజేసి సుఖలోక విహారముఁ గూర్చినట్టి యా
వ్యాకృతి కర్తలైన మహాత్ముల కేను నమస్కరించెదన్.

శివౌ సంప్రార్థయే భక్త్యా శివేతర నివృత్తయే
శివం శివసుతౌ దత్తాం శివభావాశ్చ సంతు మే.

★

# నన్నెచోడ మహాకవి కాలము

ఆంధ్రకవుల చరిత్రమునందు నన్నెచోడుని కాలమును గూర్చిన విషయముకన్న నెక్కువ వివాదగ్రస్త విషయ మింకొకటిలేదు. పండితు లెవరికిఁదోచినరీతిని వా రీతనికాలమును నిర్ణయించినారు. ఇంతకు నీకవి కాలమును నిర్ణయించుట యీ గ్రంథవిషయమునకు లోఁబడినదిగాని, నా కృషికి సాధ్యమయినదిగాని కాదు. అయినను నీకవి కాలమునుగూర్చి యేదేనొక నిర్ణయమునకురాక చారిత్రక దృష్టితో గ్రంథస్థ విషయముల విమర్శింప వీలులేదుకనుక పండితు లింతవఱకీ విషయమునఁ బ్రకటించిన యభిప్రాయముల నరసి వానిలో నాకు సమంజసముగాఁ దోచినదాని నీక్రింద నొసగి ముందుకుసాగుట యుక్తమని యెంతును.

నన్నెచోడకవికాలమునుగూర్చి స్థూలముగా నాలుగు వాదము లున్నట్లు కనిపించుచున్నది. కొందఱీతఁడు నన్నయ భట్టారకునకన్నఁ బ్రాచీనుఁడని భావించినారు. మఱికొందఱీతఁడు నన్నయకు సమకాలికుఁ డన్నారు. ఇంకనుగొందఱీ మహాకవి నన్నయ తిక్కనల నడిమికాలమున జీవించినవాఁడని తేల్చినారు. ఒకరిద్దఱుమాత్ర మీ కవిపుంగవునిఁ దిక్కనకును దరువాతివాఁడని చెప్పినారు. పండితు లిట్లు భిన్నాభిప్రాయు లగుటకుఁ గారణ మీ కవికాలమును నిర్ణయించుటకు సరియయిన శాసనాద్యాధారములు లేకుంటయేయని చెప్ప నవసరములేదుగదా !

నన్నయకుఁ బ్రాచీనుఁడీ కవియని వచించిన వారిలో శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు ప్రథములు. వారిని సమర్థించినవారు శ్రీ నడకుదుటి వీరరాజు పంతులుగారు, డా. నేలటూరి వేంకటరమణయ్యగారు, మఱి కొందఱు.

నన్నయకు సమకాలికుఁడని భావించినవారిలో శ్రీ దేవరపల్లి కృష్ణారెడ్డిగారును, శ్రీ చాగంటి శేషయ్యగారును ముఖ్యులు.

నన్నయ తిక్కనలకు నడిమికాలమువాఁ డనువారు పండితులలో నధిక సంఖ్యాకులు. మదరాసు విశ్వ విద్యాలయమువారు ప్రకటించిన కుమారసంభవమునకుఁ బీఠిక వ్రాసిన శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారును ప్రస్తుతము ఆ విశ్వవిద్యాలయాంధ్రశాఖ కధ్యక్షులు, పరిశోధకులును నగు శ్రీ నిడదవోలు వేంకటరావుగారును, మా గురువులు శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనముగారును, డా. దివాకర్ల వేంకటావధానిగారును, తక్కుంగల పండితులనేకులును, నేఁడు దీనినే బలపఱుచుచున్నారు. శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారును తమ కవుల చరిత్రయందు "ఈ నన్నెచోడకవి నన్నయ భట్టారకునకును, తిక్కన సోమయాజికిని నడిమి కాలమందున్నవాఁ"డని వచించి యీ వాదమునే అంగీకరించి, తక్కిన వారికి త్రోవఁ జూపిరి. శ్రీ జయంతి రామయ్య పంతులుగారును దీనినే బలపఱచిరి.

ఇఁక నీకవిని దిక్కన తరువాతి కాలమునకు లాగినవారు శ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రులుగారు. వారు తమ "కుమారసంభవ విమర్శనము"నం దీతఁడు కొన్ని యెడల తిక్కన సోమయాజి ననుకరించి గ్రంథ రచనము గావించెనని భావించి యీ నిర్ణయమునకు వచ్చిరి. కాని యీ వాదమే నే డన్నింటికన్న బలహీనమయినది. పండితులందెవ్వఱును నీ వాదమును బలపఱచినవారు కానరారు. తిక్కన సోమయాజియే నన్నెచోడ మహాకవి రచనము ననుకరించెనని వచించుటకేమి యభ్యంతరమో శ్రీ శాస్త్రులుగారు చూపలేదు. నేనీ గ్రంథమునఁ జోశరాజు మార్గములు కొన్ని యాతనివేకావి యనుకరణములు కావని చూపుటకుఁ గొంత ప్రయత్నించినాను. పండితులు నిదివఱకట్లే భావించినారు. కావున శ్రీ లక్ష్మీపతి శాస్త్రిగారి కాలనిర్ణయము నేడు పండితులెవ్వరు నంగీకరింప రనుట తేలిన సారాంశము.

ఇక్కడ మఱియొక విషయము చెప్పుట యప్రస్తుతము కాదనుకొందును. "పాలకురికి సోమనాథుని" గూర్చి యొక గ్రంథమునే ప్రక

టించిన విమర్శకాగ్రేసర శ్రీ బండారు తమ్మయ్యగారు తమ గ్రంథమున నీ కవిరాజు పాలకురికి సోమనాథ మహాకవికిఁ దరువాతివాఁడనియు నాతని నీకవిరాజు తన గ్రంథమున ననుకరించిన పట్టులు కాననగుననియు వచించినారు. కాని యిది యుక్తముగాఁ గనుపట్టదు. చోడుని కాలము వలెనే సోమనాథుని కాలమును వివాదాంశము. నేటికిని శ్రీ తమ్మయ్యగారది సునిశ్చితాంశమనియే భావించినను బండితులు వారి వాదము నంగీకరించుటలేదు. శ్రీ చాగంటి శేషయ్యగారు సోమనాథుని రెండవ ప్రతాపరుద్రుని కాలము వానినిగానే చెప్పినారు. అదియునుగాక యీ యనుకరణముల నాధారముగాఁగొని కాలమును నిర్ణయించుటయు సమంజసము కాదు. ఎవరి నెవరనుకరించిరో నిర్ణయించుట కష్టము. నన్నెచోడుని నాటికి వీరశైవమే వ్యాప్తియందున్నట్లు కానరాదు. అతఁడు వీరశైవుఁడు కాఁడు. ఈ విషయమును నేనీ గ్రంథముననే స్థలాంతరమున వివరించినాను. ఛందో విషయమును సోమనాథుఁడు నన్నెచోడునికిఁ దరువాతివాఁడనుటనే బలపఱచుచున్నది. (చూ. దీనిలోనిదే "తరువోజ" యను ప్రకరణము) కావున శ్రీ తమ్మయ్యగారు వచించినది సమంజసము కాదని నేను భావించుచున్నాను. మదరాసు విశ్వ విద్యాలయాంధ్రోపన్యాసకులును వీరశైవ వాఙ్మయ చరిత్రాది గ్రంథకర్తలునునగు శ్రీ శిష్ట్లా రామకృష్ణశాస్త్రి యమ్. ఏ. గారును సోమనాథుని రెండవ ప్రతాపరుద్రునికి సమకాలికుఁడని నిర్ణయించి యీ విషయమునే బలపఱచినారు. చూ. 1953 జనవరినెల భారతిలోని "సోమనాథుని కాలము" అను శాస్త్రిగారి వ్యాసము.

ఈ విధముగాఁ బండితులలో నన్నెచోడుని కాలమునుగూర్చి పలువివాదము లున్నను కుమారసంభవ గ్రంథ ప్రాదుర్భావమునకు సంబంధించినంతవఱకవి మూఁడుగానే యెంచవలెను. అందు నన్నయ భారతమునకుముందీ గ్రంథ మావిర్భవించెననునది మొదటిది. నన్నయ తిక్కనల భారతములకు మధ్య కాలమునఁ గుమారసంభవము వెలసెననుట రెండవది. తిక్కన భారతమునకుఁ బిమ్మటననుట మూడవది.

పండితులలో నధిక సంఖ్యాకు లంగీకరించిన మధ్యవాదము నాధారముగా గొనియే నేనీ గ్రంథమున నిర్ణయములఁ జేసితినని విన్నవించుచు నీ ప్రకరణము నింతతో ముగింతును.

## మంగళాచరణము

ఆంధ్రవాఙ్మయమున గ్రంథాదిని మంగళాచరణము గావించుట యందు రెండు సంప్రదాయములు గలవు. ఒక్కటి నన్నపార్యుఁడు ప్రారంభించినది. నన్నయ భట్టారకుఁడు తన భారత గ్రంథ ప్రారంభమున "శ్రీ వాణీ గిరిజా శ్చిరాయ దధతో వక్షో ముఖాంగేషు యే" యని ప్రారంభించి వేదత్రయ మూర్తులగు బ్రహ్మ విష్ణు మహేశ్వరులను గీర్వాణ భాషలో నుతించెను. ఆతనికిఁ గొంచెము తరువాతివాఁడో సమకాలికుఁడో యయిన పావులూరి మల్లన్నయు నన్నయ భట్టారకుని వలెనే తన గణిత గ్రంథమున మంగళాచరణమును సంస్కృత భాషలోనే గావించెను. తిక్కనయు నిర్వచనోత్తర రామాయణమున మంగళాచరణమును సంస్కృత భాషలోనే గావించి తరువాత భారతమున "శ్రీయన గౌరినాఁ బరగు" నని యాంధ్రముననే మంగళాచరణమును గావించినాఁడు. నన్నయ తరువాతఁ దిక్కనకు ముందున్న యాంధ్ర కవులలోఁ గొందఱి గ్రంథములు లభింపకపోవుటచే నానాటి మంగళాచరణ భాష నిదమిత్థముగా నిర్ణయింప నవకాశములేదు.

తెలుఁగున మంగళాచరణము గావించు సంప్రదాయమే రెండవది. దీనిని బ్రారంభించినవాఁడు తిక్కనయే యనియుఁ దరువాతి వారందఱు నాతని భారతము ననుకరించి తెలుఁగుననే మంగళాచరణముఁ గావించుచు వచ్చిరనియు కీ॥ శే॥ కందుకూరి వీరేశలింగము గారు తమ కవుల చరిత్రయం దుల్లేఖించిరి. విమర్శించి చూడఁగా దీని యందు సత్యమున్నట్లు గానరాదు. తిక్కన తరువాతివా రందఱును

దవ గ్రంథములందు మంగళాచరణములను దెలుఁగులోఁ జేయలే దనియు, సంస్కృతమునందు నయితము మంగళాచరణము గావించినవా రున్నారనియు విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణి సాక్ష్య మిచ్చుచున్నది. దానిలోని మంగళాచరణ మీ క్రిందివిధముగా నున్నది.

"శ్రీవాగాస్పదయోః పరస్పరయుజోః శ్రుత్యుత్సవ శ్లాఘయో
రాగాలాప నియాధయో ర్యతిగణ వ్యాపారపారీణయోః
సారస్యం గిరిజేశయో రివ సదా సంగీత సాహిత్యయో
ర్విద్వద్విశ్రమహేతుకం విహరతాం చాళుక్య విశ్వప్రభౌ"

ఈ విన్నకోట పెద్దన్న పదునైదవ శతాబ్ది ప్రథమ పాదమున గ్రంథ రచనము గావించి వఱలినవాఁడని యాధారసహితముగా నిరూపిత మయినది. ఇంతేగాక 15 శతాబ్ది ప్రథమ పాదమున నున్న మడికి సింగన తన వాసిష్ఠ రామాయణమున మంగళాచరణమును రెండు సంస్కృత శ్లోకములతోఁ గావించినాఁడు. ఇదియును పై విషయమునే బలపఱచు చున్నది. కావునఁ దిక్కన తరువాతఁగూడ మంగళాచరణమున నన్నయ సంప్రదాయమునే పాటించిన యాంధ్ర కవులును గలరని నిశ్చయమగు చున్నది.

ఇఁకఁ దిక్కనకుఁ బూర్వము తెలుఁగున మంగళాచరణము గావించినవా రెవరయిన నున్నారా? యని యాలోచించవలసి యున్నది. నన్నెచోడ మహాకవి తన కుమారసంభవమున మంగళాచరణము నాంధ్రముననే గావించినాఁడనుట స్పష్టముగదా! తెలుఁగుననే మంగళా చరణము గావించిన మఱియొక యాంధ్రకవి రేచయ. ఈతఁడు తన కవిజనాశ్రయ గ్రంథమున

"శ్రీకాంతాతిప్రియ వా
క్శ్రీ కాంత జగత్త్రయైక సేవిత నుత వి
ద్యాకాంత దివ్య కావ్య స
దేకాంత నితాంతకాంతి నీవుత మాకున్".

అని తెలుఁగు భాషనే భారతీ స్తుతి గావించినాడు. కవిజనాశ్రయ కర్త యెప్పటివాఁడో నిర్ణయించుటకు సరియయిన యాధారములులేవు. అతఁడు కుమారసంభవ కర్తకు ముందువాఁడను వాదము దుర్బలమయినది. "శ్రీ శ్రితవక్షుఁడు" అను పద్యములం దెవరి నెవరనుకరించిరో నిర్ణయించుట సాధ్యముకాదు. ఏమయినను వారిరువురు కొంచె మించుగాఁ దిక్కనకుఁ బూర్వ మేకకాలమున నున్నవారు కావచ్చును.

రేచన కవిజనాశ్రయమునఁ దాను వస్తు కవిజనాశ్రయుఁడనని యీ క్రింది పద్యమునఁ జెప్పుకొనినాఁడు.

"నాలుగడుగులను న నల నల నసంబు
లోలి నిలిపి మూఁడగు కడ నొండెవళ్లు
ప్రాలు నిడియొండె జెప్పిన వస్తు కవిజ
నాశ్రయా! తేటగీతియ యగు ధరిత్రి" (జాత్యధికారము)

నన్నెచోడుఁ డాంధ్రమున వస్తుకవితకు మార్గదర్శకుఁడుగదా! కావున వస్తుకవుల ప్రశంస నెత్తుకొన్న రేచన కుమారసంభవ కర్తకుఁ బిమ్మటివాఁడగును గాని ముందరివాఁడు కాలేఁడు.

ఇంతకును దేలిన సారాంశ మేమనఁగా దెలుఁగు కావ్యములందుఁ దెలుఁగు భాషయందే మంగళాచరణము చేయవలయునను (దేశి) సంప్రదాయమును నెలకొల్పినవాఁడు నన్నెచోడుఁడే యనునది. నన్నయ మార్గమున నాదరాభిమానములు లేనివాఁడగుటచేతను, దేశిసంప్రదాయములందును, దేశిమార్గములందును మిక్కిలి యభిమానము గలవాఁడగుటచేతను నీ దేశభాషాసంప్రదాయమును నన్నెచోడుఁడే కావ్యజగములోనికిఁ బ్రవేశపెట్టియుండుననుట యుక్తియుక్తముగాఁ గనుపట్టుచున్నది.

తిక్కనకుఁ బూర్వమే యీ యాచారము గలదనుట కొక బలమయిన శాసనాధారమును గలదు. కాకతీయరాజులలో రుద్రదేవ మహారాజు సుప్రసిద్ధుఁడు. ఈతఁడు గణపతిదేవచక్రవర్తి తండ్రికి సోదరుఁడు. ఈ రుద్రదేవునికడ మంత్రి గంగాధరకవి. ఈతఁడు 1170 A. D. లో

రచించి వేయించిన పద్యమయశాసన మొకటి కరీంనగరమున లభించి నది. ఇది యొక లఘుకావ్యమన నలరుచున్నది. ఈ శాసనమున కాదిని మంగళాచరణమును, తరువాత కృతికర్త వంశాభివర్ణనమును, పిమ్మట భర్తయగు రుద్రదేవుని వంశాభివర్ణనమును గృత్యాదిషట్కములో నున్నవి. దానిలోని దీక్రింది పద్యము,

"శ్రీరామాధిపుఁ డింద్రనీలనిభ శారీరుం డుదారుండు గౌ
రీ రామాధిపుఁ డుజ్జ్వల స్ఫటిక శారీరుండు ధీరుండు భా
షారామాధిపుఁ డబ్జకేసర లసచ్ఛాయా శరీరుండునుం
గారుణ్యంబున మాకు నీవుత సదాకాలంబుఁ గామార్థముల్."

(తెలంగాణాశాసనములు - 6. కరీంనగరశాసనము 12 పుట)

పై యాశీఃపద్యమునందును నన్నయ మంగళాచరణమునందు వలెనే త్రిమూర్తిస్తుతి యున్నది. అయ్యు నిది యాంధ్రభాషయందుండుట విశేషము. నన్నయ్య పద్యమువలె నిదియు శార్దూల విక్రీడితమే. మొదట మగణముండుట శ్రేయస్కరమను సంప్రదాయపాలనము దీనికి హేతు వయి యుండును.

ఈ విధముగాఁ దిక్కనకుఁ బూర్వమే దేశమున నాచారమం దున్న తెలుఁగు మంగళాచరణ విధానమును నన్నెచోడుఁడు తన గ్రంథ మునఁ జేర్చికొని తరువాత తిక్కనాదులకు మార్గదర్శియయినా డనుట యుక్తిదూరముగాదు.

నన్నెచోడుని మంగళాచరణమును గుఱించి యొక విషయమును వివరించనిచో నీ ప్రకరణము సమగ్రము కాదు. అది యాతని స్రగ్ధరా వృత్తమును గుఱించినవిషయము.

నన్నెచోడుఁడు సందర్భమున కుచితములయిన వృత్తముల నేరు కొనుటలో నాంధ్రవాఙ్మయమునం దద్వితీయుఁడు. ఆ విషయ మన్యత్ర సోదాహరణముగా నీ గ్రంథముననే వివరింపఁబడినది. ఆతఁ డట్టి యుచి తజ్ఞుఁడు కావుననే ప్రప్రథమమున స్రగ్ధరావృత్తమునుంచి తన కావ్యము

నారంభించినాఁడు, ప్రక్కనగాఁ బూలమాలగదా: స్రగ్ధరుఁడగు శివుని చరిత్రమిం దావృత్తమయినది. శివస్తుతి కిది యర్థ్యముగా నున్నది. పద్యాది శ్రీకారము, మగణము మంగళకారణములు. కావున నన్నెచోడుని యీ మంగళాచరణ మొక ప్రత్యేకపద్ధతికిఁ జెంది సహృదయ హృదయాహ్లాదకముగా నున్నది.

ఇది యిట్లుండగా నథర్వణుఁడు నన్నెచోడుఁడు మగణ రగణములను గృత్యాదినిడి మరణమునందెనని యీ క్రిందిరీతిని వచించినాఁడు.

"మగణమ్ము గదియ రగణము
వగవక కృతిమొదట నిలుపువానికి మరణం
బగు నిక్కమండ్రు, మడియఁడె
యగునని యిడితొల్లి చేంకణాదిత్యుఁడనిన్."

ఈ పద్యములోని చేంకణాదిత్యుఁడు నన్నెచోడుఁడే యనియు నాతని మంగళాచరణ పద్యముననే మరయోగము గలదనియుఁ గావుననే యాతఁడు యుద్ధమున మరణించెననియుఁ బలువురు వచించినారు.

ఇది కొంచెము విమృశ్యము. కృత్యాదిని మగణము శుభదమనియు నయ్యు నది క్రూరగణయుతమై క్రూరమగుననియుఁ బలువురు ఛందఃకర్తలు వచించినారు. కవిజనాశ్రయకర్త గణదోష ప్రకరణమున నేయేగణములయోగ మరిష్ట దాయకమో వివరముగా వచించినాఁడు. కావి యందు మరయోగము మరణయోగముగాఁ జెప్పఁబడలేదు. అంతే గాక కవి జనాశ్రయకారుఁడు యగణాంతమగు పద్యము శుభకరమని,

"తగు పద్య మొండెఁ గర్తకు
*యగణాంతము* చెప్ప శుభములయ్యెడుకొలఁకున్."

అను పద్యమునఁ జెప్పినాఁడు. స్రగ్ధర యగణాంతము. అది కర్తకు శుభకరము. వీనినన్నింటిని నెఱిఁగియే కవిరాజు తన కావ్యమును స్రగ్ధరా వృత్తముతో నారంభించి నిర్విఘ్నముగాఁ బూర్తిఁ గావించినాడు.

అంతేకాదు; స్రగ్ధరా వృత్తముతో నారంభించి తమ కావ్యముల నాచంద్రార్కస్థాయిగా నిలుపుకొన్న మహాకవులనేకులు గీర్వాణభాషయందున్నారు. వారందఱును యుద్ధములందు మరణించి రనుట కాధారములును లేవు. పైపెచ్చు వారి గ్రంథముల కథర్వణాచార్యుల గ్రంథములకుఁ బట్టిన స్థితియుఁ బట్టలేదు.

కవికులగురువగు కాళిదాసు తన శాకుంతల నాటకమును స్రగ్ధరా వృత్తముతోనే యారంభించినాఁడు. అదియు శివమూర్తిస్తవమే.

కాళిదాసమహాకవి మఱియొక నాటకము మాలవికాగ్నిమిత్రము. దానియందును శివస్తవమే స్రగ్ధరా వృత్తముననే కలదు.

స్రగ్ధరావృత్తముననే నాందిగావించిన మరియొక సుప్రసిద్ధ గీర్వాణ నాటకకర్త విశాఖదత్తుఁడు. ఈతఁడు నుమామహేశ్వరుల విలాసవచనములనే స్రగ్ధరావృత్తమునందు ముద్రారాక్షసనాటక ముఖమున వర్ణించెను.

ఇంతేకాక శూద్రకకవి మృచ్ఛకటికమునందును, దండ్యాచార్యుని దశకుమార చరిత్రమునందును, భవభూతి మహావీరచరితమునందును "మంగళాచరణ" పద్యములు స్రగ్ధరావృత్తమునఁ గలవు. వీరేగాక ఆశ్చర్యచూడామణ్యాది గ్రంథముల రచించిన సంస్కృత మహాకవులెందఱో తమ గ్రంథములను స్రగ్ధరావృత్తముతో నారభించినవారున్నారు. వారెవ్వరికి నథర్వణశాపము తగిలినట్లు కానరాదు. ఒక్క నన్నెచోడ మహాకవినిగూర్చియే యథర్వణుఁ డిట్లు పలుకుటకుఁ గారణమేమయి యుండునో! దీనికిని వారివారి మతవిశ్వాసములే కారణమయి యుండునేమో యని విచారించుటయు నసంగతముగాదు.

ఏమయినను గుమారసంభవకర్త తరువాత నాంధ్రకవులు తమ కావ్యములను స్రగ్ధరావృత్తముతో నారంభింపకుండఁజేయుట కుపయోగించినది యథర్వణాచార్యుల పద్యము.

ఆంధ్రదేశమునందును స్రగ్ధరావృత్తము శాసనములందు మొదటఁ గానవచ్చుచున్నది. రాజరాజనరేంద్రుని కూతురు సోమలదేవి ద్రాక్షారామ

మున వేయించిన శాసనమునం దీక్రింది స్రగ్ధరావృత్తము ప్రప్రథమమునఁ గలదు.

"శాకేసంవత్సరేషు మునివసునిధిగే రాజమార్తాండభూభృ
త్పుత్రీ సారంగనేత్రీ కనకవిరచితం కల్పభూజాతపుష్పం
ప్రాదా ద్భీమేశ్వరాయ వ్యదిశ దథ సదా దీవ్యదాచంద్రతారం
దీపం రౌప్యంచ పాత్రం బిససదృశభుజా సోమలదేవీతనూజా."

(చూ. రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచికలో కొ. వేం. లక్ష్మణరావుగారి "సోమలదేవి శాసనము" అను వ్యాసము.)

నన్నయభట్టారకుని "శ్రీవాణీగిరిజా" ఇత్యాది పద్యమున కహోబలుఁడు విపుల వ్యాఖ్యానమును వ్రాసినాఁడు. వివరింపవలయునన్న నంతటి వివరణము నీ కవిరాజు మంగళాచరణమునకును వ్రాయవలయును.

ఈ మహాకవి మంగళాచరణమున శాస్త్రమర్యాదల నతిక్రమించినవాఁడు కాఁడనియుఁ బైపెచ్చు వానికి మెఱుఁగులిడిన వాఁడే యనియు ననుట సారాంశము.

## వస్తుకవిత యనఁగా నేమి ?

వస్తుప్రధానమయిన కవిత వస్తుకవిత యని విన్నకోట పెద్దన వచించెను. నన్నెచోడుఁడు విన్నకోట పెద్దనకుఁ గొంచెము ముందరివాఁడు. వీరిద్దఱకును గొన్ని విషయములలోఁ బోలికలు స్పష్టముగా గనిపించుచున్నవి. ఉదాహరణమున కలంకార విషయమును, కావ్యగుణ విషయమును గ్రహింపవచ్చును. అలంకారము లిద్దఱును ముప్పదియారే యని యంగీకరించినారు. అట్లే కావ్యగుణములు దశప్రాణములవంటివని యిరువురును జెప్పినారు. బహుశః వారిరువురును గొంచెమించుమించుగా నేకకాలమునఁ గాకపోయినను సమీపకాలములందు జీవించిన

వారగుటచేత నానాఁడు వ్యాప్తియందున్న విషయముల గ్రహించి యుం దురు. నేడా విషయములు మనకుఁ గ్రొత్తగాఁ గనుపట్టుచున్నవి గాని యానాటివారి కవి సామాన్యములే యయియుండును.

ఇంతకుఁ బెద్దనయు "వస్తు" వనగా నేమో స్పష్టముగా వచించలేదు. సామాన్యముగా నాలంకారికుల సంప్రదాయమున కథ యితివృత్తమనియు, వస్తువనియు వ్యవహృతమయినట్లు కానగును. కవిరాజ శిఖామణియు "వస్తు" వను మాట నీ యర్థముననే వాడియుం డునా యని యాలోచించుట ముఖ్యమయినది. చోడుఁ డీ యర్థముననే "వస్తు" పదమును వాడినాడన్నచో నన్నయ చెప్పిన ప్రసన్నకథా కలి తార్థయుక్తియు నిదియు నొక్కటే యనవలసియుండును. అనగా నన్నయ భారతమును చోడుని యభిప్రాయానుసారముగా వస్తుకావ్యమే యగుననుట. కవిరాజు నన్నయను గూర్చిగాని, నన్నయ భారతమును గూర్చి గాని కుమారసంభవమున నేమియుఁ జెప్పలేదనుట సువిదిత విషయము. అయినను వీరిరువురును సమానముగాఁ జెప్పిన విషయ ములు లేకపోలేదు. "అక్షరములు సూక్తు లార్యులకుఁ గర్ణరసాయన లీలఁ గ్రాలఁగాన్" అని నన్నెచోడుఁడు తన కావ్యమున నక్షరముల కును సూక్తులకును స్థానమున్నట్లు వచించినాడు. నన్నపార్యుఁడును "ఇతరు లక్షర రమ్యత నాదరింప నానారుచిరార్థ సూక్తినిధి" యని యక్షర రమ్యతను సూక్తులను బేర్కొన్నాడు. ఇట్లే దేవతాస్తుతియం దును వీ రిరువురకుఁ గొన్ని పోలికలు గలవు. వీనినిబట్టి చూడఁగా నితి వృత్త ప్రధానమయిన కావ్యము వస్తుకావ్యమని తేలును.

కాని సూక్ష్మముగాఁ బరిశీలించినచో నిది యథార్థముగా గనిపిం పదు. కథా ప్రధానమగు కవిత వస్తు కవిత యగుచో వ్యాసుఁడు వస్తు కవి కావలసివచ్చును. కాని కుమారసంభవమున చోడుఁడు వ్యాసుని స్తుతించిన పద్యమున నాతనిని వస్తుకవిగాఁ జెప్పలేదు. దీనినిబట్టి భార తము వస్తుకావ్యము కాదని చోడుని యభిప్రాయ మయినట్లు తేలును.

కావున నన్నెచోడుని వస్తు కవితయు, నన్నయ ప్రసన్న కథాకలితార్థ యుక్తియు నొక్కటికావని తేలుచున్నది.

ఇఁక చోడుఁడీ శబ్దము నెట్టి యర్థము నుద్దేశించి వాడినాఁడో చూడవలసియున్నది. నా యభిప్రాయము నిందుఁ బ్రకటించుటకు ముందుఁ బ్రాచీను లేమనినారో వివరింతును.

కుమారసంభవముపై నొక విమర్శన గ్రంథమునే రచించిన శ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిలుగారు వస్తుకవితయనగా నేమో వివరించి నట్లు కానరాదు. తరువాత "వస్తుకవిత" యను విషయమును వివరించిన వారు శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు. వారు తమ కుమారసంభవ పీఠిక యందు "వస్తుకవిత" యన నేమో యీ క్రిందిరీతి నూహించిరి. వారి మాటలతోనే దానిని జెప్పుట యుక్తమని భావింతును.

> "భావప్రధానమయినదానికి భిన్నమై - వస్తుప్రాధాన్యముగలిగి వర్ణనీయ వస్తువును గూర్చి చమత్కార వర్ణనలతోఁ గూడిన కవిత యని దీనివలన నీతని (కవి) యభిప్రాయము కానోపును".
>
> (కుమారసంభవ పీఠిక-పుట xxxi)

శ్రీ రామకృష్ణయ్యగారు చెప్పిన యీ నిర్వచనమునకు నేనిట్లర్థము చేసి కొన్నాను: వస్తుకవితలో (i) భావమునకుఁ బ్రాధాన్యముండదు. (ii) వస్తువునకు మాత్రమే ప్రాధాన్యముండును. (iii) చమత్కార వర్ణన లుండవలెను, కాని యవి వర్ణ్య వస్తువును గూర్చినవిగా మాత్రమే యుండవలెను.

ఇప్పుడు శ్రీ రామకృష్ణయ్యగారి నిర్వచనము నన్నెచోడుని కవిత కెంతవఱకు వర్తించునో పరిశీలింపవలయును.

శ్రీ రామకృష్ణయ్యగారు చెప్పినదానినిబట్టి వస్తు కవితలో భావమునకుఁ బ్రాధాన్యముండరాదు. కాని నన్నెచోడుఁడు తన కావ్యమున భావమునకుఁ బ్రాధాన్యమున్నట్లు కృత్యాదిని కంఠోక్తిగా పలుమార్లు వచించినాఁడు.

1. సరళముగాగ భావములు జానుఁ దెనుంగున నింపు పెంపుతోఁ బిరిగొన.... (కుమా. 1 ఆ. 35 ప.)

2. మృదురీతి సూక్తులిం పొదవింప మేలిల్లు
భావమ్ము నెలమి క్రీడావహముగ (1-36)

3. (ఇమ్మహిం)
బరగు సువర్ణబంధమ్మృదుభావ విశేషము లొప్పుదెల్పులన్
సరియగు రత్నపుత్రికయు సత్కవి కావ్యము నొక్క రూపమై.
(1-37)

4. "చతురోక్తులనుతపద బహు
గతుల నలంకార భావ కాంతి రసార్థో
న్నతి గతి నతి రసికులు వర
సతిగతి నెఱిఁగింప వలదె సౌభాగ్యమునన్." (1-39)

5. దశప్రాణంబుల సప్రాణంబై నవరస *భావభరితంబై.* (1-45)

దీనినిబట్టి నన్నెచోడ మహాకవి తన కావ్యమున భావమునకుఁ బ్రాధాన్యమున్నదనిచెప్పినట్లు స్పష్టముగా తేలుచున్నది. కావున శ్రీ రామకృష్ణయ్యగారు చెప్పినదానిలో మొదటిది భావ ప్రాధాన్య రాహిత్యమనునది వస్తుకవితకుఁ బట్టదని స్పష్టమగుచున్నది. కుమారసంభవములోని భావములనుగూర్చి మఱియొకచోట వచింతును.

ఇఁక రెండవది వస్తు ప్రాధాన్యము. ఇది కొంతవఱకు యుక్తముగానే చెప్పఁబడినది. ఇంతకు "వస్తు"వననేమో ? నిర్వచింపవలయును. అది తేలినచో నీ విశేషణము నర్థము నెఱుగ వీలగును.

మూడవది వస్తువునుగూర్చిన చమత్కార వర్ణనలతోఁ గూడి యుండుట. నన్నెచోడుని కవితలో చమత్కార వర్ణన లున్నవనుట యథార్థము. అవి వస్తువునుగూర్చినవే యగుటయు నిజమే. వస్తువనగా వర్ణ్యవస్తువని భావించినచో నిది మఱింత స్పష్టమగును. అనగా నన్నెచోడుని కవిత వర్ణనా ప్రధానమయిన కవితయని తేలుచున్నదన్నమాట. ఈ విషయమునే శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనముగారు తమ ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహమున నీక్రింది విధముగ నుల్లేఖించినారు.

"నన్నెచోడుఁడు ప్రకృతి పరిశీలననమునందును, వర్ణనమునందును నిపుణుఁడు. వర్ణనలు సహజముగనే ఉండును. ఈతడు తన గ్రంథము 'వస్తుకావ్యము' అని చెప్పుకొనెను. *వస్తుకవిత్వ మనగా వర్ణనాత్మక మయిన ఫణితియని యాతని భావమైయుండును.*"

(ఆం. సా. చ. సంగ్ర. పుట 27)

నన్నయ భారతముఁజూచి నన్నెచోడుని గ్రంథమును బఠించినచో వెంటనే కనిపించు విశేషములలో వర్ణనలొక్కటి. తన కావ్యమున నష్టాదశ వర్ణనము లున్నవని నన్నెచోడుఁడే కృత్యాదిని వచించెను. కావున నాతని కవిత్వమున వర్ణనములకుఁ బ్రాధాన్యము గలదని యనుటలో ననౌచిత్య మేమియు లేదు.

కాని చోడుఁడీ భావముననే వస్తుకవితా శబ్దమును వాడియుండునా? యనుట విచారింపఁదగినది. అట్లనుటకుఁ గొన్ని యాటంకములు కనిపించుచున్నవి.

చోడుఁడు కృత్యాదిని కొందఱు గీర్వాణ కవులను బేర్కొని యందుఁ గొందఱు మాత్రమే వస్తుకవులని వచించినాఁడు. ఆ విధముగాఁ బేర్కొన్నవారిలో వస్తుకవులని చెప్పఁబడినవారు వాల్మీకి, భారవి, ఉద్భటుఁడు. వీరి కవితలో వర్ణనము లున్నవి. వస్తుకవులు కానివారు వ్యాస, కాళిదాస, బాణభట్టులు. కాళిదాస కుమారసంభవమున వర్ణ్య విషయిక విచిత్ర వర్ణనలు లేవనుట సాహసమగునుగదా! బాణభట్టు వర్ణనలకుఁ బుట్టినిల్లుగదా! వర్ణన ప్రధాన కవితయే వస్తుకవితయని యన్నచోఁ జోడుఁడు వీరిని వస్తుకవులని యేల వచింపలేదు? కావునఁ జోడుఁడు వర్ణనములకుఁ బ్రాధాన్యము గలదను నర్థమున నీవస్తు కవితాశబ్దమును వాడలేదేమో యను ననుమానము కలుగుట యనుచితము కాఁబోదు.

మఱి యట్లయిన చోడుని వస్తుకవితయననేది? యను ప్రశ్నము కలుగును. దానికి సమాధాన మరయుట మన కర్తవ్యము. ఆ సమాధానము చోడుని భావానుగుణముగా నుండవలెను. ఆతని కవిత్వమున

కన్వయింప వలయును. అంతేగాదు. ఆ నిర్వచనము వాల్మీకి, భారవి, యుద్భటుల కావ్యముల కన్వయింపవలెను. అప్పుడే దానికిఁ గొంత యర్థముండును. నేనందుకు నా యోపినకొలది ప్రయత్నింతును.

నన్నెచోడుఁడు కృత్యాదిని కవి స్తుతిచేయుచు వాల్మీకిని "వస్తు కావ్యాబ్జరవి" యనియు, భారవి యింద్రకీల నగారోహణ వర్ణనమున నుదయ పర్వతారోహణమున రవివలెఁ బ్రకాశించెననియు, నుద్భటుఁడు గూఢవస్తుమయ కావ్యముగా కుమారసంభవమ్మును రచించెననియుఁ బొగడెను. పిమ్మట విబుధ వర్గము కృతవస్తు సమితికి మది నెఱుగు ననెను. (1-26) పిమ్మటఁ దన కృతియందుండు కవితా గుణముల రెండు పద్యములచే వచించుచు నట్టికావ్యమును

"ఆదరించి విని సదర్థాతిశయమున
బుధులు నెమ్మనముల నిధులు నిలుప
వలవదే సమస్తవస్తుకవీశ్వర
నూత్న రుచిరకావ్య రత్నవీధి."	(1-36)

నని వచించినాఁడు. దీనినిబట్టి నన్నెచోడుని కవిత "వస్తుకవిత" యని స్పష్టమయినది. ఇట్టి యీతని వస్తుకవిత జంగమమల్లయవరమునందుఁ గనినదియుఁ గావున దాని నాతనియందే నెగడింతుననియుఁ గవి యీ క్రిందిరీతిని జెప్పినాఁడు.

"నింగిముట్టియున్న జంగమ మల్లయ
వరమునందుఁ గనిన వస్తుకవిత
దగిలి వారియంద నెగడింతు రవికి దీ
పమున నర్చలిచ్చు పగిదివోలె."	(1-49)

ఇట్టి యీ వస్తుకవిత యీకవిరాజునకు "అనూన ప్రతిభార్ణవోదీర్ణ రుచిర వస్తువిస్తారితమయి" న దనియుఁ జెప్పఁబడినది (1-56). కావునఁ దన కవితచే నమృతాంశు భూషణావతారంబయిన జంగమమల్లికార్జునదేవుని స్తుతింపనెంచి యీకృతిని రచింప సమకట్టినాడీ మహాకవి.

అనగాఁ దాను వస్తుకవి. తన కావ్యము వస్తుకావ్యము. తన గురువగు మల్లికార్జునుఁడు వస్తుకవి స్తవనీయుఁడు. తన సూక్తులు వస్తుకవి స్తవనీయములు. ఇవి చోడుని యభిప్రాయములు. ఇంతవరకు నందఱు నంగీకరించినదే. ఇంతకు నీవస్తుకవిత యన నేమి ? ఈ క్రింది పద్యమున దానికిఁ గొంత సమాధానము గలదని నేను భావించుచున్నాను.

"జంగమమల్లికార్జును *నిసర్గకవి స్తవనీయసూక్తియు*
*క్తిం గొనియాడి* సత్కవితఁ గేనము లే కనురక్తయైన భా
షాంగనఁ దక్క నేలిన మహత్త్వము లోకమునం బ్రసిద్ధిగా
భంగిగ విస్తరించెదఁ బ్రబంధము సద్రసబంధురంబుగాన్."

(1-48)

పైపద్యమునఁ దానీ కావ్యరూపమునఁ దన గురువును "నిసర్గకవి స్తవనీయసూక్తులం గొనియాడఁ" దలఁచినట్లును, దనకు సత్కవితయందు మాయలులేక భాషాంగన వలచివచ్చినదనియు, నట్టి మహిమను లోకమున విలుపుకొఱకుఁ దానీ ప్రబంధము వ్రాయ నెంచినట్లును నన్నెచోడుఁడు స్పష్టముగాఁ జెప్పినాఁడు. కావుననే యాతఁడు కృతిపతికిఁ గృతినాయకునితో నభేదమునువచించి గ్రంథరచనము సాగించినాఁడు. అదియంతయు మనకు ప్రస్తుతాంశముకాదు. పై పద్యమున మనకుఁ బ్రస్తుతాంశమున నుపయోగించునది యాతని సూక్తులు *నిసర్గకవి స్తవనీయము* లను మాటయే. ఈ నిసర్గకవులు వస్తుకవులేకాని యన్యులు కారు. అయిన నన్నెచోడుఁడు "నిసర్గకవి" యగునన్నమాట. ఈ విషయమునే పై పద్యములోని

"                    ...సత్కవితఁ గేనములే కనురక్తయైన భా
షాంగనఁ దక్క నేలిన మహత్త్వము లోకమునం బ్రసిద్ధిగా"

ననునది బలపఱచుచున్నది. కవితాభాషాంగన యాయన యెడఁ గేనము లేక యనురక్తయైనదట, అనఁగాఁ జోడుని కవిత నిసర్గకవితయేకాని ప్రయత్న ప్రతిలబ్ధి కాదనుట. అట్లన్నచో చోడుఁడు చెప్పిన యీ వస్తు

కవిత నిసర్గకవితయే యని తేలుచున్నది. నిసర్గకవిత యన సహజకవిత. దీనినే మఱింత వివరించవలయు ననిన పాండిత్యబలముచేఁ బట్టుపట్టి పద్యరచన సాగించు కవితగాక సహజమయిన కవిత యని చెప్పవలయును. నన్నెచోడుని కవిత యట్టిది కావలయును.

వస్తుశబ్దమునకు సహజమను నర్థమున్నదా ? యని విచారింపఁ జనదు. ఆ శబ్దమున కట్టి యర్థ మున్నదనుట లోకవ్యవహారమునుబట్టి యెఱుఁగనగును. మనము వ్యవహారమున "వాఁడు వస్తుతః చాల మంచి వాఁడు" అన్నప్పుడు "వాడు నిసర్గముగా మంచివాఁ"డని కదా యర్థము వచ్చును ? కావున "వస్తు" శబ్దమునకు "సహజ"మను నర్థము కలదనియే తేలుచున్నది.

ఇఁకఁ జోడుఁడు పేర్కొన్న వస్తుకవుల కీ నిర్వచనము వర్తించునా ? యనుట నొక్కదానిని బరిశీలించిన నిది పూర్తి యగును. వస్తుకవులలో మొదటివాఁడు వాల్మీకి. ఆతని కవితలోని సహజత్వము లోకప్రసిద్ధము. "మానిషాద" పద్యప్రాదుర్భావము సహజమేకదా : రెండవ వస్తుకవి భారవి. ఈతని వాక్కులకు సహజమాధుర్యము (Natura grace) గలదని సదుక్తికర్ణామృతమునందు (ప్రకృతిమధురా భారవిగిరః) చెప్పఁబడినది. కావున సహజత్వము భారవికవితకుఁ గలదనుట మనము సాధింపవలసినదిగాదు. మిగిలినవాఁ డుద్భటుఁడు. ఇంతదనుక యీతని వస్తుకావ్యము (కుమారసంభవము) లభింపలేదు. అది లభించినతరువాత దానిసంగతి విచారింపవలయును. కావునఁ బ్రస్తుత ముద్భటునిది సహజకవితయగునా ? కాదా ? యని విచారించుటకన్న నాతనిదియు సహజకవితయే యయియుండునని భావించుట యుక్తము.

ఇఁకఁ గన్నడభాషయందు నీ "వస్తుకవిత" ను గూర్చిన ప్రశంస కొంత ప్రాచీన వాఙ్మయమునఁ గలదనియు, నయినను దానిని గూర్చి యేదియు నా భాషయందు స్పష్టముగా లేదనియు శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారే వచించినారు. అస్పష్టముగా నున్న యా భాషావిషయ

ముల నాధారముగా మన కవిరాజు కావ్యమును విమర్శించుటకన్న నాతనిచేఁ జెప్పఁబడిన విషయము లాధారముగా నాతని భావమును గ్రహింప నెంచుటయే యుక్తమని భావించుచున్నాము.

తెలుఁగు భాషలో వస్తుకవితను గూర్చి చెప్పినవారిలో నన్నెచోడుడు, విన్నకోట పెద్దన మాత్రమే కాక రేచయకూడఁ గలఁడు. గీతి పద్య లక్షణమున నాతఁడు తన్ను వస్తుకవి జనాశ్రయునిగాఁ జెప్పుకొనినాఁడు. (వావిళ్ల ప్రతి. శ్రీ నిడదవోలువారి పీఠికతో.) అయినను నది ప్రత్యేకముగా నీ విషయనిర్ణయమున కుపయోగపడునది గాదు. పై ముగ్గురును కొంచె మించుమించుగా నొకేకాలమున నుండినవా రగుటచే నాఁనాడు ఈ శబ్దము బాగుగా వ్యవహరింపఁబడుచుండె ననియు నేకారణముననో తరువాతివారు దీనిని వాడుట మానిరనియు నూహింపనగును.

ఇంతదనుక జరిపిన చర్చకు సారాంశము "వస్తుకవిత" యనగా "సహజకవిత" యనియే నన్నెచోడ మహాకవి భావించియుండుననుట.

కాని దీనికిని కొన్ని ప్రతి బంధకములు లేకపోలేదు. సహజ కవితయే వస్తుకవిత యనినచోఁ గాళిదాసును స్తుతించిన పద్యమున మన కవిరాజాతనిని వస్తుకవిఁగాఁ జెప్పలేదు కాన నాతని కవిత సహజము గాదనవలసి వచ్చుచున్నది. ఇది సహృదయు లంగీకరింపలేరు. అట్లే మఱియొక బాధయుఁ గలదు. మన కవిరాజు పేర్కొన్న వస్తుకవులలో భారవియు నొక్కఁడు. కాని యాతని కవితయంతయు వస్తుకవిత కాదట. ఒక్క యింద్రకీలనగారోహణ వర్ణనమునందు మాత్రమే యాతనిది వస్తుకవితయట. చోడుఁడు భారవిని గూర్చి వచించిన పద్యముఁ బరికింపుఁడు :

"భారవియు వస్తుకవితను
భారవియును బరగి నుదయపర్వతశిఖరా
గ్రారోహణేంద్రకీల న
గారోహణ వర్ణనల జనారాధితులై."

కిరాతార్జునీయమునందలి యింద్రకీల నగారోహణ వర్ణనమునందు మాత్రమే కలదన్న వస్తుకవిత యితరత్ర అతని గ్రంథమునందు లేదన్న మాటయే గదా ! సహజకవితయే వస్తుకవిత యన్నచో నిట్టిది పొసఁగ నేరదు. భారవి యొకచోట సహజకవి యగుటయు నింకొకచోటఁ గాక పోవుటయు జరుగునా ? కావున నీవిషయము నింకొకవిధముగా సమన్వయింప నవసర మేర్పడుచున్నది.

"వస్తు" శబ్దమునకు "ప్రకృతి" యను నర్థముగూడ నిఘంటువులయందుఁ గానవచ్చుచున్నది. (చూ. జీవానంద విద్యాసాగరపండితుని "శబ్దసాగరము" లోని వస్తుశబ్దార్థము. అందు దీనికి 'Nature' అను నర్థము గలదు.) ఆ యర్థముననే నన్నెచోడ మహాకవి యీశబ్దము నీ విషయమున గ్రహించి యుండునా యని విచారింపవలయును. అనగా "వస్తుకవిత" యనునది "ప్రకృతినిగూర్చి వర్ణించు కవిత" యగును. ప్రకృతిలోని విషయములను వాస్తవముగాఁ గన్నులకుఁ గట్టునట్లు వర్ణించు కవితయే వస్తుకవితయన్నియప్పుడు నిర్ణయింపనగును. ఈ నిర్వచనము శ్రీరామకృష్ణయ్యగారును, శ్రీ లక్ష్మీరంజనముగారును చెప్పిన వస్తుకవితానిర్వచనమునకుఁ గొంచెము దగ్గఱగా నుండును.

"ప్రకృతి వర్ణనాత్మకమయిన కవిత వస్తుకవిత" యనునదే చోడుని యభిప్రాయ మనుకొన్నచో నది యాతని కవిత్వమునకును, భారవి యింద్రకీల నగారోహణ వర్ణనమునకును, వాల్మీకి కవితకును, ఉద్భటుని కవితకును వర్తించును.

భారవిని గూర్చిన ప్రకరణమున నన్నెచోడ భారవుల కిరువురకును బ్రకృతి పరిశీలనమున నాసక్తి మెండని వచించితిని. భారవి యింద్రకీల నగారోహణ వర్ణనమున నది స్పష్టముగాఁ గనిపించును.

అర్జునుఁడు ద్వైతవనమునుండి బయలుదేఱి హిమవత్పర్వతము దాటి యింద్రకీలాద్రిని జేరును. ఆతని యీ మార్గమును భారవి ప్రకృతి రమణీయముగా వర్ణించినాఁడు. అతఁడు మార్గ మధ్యమున

శాలిగోప్త్రిని చూచినాఁడట! ఆ వర్ణనము బహు మనోహరముగా నున్నది. అట్లే సాయంకాల మింటికి మఱలివచ్చు గోవులు, మహోక్షము, గోపాలకులు, పల్లె పట్టులలోని వల్లవీ జనము, వీని నన్నిటిని భారవి వర్ణించిన విధముఁ జూచినచో నాతకినిఁ బ్రకృతి పరిశీలనము నెడ నెంత యనురాగము గలదో స్పష్టమగును. ఆతని వర్ణనములు చూచినచో పల్లెలు కన్నులకుఁ గట్టును. ఆతని శరద్వర్ణనము ప్రకృతి రమణీయము. హిమాద్రి వర్ణనము, ఇంద్రకీలనగ వర్ణనము నాతనికిఁ గల ప్రకృతితోడి పరిచయమును స్పష్టపఱచుచుండును. వాని నన్నింటి నుదాహరించుట కిటఁ దావు చాలదు. అయ్యును ఒకటి రెండుదాహరింతును.

శరత్కాలమున నాకాశమునిండ హంసలు గుంపులుగట్టి పరుగిడుచున్న మనోహర దృశ్యమును భారవి యీ క్రింది విధముగా వర్ణించినాఁడు :

"సితచ్ఛదానా మపదిశ్య ధావతాం
రుతైరమీషాం గ్రథితాః పతత్రిణాం
ప్రకుర్వతే వారిదరోధ నిర్గతాః
పరస్పరాలాప మివామలా దిశః". (4 స. 30 శ్లో.)

ఆ హంసలు కూతలిడుచుఁ బరుగిడుచుండగా దిక్కులు తద్వ్యాజమునఁ బరస్పరము మాట్లాడుకొనుచున్న ట్లున్నవట.

ఆకాశమునఁ బక్షులు గుంపులుగట్టిపోవు దృశ్యమును నన్నెచోడకవియు మనోహరముగా వర్ణించినాఁడు. అదియు శరద్వర్ణనమునందే.

"అరుణ శాలి కణిశములు శుకాలి గఱచుకొనుచు నం
బరతలమున నోలి నెగసిపాఱు దిగ్గ్రధూచయం
బరయఁ జెలువమెసగు శారదాగమమున నుత్సవో
త్కరవిభాతిఁ దోరణములు గట్టినట్టు లందమై." (6-120)

కుమారసంభవ పద్యమునందును దిక్కులకు స్త్రీత్వము కల్పితమయినది.

ఇట్లే మహాకవు లిరువురయందును బ్రకృతి పరిశీలనమునెడ నాద రము గానవచ్చును.

ఉద్భటుని కుమారసంభవము పూర్తిగా లభింపలేదు. మనకు లభించిన కుమారసంభవైకదేశమునందుఁ జూచినచో నాతనికిని బ్రకృతి దృశ్యములను వాస్తవముగా వర్ణించుట మిగుల నిష్టమయినదని తెలి యును. శరద్రాత్రి నుద్భటుఁడు క్రింది శ్లోకములో నెంత చక్కగా వర్ణించినాఁడో చూడుఁడు.

"జ్యోత్స్నాంబు నేందుకుంభేన తారాకుసుమ శారితం
క్రమశో రాత్రి కన్యాభిః వ్యోమోద్యాన మసిచ్యత".

"రాత్రి కన్యలు చంద్రుఁ డను కుండతో వెన్నెలయను నీటిని జిలకరించి తారాకుసుమ శారితమయిన ఆకాశోద్యానమును దడిపిరట". ఇది శరద్రాత్రిలోని వెన్నెల ప్రవాహమును కన్నులకుఁ గట్టినట్లు చిత్రించు చున్నది.

ఇఁక వాల్మీకి మహాకవి ప్రకృతిశోభను వర్ణించుటలో నాద్యుఁడన దగినవాఁడు. అతనివి రెండు శ్లోకముల సుదాహరించి యీ ప్రకరణ మును ముగింతును.

కిష్కింధ కాండమున రాముఁడు పంపాసరోవరమును, దత్పరి సరములఁగల ప్రకృతిశోభను విపులముగా వర్ణించి పిదప నీ క్రిందిరీతిని లక్ష్మణునితో వచించును.

"యది దృశ్యేత సా సాధ్వీ యదిచేహ వసేమహి
స్పృహయేయం నశక్రాయ నాయోధ్యాయై రఘూత్తమ!"

(కిష్కిం. 1 స. 95 శ్లో.)

పై శ్లోకమును రామునిచేఁ జెప్పించిన వాల్మీకికవి హృదయము ప్రకృతిశోభా సందర్శనమున నెంతటి యానందము ననుభవించునో, అతఁ డట్టి శోభను వర్ణించుటలో నెంత గొప్పఁదనమును జూపునో,

చెప్పఁ బనిలేదు. కావలసినచో వాల్మీకిలోని యీ ప్రకృతి వర్ణనా నైపుణ్యమునకు శ్రీమద్రామాయణమునుండి వలసినన్ని యుదాహరణ ముల నీయవచ్చును.

వర్షాకాలమునందలి మేఘములను వర్ణించుచు మహాకవి వాల్మీకి

"విద్యుత్పతాకా స్సబలాకమాలా
శైలేంద్ర కూటాకృతి సన్నికాశాః
గర్జన్తి మేఘా స్సముదీర్ణనాదాః
మత్తా గజేంద్రా ఇవ సంయుగస్థాః". (కిష్కిం. 28 స. 20 శ్లో.)

అని యవి యుద్ధరంగములోని గజములవలె గర్జిల్లుచున్నట్లు చెప్పెను.

మఱియొక్కటి—

"బాలేంద్రగోపాన్తర చిత్రితేన విభాతి భూమి ర్నవశాద్వలేన
గాత్రానువృత్తేన శుకప్రభేణ నారీవ లాక్షోక్షిత కంబలేన".
(కిష్కిం. 28 స. 24 శ్లో.)

పై పద్యము వర్షకాలమున నార్ద్రికార్తెయందలి పచ్చికబయలును కన్నులకు గట్టినట్లు వర్ణించుచున్నది. ఈ పద్యభావమునే మన కవిరాజు వర్షర్తు వర్ణనమున నొక్క కందమునఁ బొదిగినాఁడు.

"చలిగాడ్పుల ముసరులమెయి
వలిగొని ధాత్రీపురంధ్రి వలిఁబచ్చనికం
బలిఁ గవిచికొన్న విధమునఁ
బొలుపుగఁ జిప్పరువు గవిసె భూతలమెల్లన్" (6-100)

ఈ విధముగా నెన్నియో వాల్మీకి యనుకరణములు మన కవిరాజు గ్రంథమునందుఁ గాననగును. వానిని వేఱొక ప్రకరణమున వివరించినాను.

కాన ప్రస్తుతము చెప్పునది యేమనఁగా వస్తుకవిత యనగాఁ బ్రకృతిని వాస్తవముగా వర్ణించు కవితయనియు, వస్తుకవు లనగాఁ బ్రకృతిశోభను వాస్తవముగా వర్ణించు కవులనియు ననుటయే.

ఈ సందర్భమున నొక్క విషయమును వ్రాయుట యప్రస్తుతము కాఁబోదు. మన కవిరా జుద్భటునిగూర్చి వచించిన పద్య మీక్రింది రీతి నుండఁదగునని నేను భావింతును.

"క్రమమున నుద్భటుఁడు కవి
త్వము మెఱయఁ గుమార సంభవమ్మ నలంకా
రముఁ గూడ వస్తుమయ కా
వ్యముగా హరులీలఁ జెప్పి హరు మెచ్చించెన్."

అట్లయిన నుద్భటునిది గూఢవస్తుమయ కావ్యము గాక వస్తుమయ కావ్యమే యగును. శ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగా రీ పద్యమును గూర్చి చెప్పిన యర్థము మఱింత సుగమముగా బోధితమగును. (వా రుద్భటుఁడు కుమారసంభవమును వేఱుగా వ్రాయలేదని భావించిరి. వివరము లుద్భటుని గూర్చిన ప్రకరణమునఁ జూడనగును.)

నా కీ ప్రకరణమును వ్రాయుటలో మార్గదర్శకు లయినవారు పూజ్యులు శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు, శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనము గారు. వా రిరువురకును నా నమస్కారముల నర్పించి యీ ప్రకరణమును ముగించుచున్నాను.

## షష్ఠ్యంతములు

ఆంధ్ర వాఙ్మయమునఁ దిక్కనతరువాత వెలసిన మహాకవు లందఱును దమ గ్రంథముల షష్ఠ్యంతముల నిలిపి యాతని మార్గము నవలంబించిరనుట సుప్రసిద్ధము. తిక్కనకుఁ బూర్వము షష్ఠ్యంతముల రచించు నాచారము లేదనియు, దాని నారంభించినవాఁడు తిక్కనయే యనియుఁ బలువురి విశ్వాసము. దీని నాతఁ "డుదాహరణ కావ్యము" లందలి షష్ఠీవిభక్తి ననుసరించి కల్పించియుండునని మఱికొందఱి యూహ. సోమనాథుని బసవపురాణమునందును షష్ఠ్యంతములు గాన

రావు. ఆతఁడును నన్నయవలె సంబోధనాంతముగానే కథ నారంభించి చెప్పుట కాననగును. అట్లనుటవలన సోమనాథునినాటికి షష్ఠ్యంతముల యాచారములేదని చెప్పుటకు వీలులేదు.

తిక్కన షష్ఠ్యంతముల రచించుటకుఁ గల కారణ మేమి యని విచారింపవలయును. ఉదాహరణములందలి షష్ఠీ విభక్తి ననుసరించెనని దానికి కొందఱి సమాధానము. అట్లయిన నొక్క షష్ఠీ విభక్తినే యేల గైకొనవలయును? కడమవాని నేల పరిగ్రహింపలేదు? అను ప్రశ్నములు జనించుటయు వానికి సరియగు సమాధానములు రాకపోవుటయు జరుగక తప్పదు. అంతకుఁ బూర్వమే షష్ఠ్యంతముల రచించు నాచారము కల దనియు దానినే యాతఁడు తన గ్రంథమునఁ బరిగ్రహించెననియు నన్నచోడుని కొంతవఱకు సరియయిన సమాధానమగును.

సోమనాథుని కాలమును గుఱించి వివాదములున్నను నాతఁడు ద్వితీయ ప్రతాపరుద్రునకు సమకాలికుఁడనుటయే యెక్కువ యుచితముగాను, యుక్తియుక్తముగాను గానవచ్చుచున్నది. తిక్కన గణపతిదేవ చక్రవర్తికి సమకాలికుఁడు కనుక సోమనాథునకు ముందరివాడగును. తిక్కన కావ్యమున నున్న షష్ఠ్యంతములను సోమనాథుఁడు గ్రహింపకుండుటకు (బసవ పురాణమున) కారణ మాతనికి వాని యవసరము లేకుంటయే యనుట యుచితము. మహాభారతమునకు రాజరాజ నరేంద్రునివలె బసవ పురాణమునకు గొబ్బూరి పంగన్న శ్రోతమాత్రమే. కావుననే సోమనాథుఁడు పంగన్నను సంబోధించుట మాత్రమే చేసి షష్ఠ్యంతముల రచించుట మానివేసినాఁడు. బసవపురాణము సంగయ్యకు అంకితముగా రచింపఁబడలేదు. రాజరాజునకు భారతము నంకితముచేయఁబడలేదు. రాజరాజునకు భారతము నంకితముఁ గొనవలయునను కుతూహలమున్నట్లు కానరాదు. కృతిని సప్త సంతానములం దొక్కదానిగా నెంచి దానిని వెలయింప నెంచినవాఁడుకాఁడు రాజరాజు. తన వంశపు రాజుల చరిత్రము వర్ణించు

గ్రంథమగుటచే దానిని వినవలయునను కోరిక మాత్రమే యాతనికిఁ గలదు. కావుననే నన్నయకు షష్ఠ్యంతముల యవసరము కలుగలేదు.

తిక్కనకుఁ బూర్వమే షష్ఠ్యంతముల యాచారము గలదనిన నా యాచార మెక్కడ నున్నదో చూపుట యవసరమగును. నన్నెచోడుని కాలమును గుఱించి పలు వివాదములున్నను నాతఁడు నన్నయ తిక్కన లకు నడుమ నున్నవాఁ డనువాదము బహుజన సమ్మతమగుటచేతను, గొన్ని విషయము లాతనిని నన్నయకు సమీపకాలమువానినిగా సూచిం చుటచేతను నన్నెచోడుఁడు తిక్కనకుఁ బూర్వుఁడనుటయే యుచిత ముగాఁ గనుపట్టుచున్నది. అట్లన్నచోఁ గుమారసంభవములోని షష్ఠ్యంత ములనే తిక్కనామాత్యుఁడు తన గ్రంథములం దనుసరించెనని తేలు చున్నది.

చోడుఁడు దన కవిత గురు కరుణచే లభించినదని భావించి, యాతనికిఁ గృతిఁ జెప్పి పుణ్యమును సంపాదింపఁదలంచినాఁడు. అంతే కాదు ; ఆతనిభావమున గురువగు మల్లికార్జునుఁడు నీశ్వరుఁడు నొక్కఁడే. వారి కిద్దఱకు నభేదమును బాటించియే యాతఁడు కుమార సంభవ రచనము సాగించినాఁడు, కావుననే యీ కృతిని తన గురువునకు సమర్పించి, కృతార్థుఁడనగుదునని యెంచినాఁడు. కావుననే యీతనికి "షష్ఠ్యంత" రచన మవసరమయినది. ఈ షష్ఠ్యంతములు చోడరాజు కావ్యమున నీ విధముగా మొట్టమొదటిసారిగాఁ జేరి, తరువాత నన్ని కావ్యములలోనికిఁ బ్రాకినవని తోఁచును.

మన కవిరాజు షష్ఠ్యంతములు ఇతరానుకరణములు కావనుట కింకొక కారణమును గలదు. ఈతని షష్ఠ్యంతములు తదితర కవుల వానివలెఁ గందపద్యములతోడనే యారంభింపఁ బడలేదు. వానికిఁ బూర్వము జంగమమల్లికార్జును వర్ణించు నొక కించిద్దీర్ఘమయిన గద్యము నకుఁ జివరనే "జంగమమల్లికార్జున దేవునకు" నని పూర్తిచేయబడినది. ఆ పిమ్మట షష్ఠ్యంతములున్నవి. అనఁగా నీ షష్ఠ్యంతములు కేవలము

కావ్యమం దుండవలెఁ గావున రచించినట్లు కనుపడు నితర కవుల వానివలెఁగాక ముందు గద్యాంతముననే షష్ఠ్యంతముండుటయుఁ దరువాత దానినే సమర్థించుచు షష్ఠ్యంతపద్యము లుండుటయు నివి యితరాను కరణములు కావనుట కొక సూచకము. ఇంతేగాదు; చోడుఁ డీ షష్ఠ్యంత పద్య సంఖ్యయందు నొక ప్రత్యేకతను బాటించినాడు.

సామాన్యముగాఁ గావ్యములందు షష్ఠ్యంతపద్యము లయిదు గాన వచ్చును. అట్లనుటచే నీ సంఖ్య నందఱు బాటించిరనుటకాదు. మూఁడు వ్రాసినవారును గలరు. పదకొండుదాక పెంచినవారు నున్నారు. చోడుఁడు రచించినవి మాత్ర మెనిమిది కందపద్యములు. ఈ యెనిమిది సంఖ్యను గ్రహించుటలో నొక విశేషమున్నది. నన్నెచోడుఁడు కృతిపతి కృతి నాయకుల కభేదమును బాటించినవాఁ డనుట సువిదిత విషయముగదా! కృతినాయకుఁడగు శివు డష్టమూర్తి. కావుననే తదభిన్నుఁ డగు కృతి పతినిగూర్చిన షష్ఠ్యంతము లెనిమిది రచించినాఁడు. షష్ఠ్యంతపద్యము లను దదితర కృతిపతి వర్ణనాపద్యములవలెనే యష్టమూర్తియగు శివు నకు సహిత మన్వయించును. నన్నెచోడ మహాకవి యీషష్ఠ్యంతము లను కృతిపతి యష్టమూర్తులను సూచించుటకే యుద్దేశించెనని చెప్పుట కాధారము ఆ పద్యములందే కలదు. శివుని యష్టమూర్తులను వర్ణించు క్రమ మిది. (1) పృథివి, (2) జలము, (3) అగ్ని, (4) వాయువు, (5) ఆకాశము, (6) సూర్యుఁడు, (7) చంద్రుఁడు, (8) యజమానుఁడు.

పైవానియందు మొదటిది పృథివి. నన్నెచోడుని షష్ఠ్యంతము లందు మొదటి పద్యమునందు కృతిపతిక "అచలాత్మనకున్" అను విశేషణము వాడఁబడినది. "అచల" యనఁగాఁ బృథివిగదా! కావున నిందు శివుని పృథివీ మూర్తిత్వము వర్ణింపఁబడెననుట స్పష్టమే.

అష్టమూర్తులలో మూఁడవది యగ్ని. కావుననే షష్ఠ్యంతము లలోని మూడవపద్యమున "నంగజహర మూర్తికి" అను విశేషణము వేయఁబడినది. మన్మథుని హరించిన దగ్నియేగదా!

శివుని యష్టమూర్తులలోఁ జివరి మూర్తి యజ్ఞకర్త. ఈతఁడు మానవులలోని శివస్వరూపము. కావుననే షష్ఠ్యంతములలోని చివరి పద్యమున "మనుజాకారమహేశునకు" అను విశేషణము వేయఁబడినది.

ఇట్లే కడమవానియందు నింతస్పష్టముగాఁ గాకపోయినను నాయా శివమూర్తులను సూచించు విశేషణములు వాడఁబడియేయున్నవి.

దీనినిబట్టి చోడకవి శివుని యష్టమూర్తిత్వమును సూచించుటకే యెనిమిది షష్ఠ్యంతముల వ్రాసియుండు ననుట యుక్తియుక్తమే యగుచున్నది. కావుననే చోడుని షష్ఠ్యంతములు స్వతంత్రములే కాని యనుకరణములు కావని చెప్పుట యుక్తియుక్తమగును.

నన్నెచోడుఁ డీషష్ఠ్యంతముల నెట్లు గ్రహించియుండు ననుప్రశ్నమునకు సమాధానము నరసినచో నీ ప్రకరణమును ముగించవచ్చును.

నన్నపార్యుఁడు దేశమునఁ బ్రచారమున నున్న యాచారములలోఁ గొన్నింటిని మాత్రమే (బహుస్వల్పముగా) తన భారతమున గ్రహించెను. తరువాత నన్నయ గ్రహించినవే కొన్ని తరువాతివారు పరిహరించుటయు మఱికొన్ని దేశిసంప్రదాయములు క్రొత్తగాఁ గావ్యప్రపంచములోనికిఁ జేరుటయు జరిగినదనుట హేతుదూరముగాదు. ఈ షష్ఠ్యంతము లట్టివానిలోఁ జేర్పఁదగినవనుట యుక్తము, అనగాఁ దన కాలమున దేశముననున్న యీ యాచారమునకు నన్నెచోడుఁడు దన కావ్యమున స్థానము గల్పించి యుండుననుట.

ఆనాటి యాచారముల నన్నింటిని దెలిసికొను సాధనసామగ్రి మనకు బహుస్వల్పముగా నున్నది. లభించినంతమట్టుకయినను వివాదములకుఁ దావీయని విధముగా లేదు. అయినను "షష్ఠ్యంతములు" తిక్కనకుఁ బూర్వమే ఆంధ్రభాషయం దున్నవనుటకు బలమయిన యాధారమును గలదు.

స్వస్తిశ్రీ శకవర్షంబులు 1092 వికృతిసంవత్సర మాఘశుద్ధ పంచమీ బుధవారమునాఁడు (1170 A. D.) కాకతీయరుద్రదేవరాజుకడ

నుద్యోగియగు గంగాధరకవి వేయించిన శాసన మొకటి తెలంగాణము లోని కరీంనగరమున లభించినది. అందు అతఁడు దేవాలయమునకు భూదాన మొనరించిన విషయము గలదు. ఈ శాసన మొక గద్యపద్య మయమయిన లఘుకావ్యమువలె నున్నది. దానిలోని యీక్రింది కంద పద్యము ఆనాడు షష్ఠ్యంతముల రచనము కలదని చెప్పుచున్నది.

"వరమంత్రకూటపురమున
వరదునకు జగజ్జనానువందితచరణాం
బురుహున కాచంద్రార్క
స్థిరముగ గుడివృత్తినిల్పితిం బ్రణయమునన్."

(తెలంగాణశాసనములు– 16 వ పుట. కరీంనగరశాసనము– దక్షిణము.)

పై పద్యమునందలి షష్ఠ్యంతములు ఆనాటి యాచారమును మును సూచించుచున్నవనుట తథ్యము. ఇది కందపద్యమే యగుట మఱియొక విశేషము. రుద్రదేవుఁడు తిక్కనకు బూర్వుఁడనుట నిర్వి వాదాంశము. ఆతనినాఁడేయున్న షష్ఠ్యంతములు తిక్కనకుముందే యవి యున్నవనుటకుఁ బ్రబలాధారము.

పై శాసనమునందలి విషయము దేవాలయమునకు సంబంధించి నది. దేవాలయము "కృతి" తోఁబాటు సప్తసంతానములలోనిది. ఇదియుఁ బైవాదమునకుఁ బ్రోద్బలకమే. ఆ శాసనముననే పిమ్మట సప్తసంతాన ములఁగూర్చి యీక్రింది పద్యముగలదు.

"తన పెంచిన సంతానము,
తనసంతానమ్ముఁ గృతియుఁ దన నల్లిల్లున్
వనమును జెరువును గుడియును
జనవినుతములైన సప్త సంతానమ్ముల్."

(తెలంగాణశాసనములు - 17 పుట)

ఈ విషయముల నన్నింటి నాధారముగాఁ గొని చూచినచోఁ దెలుఁగు భాషయందు గావ్యములలో షష్ఠ్యంతముల వ్రాయు నాచార

మును ప్రారంభించినవాఁడు తిక్కన సోమయాజి కాఁడనియు, నన్నెచోడ మహాకవియే దేశీయాచారములం దాతనికి సహజముగాఁగల యభిమానముచేతను, తాను గురువునకు సప్తసంతానములం దొక్కటిగా భావించి తన కృతి నంకితముచేయ నెంచినవాఁడగుటచేతను, నీ షష్ఠ్యంతములను మొట్టమొదట వ్రాయఁగా దిక్కనాదు లాతని ననుసరించి రనియు చెప్పవలసి యున్నది.

## నన్నెచోడుఁడు వీరశైవుఁడా ?

నన్నెచోడుఁడు వీరశైవ సంప్రదాయమునకుఁ జెందినవాఁడా అను దానిని జర్చించుటయే యీ ప్రకరణమునందలి విషయము.

నన్నెచోడుఁడు శైవ సంప్రదాయమునకుఁ జెందినవాఁడనుటలో నభిప్రాయభేదము లేదు. కాని యాతని యీసంప్రదాయ మెట్టిది? బసవేశ్వరుని వీరశైవ సంప్రదాయము నిదియు నొక్కటియేనా ? భిన్నములా ? ఒక్కటియే యనుట కాధారములేమి ? ఇవియే విచారణీయాంశములు.

సుప్రసిద్ధ పరిశోధక పండితు లగు శ్రీ నిడుదవోలు వేంకటరావు గారు నన్నెచోడుని కుమారసంభవమునకు వ్రాసిన పీఠికయందు క్రింది రీతిని వచించి యీ కవి వీరశైవ సంప్రదాయమునకుఁ జెందినవాఁడను నభిప్రాయమును బ్రకటించినారు. వారి పీఠికయందు "నన్నెచోడుఁడు - వీరశైవ సంప్రదాయము" అను దానిని చూచునది.

> "ద్వితీయాశ్వాసమున దక్షాధ్వరధ్వంసము వీరశైవ సంప్రదాయకము .........*దక్షాధ్వరధ్వంసమున వీరభద్రుని కృత్యములు తు చ తప్పక వర్ణితములైనవి.* ఇట్లే పండితారాధ్యులు శివతత్వసారమున, సోమనాథుఁడు పండితారాధ్య చరిత్రమున వీనిని వర్ణించి యున్నారు."                                                  (చూ. పీఠిక 12 వ పుట)

శ్రీ వేంకటరావుగారి వాక్యములఁ గొంచెము పరిశీలించవలసి యున్నది. శివపురాణమునందలి దక్షాధ్వరధ్వంస కథను చోడుఁడు తు చ తప్పక

వర్ణించినాఁడా? ఈ రెంటిని చూచినచో నీ క్రింది విభేదములు కానవచ్చు చున్నవి.

(i) శివపురాణము నందలి సతీఖండమునందు దక్షాధ్వరధ్వంసము కాళీ వీరభద్రులచేఁ జేయఁబడినట్లు స్పష్టముగా వర్ణింపఁబడినది. ఈ విషయ మిట్లే శివతత్వసారమునందును, పండితారాధ్య చరిత్రమునను వర్ణితమయినది.

కాని చోడుని కుమారసంభవమున వీరభద్ర ప్రశంసయే కానరాదు. కుమారసంభవమునందు గణాధీశ్వరుఁడే యా కార్యమును బూర్తి గావించినాఁడు. "దేవగణాధీశ్వరి నిఖిల శాకినీ ఢాకినీ కూశ్మాండ యోగినీ గణ పరివృతయై" యాతనికి సహాయపడినది.

ఈ విధముగా వీరభద్ర ప్రశంసయేని లేని కుమారసంభవమునందు వీరభద్రుని కృత్యములు తుచ తప్పకుండ వర్ణితములైనవని శ్రీ వేంకటరావుగారు వచించుటకుఁ గారణమేమో తెలియదు.

(ii) శివపురాణమున వీరభద్రుఁడు దక్షుని శిరమును ఖండించి యజ్ఞ కుండమున వ్రేల్చినట్లీ క్రింది శ్లోకము చెప్పుచున్నది.

"తచ్ఛిరస్తస్య దుష్టస్య దక్షస్య హరవైరిణః
అగ్నికుండే ప్రచిక్షేప వీరభద్రో గణాగ్రణీః".

అటుతరువాత బ్రహ్మాదులు కైలాసమున కేగి శివుని వేడఁగా నాతఁడు వీరభద్రునిచే దక్షుని కబంధమును దెప్పించి యజ్ఞపశు శిరమ్ము నుంచి దక్షుని జీవితుని జేసెనని కలదు.

కుమారసంభవమ్మునం దట్లుకాక, దక్షుని శిరశ్ఛేదమే జరిగినట్లు చెప్పఁబడలేదు. ప్రమథు లాతనిని సజీవముగా శివునికడకుఁ దెచ్చినారు.

"ప్రమథగణము దక్షుఁ బడఁగొట్టి కట్టుచుఁ
గాలు చేయి బడియ గావడించి
మను మృగంబు గట్టికొని వచ్చు బలువేఁట
కాఁడువోలె వచ్చి కవిరి శంభు." (2-84)

ఆతని వెంటనే దక్షాంగన వచ్చి శివుని పతిభిక్ష వేడినది. చతురాననుఁడు చతుర వచనములచేఁ బరమేశుని సంతుష్టునిఁజేసి "బ్రాహ్మణో నహంతవ్యః" అను సూక్తిని జ్ఞాపకము చేసినాఁడు. అప్పు డాదిదేవుఁడు అనుమతింపఁగా బ్రహ్మ దక్షుని బంధము విప్పి హరుని పాదములపై వ్రాలఁ జేసినాఁడు. వెంటనే దక్షుఁడు పరమేశ్వర పాద స్పర్శనమున సచేతనుండై భక్త్యావేశంబునం బ్రణుతింప నభిముఖుఁడైనాఁడు.

ఇవి ప్రధానములగు మార్పులు. అప్రధానములగు మార్పు లింకెన్నియో గలవు. వాని నన్నింటిం జూపుట పనిలేనిపని.

ఇంతకును తేలిన విషయ మేమనగా దక్షాధ్వర ధ్వంసమును వర్ణించుటలో నన్నెచోడుఁడు శివపురాణమును గాని, శివతత్వసారమును గాని యనుకరింప లేదనుటయే. ఇందాతని వీరశైవ సంప్రదాయము నాకేమియుఁ గనుపడ లేదనుటయే. అంతేగాదు ; బ్రహ్మ "బ్రాహ్మణో నహంతవ్య" యను సూక్తిని జ్ఞాపకము చేయఁగా శివుఁడా దక్షుని విడిచి పుచ్చినట్లు పైని చెప్పినాను. ఇట్టిది వీరశైవ సంప్రదాయము కాదనుట చెప్పఁబనిలేదుగదా !

శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు నన్నెచోడుని వీరశైవ సంప్రదాయమునకుఁ జూపిన రెండవ విషయము కుమ్మరి గుండయకథ. దీనిని పాలకురికి సోమనాథుఁడు, రావిపాటి త్రిపురాంతకుఁడును (చూ. త్రిపురాంతకోదాహరణము) వచించినారు. వీరశైవుఁడగు పాలకురికి సోమనాథుఁ డీ చరిత్రమును వర్ణించినంతమాత్రాన చోడుఁడును వీరశైవుఁడే యని భావించుట యంత యుచితముకాదని నాతలంపు. శివభక్తి వీర శైవులకువలెనే యితర శైవులకును సాధారణము. వీరశైవ సంప్రదాయమునకుఁ జెందకున్నను సోమనాథుఁడు కొందఱు శివభక్తుల చరిత్ర లను తన గ్రంథములందు వర్ణించినాఁడు. ఈ కుమ్మరి గుండయ్య యట్టి భక్తులలో ప్రాచీనుఁడు కావచ్చును. లేదా ? వీరశైవుఁడే యయినను (బసవనికిఁ బూర్వ మట్టి నామమే యున్నచో) నాతనిం బేర్కొన్నంత

మాత్రముననే నన్నెచోడుఁడు వీరశైవ సంప్రదాయములఁ బాటించిన వాఁడనుటయు యుక్తముకాదు.

పైవేకాక శ్రీ వేంకటరావుగారు మఱికొన్ని కారణములను జూపిరి. కాని యవి నన్నెచోడుఁడు వీరశైవుఁడనుట కుపయోగించుట కన్న నాతఁడు శైవమార్గమునకుఁ జెందినవాఁడనుటకు మాత్రమే యుపయోగపడును. అందుకని వానినిగూర్చి కాలక్షేపముచేయక నన్నెచోడుఁడు వీరశైవ సంప్రదాయమునకుఁ జెందినవాఁడు కాఁడనుటకుఁగల కారణములను నాకుఁ దోచినంతగా వివరింతును. విమర్శకులలో శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు కవిరాజ శిఖామణి వీరశైవ సంప్రదాయము వాఁడని వచించిరి. (చూ. ఆంధ్ర భారత కవితా విమర్శనము 109 పుట) శ్రీ నడకుదుటి వీరరాజు పంతులుగారు మాత్రము చోడుఁడు వీరశైవ సంప్రదాయమువాఁడు కాఁడని స్పష్టముగా సోపపత్తికముగా వచించిరి. (చూ. వారి విమర్శ తరంగిణి 1 భా. 'కవిరాజ శిఖామణి-కావ్య విశేషములు' అను వ్యాసము 220 పుట.)

వీరశైవ సంప్రదాయము బసవేశ్వరునితోడనే ప్రారంభమయినదని కొందఱును, నంతకుఁ బూర్వమే కలదని మఱికొందఱును భావించుచున్నారు. శ్రీ కురుగంటి సీతారామ భట్టాచార్యులు రచించిన "Saivism And Andhra Desa" అను గ్రంథములోని యీ క్రింది పంక్తులు విలోకింపుఁడు.

"The last is Virasaiva. Some believe that it began with Basaveswara. But from a perusal of the Agamas one has to conclude that it is mentioned in them long before Basava." (Page 8)

వీరశైవము బసవేశ్వరునకుఁ బూర్వమే యుండియున్నను నది శీణావస్థయందే యుండెను. దానిని మిగులఁ బ్రచారముచేసి వ్యాప్తిలోనికిఁ దెచ్చినవాఁడు బసవేశ్వరుఁడే యనుటలో నెవ్వరికిని విప్రతిపత్తిలేదు.

కావుననే కొందఱు పండితులు వీరశైవము బసవేశ్వరునితోడనే ప్రారంభ మయ్యెనని తలంచుట జరిగినది. ఈ వీరశైవ సంప్రదాయము నాంధ్ర దేశమున బహుళ ప్రచార మొనరించినవాఁడు పాలకురికి సోమనాథుఁడు. అతని గ్రంథములు వీరశైవమత ప్రచారమునకే వ్రాయఁబడినవని సోమ నాథుఁడే చెప్పికొనినాఁడు. సోమనాథుఁ డాదర్శ వీరశైవుఁడు. కావున నాతని గ్రంథస్థ విషయములతో నన్నెచోడుని భావములను బోల్చి చూచినచో నీతఁడా సంప్రదాయమునకుఁ జెందినవాఁడగునో, కాదో నిర్ణయింపవచ్చును.

పాలకురికి సోమనాథుని బసవపురాణముఁ జదివినచో వీరశైవులకు బ్రాహ్మణులయెడ నెట్టిభావముండునో తెలియును. ఇక్కడ బ్రాహ్మణు లనగా శైవులుకానివారనియే గ్రహింపవలెను. వీరశైవులు ముందు వర్ణా శ్రమధర్మములంగీకరింపరు. అట్టివారు బ్రాహ్మణాధిక్యము నంగీకరింతురా? బ్రాహ్మణులను వారు త్రాటిమాలలని, భవులని, కర్మచండాలురని భావించి వారి ముఖమయినను జూడనిచ్చగింపరు. మన నన్నెచోడుఁ డట్టి భావము కలవాఁడుకాఁడు. పైపెచ్చాతనికి బ్రాహ్మణులయెడ నాదరమును గలదు. ఇందుకాతని గ్రంథములోని యీ క్రింది విషయములు ప్రమాణములు.

1. నన్నెచోడుని గురువు మల్లికార్జునుఁడు. ఆతఁడు వినుత బ్రహ్మర్షి. (1-66.) కమలభవ కుల తిలకుఁడు (1-131). భూసుర వంశాద్యుఁడు (5-176) భూసుర కులాగ్రణి (7-162) పంకరుహజ గోత్రుఁడు (9-163) సద్భూదేవ కులశేఖరుఁడు (12-231). ఈ విశేష ణము లాతని బ్రాహ్మణత్వమును నిర్ణయించుటకుఁ జాలును. ఈ విధ ముగాఁ దన గురువును బలుమారులు బ్రాహ్మణుఁడని వాడుట యాతని బ్రాహ్మణాదరమునకు నిదర్శనము. అంతేగాదీ రాజకవి తన గురువు పేర నగ్రహారముల (బ్రాహ్మణులకే) దానముఁ జేసినాఁడట. (1-46)

2. తన గురువేకాదు. తన కావ్యమున నాయికయగు పార్వతి గురువును బ్రాహ్మణుఁడే యగునట్లు మూలమును మార్చినాడీ కవిరాజు.

"వాసనగా శివాగమము వర్ణనకెక్కఁ బ్రయీ సదర్థముల్
దేసిగ నాత్మ శిష్యులకుఁ దెల్పుచు సద్విధి నున్న నిష్కళా
భ్యాసమునందు లీనమగు భావమునిల్పి వెలుంగుచున్న స
ద్భ్యాసురముఖ్యు విప్ర మునిపుంగవు జంగమ మల్లికార్జునున్".

(6-79)

3. మూలమున లేకున్నను దక్షుని బ్రాహ్మణుఁడు వధార్హుఁడు కాఁడని బ్రహ్మచేఁ జెప్పించి విడిపించినాఁడు మన కవిరాజు.

"ఇంత ద్రోహుఁడయ్యు నితఁడు వధార్హుఁడే
యభవ ! నీవు దీని నవధరింపు
మవని "బ్రాహ్మణో న హంతవ్య" యను పలు
కీవు నిలుపకున్న నేల నిల్చు?" (2-95)

ఇది కవిరాజు బ్రాహ్మణ భక్తికి ముఖ్యనిదర్శనము.

(4) బ్రాహ్మణులు చండాలురు తాకిన చెరువులను గాని, బావులను గాని యుపయోగించకుండుట నేడును పల్లెటూరులందుఁ గాననగును. ఇది మన కవిరాజునకు నంగీకార్యమే. దాని నెంత మనోహరముగాఁ జెప్పినాఁడో పరికింపుఁడు.

"కొలను వన్యేభములు చొచ్చి కలయఁగలఁపఁ
బులువు లుండక వెలువడిపోయెఁ బోక
తగదె మాతంగ దూషితంబగు సరోవ
రంబు సద్ద్విజ వర్జనీయంబుగాదె." (1-92)

(5) వీరశైవు లుపనయన సంస్కారము నంగీకరింపరు. యజ్ఞోపవీతధారణమును వారికి వర్జ్యమే. (లింగమే యజ్ఞోపవీత మను భావమున గాదు. లింగమే యజ్ఞోపవీతమని భావించువారును గలరు. చూ. శ్రీ బండారు తమ్మయ్యగారి బస. పీఠిక) బసవేశ్వరుఁడు తనకు వడుగువలదని తండ్రితో వాదించుచు జన్నిదమును గూర్చి యేమనెనో చూడుఁడు.

"కర్మపాశంబు లొక్కటఁ దెగనీల్గి
కర్మంబు త్రాళ్లు దాఁ గట్టుకోఁదగునె ?" (బ. పు. "వావిళ్ల" 41 పుట)

కాని నన్నెచోడుఁ డీ మార్గమునకుఁ జెందినవాఁడు కాఁడు. అతని బ్రహ్మచారి పార్వతి తపోవనమునకు వచ్చుచు,

"మెఱుఁగు తీవియతోడి మేఘంబు నా జన్ని
దముతోడఁ గృష్ణాజినము ధరించి" (7-3)

యే వచ్చినాఁడు. అతని కిష్టమే లేనిచో నీ జన్నిదము నూడఁబెఱికియే యుండును.

(6) యజ్ఞాదికర్మలును వీరశైవులకు విహితములుకావు. బసవేశ్వరుఁడు పై సందర్భముననే

"అగ్గురు పాదంబు లర్చించు నతని
కగ్గిలో హవి వేల్చు టది తప్పుగాదె" (బ. పు. "వావిళ్ల" 41 పుట)

యని వచించినట్లు బసవపురాణమునందుఁ గలదు. నన్నెచోడుఁ డీ సంప్రదాయమునకుఁ జెందినవాఁడు కాఁడు. అతఁడు తనను గూర్చి కృత్యాదిని జెప్పుకొన్న పద్యముఁ జూడుఁడు.

పాత్రుఁడ ననదృశకాశ్యప
గోత్రుఁడ సచ్చరిత నుభయకుల శుద్ధుఁడ నే
మిత్రాన్వయ శేఖరుఁడఁ బ
విత్రీకృత దేహుఁడను వివిధ యజ్ఞములన్." (1-55)

(7) వీరశైవు లుమామహేశులే తమ తల్లిదండ్రులని భావించి, గురుగోత్రమునే తమ గోత్రముగా భావించు సంప్రదాయము గలవారు. పై పద్యమున నన్నెచోడుఁడు తాను కాశ్యపగోత్రుఁడనని స్పష్టముగాఁ జెప్పుకొనినాఁడు. ఇది వీరశైవాచారమునకు విరుద్ధము. సోమనాథకవి తన తల్లిదండ్రుల పేరులను సైతము చెప్పుకొనలేదు. మన కవిరాజు దన వంశావళిని ఘనముగా వర్ణించుటతోఁ దృప్తినొందక తన పూర్వికుఁడగు (సూర్యవంశమువాఁడు) ఇక్ష్వాకు మహారాజు గూడ దేవాసుర యుద్ధము

నకు వచ్చి దేవతల పక్షమున నున్నట్లు శుక్రాచార్యునిచేఁ దారకాసురునకు జెప్పించినాఁడు. (చూ. 11-90) తనకేగాదు తన గురువునకును వీరశైవ సంప్రదాయమునకుఁ జెందిన పంచాచార్యులు గోత్రకర్త లయినట్లు కవిరా జెక్కడను జెప్పలేదు.

(8) సోమనాథుని గ్రంథములం దెక్కడఁ జూచినను కొట్టవచ్చు నట్లు కనిపించు "వీరశైవ" శబ్దము గాని వీరవ్రతాచార విషయముగాని నన్నెచోడుని గ్రంథమున నెక్కడను గానరాదు.

(9) వీరశైవులు శివున కష్టమూర్తిత్వము చెప్పుట నంగీకరింపరని సోమనాథ మహాకవి యీ క్రింది వాక్యములు చెప్పుచున్నవి :

"విను 'యథా శివమయో విష్ణు' వన్మాట
లును త్రిమూర్తులు నొక్కటను దురుక్తులును
అష్టమూర్తులు రుద్రుఁడను కుయుక్తులును
దుష్టమానవుల భక్తుల కెనసేసి
పలుకుటయు వినంగఁ బాతకంబొందు".

(బసవ పు. 6 ఆ. 488 పుట "వావిళ్ళ ప్రతి")

మన కవిరాజు శివుని యష్టమూర్తిత్వమును బలుమాఱు తవివితీర వర్ణించినాఁడు. కొన్ని పట్టు లుదాహరింతును.

(i) అనుపమ....భవాష్టమూర్తులందును వరమూర్తి(రవి) 1ఆ.6ప.

(ii) "త్రిజగన్నాథుఁ బవిత్రగాత్రుఁ *గ్రతుమూర్తింబుత్తు*" (2-23)

(iii) "విశ్వంబుఁ గావింప విశ్వాత్ముఁడై యష్ట
తనువులు సేకొని తనరు వాని" (2-38)

(iv) "పుడమియై కదలక పడియుండు నెల్లచో
నెఱిలేక నీరమై నెఱసియుండు." (7-24)

ఇట్టివానిని మఱియును జూపవచ్చును. అయినను నివి చాలును.

(10) వీరశైవుల దీక్షావిధానమున లింగధారణముమిగుల ముఖ్యమైనది. పార్వతి విప్రమునిపుంగవుఁడగు జంగమమల్లికార్జునుని కడ శైవాగమ

విధ్యుక్తముగా దీక్షవడసి తన్నియోగంబునఁ దపోవేషము దాల్చినది. అప్పటి యామెవేషమును నన్నెచోడుఁ డీక్రింది విధముగా వర్ణించినాఁడు.

"పవడంపు లతమీఁద బ్రాలేయపటలంబు
పర్వెనా మెయినిండ భస్మ మలఁది
లాలితంబగు కల్పలత పల్లవించె నాఁ
గమనీయధాతు వస్త్రములు గట్టి
మాధవీలత కలిమాలికల్ ముసరెనా
రమణ రుద్రాక్షహారములు వెట్టి
వరహేమలతికపైఁ బురినమ్మి యూఁగెనా
సన్నుతంబగు నెఱి జడలుపూని
హరుడు మాహేశ్వరీ రూపమైన చెలువ
మభినయించెనొయని మును లర్థిఁ జూడ
గురుతపశ్శక్తి మూర్తిసేకొనిన కరణిఁ
దగిలి యుమ తపోవేషంబు దాల్చి పొల్చె." (6-82)

పై పద్యమునఁ బార్వతికి లింగధారణము సెప్పఁబడలేదు. బ్రహ్మచారి వర్ణనమునందు నిక్లే లింగధారణ విషయము స్పృశింపఁబడలేదు. జంగమ మల్లికార్జుననకును లింగధారణము జరిగెనని చెప్పఁబడలేదు. నన్నెచోడుఁడు వీరశైవ సంప్రదాయమునకుఁ జెందినవాఁడేయయినచో లింగధారణమునుగూర్చి చెప్పియే యుండెడివాఁడని భావింతును. పై విషయములేకాక మఱి యెన్నేని విషయములందు సోమనాథ నన్నెచోడులు భిన్నాభిప్రాయులయి యున్నట్లు వారి గ్రంథములు పరిశీలించినచో స్పష్టపడును.

## జంగమశబ్ద విచారము

నన్నెచోడుఁడు వీరశైవ సంప్రదాయమునకుఁ జెందినవాఁడయి యుండుననను భావము కలుగుటకు ముఖ్యకారణ మాతని గురువగు మల్లికార్జునుఁడు జంగమశబ్దవాచ్యుఁ డగుట.

నేఁడు మన మెఱిఁగిన జంగములందఱును వీరశైవసంప్రదాయము వారే. సోమనాథుఁడు పేర్కొన్న జంగము లందఱు నట్టివారే. కావుననే యీ శబ్దమునకు వీరశైవముతో నిత్యసంబంధ మేర్పడినది. కనుకనే జంగమ శబ్దవాచ్యుఁడైన మల్లికార్జునయోగియు, నాతని శిష్యుఁడగు నన్నెచోడుఁడును వీరశైవ సంప్రదాయమువారేయని భావించుట కవకాశము కలిగినది.

కాని నన్నెచోడుఁ డీశబ్దము నుపయోగించిన విధముఁ బరిశీలింపఁగా వీరశైవ సంప్రదాయమునకుఁ జెందిన బ్రాహ్మణేతరులేకాక, శైవ బ్రాహ్మణులు (వీరశైవులుకారు) సైతము జంగమశబ్దవాచ్య లగుచుండినట్లు తెలియనగును. ("సద్భూసురముఖ్యు విప్రమునిపుంగవు జంగమ మల్లికార్జునున్") ఇట్టి వ్యవహారము నేఁడు లేకుండుటకు సోమనాథుల వ్యవహారమే కారణమయి యుండవచ్చును.

కావున నీ జంగమశబ్ద మాధారముగాఁ జోడుఁడు వీరశైవుఁడని నిర్ణయింప వీలులేదు.

ఈతనిని వీరశైవుఁడని భావించుటకు మఱియొక కారణము సోమనాథాది వీరశైవ కవులలో నీతని సంప్రదాయములు కొన్ని కానవచ్చుట. కాని యందుకు కారణాంతరము లున్నవి. దేశీయాభిమానముచేఁ జోడుఁ డట్టి సంప్రదాయములను బ్రవేశపెట్టఁగా సోమనాథులు మత ప్రచారమున కనుకూలించునని వానిని గ్రహించి గ్రంథరచనము సాగించిరి.

నన్నెచోడుఁడు వీరశైవసంప్రదాయమునకుఁ జెందినవాఁడు కాఁడనుటకుఁ గల కారణములఁ జూపుట జరిగినది. కవిరాజు వీరశైవుఁడు కానిచో మఱి యాతఁడెట్టి శైవమునకుఁ జెందినవాఁడై యుండును? అను ప్రశ్న ముదయించును. దానికి సమాధానమును నాకుఁ దోచినంతలో నీయ యత్నింతును.

# నన్నెచోడుని శైవ సంప్రదాయము

బసవేశ్వరుఁడు వీరశైవమును వ్యాప్తిలోనికిఁ దేకముం దాంధ్ర దేశమునఁ గల శైవసంప్రదాయములను గుఱించి శ్రీ కురుగంటి సీతారామ భట్టాచార్యులవారీ క్రిందివిధముగా వచించుచున్నారు.

"This (Sudha Saivism) was the continuation of the Pristine Pre - Aryan Saivism gradually influenced by Agamas and Puranic Hinduism. Among the votaries of this cult the following may be mentioned:

(1) Pasupatas (3) Kalamukhas
(2) Kapalikas (4) Gorakshanatha sect
(5) Raseswara sect.

About the 10th and 11th centuries Pasupata sect wa widely diffused from Rajasthan to Mysore and seems to have penetrated into Andhra Desa in the east. Kapalika does not seem to have entered the Andhra Desa, but Kalamukhas are there particularly in Guntur District."

('Saivism and Andhra Desa'-9.p)

పై శుద్ధ సంప్రదాయములలో నొక్కటి యయిన కాలాముఖ సంప్రదాయములు కొన్ని నన్నెచోడుని కుమారసంభవమున వర్ణితము లయినవికావున నీతఁడు కాలాముఖ శాఖకుఁ జెందినవాఁడు కావచ్చునేమో యను ననుమానము కలుగునట్లు శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు తమ కుమారసంభవ పీఠికలో వచించిరి.

పై శుద్ధశైవము మాత్రమే గాక యాకాలమున దక్షిణదేశమునం దాగమిక శైవ సంప్రదాయ మొకటి యుండెననియు నది కాశ్మీర శైవ సిద్ధాంతమును బోలియున్నను దానినుండి యిది యేర్పడెననుటకు వీలు లేదనియు డా॥ చిలుకూరి నారాయణరావుగారు తమ పండితారాధ్య చరిత్ర పీఠికయందు వచించినారు. (చూ. పం. చ. పీఠిక 279 పుట) ఈ సంప్రదాయమున కాగమము లాధారములు. ఈ ఆగమములు

సంస్కృత భాషయందున్నవి. అయినను నివి తమిళ గ్రంథముల కనువాదము లని వాదించువారును లేకపోలేదు. అట్టివారు ఈ సంప్రదాయము శుద్ధ దాక్షిణాత్యమనియు నతి ప్రాచీనమనియు వచింతురు. (చూ. Saivism and Andhra Desa) దీనినే శ్రీ కురుగంటివారు "Saiva Sidhanta of Tamils" అని యనిరి. నన్నెచోడుఁ డీ సంప్రదాయమునకుఁ జెందినవాఁడయి యుండునని నేను భావించుచున్నాను. అందుకుఁ గల కారణముల నీ క్రిందఁ జూపుదును.

(i) నన్నెచోడుఁడు గణాధిపతి జన్మమును గూర్చి వచించిన కథ సంస్కృత పురాణములం దెక్కడను గానరాదు. అది ప్రాచీన తమిళ వాఙ్మయమునందును, ఆగమము లందును గలదని శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు వచించిరి. ఈ యాగమములే ఆగమ శైవ సంప్రదాయమున కాధారగ్రంథములు. కావున నా యాగమ గంథములందున్న యీ దేశీయేతివృత్తమును దన కావ్యమునఁ జేర్చుకొన్న నన్నెచోడుఁ డాగమ శైవ సంప్రదాయమునకుఁ జెందినవాఁడనుట యుక్తము. ఈ గణాధిప జన్మ కథ సుప్రభేదాగమమునందు త్రిచత్వారింశత్తమ పటలమునఁ గలదని చూపి శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు తమ కవుల చరిత్రమునఁ బైయాగమమునుండి యీ క్రింది శ్లోకము ఉదాహరించినారు. "అథాతస్సంప్రవక్ష్యామి విఘ్నేశస్థాపనం పరం। ఆదౌ త్వహ ముమాసార్థం క్రీడార్థం హేమవద్వనే॥ కరేణుశ్చ గజేంద్రేణ సంభోగ మకరోత్తతః। యదృచ్ఛయా తు తందృష్ట్వా తదాకార మశామహం॥ కరేణో రాకృతించోమా తదాక్రీడ మహభ్నశమ్ (?) తస్యాంతు గర్భ మదధాత్తస్మిన్ కాలే తతోద్భవః॥ చూ. తెనుఁగు కవుల చరిత్ర 221 పుట.

(ii) షష్ఠాశ్వాసమున నన్నెచోడకవి మున్యాశ్రమమును మూలములో లేకున్నను గ్రొత్తగాఁ గల్పించినాఁడు. ఆ యాశ్రమములోని మునిముఖ్యుఁడగు జంగమ మల్లికార్జునుని యాకారమును గవి యీ క్రింది రీతిని వర్ణించినాఁడు.

"వాసనగా శివాగమము వర్ణనకెక్కఁ బ్రయీసదర్థముల్
దేసిగ నాత్మ శిష్యులకుఁ దెల్పుచు సద్విధి నున్న నిష్కళా
భ్యాసమునందు లీనమగు భావము నిల్పి వెలుంగుచున్న స
ద్భూసుర ముఖ్య విప్ర మునిపుంగవు జంగమ మల్లికార్జునున్".
(6-78)

పై పద్యమున "శివాగమము"ల కిచ్చిన ప్రాధాన్యము నన్నెచోడున కాగమములయెడఁ గల నభిమానమును జాటుచున్నది. అంతేగాక పార్వతియు "శైవాగమవిధి దీక్షఁగొనిన" దని పిమ్మట పై సందర్భముననే కవిరాజు వర్ణించినాఁడు. (చూ. 6-81)

(iii) కవికి శైవాగమ విధులయం దభిమానము కలదని వచించుట కనువయిన మఱియొక స్థలము సప్తమాశ్వాస ప్రారంభమునఁ గలదు. బ్రహ్మచారి పార్వతి తపోవనమునుఁ బ్రవేశింప

"వీణారవముతోడ వేదనాదమ్ము నా .
రాగమ్ముతోడ శివాగమములు సదువుచు" (7-3)

వచ్చినాడట. ఆ వచ్చిన బ్రహ్మచారికిఁ బార్వతి "శైవాగమోదిత విధాయతి"తో నభ్యాగతోచిత సపర్యల నొనరించినదట.

"ఆ గిరీంద్ర సుత హర్షముతో శై
వాగమోదిత విధాయతితో సు
స్వాగతాభినుత వాక్యములం ద
భ్యాగతోచిత సపర్యలఁ దనిపెన్." (7-5)

పార్వతి కిట్లు ఆగమోక్త విధమున దీక్ష నిప్పించి, యామెచే నాగమ సంప్రదాయములఁ బాటింపఁజేసిన నన్నెచోడ మహాకవియు నీ యాగమ శైవ సంప్రదాయమునకే చెందియుండుననుట యుక్తిదూరము కాదు.

(iv) నన్నెచోడుని గురువగు జంగమ మల్లికార్జునుఁడు పలుతావులందు శైవాగమవేదిగా వర్ణింపఁబడినాఁడు. "అమితాభవాగమ విశార

డుఁడు" (6-168) "ఆగమచయాచార్యుంఁడు" (10-201) "శివాగమవేది" (11-210). ఇదియు నన్నెచోడుఁడు దాక్షిణాత్యాగమిక సంప్రదాయమునకుఁ జెందియుండుననుటను బలపఱచుచున్నది.

ఈ విధముగా నీ మహాకవి సోమనాథాదులవలె వీరశైవ సంప్రదాయమునకుఁ జెందినవాఁడు కాఁడు కావుననే యాతని గ్రంథమున సోమనాథాదుల గ్రంథములందువలె మతాంతరుల నిందగాని, పరమత దూషణముగాని కటుమార్గమున నడువక సాధారణముగా సాగినవి. ఈతని శైవము శాంతిపూర్వకమేకాని వీరరసోపేతముకాదు.

## కావ్యలక్ష్యము మత ప్రచారమా ?

నన్నెచోడ మహాకవి కుమారసంభవ రచనముఁ జేయుటలోని లక్ష్యమేమి ? ఆతఁడు శైవమతమును బ్రచారము చేయుటకే కుమార సంభవ రచనము సాగించెనా ? అను ప్రశ్నములకు సమాధానము నరయ వలయును.

సోమనాథుఁడు తాను వీరశైవమత ప్రచారార్థమే గ్రంథరచనమును గావించినట్లు స్పష్టముగాఁ జెప్పికొనినాఁడు. నన్నెచోడుఁడు తన కుమార సంభవమును మత ప్రచారార్థము వ్రాసినట్లు చెప్పుకొనలేదు. పైఁగా దానీ గ్రంథమును వ్రాయుటకుఁగల కారణము నీ క్రిందివిధముగా గ్రంథాదిని చెప్పినాఁడు,

"పూని మహాగ్రహారపుర పుత్ర సమున్నతి దేవతాల యో
ద్యాన తటాక సత్కృతి నిధానము లాశశితారకంబు సు
స్థానములై మహింబరగ జంగమమల్లయపేర సప్త సం
తానములొప్ప సల్పుదు ముదంబునఁ దత్ప్రభునాజ్ఞ పెంపునన్"

వ, అందు నుత్కృష్ట సంతానంబు కృతియకా నిశ్చయించి.

"జంగమ మల్లికార్జున నిసర్గకవి స్తవనీయసూక్తి యు
క్తిం గొనియాడి సత్కవితఁ గేనములే కనురక్తమైన భా
షాంగనఁ దక్కనేలిన మహత్వము లోకమునం బ్రసిద్ధిగా
భంగిగ విస్తరించెదఁ బ్రబంధము సద్రస బంధురంబుగాన్".

"గురువున కిష్టదైవమునకుం బతికిం గృతిచెప్పి పుణ్యమున్
వరమును దేజముం బడయవచ్చు జగంబుల నిశ్చయంబు మ
ద్గురువును నిష్టదైవమును గూర్చు నిజేశుఁడుఁ దాన నాకుఁగా
కొరునకు నిట్లు సేకురునె యొక్కట లాభములెన్ని యన్నియున్."

పై పద్యములఁ జూచినచోఁ జోడుని గ్రంథరచనోద్దేశము కొంత తెలియ నగును. తన కృతిని గురువగు జంగమ మల్లికార్జునయోగి కంకితము చేసి కృతార్థత నందుటయు, లోకమునఁ గవిగాఁ దాను ప్రసిద్ధిఁజెంద నెంచుటయుఁ గావ్యరచనకు కారణములయినట్లు కవిరాజు వచించినాడు గదా ! సహృదయుల నాహ్లాదింపఁజేసి తలలూఁగింపని కావ్యము నిరర్థక మని మన రాజకవి మఱియొక పద్యమునఁ జెప్పినాడు.

"ముదమున సత్కవి కావ్యము
నదరగ విలుకానిపట్టినమ్మును బర హృ
ద్భిదమై తలయూపింపని
యది కావ్యమె మలరి పట్టినదియున్ శరమే" ? (1-41)

కావ్యమునెడ మనకవి యభిప్రాయ మిది.

నన్నెచోడ మహాకవి కుమారసంభవ కావ్యము శైవమత ప్రచారార్థము వ్రాయఁబడిన ప్రచార గ్రంథముకాక కవితయెడఁ గవికి సహజముగాఁగల ప్రీతిచే వ్రాయఁబడిన యుత్తమ కావ్యమని వచించుచు నీ ప్రకరణమును ముగింతును.

# నన్నెచోడుని పద్యౌచిత్యము

సంస్కృతవాఙ్మయమునందలి శ్రవ్యకావ్యములందు సామాన్యముగా నొక్క సర్గయందుఁ బూర్తిగా నొకే విధమగు వృత్తమునువాడుట కాననగును. సర్గాంతమున మాత్రము మఱియొక వృత్తము కానవచ్చును. ఈ సర్గాంతమునందు భిన్నవృత్తమును వాడు సంప్రదాయము నవీనమనియు నంతకుముం దంతటను నొకే విధమయిన వృత్తమే వ్రాయువారనియు విమర్శకులు భావించుచున్నారు. (చూ. Sri Varadachari, M. A. గారి 'A History of the Sanskrit Literature') నాటకములందు మాత్రము ఒకే యంకమున ననేక వృత్తములు వాడుట గలదు. ఈ వృత్తములు రసానుకూలములయి కావ్యశోభను బెంపొందించును. ఉదాహరణమున కొక్క పద్యము. కాళిదాస మహాకవి శాకుంతలమునందు చతుర్థాంకమున వైదికచ్ఛందముచే శకుంతల నాశీర్వదింపఁజేసెను.

"అమీ వేదిం పరితః క్లుప్తధిష్ణ్యా
స్సమిద్వన్తః ప్రాంతసంస్తీర్ణదర్భాః
అపఘ్నన్తో దురితం హవ్యగంధై
ర్వైతానా స్త్వాం వహ్నయః పాలయన్తు."

ఇట్టివే మఱికొన్ని. నాటకములందువలెనే శ్రవ్యకావ్యములందును రసోచితములగు వృత్తములను రచించుటలోఁ గాళిదాసు మిక్కిలి యౌచిత్యమును బాటించెను. అతని కుమారసంభవ చతుర్థసర్గయందు "వియోగినీ వృత్తము" వాడఁబడినది. ఆ సర్గయందు మన్మథ వియోగ పీడిత యగు రతీదేవి వృత్తమే (చరితమే) గదా వర్ణితమయినది! ఇది యాతని వృత్తౌచిత్యమును గూర్చిన చక్కని యుదాహరణము. భారవి మహాకవియు వృత్తౌచిత్యమును బాటించినవాఁడే.

ఈ వృత్తౌచిత్యమునుగూర్చి గీర్వాణభాషయందు క్షేమేంద్రుఁడను నాలంకారికుఁడు "సువృత్తతిలకము" అను చిన్ని పొత్తమును రచిం

చెను. అందు మూఁడు "విన్యాసము"లు గలవు. తృతీయవిన్యాసమున వృత్తరచనమునుగూర్చి సంగ్రహముగాఁ గలదు. అందాతఁడు సందర్భోచిత వృత్తములు కావ్యశోభను బెంపొందించునని యీ క్రిందిరీతిని వచించెను.

"ప్రబంధ స్సుతరాం భాతి యథాస్థానం నివేశితైః
నిర్దోషై ర్గుణసంయుక్తైః సువృత్తై ర్మౌక్తికై రివ."

అంతేగాదు. అస్థాననివేశితములయిన వృత్తములు కావ్యశోభను హరించుననియు నీ క్రింది శ్లోకముచే వచించినాఁడు క్షేమేంద్రుఁడు.

"వృత్తరత్నావలీ కామా దస్థానే వినివేశితా
కథయ త్యజ్ఞతా మేవ మేఖలేవ గళేకృతా."

ఈవిధముగా వచించి క్షేమేంద్రుఁ డేయే వృత్తముల నెక్కడెక్కడనుంచఁదగునో ఉదాహరణముగాఁ గొన్నింటిని వచించి, రచించి చూపినాఁడు. కొన్ని పూర్వుల యుదాహరణములనుగూడ నొసంగినాఁడు.

ఈ క్షేమేంద్రమహాకవి వచించిన కొన్ని విషయములు మన నన్నెచోడ మహాకవి పాటించినట్లు ఈ క్రింది యుదాహరణములనుబట్టి యెఱుఁగనగును. మఱికొన్ని యితరకవులు నన్నయాదులందును గాననగును.

తెలుఁగు గ్రంథములం దంతటను నాశ్వాసాదిని కందపద్యము విధిగాఁ గనుపడుచున్నది. ద్విపద కావ్యములు దీని కపవాదములు. ఇట్లాశ్వాసాదిని నన్నయనాటినుండి నేటిదనుక కందపద్యము కానవచ్చుచున్నను దీనినిగూర్చి యాంధ్ర ఛందఃకర్త లెవ్వరు నెట్టి నియమమును గావించినట్లు కానరాదు. ఆకందమున్ను విధిగా శ్రీకారముతో మొదలగును. ఇది దేశీయాచారమని నేను భావింతును. క్షేమేంద్రుఁడు "ఆరంభే సర్గబంధస్య....సంత శ్శంసం త్యనుష్టభం" అని సర్గాదిననుష్టుప్ఛందము వాడుట యుక్తమని వచించెను. ఆంధ్ర కర్ణాటభాషలం

దనుష్టుప్ఛందము లేదుగనుక మనవారీ కందసంప్రదాయమును బాటించి నట్లు కాననగును.

అట్లే సర్గాంతమున "కుర్యాత్సర్గస్య పర్యంతే మాలినీం ద్రుత తాలవత్" అని మాలినీవృత్తమును వాడవలెనని వచించి కాళిదాసు కుమారసంభవము ప్రథమసర్గాంతమున వాడిన "అపచిత బలిపుష్పా వేదిసమ్మార్గదక్షా" అనుశ్లోకమును క్షేమేంద్రుఁ డుదాహరించెను. నన్న పార్యుఁడు ఆదిపర్వ షష్ఠాశ్వాసాంతమున మాత్రము "మాలినీ" వృత్తమును రచించెను. అయినను తదితరాశ్వాసాంతములం దనేక వృత్తముల రచించుటచే నాతఁ డిద్దానిని సంప్రదాయముగాఁ బాటించినవాడు కాఁడని చెప్పవలసి యున్నది.

తిక్కన మాత్ర మట్లుగాక భారతమునం దంతటను విధిగా నాశ్వాసాంతములందు "మాలిని"ని వాడినాఁడు. నిర్వచనోత్తర రామాయణమునందును సోమయాజి యీ నియమమును నియతిగాఁ బాటించి నాఁడు. విన్నకోట పెద్దనయు నాచన సోమనాథుఁడును నీ నియమమును బాటించినారు. మన నన్నెచోడుఁడే వీరి కిందు మార్గదర్శకుడయి యుండును. చోడుఁడు కుమారసంభవమునఁ బ్రథమ ద్వితీయ పంచమా శ్వాసముల కంతమున మాలినీ వృత్తమును రచించెను. తదితరాశ్వా సాంత పద్యముల నాయా సందర్భముల కుచితమగు వృత్తములలో రచించెను. వాని యౌచిత్యమును సమగ్రముగాఁ జర్చించుటకు స్థలము చాలకున్నను నొక్కటి రెంటి సంగతిని వచింతును.

కుమారసంభవమున తృతీయాశ్వాసాంతమున వనయమూర వృత్తము గలదు. ఈ యాశ్వాసమునఁ బార్వతి శివు నర్చించుట కాతని యాశ్రమమును జేరుట వర్ణితమయినది. ఆశ్వాసాంత పద్యములకు ముందు పార్వతి చెలికత్తెలతోఁ బూవులు ద్రెంచుట వర్ణితమయినది. అందా చెలికత్తెలు "పొలుపుగ చంద్రశేఖరు తపోవన మంగజ చక్ర వర్తి దోర్బలమున ముట్టి చూరగొనఁ బంచిన దండొకొ నాగఁ బొల్చె"

నారని వచించినాఁడు కవి. తరువాత శివునితో నభిన్నుఁడయిన కృతి పతిని వనమయూరమున వర్ణించి యాశ్వాసమును బూర్తిచేసినాఁడు చోడరాజు. అతఁడు పార్వతి హృదయము నాకర్షించిన వనమయూరము గాకపోయినచోఁ బాప మామె కీ యరణ్యాగమన మెందుకు సంభ వించును ?

అట్లే చతుర్థాశ్వాసము చివర కవిరాజు వసంత తిలక వృత్త మును రచించినాఁడు. ఈ యాశ్వాసమున మన్మథుఁడు శివుని యాశ్రమ మునకుఁ జేర వసంత మావిర్భవించినది. తదృతుధర్మము లెల్లెడ వర్తిల్లినవి. కంతుఁడును తత్కాలోచిత క్రీడా పరవశుఁడై తరువాత మేల్కనినాఁడఁట. అక్కడ నాశ్వాసము పూర్తియయినది. అక్కడ నీ వసంత తిలకము రచితమయినది. వసంతర్తు వర్ణనము పిమ్మట వర్ణితుఁ డయిన కృతినాయకుఁడు వసంత తిలకమని కవిరాజు భావమైయుండును. అంతేగాక తరువాత పంచమాశ్వాస కథయందు మన్మథుని వీర విక్రమ మును, రుద్రుని రౌద్రమును వర్ణ్య విషయములు. క్షేమేంద్రుఁడు సువృత్త తిలకమున "వసంతతిలకం భాతి సంకరే వీర రౌద్రయోః" వీర రౌద్ర సాంకర్యమును వసంత తిలకముచే వర్ణించుట బాగుండునని వచించెను. కవిరాజు రాబోవు వీర రౌద్ర సాంకర్యము నీ వృత్తముచే సూచింపనెంచి యుండవచ్చు ననియు నూహించుట కవకాశము లేక పోలేదు. ఇఁక నాశ్వాసాంత పద్య రచనమును గూర్చిన వివరణమును బెంచుచుఁ గూర్చుండక తదితర పద్యములను గూర్చి యాలోచింతము.

## శార్దూల విక్రీడితము

తిక్కన శార్దూల విక్రీడిత వృత్తమును వాడుటయందుఁ జూపిన యౌచిత్యము స్తుతిపాత్రమని విమర్శకులు భావింతురు. సోమయాజులు శార్దూలమును మిక్కిలి యరుదుగా వాడినారు. వాడిన పట్టులును బహు రమణీయములు. తిక్కన శార్దూల వృత్తౌచిత్యమునకు విరాటపర్వములోని

"సింగం బాఁకటితో గుహాంతరమునం జేడ్పాటుమైనుండి మా
తంగ స్ఫూర్జిత యూథదర్శన సముద్యత్క్రోధమై వచ్చు నో
జం గాంతార నివాసఖిన్నమతి నస్మత్సేనపై వీఁడె వ
చ్చెం గుంతీసుతమధ్యముండు సమరస్థేమాభిరామాకృతిన్".

(విరాట. 4 ఆ. 95 ప.)

అను పద్య ముదాహరణముగాఁ గైకొనుట మన మెఱుఁగుదుము. పై పద్యముచే నర్జునుని శౌర్యమును వర్ణించినాఁడు ద్రోణాచార్యుఁడు. ఇట్లే శార్దూల విక్రీడితము నెక్కుడ వాడినను సోమయాజులు అందలి యౌచిత్యము పాటింపక మానినవాఁడు కాఁడు. క్షేమేంద్రుఁడు శార్దూల విక్రీడిత పద్యమును గూర్చి "శౌర్యస్తవే నృపాదీనాం శార్దూల క్రీడితం మతమ్" అని వచించెను. తిక్కన యీ నియమమును బాటించెనని ముందే స్పష్టమయినదిగదా!

తిక్కన శార్దూల విక్రీడితము నింత యుచితముగా వాడుట కాతనికి మార్గదర్శి యయినవాఁడు నన్నెచోడ మహాకవిగాఁ గనుపట్టు చున్నాఁడు. అతఁడు నీ పద్యమును మిక్కిలి యుచితములగు సందర్భములలోనే వాడినాఁడు. ఆ వృత్తమును వాడిన పట్టులును విరివిగా లేక కొలఁదిగా మాత్రమే గలవు. సుమారు రెండువేలు పద్యములు గల కుమారసంభవ కావ్యమున శార్దూల వృత్తముల సంఖ్య యిరువది మాత్రమే యన్నచో నతఁడా పద్యము నెంత తూఁచి తూఁచి యుపయోగించినాఁడో విశదము కాకపోదు. అంతేగాదు, నన్నెచోడ మహాకవి శౌర్యస్తవమునే శార్దూల విక్రీడితమున వర్ణించినాఁడని యీ క్రింది పద్యములు సాక్ష్యమిచ్చుచున్నవి:

(i) "రంభా ద్యప్సరసౌఘ....

...గని మనోజాతుండు ప్రీతాత్ముఁడై" (4-38)

(ii) "ఏమేమీ మది నోటికందపెడి....

....గారణం బేమియో?" (10-138)

పై పద్యమునఁ దారకుని శౌర్యము వర్ణితమనుట స్పష్టము.

(iii) "భర్గుం డంతకవాహినుల్....

....మద్బాణవర్షంబునన్". (11-33)

పై పద్యమునందు భటుని శౌర్యము వర్ణితమయినది.

(iv) "వీరేకాదశరుద్రు లష్టవసువుల్....

... సుమహద్విఖ్యాత కీర్తీశ్వరా!" (11-85)

పై పద్యమున దేవతావీరుల శౌర్యగుణము వర్ణితమయినది.

(v) "ఖాలాఖీల....

...నిర్భేద్యు లాద్యుల్ మహిన్". (11-93)

పైనిచ్చిన పద్యములన్నియు శౌర్యమువర్ణించునవియేయగుట స్పష్టము. ఇంతకును దేలినసారాంశ మేమనగాఁ గవిరాజీశార్దూలవిక్రీడితము నుచితరీతిని తన కావ్యమున వాడి తరువాతి తిక్కనాదుల కీ విషయమున మార్గదర్శియయి పఱలినాఁడనుట.

శార్దూలమును వాడుటయందే కా దితర పద్యములను వాడుటలోను నన్నెచోడుఁడు మిగుల నౌచిత్యమును బాటించినాఁడు. ఒక్కొక్కపద్యమునే గైకొని దానిని వాడుటలో కుమారసంభవకర్త చూపిన యుచితజ్ఞతను తెల్లమొనర్తును.

## కందము

కందము చిన్న పద్యము. కథాగమనమును శీఘ్రతరమొనర్చుటకీ పద్యము మిక్కిలి యనుకూలము. సంగ్రహముగా విషయము నెదుటివారి హృదయమునకు హత్తునట్లు చెప్పుటకు నిది యుచితముగానుండును. చోడుఁడు వాడిన పద్యములందు వీనిసంఖ్యయే పెద్దది. (534-చూ. శ్రీ. ని. వేంకటరావుగారి పీఠిక) కుమారసంభవము స్కందునిగూర్చి చెప్పు కావ్యముకావునఁ గవి కందము లెక్కువగా వాడినాఁడని శ్రీ నిడుద

4

వోలు వేంకటరావుగారు వచించినారు (చూ. వారి పీఠిక). కుమారస్వామి వర్ణనము కందపద్యమునఁ జేయఁబడుటకుఁ గారణము నిదేయని వారి తలఁపు. అరవమున స్కాందపురాణము కందపురాణమయినది. ఇదియే శ్రీ వేంకటరావుగారి యూహ కాధారమయి యుండును. నాకుఁజూడ నీ పద్యము వాడఁబడుటకు మఱియొక కారణమును గలదని తోఁచు చున్నది.

ఇందుఁ గుమారస్వామి జననమునకుఁ బూర్వము జరిగినకథలోఁ బ్రాధాన్యముగలవ్యక్తి పార్వతి. ఆమె ఆర్యాదేవిగదా? కావున కవి యార్యాదేవి చరితమును వర్ణించుటకుఁగా నార్యా సంబంధియగు కందముల నెక్కువ వాడియుండును. ఈ యూహ కుపబలకమగు నాధారమును గ్రంథమునఁగలదు.

తృతీయాశ్వాసమునఁ బార్వతి సౌందర్యవర్ణనముగలదు. ఇక్కడ వరుసగాఁ గవి ముప్పదియొక్క కందపద్యములను రచించినాఁడు. శత కములందుఁ దక్క నిట్లు వరుసగా నొక్కచో నొకే పద్యము రచిత మగుట మఱొకచోఁ బ్రాచీనకావ్యములందుఁగానరాదు. ఇన్నింటిని కంద ములను వరుసగాఁ గవి రచించుటయం దేదేనొక యుద్దేశముండియుండు ననుట తగును. మఱియొకచిత్రమేమనగా సౌందర్యవర్ణనము కందముల తోడనే పూర్తిగా రచితమగుట. దీనినిబట్టి పార్వతి సౌందర్యవర్ణన మునకై మన కవిరాజు కందపద్యము నేరికోరి పరిగ్రహించెనని తేలు చున్నది. దీనికిఁగారణ మామె యార్యయగుట నామెశరీరసౌందర్యము నార్యారూపాంతరమగు కందపద్యములందు వచించుట యుక్తమని కవిరా జెంచియుండుననుట చెల్లును.

ఈ సందర్భమున కందమును వాడుటలో మఱియొక యౌచిత్య మును గలదు.

మన కవిరాజు సువృత్త తిలకమున క్షేమేంద్రుఁడు వచించినట్లు వృత్త గమనములోని యౌచిత్యమునుబట్టి యాయా పద్యములను

వాడుటయేకాక వృత్త నామౌచిత్యమును బట్టియు నాయా పద్యముల రచించియుండుట యీతని గ్రంథమునఁ గాననగును.

"కంద" శబ్దము "కది" ధాతువునుండి పుట్టినది. ఈ "కది" ధాతు వాహ్లాదనార్థకమని గురుబాల ప్రబోధికయందుఁ గలదు. అనగా "కందము" అనుదానికి "ఆహ్లాదమును గలిగించునది" యని యర్థమగును. దీనినిబట్టి లోకోత్తరమగు పార్వతి శరీర సౌందర్య మాహ్లాదమును కలిగించునది కాక మఱియేమగును? అనియెంచి మన కవిరాజు కంద పద్యములచేఁ బార్వతి శరీరసౌందర్యమును వర్ణించియుండు ననియు నూహింపనగుచున్నది.

ఈ కవిరాజు కందపద్యముల నెక్కువగా రచించుటయేకాక వాని రచనమునం దనేకవైచిత్ర్యములం జూపినాడు. దుష్కరప్రాస పద్యములు ద్విప్రాస పద్యములు మున్నగునవి యీతని కందపద్యములందుఁ గాన నగును. ఈ క్రిందిసర్వలఘు కందమును జూచినచోఁ బోతన గజేంద్ర మోక్షమున లక్ష్మినడకను వర్ణించిన కందపద్యము జ్ఞప్తికివచ్చి యీ మార్గమునకు నన్నెచోడుఁడే ప్రథముఁడని స్పష్టమగును.

"తగుఁదగదని మనమున మును
వగవగ నొడఁబడఁగ వగవ వగవఁగ బడయున్
దగుఁ దగదని వగవనివగ
వగవగఁ బనిగలదె తనకు వగ మఱి జగతిన్?" (10-136)

ఇది సర్వలఘుకందము. పోతరాజు లక్ష్మి నడకను సర్వలఘు కందముచే వర్ణించినాఁడు. మన కవిరాజు రాజులకు "వగ" కలుగు విధమును హ్రస్వాక్షరములగూర్చి వచించినాఁడు. హ్రస్వాలోచనగల రాజు వగఁగూరు నని కవి భావించి యట్లు రచించెనని తోచుచున్నది.

ఈ కవిచేత కంద మెట్లు చెప్పిన నట్లు విన్నది. ఎన్ని పోకలం బంచిన నన్ని పోకలం బోయినది. దుష్కర ప్రాసముతోఁ బొల్లు మాటలులేక వచనమువలె సాగిపోయిన యీ కందముఁ బరికింపుఁడు:

"చక్షు మదనేంద్రియములు ము
ముక్షులు మది గెలుతు రెఱిఁగి మును శ్రోతృత్వ
క్చక్షు ర్జిహ్వా ఘ్రాణస
పక్షగ వా క్పాణి పాద పాయూపస్థల్". (6-68)

శ్లేషాభిరామమగు నీక్రింది కంద మెంత సుకరముగా సాగిపోయినదో చూడుఁడు :

"కమలాభిశోభితము హరి
రమణీయము విద్రుమాభిరామము శుక ర
మ్యాముసై గగనాబ్ధులతో
సమమై వనమధ్య జలజషండం బొప్పెన్". (10-19)

పై పద్యములోని విశేషణములు జలజ షండమునకును గగనమునకును అబ్ధికిని సమానముగా నన్వయింప వలయును. అయ్యు నొక్క పొల్లు మాటలేదు. ఇట్టివే మఱియుం జూపవచ్చును. ఈ క్రిందిపద్యము నొక్కటిం జూడుఁడు.

"తానేలపచ్చు భూపతి
మానవపతి చరిత నీతి మార్గంబైనన్
(తానేల వచ్చు భూపతి ?
మానవపతిచరితనీతిమార్గంబైనన్)" (10-180)

పై పద్యమున మొదటి రెండు పాదములే ముద్రిత పాఠమునందున్నవి. ఇవి పై విధమున నుండఁదగునని సూచించినవారు శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు. ఇదియే కవి యుద్దేశమునయి యుండును. ఇట్టి పద్యములు భారవియందును గలవు భారవి మన కవిరాజు కభిమాన కవిగదా! ఈ క్రింది కిరాతార్జునీయ శ్లోకమును జూడుఁడు.

"వికచ వారిరుహం దధతం సర
స్సకలహంసగణం శుచి మానసమ్

శివ మగాత్మజయా చ కృతేర్ష్యయా
సకలహం సగణం శుచిమానసమ్" (౫ స. 13 శ్లో.)

పైకిరాతార్జునీయ పద్యమునందు రెండు నాలుగు పాదములే యభిన్నము లుగానుండ చోడుఁడు పూర్వోత్తరార్ధముల కభిన్నతను బాటించినాఁడు. "చరిత+అనీతి మార్గంబైనన్" అను చోటఁగల సంధి వ్యాకరణ విరుద్ధముగదా యని సంశయింపఁ బనిలేదు. అట్టివి మన కవిరాజునకు సమ్మతములే. మొత్తముమీఁదఁ బై పద్యము హృద్యముగా నున్నదనుటకు సందేహములేదు. కవి హృదయమును జక్కఁగా గ్రహించి చూపిన శ్రీ వేంకటరావుగారు మనకు శ్లాఘనీయులు. లేఖకుఁడు కవిరాజు హృద యము గ్రహింపలేక వ్రాయునప్పుడు రెంటినే వ్రాసి యుత్తరార్ధమును వ్రాయక విడిచి యుండుననుట హేతుదూరముగాదు.

ఈకవి కందములగూర్చి మఱొక్క విషయము మనవిచేసి విష యాంతరమునకు వెళ్లుదును.

## చతుర్విధ కందము

ద్వాదశాశ్వాసమున నన్నెచోడుఁ డొక్క చతుర్విధకందమును వ్రాసినాఁడు. ఈ క్రింది దా పద్యము.

"సుజ్ఞానయోగతత్వ వి
ధిజ్ఞులు భవ బంధనములఁ ద్రెంచుచు భువిలో
నజ్ఞానపదముఁ బొందక
ప్రాజ్ఞులు శివుఁగొల్తు రచల భావనఁ దవులన్". (12-27)

ఇందు నాలుగు కందపద్యము లుండవలెను. ప్రథమ కందము యథా తథముగానే యున్నది గదా!

అప్పకవి చతుర్విధ కందమునుగూర్చి యీ క్రిందివిధముగా వచించెను.

"రెండవచరణంబునకున్
రెండవగణ మాదిగాగ నిర్మించినచో
దండిఁ జతుర్విధకందము
పాండవపక్షా! మెలంగుఁ బ్రాజ్ఞులసభలన్." (4 ఆ. 412)

అనగా ప్రథమకందము ద్వితీయచరణము ద్వితీయగణ మాదిగాఁ గొని నచో ద్వితీయచరణ ప్రథమ గణాంతముగా ద్వితీయకంద మేర్పడు నన్నమాట. అట్లే ద్వితీయకంద ద్వితీయచరణ ద్వితీయగణము నాదిగా గ్రహించి కూర్చినచోఁ దృతీయకందమును, దృతీయకంద ద్వితీయ చరణ ద్వితీయగణ మాదిగాఁగొని కూర్చినచో చతుర్థకందము నేర్పడు నన్నమాట. అప్పకవి యుదాహరణము నట్లే యున్నది. (చూ. అప్ప. 4 ఆ. 413 నుండి 416 ప. వఱకు) ఆ విధముగా మన కవిరాజు కందమును విడఁదీసి కూర్చినచో నీ క్రిందివిధముగా ద్వితీయ తృతీయ చతుర్థ కందములేర్పడును. పాఠకుల యుపయోగమునకయి ద్వితీయచరణ ద్వితీయగణము విభిన్నముద్రాక్షరములచే సూచింతును.

### ద్వితీయకందము

"భవబంధనములఁ ద్రెంచుచు
భువిలో నజ్ఞాన పదముఁ *బొందక ప్రాజ్ఞుల్*
శివుఁగొల్తు రచలభావనఁ
దవులన్ సుజ్ఞానయోగ తత్త్వవిధిజ్ఞుల్."

### తృతీయకందము

"అజ్ఞానపదముఁ బొందక
ప్రాజ్ఞుల్ *శివుఁ గొల్తు* రచల భావనఁదవులన్
సుజ్ఞానయోగతత్త్వ వి
ధిజ్ఞుల్ భవబంధనములఁ ద్రెంచుచు భువిలో."

చతుర్థకందము

"శివుఁగొల్తు రచలభావనఁ
దవులన్ సుజ్ఞానయోగ తత్త్వవిధిజ్ఞుల్
భవబంధనములఁ ద్రెంచుచు
భువిలో నజ్ఞానపదముఁ బొందక ప్రాజ్ఞుల్."

ఈ చతుర్థకంద ద్వితీయపాద ద్వితీయగణ మాదిగాఁగొని కూర్చిన మఱలఁ బ్రథమకంద మేర్పడును. కనుక నిట్లిది చతుర్విధకందమయినది. ఇది మన కవితా సంప్రదాయము. అప్పకవియే కాదు మన కవిరాజుకుఁ గొంచెము తరువాతకాలమున జీవించిన విన్నకోట పెద్దనయుఁ దన కావ్యాలంకార చూడామణియందుఁ జతుర్విధ కంధమునుగూర్చి పైవిధము గానే చెప్పినాడు.* కావున నీ సంప్రదాయము ఆదినుండియు నిట్లే వచ్చుచున్నదనియు నిదియే నన్నెచోడ సమ్మతమనియు గ్రహింపనగును. పై విధముగాఁ జతుర్విధకందములఁ గూర్చుటలో మఱియొక విశేషమును గలదు. ప్రథమ కందములోని యక్షరములను యథాతథముగా నితర కందములం దుంచగల్గుటయే యది. ఏమాత్రమును మార్చనవసరములేక వానిం గూర్పవచ్చునని పై విధమును బరిశీలించిన స్పష్టమగును.

కాని మదరాసు విశ్వవిద్యాలయమువారు ప్రకటించిన కుమార సంభవమున నిది యింకొకవిధముగాఁ జూపఁబడినది. సంపాదకులు కావ్యాంతమునందుఁ గల అనుబంధమునఁ దృతీయ చతుర్థ కందముల నీ క్రిందిరీతిఁ జూపినారు. ప్రథమ ద్వితీయ కందముల వారును బై విధము ననే చూపి తృతీయ చతుర్థ కందములయెడ మాత్రమే మార్గాంతరముం ద్రొక్కినారు. వానిని వారు చూపినవిధ మిది :

---

* ప్రథమ కందంబు రెండవ పాదయుగమునందు రెండవగణ వర్ణమాదిగాగఁ గడయుమొదలును వరుసతోఁ గలిపి చదువనగుఁ జతుర్విధకందమై యార్యసభల"
(కావ్యా. చూడా, 6 ఉల్లా, 48 ప.)

తృతీయకందము

"కొలుతు రచల భావనఁ బ్రా
జ్ఞులు శివునిన్ యోగతత్వ సుజ్ఞానవిధి
జ్ఞులు ద్రెంచుచు భవబంధన
ములఁ దవుల జ్ఞానపదముఁబొందక భువిలోన్"

చతుర్థకందము

"మునుఁ ద్రెంచుచు ప్రాజ్ఞులు బం
ధనములు నజ్ఞానభవపదంబొందక భా
వనఁగొల్తు ర్శివు పొల భు
వినచల సుజ్ఞానయోగ విధితత్వజ్ఞుల్."

(చూ. యూనివర్సిటీ ప్రతి : అనుబంధము 1 పుట)

ప్రథమ ద్వితీయ కందముల సంప్రదాయానుసారముగానే చూపిన సంపాదకులు ఈ తృతీయ చతుర్థ కందముల నిట్లు చూపుటకుఁ గారణము తోఁచకున్నది. పోనీ యీ విధమును హృదయంగమముగానే యున్నదనియు దీనివలనఁ గవిరాజు మఱిరెండు కందములు నందిమిడునట్లు రచన సాగించినాఁడని యెంచ దీనివలన వీలగుచున్నదనియు సంతసింతమన్నను నీ విధానములోని క్రమము బోధపడకున్నది. రెండవ కందము (వారు చూపినది) లోని పదముల రూపమును క్రమమును మారకుండునట్లుగాఁ గదా మూఁడవ కందమును గూర్పవలెను ? వానిని మన యిచ్చవచ్చినట్లు మార్చి కూర్చినచో నది కవిహృదయానుసారి యగునా ?

వారిచ్చిన తృతీయ కందము విధమును బరిశీలింతము. ప్రథమ పాద ప్రారంభముననే యొక పొల్లక్కరము ప్రాణమునందినది. "శివుఁ గొల్తురచల" యని మూలముననుండగా నది "కొలుతురచలభావన"గా రూపాంతరితమయినది. అదియుఁ గ్రమమున సాగినదాయన్న నక్కఱ

నుండి "ప్రాజ్ఞులు శివునిన్" అని వెనుకకుదుమికి "శివుఁగొల్తు"రనునది "శివునిన్" గా మాఱిపోయినది. ఇంకను ననేకములగు మార్పులను, చేర్పులను గూర్పఁబడి తుదకు కందాకారము నందినది. ఇందొక క్రమము నున్నట్లు కానరాదు.

చతుర్థకంద మింకను మూలమునకు దూరమయి సంబంధములేని దానివలెఁ గనిపించుచున్నది. పదములు తారుమారయినవి. వీనికన్నింటికి నేదేనొక క్రమమున్న బాగుండెడిది. వీరి విధానము నన్నెచోడుని మూలములోని పదములను భావమును గ్రహించి కొత్త పద్యములు వ్రాసినట్లున్నది గాని మూలముతో సంబంధించిన కందము లనునట్లు లేదు.

ఈ విశ్వవిద్యాలయ ప్రతియం దిట్లుండుటచేతనే దీనినిగూర్చి యింతగా వ్రాయవలసివచ్చినది*. నేనిట్లు వ్రాయుట నాకు సంపాదకుల యెడ గౌరవభావము లేక కాదనియు, వారు నాకు సర్వవిధములఁ బూజ్యులనియు స్పష్టపఱచుచు నీ కందపద్య విషయమును ముగించుచున్నాను.

## సీసము

కవిరాజు క్రొత్తమార్గమునకుఁ ద్రిప్పి సొగసుగా రచించిన మఱియొక పద్యము సీసము. ఇది దేశీయ పద్యభేదమగుటచే దానియెడ మన కవి కభిమానముండుట సహజము. కావుననే దాని నంత యందముగాఁ దీర్చఁగలిగినా డీ కవిరాజు.

సామాన్యముగా సీసపద్యమునకు శ్రీనాథు నెన్నుట పరిపాటి. ఆ విధముగా సీసముల నడిపినవారిలో నాద్యుఁడు కవిసార్వభౌముఁడే

* కీ. శే. శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారీ కందపద్యమునకు వివరణము వ్రాయు సందర్భమున రెండవ కందమును మాత్రమే సంప్రదాయానుసారముగాఁ జూపి యూరకున్నారు. (చూ. 2 భా. 122 పుట) వారు కడమవానిని జూపకుండుటకుఁ గారణము తెలియదు. యూనివర్సిటీవారు రెండవకందమునైనను సంప్రదాయానుగుణముగా నిచ్చుటకుఁ గవిగారి వ్రాతయే మూలమని తోఁచుచున్నది.

యని కొందరి భావన. కాని చోడుని కుమారసంభవమును జూచినచో నా కొందఱి భావమయినను మారక తప్పదు.

సీసము వర్ణనలో రాణించును. కథాగమనమున దీని రచన సొగసుగానుండదు. వర్ణనమునందైనను నే పాదమున కా పాదము విడిపోయి తూగినట్లు సాగినచో సీసము పాఠకుల నుఱ్ఱూఁతలూఁగించును. ఇట్టి సీసములు కారణమేమోకాని తిక్కనలోఁ గానరావు. నన్నయయందును గానరావు. వారు దీని ప్రత్యేకతను గుర్తించిరచించినట్లు కానరాదు. అయినను నన్నయభట్టారకుని యీ క్రింది సీసము కొంచెము నన్నెచోడాదులు చూపిన మార్గమునకుఁ గారణమేమో యనునట్లు సాగిపోయినది. రాజసూయ ఘట్టమందలి దీ పద్యము.

"ఈతని వృద్ధని యెఱిఁగి పూజించితే
వసుదేవుఁ డుండంగ వసుమతీశ :
ఋత్విజుండని విచారించి పూజించితే
ద్వైపాయనుండుండ ధర్మయుక్తి
ఆచార్యుఁడని వినయమునఁ బూజించితే
కృతమతుల్ ద్రోణుండు కృపుఁడు నుండ
భూనాథుఁ డనియెడు బుద్ధిఁ బూజించితే
యాదవుల్ రాజులే యవనిమీఁద
పూజనీయులైన పురుషుల లోపల
నెవ్వఁడయ్యెఁ గృష్ణుఁ డిట్టు లేల
పూజ్యులైనవారిఁ బూజింప నొల్లక
భీష్మ పలుకుఁజేసి బేలవైతి" (సభా. 2 ఆ. 11 ప.)

పూర్తిగాఁ గాదు గాని మూఁడు పాదములదాక నుయ్యాలలూఁగిన మఱియొక సీసము నన్నయ్యది :

"అమలసుధా రమ్యహర్మ్య తలంబుల
నవకుసుమామోద నందనముల

కృతకాద్రి కందర క్రీడాగృహాంగణ
వివిధ రత్నోపల వేదికలను
కలహంస కలనాద కమనీయ కమలినీ
దీర్ఘికా సైకత తీరములను
రమియించుచును ... ... ......" (ఆది. 4 ఆ. 216 ప.)

దీని మూఁడవ పాదము రమ్యతరము. గణమొక్క పదముగా గమనము సాగించి యన్నింటను "క" కారమే యాదినుండుట దానిని రమ్యతరమొనర్చినది.

చోడుని సీసములందు తూఁగు సీసములే మెండు. కథాగమనమున చోడుఁడు సీసమును వాడిన పట్టులు చాల తక్కువ. సీసముల కందమును గూర్చు మఱియొక విషయము నాలుగు పాదముల చివరలు నొకే విధమున చెక్కి నిలిపినట్లు రచించుట. ఈ క్రింది పద్యముం జూడుఁడు :

"వెలిమిడి నలికంబు చెలువంగఁ బోవుఁచోఁ
దెలుపార మైనిండ నలఁది కొనుచుఁ
బూవులు దుఱుమంగఁ బోవుచో వెలిఁ గొంత
దోపంగ నడ్డంబుఁ దురిమికొనుచు
మోవి లత్తుకఁ బూయఁ బోవుచో లాలాట
పట్టికఁ దిలకంబు వెట్టికొనుచు
కాటుక మెదుచుచుఁ గన్నుల నిడఁబోయి
పొల్తుక గళమునఁ బూసికొనుచు
సితరుచీం, దుఖండ, శిఖినేత్ర, గరళంబు
లొడలఁ, దలను, నుదుట, మెడను, దాల్చి
పొల్చు శంభునొర్తు పోలి చూపఱు దన
కెఱఁగుచుండ వచ్చె నీశుఁ జూడ." (8-66)

సీసము చమత్కారముగా నుండుటకు మఱియొక కారణము గీత పద్యమద్దానికి జీవము పోయునట్లు కూర్చుట. అనగా గీతియే పద్యార్థమును

బూర్తిచేయుటకు ముఖ్యమయినదిగా నుండవలయు ననుట. పై పద్యమే యందు కుదాహరణము. ఆ చెలువ యాకార మీఘఁ బోలి యున్నట్లు గీతము చదివినఁ గాని తెలియదు. దీని మెలకువ గ్రహించి యీ మార్గమును జూపినవాఁడును చోళరాజే. ఈతఁడు సీసములందు వివిధ గతులను జూపి తరువాతివారికి మార్గదర్శి యయ్యెననుట నిశ్చితాంశము. గ్రంథమునఁ గుప్పలుగాఁ గనుపించు నాతని సీస రచన కుదాహరణములు వెదకి యీయనవసరము లేదని యుదాహరించుట మాని మఱియొక విషయమునకు వెడలుదును.

## తరువోజ

నన్నెచోడునకు దేశి పద్యముల యెడ నభిమానమని ముందే వచించితినిగదా! ఆతఁడు తరువోజలను, ఉత్సాహములను, లయగ్రాహి, లయ హారిణులను, తన గ్రంథమున సందర్భానుకూలముగా వాడి రస పోషణము గావించినాఁడు. తరువోజలనే కొన్నియెడలఁ దరువదలనియు ముద్రించుట కాననగును. ఈ రెంటికిని భేదము కనిపింపదు. "తరువద" యను పద్య మొక్కటి వేరుగా నున్నట్లును ఆంధ్ర ఛ్ఛందఃకర్తలు వచించినట్లు నే నెఱుఁగను. కావున నివి రెండు నొక్కటియనియే నేను తలంచుచున్నాను.

తరువోజనుగూర్చి విన్నకోట పెద్దన యిది రోళ్ళకడ నాడువారు పాడుకొనుటకు యుక్తముగానుండునని సూచించెను. రోళ్ళకడగానీ కాకపోనీ కాని యిది యాఁడువారు పలికినట్లు రచించుట మనోహరముగా నుండునని నేను భావింతును. అందుకుఁ గారణమీ పద్యము నడకలో కొన్ని యాఁడువారి స్వరముం బోలిన దీర్ఘములు కనుపించుట, ఎంత కలిసిమెలసి యున్నను నాఁడువారి స్వర మాఁడువారిదే. అది యీ పద్యమునందు వినిపించును. ద్విపదలందు నిది కాననగును. అంతేగాదు ఆఁడువారు సామాన్యముగాఁ బాడుకొను పాటలం దంతటను నీ స్వరము విని

పించుచుండును. విన్నకోట పెద్దనయు దీనినే సూచించెనని నేనను కొందును. మన కవిరాజు తరువోజను వాడినవిధము నిదియే.

షష్ఠాశ్వాసమున పార్వతి తపోవనమునకు బయలుదేఱనుండఁగా మేనక యామెను వారించుటకుఁ బల్కిన పలుకులు తరువోజలోఁ గూర్చినాడు మన చోడకవి. అట్లే నవమాశ్వాసమున మదిరోన్మత్తలైన యింతులు విశ్వేశునిపైఁ బాటలను బాడిన విషయమును దరువోజలోఁ గూర్చినాడు నన్నెచోడకవి. కాని ద్వితీయాశ్వాసమున నల్లునిపై నలిగిన దక్షుఁడు తన భార్యతోఁ బలికిన పలుకులును తరువోజయందే యుండుట యొక విశేషము. దీనిలో నేదో విశేష ముండియుండవలె. అప్పటి దక్షుని పలుకుల్ అబలాజనోచితములుగా నున్నవని చోడుని తలంపై యుండును. లేనిచో దక్షుఁడేమి ? పరమపురుషునిపై నలుగుట యేమి ?

ఇఁక గొన్ని తరువదలని యున్నపద్యముల విషయముఁ జూతము. పంచమాశ్వాసమున రతీ విలాపమందొక్కటి యీ క్రిందిపద్యము.

"కాయజుఁడా యగ్నిఁగాలెనో నెఱయఁ
గాలంగ నెడ యెద్ది గడు భీతిఁ బాఱి
పోయెనో ? నను(బెట్టి పోవునే కడచి ?
పోయిననీ భస్మపుంజ మెక్కడిది ?"

పైది పద్యమున సగభాగము. ఇందును రతి పలుకులే వర్ణితములయి పైవిషయమునే బలపఱచుచున్నవి. ఈయాశ్వాసముననే యింకొకతరువద పార్వతి విరహావస్థను వర్ణించుపట్టునఁ గలదు.

అష్టమాశ్వాసమున శివుని జూడవచ్చు నొక మందయాన విలాసమును దరువోజలో నల్లినాడు చోళరాజు. మఱియొకటి దశమాశ్వాసమున శరవణ సరోవర వర్ణనమున నున్నది. ఆ కమలాకరము స్త్రీవలె నున్నదని కవియే (10-29) యొక పద్యమునఁ జెప్పుటచే నిక్కడి తరువదయు యుక్తముగానే వాడఁబడిన దనవచ్చును. దివ్యర్షుల పల్లియ వర్ణనమునందు నొక్క తరువద గలదు. అది పార్వతి తన మనమున

ననుకొన్న విషయమని భావించిన నదియు సుసంగీతమే యననగును. ఈ విధముగా నీ తరువోజ సర్వత్ర యీ గ్రంథమున నాఁడువారి సంబంధము ననే వాడఁబడినట్లు తేలినది. ఈ విషయమును ముగించుటకుముందొక్క సంగతిని బ్రస్తావించుట యసంగతము గాదని యెంతును.

## ద్విపద ముందా? తరువోజ ముందా?

రెండు ద్విపద పాదముల నొక్క పాదముగా మార్చి ప్రాస నియమము పాటించి యట్టివి నాలుగు పాదములు గూర్చిన తరువోజ యగును. అట్లే యొక్క తరువోజపాదమును రెండు ముక్కలక్రిందఁ దెగనఱకినచో మంజరీ ద్విపదగా నెట్టి మార్పవసరము లేకయే యేర్పడును. కుమారసంభవ ముద్రిత ప్రతులం దిది యీ విధముగానే యున్నది. కావున నీ ద్విపదకును తరువోజకును దగ్గఱి సంబంధము గలదనుట నిర్వివాదాంశము. వీనిలో నేదో ఒకటి మఱియొకదానివలన జనించియుండవలెను. దానిని బెద్దలు నంగీకరించినారు.

పూజ్యులగు శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు రెండు ద్విపద పాదముల నదికి తరువోజను గూర్చియుందురని భావించినారు. (చూ. వారి దేశి) దానికిఁ గారణము చిన్న పద్యములు ముందు పెద్దవి తరువాత నను సిద్ధాంతమే యయి యుండవచ్చుననుకొందును. కాని నాకుఁ జూడఁగా నది యట్లయినట్లు తోపదు.

తరువోజపాదమును రెండుగాఁజీల్చియే ద్విపదల నేర్పఱచియుందు రని నా యూహ. దీనిని బెద్దలు పరిశీలింప వేడుచున్నాను. నేనిట్లు భావించుటకుఁగల కారణమును నివేదింతును.

మన యాంధ్రభాషయందు ద్విపదలు మొట్టమొదటిమాఱుగా మనకు దర్శనము నొసగినది పాల్కురికి సోమనాథుని రచనలందు. అంతకుఁబూర్వము ద్విపదల యునికి కాధారములు గానరావు. నన్నయ గాని, పావులూరి మల్లన గాని, పండితారాధ్యులు గాని, నన్నెచోడుఁడు

గాని, అధర్వణుఁడుగాని, తిక్కనగాని వీనిని వాడలేదు. కేవలము దేశి పద్యములే గల ప్రాఙ్నన్నయ యుగములోని శాసనములందును నీ ద్విపదలయునిక్కి కనుపట్టదు. కన్నడమునందు నిదిలేదు.

ఇఁక దరువోజ యన్ననో నన్నయకు ముందుఁగల శాసనములందున్నది. నన్నెచోడుని కుమారసంభవమున విరివిగా వాడఁబడినది. నన్నయ భట్టారకుఁడును వాడినాఁడు. (ఆది. 2 ఆ. 151, 3 ఆ 172 ప.) తిక్కన సోమయాజి భారతమునను గలదు. (చూ. స్త్రీ ప. 1 ఆ. 43 ప., 2 ఆ. 157 ప.) ఈ విధముగాఁ దరువోజ మొదటినుండియు గలదు. అంతే గాదది విరివిగా నానాఁడు దేశివాఙ్మయమున వ్యాప్తియం దుండెననియు శాసనాధారములే గాక, విన్నకోట పెద్దన కావ్యాలంకార సంగ్రహమును సాక్ష్య మిచ్చుచున్నది. ద్విపదయన్ననో సోమనాథుని తరువాతనే వ్యాప్తిఁగాంచినది.

మఱియొక్క విశేషమేమనగా మనకు నిశ్చితముగా సోమనాథుని పిదప వెలువడినవని చెప్పదగిన కృతులందుఁ దరువోజ కానరాదు. అనగా నది సోమనాథుని తరువాతి కాలమున గ్రంథప్రపంచమునకు దూరమయిన దన్నమాట. అయినను ఛందఃకర్తలు దానిని చెప్పుచునే యున్నారు. వాడినవారు మాత్రము మృగ్యులే. అనగాఁ దేలిన సారాంశము ద్విపద యావిర్భవించి తరువోజను వెనుకకు నెట్టిన దన్నమాట.

కనుకనే తరువోజయే మొట్టమొదటి దనియు దాని కాళ్లు విఱిగి పోగా ద్విపద లేచి నిలిచెననియు నేను భావించుచున్నాను. ఈ పనిని గావించినవాఁడు పాల్కురికి సోమనాథ మహాకవియే యనుట హేతు దూరము గాదనియు నాతలంపు. చిన్ని చిన్ని పాదములే జనుల నోళ్ళకు దేలికగా నబ్బునని యాతఁడీపని చేసియుండును.

ఈ విషయము సాహసించి చెప్పినందులకు పెద్దలను మన్నింప వేడుచు మఱియొక విషయమునకు వెడలుదును.

## లయగ్రాహి

నన్నెచోడ మహాకవి లయగ్రాహులను వాడిన ఘట్టములు రెండు. అందొకటి ద్వితీయాశ్వాసమునను, నింకొక్కటి ద్వాదశాశ్వాసమునను గలవు. నన్నెచోడ మహాకవి పద్యౌచిత్యమును రెండు విధములుగాఁ బాటించినట్లు మున్నే వచించితిని. అందొక విధము పద్యనామము నర్థము ననుసరించి దాని కుచితముగాఁ బద్యముల వాడుట. రెండవది దాని గమనములోసి యుచితత్వము గ్రహించి తదనుకూలముగా నా పద్యము నుపయోగించుట. ఈ లయగ్రాహిని కవిరాజశిఖామణి వాడిన రెండు ఘట్టములు రెండు విధముల కుదాహరణములుగానున్నవి.

ద్వితీయాశ్వాసమున దక్షుఁడు పరమేశ్వరుని స్తుతించిన సందర్భములో వరుసగా మూఁడు లయగ్రాహులను రచించినాఁడు నన్నెచోడుఁడు. మూటియందును శివుని నాట్యభంగిమయే వర్ణితమయినది. శివుడు (ప్ర) లయగ్రాహి. ఆతని యా నృత్యభంగిమను వర్ణించుటకు లయగ్రాహిని వాడుట సందర్భోచితముగా నున్నదనుటకు సందేహము లేదుగదా!

రెండవ ఘట్టమున (12 ఆశ్వా.) కుమార తారకుల యుద్ధము వర్ణితమయినది. లయగ్రాహిగమనము వీరరసానుకూలముఁగా నుండును. దాని పదముల కూర్పును తదనుకూలముగా నున్నచో నింక జెప్పనవసరములేదు. ఈ రెండు పద్యములందు నట్టి పదరచన గలదు. అందును రెండవదానియం దిది మిగుల పరిణతినందినది. ఆ పద్యమును జూడుఁడు.

ముట్టి గజయూథముల బట్టి రదనాగ్రములఁ
గుట్టి తెగఁజీరి పలు తట్టములు వెట్టుం
గట్టెదుర దాకి పడఁ బెట్టి మొగ మెట్టుఁ బెద
ముట్టు సని వాలములఁ బెట్టుకొని వీడున్
బిట్టడరి కేల మెడ సుట్టి తెగనెత్తువడు
నట్టలు శిరంబులును మెట్టులు గొనం బ్రో

పెట్టుఁ జనఁ దట్టుఁ జెడ మెట్టుఁ నలి గొట్టుఁ గని
కట్టలుకఁ దారకసురారి కరివోరన్" (12-173)

ఇందుఁగల ద్విరుక్తటకారావృత్తి పద్యమును మనోహర తర మొనర్చినది. చోడుని యుద్ధవర్ణనములు మనోహరములుగా నుండుటకుఁ గల కారణములలో నిది యొకటి. ఇఁక లయహారిణుల నీతఁడు వాడిన విధముఁ జూతము.

## లయహారిణులు (లయహారులు)

కవిరాజు ద్వితీయాశ్వాసమున దక్షుఁడు శివుని స్తుతించు సందర్భమునసే మూఁడు లయగ్రాహుల వరుసనే రెండు లయహారిణులను రచించినాఁడు. ఇవియు శివునికి లయముతోఁ గల సంబంధమునే ధ్వనింపఁజేయు ననుట అయుక్తము గాదు. శివుఁడు లయగ్రాహియే గాదు. భక్తుల ప్రళయమును హరించి సుఖాత్ములఁ జేయువాఁడనియు నీ పద్యముల రచనమునందలి యంతరార్థమయి యుండును. ఈ లయహారిణులం దొక విశేషము గలదు. వీనియందు పాదాంత్య వర్ణములు రెండు దక్క కడమవన్నియు లఘ్వక్షరములే. వీనివలన నీ పద్యముల కొక వింత సొగసు వచ్చినది. అప్పకవి వీనిని "లయగ్రాహు" లనియే వచించెను. కవిజనాశ్రయకారుఁడు నట్లే యని చెప్పెను. కాని కుమారసంభవమునందు మాత్రము "లయహారిణి" ముద్రితమయినది. ఇది ఛంధఃకర్తలు చెప్పినట్లే యుండుట యుచితమని యెంచనగును. ఇఁక నీతఁడుత్సాహముల వాడిన విధమును బరికింతము.

## ఉత్సాహములు

ఉత్సాహ వృత్తమును వాడుటలో నీకవి సర్వత్ర చక్కని యౌచిత్యమును గనుపఱచినాఁడు. ఈతఁడు వీనిని నాలుగు సందర్భము లందు వాడినాఁడు. అందు మొదటిది ద్వితీయాశ్వాసమున దక్షాధ్వర

ధ్వంసమునకై తన్నుఁ బంపుమని గణాధీశ్వరుఁ డీశ్వరుని వేడుపట్టున గలదు. ఇందు గణపతి యుత్సాహము వర్ణితమయినది. రెండవది పంచమాశ్వాసమునందు రతీవిలాపమున నున్నది. ఇందు రతి మన్మథునియహంకారమును వర్ణించి విలపించుట వర్ణింపఁబడినది. మన్మథుఁ డుత్సాహముతో శివుని జయింతుననియే భావించెను గాని యుచితజ్ఞుఁడయి విషయము గ్రహించి తప్పుకొని బ్రదుకలేకపోయెనే యని రతి యేడ్చు. ఇక్కడ నొక్క విషయమును వచించుట యసందర్భము గాదని భావింతును.

## స్త్రీపర్వములోని వృత్తములు కుమారసంభవానుకరణములా?

తిక్కన భారతమున వివిధవృత్తములు విశేషముగా నొక్క స్త్రీపర్వముననే గలవు. ఇతరత్ర ఆశ్వాసాంతమునం దొక్క మాలిని దక్క విశేషవృత్తములు గానరావు. ఇక్కడ నిట్లు రచించుటకుఁ గారణ మేమయి యుండును? కొందఱు తిక్కన నెవరో విశేషవృత్తములు వాడలేదని యాక్షేపింపఁగాఁ దన ప్రతిభఁజూపుట కిట్లు కావించెనందురు. కాని యది యుచితమని తోపదు. అట్లన్నచో నిక్కడనే వానినేల గుప్పింపవలయును? మఱియొకచోట వ్రాయవచ్చునే? మఱికొందఱు స్త్రీలరోదనము వివిధగతుల గీతిరూపమున నుండుట లోకమునఁ గానవచ్చుచున్నది గనుక దానిని సూచించుట కిట్లు కావించి యుండునని యెంతురు. ఇదికొంత యుక్తియుక్తముగా నున్నదనవచ్చును.

కుమారసంభవమునందు రతీవిలాపమున మత్తకోకి లోత్సాహ వృత్తములేకాక తరువోజలును కాననగును. కుమారసంభవకర్తయుఁ బై యౌచిత్యము నెఱింగియే వీనిం బ్రయోగించి యుండుననుట వానిని జూచినచోఁ దెలియఁగలదు. కావున స్త్రీల విలాపములను వివిధవృత్తములలో వర్ణించు నీయాచారమును దిక్కన నన్నెచోడునినుండియే

గ్రహించెనని యెంచవచ్చును. ఈ విషయము నింతతో విడిచి ప్రకృత మునకు వత్తము.

కుమారసంభవ షష్ఠాశ్వాసమున శరత్కాల వర్ణనమునం దొక యుత్సాహవృత్తము గలదు (6-20). ఆకాశమునఁ జిలుకబారు పరు గెత్తుట దిగ్వధువులు శరదాగమనమునఁ జేయు నుత్సవమునకుఁ గట్టిన తోరణమువలె నున్నదట. ఇది దిగ్వధూత్సాహము.

దశమాశ్వాసమున నొక్కపట్టున నుత్సాహములు రెండు కూర్చఁ బడినవి. ఇది కుమారసంభవోత్సాహము. ఇది కుమారసంభవోత్సాహ మని కవియే (10-50) స్పష్టముగాఁ జెప్పినాఁడు. కావున నీపద్యమును బహురమ్యముగా నీకవి యుపయోగించినాఁ డనఁజెల్లుచున్నది.

## స్రగ్ధర-మహాస్రగ్ధరలు

సామాన్యముగా నీరెండు వృత్తములు యుద్ధవర్ణనమునకును సముద్రవర్ణనమునకును, వీరుల పరాక్రమ వర్ణనమునకును ననుకూల గమ నము కలిగి యుండును. వీనిని మహాకవులందఱు సామాన్యముగాఁ బై సందర్భములందే యుపయోగించుట కాననగును.

చోడుఁడు స్రగ్ధరను రెండుచోట్లమాత్రమే వాడినాఁడు. గ్రంథాదిని మంగళాచరణమందొక్కటి. దీని యౌచిత్యమునుగూర్చి మంగళాచరణ ప్రకరణమునఁ గొంత వచించినాను. ఇది నామౌచిత్యమునుబట్టి యుప యోగించినదాని కుదాహరణము. రెండవది దక్షాధ్వర విధ్వంసమునఁ గలదు. ఇది గమనమునందలి యౌచిత్యమునుబట్టి వాడినదాని కుదా హరణము.

మహాస్రగ్ధరను వాడిన పట్టులు కుమారసంభవమున నెక్కువ గలవు. అందు యుద్ధవర్ణనమునం దుపయోగించినవి 11 ఆ. 63, 81; 12 ఆ. 190 ; పద్యములు. 1 ఆ. 115 వ పద్యము సముద్రవర్ణనము. 2 ఆ. 50 వ పద్యము దాక్షాయణి మరణవార్త విన్న శివునికంట వెల్వడిన

యగ్ని భయంకరాకారమును వర్ణించునది. మఱికొన్ని కృతినాయక వర్ణనము గలవి. ఇవి యన్నియు మిక్కిలి యుచితముగా నుపయోగింపఁ బడినవనుట స్పష్టము.

## ముద్రాలంకారము

నన్నెచోడుఁడు సమయోచితముగా నాయా వృత్తములను వాడి చూపుటయేకాక ఆయా పద్యముల పేరులనుగూడ వానియం దిమిడ్చి పద్యముల రచించినాఁడు. ఈ విధమగు రచన ముద్రాలంకారమగును. ఇట్టిది మన కవిరాజు విరివిగా రచించినవాఁ డగుటచే నట్టి రచనమునం దాతని కాదరము మెండని చెప్పనొప్పును. ఆ పద్యములు పై వానివలెనే మనోహరముగానుండి రసపోషకములుగా నుండును. ఇట్టివి సంస్కృత భాషయందును గలవు. వానికి కొన్ని యుదాహరణములను శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు తమ కుమారసంభవ పీఠికయం దొసఁగియున్నారు. క్రీ. శ. 400 సం. నాటినుండియు నిట్టి రచనలు గలవని శ్రీ వేంకట రావుగారు చెప్పినారు. వారు చూపిన యుదాహరణములు విడిచి మఱి యొకటి నేనుచూచినది యిక్కడ నొసంగెదను. ఇది వాగ్భటుని వైద్య గ్రంథములోనిదట (చూ. సువృత్తతిలకము).

"మధుముఖమివ సోత్పలం ప్రియాయాః
కలరసనా ప్రియవాదినీ ప్రియేవ
కుసుమచయ మనోహరా చ శయ్యా
కిసలయినీ లతికేవ పుష్పితాగ్రా"

ఇది పుష్పితాగ్రావృత్తము.

ఈ ముద్రాలంకారవిషయమున నన్నెచోడుని యీ సంప్రదాయ మును బాటించిన యాంధ్రకవులు ఎఱ్ఱాప్రెగ్గడ, కూచిరాజు ఎఱ్ఱన, అద్దంకి గంగాధర కవులని శ్రీ వేంకటరావుగారు వచించి వారిగ్రంథములనుండి యుదాహరణముల నొసంగిరి.

*నన్నెచోడుఁడు ముద్రాలంకారమును వాడిన పట్టు లుదాహరించి మఱియొకవిషయమున కేగుదును.

1. "హృదయాహ్లాదముతోడ....
మదనాసక్తిఁ బెనంగుచున్న విలసన్మత్తేభ విక్రీడితం....(1-101)
(ఇందు మదపుటేనుఁగుల క్రీడ వర్ణితము)

2. "మెత్తమెత్తన....
మత్తకోకిల లాఱమిం గడు మానసరంబగు నామనిన్" (4-108)
(ఇందు మత్తకోకిలాలాపములు చాటబడినవి.)

2. "ఆ గిరీంద్రసుత హర్షముతో శై
వాగమోదిత విధాయతితో సు
స్వాగతాభినుత వాక్యములం ద
ధ్యాగతోచిత సపర్యలఁ దనిపెన్" (7-5)
(ఇందుఁబార్వతి బ్రహ్మచారికిస్వాగతమిచ్చుట వర్ణితమయినది)

4. "ఆననలీల....
మానినిరూపచరిత్ర లుదారసమంబగుచున్నవి చిత్రగతిన్" (7-9)
(ఇందు మానినియగు పార్వతి చరిత్రము వర్ణితమయినది)

5. "జలజముసావి.... చంపకంబులు సవిడాయ...." (8-8)
(ఇందుఁబార్వతి ముఖము, ముక్కు మున్నగునవి వర్ణితములు)

6. "చంచల....
క్రౌంచగతుల్ వీక్షించుచు
భాస్వజ్జ్వలనుఁడు శరవణ సరసికివచ్చెన్" (10-30)
(ఇందు క్రౌంచపక్షుల గతులు వర్ణితములు)

---

* ఈతఁడు వృత్తములందేగాక కందాదులయందును ముద్రాలంకారము వాడినాఁడు : "సిందూరపిండములో మరుకందుకములో సత్త్రవాళకఫలంబులో నా నందములై రాగ లతా కందములన మడమ లచలకన్యక కొప్పున్" (3-46).

7. "ఆ హరాద్యమరవరుల....
న్మహోత్సాహమయ్యె నక్కుమారసంభవమ్మునం దొగిన్" (10-50)
(ఇందుఁ గుమారసంభవోత్సాహము వర్ణితము)

8. "చెలఁగన్....
లలితేభంబు దినేశ్వరుం డుదయశైలం బెక్కునట్లున్నతిన్" (11-8)
(ఇందుఁగుమారుఁడు మత్తేభారోహణముచేయుట వర్ణితము)

9. "మదనాగంబులు చేతులెత్తి పఱవన్...." (11-34)
(మత్తేభముల పరుగు వర్ణితము.)

10. "భూవినుతుఁ డార్య....
....నిచ్చు దయ మంగళమహాశ్రీ" (12-231)
(ఇందు శిష్టతతికి మంగళమహాశ్రీ యగుతమనిచెప్పబడినది)

కావ్యాంతమునఁ గల యీ మంగళమహాశ్రీ వృత్తమునుగూర్చి కొంచెము చెప్పవలసియున్నది.

## మంగళ మహాశ్రీ

కావ్యాదిని స్రగ్ధరావృత్తము నన్నెచోడుని ప్రత్యేకమార్గ మయినట్లే కావ్యాంతమున మంగళ మహాశ్రీ వృత్తమును రచించుటయు నీకవి ప్రత్యేక మార్గమే. ఇంతకుబూర్వమీ విధము కావ్యములందుఁ గానరాదు. నన్నయ భారతము పూర్తిచేసినచో నంతమున నేమివ్రాసి యుండెడివాఁడో మనము చెప్పలేము. తిక్కన యుత్తర రామాయణమునఁగాని భారతమునఁ గాని యీ నియమమును బాటింపలేదు. అథర్వణుని విషయమును నన్నయ వంటిదే. కవిజనాశ్రయమున నీ నియమములేదు. పాల్కురికి సోమనాథుఁడు మాత్రము పండితారాధ్య చరితము, అనుభవ సారములను మంగళ మహాశ్రీతో ముగించెనట. (చూ. శ్రీ వేంకటరావుగారి పీఠిక) సోమనాథునకు మార్గమును జూపినవాఁడు కవిరాజ శిఖామణియే కానోపును. సోమనాథుఁడు రెండవ ప్రతాపరుద్రుని కాలమువాఁడనియే నేను భావిం

తును. శ్రీ చాగంటి శేషయ్యగారు నట్లే వచించిరి. సోమనాథుని తరు వాత మఱికొందఱీ నియమమును బాటించినవారు గలరు. వారిలో జక్కన, నంది తిమ్మన, వెన్నెలకంటి సూరన ముఖ్యులు. ఇట్లు పలువురు పాటించిన యీ నియమమును మునుముందుఁ దనకావ్యమున జొప్పించి మార్గదర్శి యయినవాఁడు నన్నెచోడుఁడు.

*అతఁడెక్కడనుండి దీనిని గ్రహించెను?*

నన్నయాదులందు లేదని ముందే చెప్పఁబడినదిగదా! కావున నీతఁడు దీనిని మఱియొకకడనుండి గ్రహించియుండ వలెను. కన్నడము నందు నానాఁడిట్టిది కావ్యములందున్నట్లు కానరాదు. కావున నా భాషనుండి గ్రహించెననుటయుఁ దగదు. మఱి యెక్కడనుండి గ్రహించియుండును? పంప "భద్రం శుభం మంగళం" అని మంగళాంతముగాఁ దన కావ్యమును ముగించినాడట (చూ. యూని. ప్రతి అనుబం. 60 P) కాని యిందు "మహాశ్రీ" చేరి మంగళ మహాశ్రీ వృత్తమే యయినది.

*శాసనములనుండియా?*

ఇది కవిరాజు దేశీయాచారమును దేసిగాఁ దన కావ్యమునఁ జేర్చుకొనిన విధమని నా భావము. ఇది దేశీయాచారమనుటకుఁ దగిన నిదర్శనములు (మం. మ. శ్రీతో ముగించుటలు) శాసనములందు నాకుఁ గానరాలేదు. కాని యానాటి శాసములుచూడగా నొక విశేషము కానవచ్చినది. ప్రారంభమును శ్రీకారముతోఁ గావించినట్లే చివరకు శ్రీకారములనుంచుట నేటికిని మనయం దాచారముగా నున్నది. ప్రాచీన శాసనములందు నిది కాననగును. కాని కొన్నింట నట్లు కాక చివరకు మంగళం మహత్" అనియు మఱి కొన్నింట "మంగళం మహా శ్రీశ్రీశ్రీ" యనియుఁ గానవచ్చుచున్నది. కొన్నింటిని కాలాదులతో నుదాహరింతును.

| శాసనము | కాలము | చివరి విధము |
|---|---|---|
| 1. రుద్రదేవునినాటి కరీంనగర శాసనము (6) | 1170 A.D. | మ (ంగళ మహా) శ్రీశ్రీ |
| 2. చిన కందుకూరి శాసనము (27) | గణపతి దేవుని నాటిది | "మంగళం మహా శ్రీశ్రీశ్రీ" |
| 3. రుద్రేశ్వరము శాసనము (53) | సరిగా తెలియదు | "మంగళ మహా శ్రీశ్రీశ్రీ" |
| 4. ధర్మసాగరము శాసనము (56) | సరిగా తెలియదు | "మంగళ మహా శ్రీశ్రీ" |

పైవన్నియుఁ గాకతీయుల శాసనములే. కావునఁ జోడునకుఁ గొంచెము ముందు వెనుకలందు వేయింపఁబడినవే. వీనియందు "మంగళ మహాశ్రీ" అని వ్రాయుట యానాటి యాచారమును సూచించునుగదా! ఆ యాచారమును చోడుఁడు తన కావ్యమునఁ బ్రవేశపెట్టుటకు కారణ మాతని దేశీయాచారాభిమానమే యనఁజెల్లును. అయ్యుదానిని యథాతథముగా గ్రహింపక దానికి మెఱుగులిడినాఁడీ మహాకవి. ఆ "మంగళ మహాశ్రీ"ని ఊరక వ్రాయుటకన్నఁ బద్యమునఁ గూర్చుట మంచిదని యాతనికి స్ఫురించియుండును. మఱియొక పద్యమేల? మంగళ మహాశ్రీ పద్యమే వాడిన నింకను యుక్తముగా నుండునే యని యాతఁడెంచియుండును. తత్ఫలితముగానే యిది యేర్పడియుండును.

అధునికులందు నీ నియమము పాటించినవారు లేకపోలేదు. వారిలో వేదము వేంకటరాయశాస్త్రిగారు గణ్యులు. వారు తమయుషానాటకమునఁ జోడకవి మార్గమును ద్రొక్కినారు. శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారును బొబ్బిలియుద్ధనాటకమునందీ నియమమును బాటించిరి.

కొన్ని కన్నడ శాసనములందును దెలుఁగు శాసనములందు వలెనే "మంగళమహా శ్రీశ్రీ" యను వర్ణములు శాసనముల కంతమున

గానఁబడుచున్నవి. ఇవియు నానాటి యాచారమునే సూచించునుగదా! (చూ. తెలంగాణా శాసనములు చాళుక్యులవి) ఈ విధముగా నీ దేశీయా చారమును మెఱుఁగిడి కావ్య ప్రపంచములోని కెక్కించి మహనీయుఁ డయినవాఁడు నన్నెచోడ మహాకవి.

## తదితర వృత్తముల యౌచిత్యము

*వనమయూరము*: దీని యౌచిత్యమునుగూర్చి యాశ్వాసాంత పద్యములఁగూర్చి చెప్పు సందర్భమునఁ గొంచెము వచించితిని. మఱి యొక వనమయూరముచేఁ గవి సప్తమాశ్వాసమునందు తపోవనము నందలి పార్వతిని శివునిచే వర్ణింపఁజేసినాఁడు. ఆమె యప్పటి రూపము వనమయూరమును బోలియున్నదని కవి భావమేమో? మఱియొకటి సప్తమాశ్వాసాంతమునందుఁ గృతినాయకుని వర్ణించు పట్టునఁ గలదు. అతఁడును వనమయూరమే అయిన మిగుల మనోహరముగా నుండును గదా! సతిపతులు సమానముగా నున్ననే దాంపత్యము శోభించును.

*మణిగణ నికరము*: అష్టమాశ్వాసమున నాకాశమునందలి తారక లను వర్ణించుపట్టున నీ వృత్తమును ముద్రాలంకార యుక్తముగా వాడి నాఁడు మహాకవి. అదియు మనోహరముగానే యున్నది:

"సరసిజ హితుఁడట చనఁ దర తరమ
త్యరుణ రుచిన్ మెఱుఁగడరుడు వడి నం
బరమున నుడుతతి ప్రవిమల మయ్యెన్
నిరుపమ *మణిగణ నికర* విభాతిన్" (8-93)

ఆకాశములోని నక్షత్రములు మణిగణ నికరమువలె మనోహరముగాఁ బ్రకాశించినవట. (దీనిని "ముద్రాలంరకాము"నఁ జేర్చి చదువుకొనవలెను.)

ఇప్పటికే మిగుల దీర్ఘమయిన యీ ప్రకరణము నింతటితో ముగించి మఱియొక ప్రకరణము నారంభింతును.

# పద పరికరము

నన్నెచోడ మహాకవి కుమారసంభవ మహాకావ్యమును గుఱించి కందుకూరి వీరేశలింగము పంతులుగారు తమ కవుల చరిత్రమునందు "నన్నెచోడుని కవిత్వ మన్యభాషా పదదూషితము గానియెడల నుత్తమ మయినదే" యని వచించిరి. శ్రీ బుట్టా శేషగిరిరావు పంతులుగారును వీరేశలింగముగారి యభిప్రాయమునే ప్రకటించి, "ఈతఁడు పనివట్టి ప్రాఁత మాటలు వాడె" ననిరి. ఈతని కవితలో నప్రతీత పదములు మెండని శ్రీ శేషగిరిరావు M. A. గారి యభిప్రాయము.

నన్నెచోడ మహాకవి కావ్యమున నాంధ్రేతరములగు తమిళ, కర్ణాట భాషాపదములు కనిపించుచున్నమాట యథార్థమే. అతఁడు వాడిన పదములు కొన్ని మన కప్రతీత శబ్దములుగాఁ గనుపడుచున్న విషయమును సత్యమే. అవి యీ నాఁడు వ్యవహారమున లేకపోవుట చేతఁ బ్రాఁతమాట లయిపోవుటయు సత్యమే. కాని నన్నెచోడ మహాకవి యాపదములను గూర్చుటలోఁ "బనివట్టి" ప్రయత్నించి యట్లు చేసెనని శ్రీ బుట్టా శేషగిరిరావుగారు వచించినది మాత్రము యుక్తమని చెప్ప లేము. అట్లు పట్టి పట్టి పదములఁ గూర్చుటయు నిమ్మహాకవి కిష్టము గాదు. ఆతని భాష సహజముగాఁ దనంతఁ దాను వలచి వచ్చినది గాని వెదకి వెదకి పట్టుకొని తెచ్చినది గాదు. ఈ విషయము నాతని యీ క్రింది పద్యము ధ్రువపఱచుచున్నది.

> "జంగమ మల్లికార్జును నిసర్గ కవిస్తవనీయసూక్తి యు
> క్తిం గొనియాడి సత్కవితఁ గేనములే కనురక్తయైన భా
> షాంగనఁ దక్కనేలిన మహత్త్వము లోకమునం బ్రసిద్ధిగా
> భంగిగ విస్తరించెదఁ బ్రబంధము సద్రసబంధురంబుగాన్". (1-48)

అంతేగాదు తాను వాడిన భాష జానుతెనుంగని వచించెను. ("సరళముగాగ భావములు జానుతెనుంగున నింపుపెంపుతోఁ బిరిగొన.")

## జానుతెనుఁగు

ఈ జానుతెనుంగు స్వరూపమును గూర్చి యిదమిత్థముగా నిర్ణయించుట సాధ్యము కాకున్నను, నిది జనసామాన్యమున కర్థమగు భాషా విధానమని పాలకుఱికి సోమనాథుడు వచించిన విధము తెలుపుచున్నది. సోమనాథుఁడు జానుతెనుఁగును గూర్చి చెప్పినదానిని బరికింపుఁడు.

"ఉరుతర గద్య పద్యోక్తుల కంటె సరసమై పరగిన జానుతెనుంగు
చర్చింపఁగా సర్వసామాన్య మగుట" (బసవపురాణము)

"పూరిత సంస్కృత భూయిష్ఠ రచన మానుగా సర్వసామాన్యంబుగామి
జానుతెనుఁగు విశేషము ప్రసన్నతకు" (పండితారాధ్య చరిత్రము)

బసవపురాణ పండితారాధ్య చరిత్రలు రెంటియందును "జాను తెనుంగు" సర్వజన సుబోధకమయిన తెనుఁగనియే వచింపఁ బడినది. ఈ సోమనాథుఁడు మన కవిరాజ శిఖామణికిఁ గొంచెము తరువాతి వాఁడు. అనేక విషయములందు నన్నెచోడు ననుకరించినవాఁడు. ఈ "జానుతెనుంగు" ను సైత మాతఁడు నన్నెచోడుని నుండియే గ్రహించెను. కావున సోమనాథుని "జానుతెనుంగు" ను చోడుని "జాను తెనుంగు" ను నొక్కటియే కాని భిన్నములు కావు. కనుక నన్నెచోడుఁడు దనకావ్యము సర్వసామాన్యమయిన జానుతెనుంగుననే కూర్పవలయునని భావించినవాఁడే కాని, శ్రీ శేషగిరిరావుగారు వచించినట్లు పనివట్టి ప్రాత మాటలు వాడినవాఁడు కాఁడని నిశ్చయింప నగును.

ఇఁకఁ జోడుఁ డప్రతీతపదములను వాడెననుటను గూర్చి చూడ వలసియున్నది. నేడు మన కపరిచితము లయిన పదము లనేకములు కుమారసంభవ కావ్యమున నున్నటుల ముందే వచింపఁబడినది. ఆంధ్ర శబ్ద చింతామణియందు శబ్దశాసనుఁడు లక్షణ యుక్తములయినను నప్ర

సిద్ధ పదములను వాడరాదని "విరళాన్ పేచోషాదిక శబ్దాన్ ప్రవ్యా
హరంతు శబ్దజ్ఞాః, ఇహతు ప్రవ్యాహార్యం సంకేతిత సుప్రసిద్ధమేవ
పదమ్" అను సూత్రముచే శాసించినాఁడు. నన్నెచోడ మహాకవియు
నిట్టి యభిప్రాయమే కలవాఁడని పైన వివరింపఁబడినది. అయినచో
నాతని గ్రంథములందుఁ గనిపించు నప్రతీత శబ్దముల సంగతి ఏమి?
యను ప్రశ్నము కలుగును. మన కాలమున అప్రసిద్ధములయిన శబ్దము
లొక్క కుమార సంభవమునందేనా కానవచ్చుచున్నవి ? నన్నయ భార
తమునందు లేవా ? ఒక్క నన్నయ భారతమునందే యననేల ? ఆంధ్ర
భాషయం దన్ని కావ్యములందును గలవు గదా ! వాని సంగతి ఏమి?
ఇతర కావ్యములందలి యప్రతీతపదముల విషయమున నేఁడు మనమ
ట్లనుచున్నామా ? వారియెడ నట్లనక యొక్క చోడుని విషయముననే
యిట్లు భావించుట యుక్తము గాదని నేను తలంతును. అంతేగాదు.
ఆ మహాకవు లానాఁడు ప్రసిద్ధములయిన పదములనే తమకావ్యములందు
వాడి యుండఁగా కాలక్రమమున నవి వ్యవహారదూరములై నేడు మనకవి
యప్రతీతములుగాఁ గనుపట్టు చున్నవి. జీవద్భాషలో ననేకములగు నిట్టి
మార్పులు జరుగుట సహజము. ఎన్నియో క్రొత్తపదము లందుఁ జేరు
చుండును. ఎన్నియో పదములు వ్యవహారమునుండి దూరమగుచుండును.
మఱికొన్ని యర్థమును మార్చుకొనును. నేడు మన మాంగ్లపద భూయిష్ఠ
ముగా మాట్లాడు తెనుఁగుసంభాషణము నన్నయాదులు వచ్చివిన్నచో
నర్థమగునా ? కాదు. మనకు నన్నయకుముందఱి శాసనములం దర్థము
తెలియని పదము లెన్నియో చెప్పగలమా ? కావున జీవద్భాషయం
దిట్టి మార్పులు సహజము. పదునైదు సంవత్సరములనాఁడు "కాందిశీక"
పదమునకుఁ బండితులయిన వారికిఁగాని యర్థము తెలియునది గాదు.
నేఁడాపదము సర్వసామాన్యమయినది. కావున రాజకీయార్థిక సాంఘిక
సంబంధబాంధవ్యములను, స్థితిగతులను బురస్కరించుకొని యనేక
పదముల రాకపోకలు భాషయందు జరుగుచుండు ననుట విజ్ఞుల కసమ్మ

తముగాదు. కావున నేటి స్థితిని బురస్కరించుకొని చోడుఁడు వాడిన పదము లప్రతీతము లనుట యుక్తముగాదు.

చోడరాజు నన్నయ మార్గమును వదలి దేశ్యపదములను దేశీయ సంప్రదాయములను, దేశి నానుడులను దన కావ్యమునఁ బ్రవేశపెట్టెను. అట్లని యాతఁడే చెప్పుకొనియెను. నన్నెచోడునికిఁ గొంచెము తరువాతి కాలము వాఁడగు విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణియందు దేశ్యలక్షణము నీక్రిందివిధముగా వచించెను.

"శ్రేయములై బహుదేశానేయములై చక్కదనము నెఱదనములునై
యాయానెలవులఁజెవులకుఁ దీయములగుపలుకులెల్ల దేశ్యములరయన్"

(కావ్యాలంకారచూడా. 9 ఉల్లా. 16 ప.)

ఈపద్యము బాలవ్యాకరణకర్త చెప్పిన "దేశ్య" నిర్వచనమునకు భిన్నముగా నున్నది. బా. వ్యా. కర్త "త్రిలింగదేశ వ్యవహార సిద్ధంబగు భాష దేశ్యం" బని చెప్పెను. ఈతని మతమున దేశ్యములకు "బహుదేశానేయత్వము" అంగీకార్యము గాదు. చింతామణియందు "ప్రవాహినీ దేశ్యా" యని దేశ్యములకు ప్రవాహినీత్వము వచింపఁబడినది. ఈ ప్రవాహము బహుదేశానేయ మేమో ! కాదనలేము.

## అచ్చతెనుఁగు

"అచ్చతెనుఁగు"ను గూర్చి చిన్నయసూరి చెప్పిన నిర్వచనమును విన్నకోట పెద్దన చెప్పిన దానికి భిన్నముగా నున్నది. కావ్యాలంకార చూడామణి యందు పెద్దన తత్సమ తద్భవ దేశ్యపదముల లక్షణముల నిర్వచించి

"ఈమూఁడు తెలుఁగులలో
నేమిటనున్ దొఱలకున్న నెల్ల జనులకున్
లో మిగులఁ దేటపడియెడు
నామాటల యచ్చతెనుఁగు లన నెగడొందున్."

అని తత్సమ తద్భవ దేశ్యేతరములై తేటతెల్లముగా జనులకర్థమగు తెలుఁగు పదములే యచ్చతెనుఁగు పదములని వచింపఁగా సూరి తద్భవములను, దేశ్యములను, అన్యదేశ్యములను, చేర్చి "సంస్కృత సమేతరంబయిన యీ భాష యచ్చ యనంబడు" నని యచ్చతెనుఁగును నిర్వచించెను. పెద్దన చెప్పిన యచ్చతెలుఁగు లక్షణము చిన్నయసూరి దేశ్య లక్షణోదాహరణములకు సరిపడుచున్నది. కావున భాషాభేదములను నిర్వచించుటలో నాధునిక వ్యాకర్తలకును ప్రాచీన లాక్షణికులకును మతభేదము లున్నవనుట నిశ్చయము. ప్రస్తుతమునకు వర్తము.

నన్నెచోడుఁడు తాను జానుతెనుఁగునఁ గావ్యము వ్రాసెద నన్నాఁడు. జానుఁదెనుఁగు సర్వసామాన్యమనియు, ప్రసన్నమయిన దనియు సోమనాథుఁడు పేర్కొన్నాఁడు. కావున నప్రతీత శబ్దములను వాడుట చోడుని యభిమతము కాదనుట తేలిన సారాంశము.

పెద్దన లక్షణమునుబట్టి దేశ్యపదములం దన్యదేశ్యము లుండ వచ్చును. కాని యవి స్థానికుల చెవులకుఁ దీయములుగా నుండవలెను. జానుతెనుఁగునకు "సరళత్వము"ను నన్నెచోడుఁడును వచించినాఁడు. (c. f. సరళముగాగ (భావములు) జానుతెనుంగున) కావునఁ బెద్దన చెప్పిన దేశ్యమును చోడుఁడు చెప్పిన జానుతెనుంగును నొక్కటియే యయి యుండుననఁ జెల్లుచున్నది. పెద్దన యుదాహరించిన దేశ్యపదములలో చాలభాగము చోడుఁడు వాడినవే. ఇదియు నీ యూహను బలపఱుచుచున్నది.

ఇంతకును దేలిన సారాంశ మేమనఁగాఁ దెలుఁగువారి చెవులకుఁ దీయములయిన యన్యదేశ్యములను వాడుట చోడునకిష్టవిషయమే యనుట. కనుకనే యాతఁడు తమిళ కర్ణాట భాషాపదములు తెలుఁగుజనుల వాడుక యందున్నవానిని దన కావ్యమున వాడినాఁడు. అంతేగాని వీరేశలింగము గారు వచించినట్లు కుమారసంభవ మన్యభాషాపద "దూషితము" కాలేదు. పై పెచ్చు వానిచే "భూషిత"మయినది.

వీరేశలింగముగారి యీ యాక్షేపణమునకు శ్రీ నడకుదుటి వీరరాజుపంతులుగారు తమ "కవిరాజశిఖామణి-కావ్యవిశేషములు" అను వ్యాసమున చక్కగా సమాధానముఁజెప్పినారు. అంతేగాదు శ్రీ వీరేశలింగముగారు అన్యదేశ్యములని భావించినవి కొన్ని యన్యదేశ్యములు కావనియు వారు చూపినారు. మఱికొన్ని నన్నెచోడుఁడే కాక, నన్నయ, తిక్కన, ఎఱ్ఱాప్రెగ్గడ, మంచెన, శ్రీనాథాదులుసైతము వాడియున్నారని యా పదముల నుదాహరించి చూపినారు. "నాయి" యను శబ్దముగూడ నానాడు (దక్షిణాది) తెనుఁగువారికిఁబరిచితశబ్దమేయయి యుండవచ్చునని చెప్పినారు. నేఁడును దక్షిణాదితెనుఁగువారియందు తమిళపదములును, తమిళోచ్చారణమును వినఁబడుచుండుట మనమెఱుఁగుదుము. అట్లే రాయలసీమ జిల్లాలు కొన్నింటను, తెలంగాణపు జిల్లాలు కొన్నింటను గర్ణాట పదములును, కర్ణాట భాషోచ్చారణములును వినఁబడుచుండును. చోడునిపూర్వికులు ఒఱయూరివారని యాతఁడే చెప్పికొన్నాఁడు, కావున నాతని భాషయందుఁ గొన్ని తమిళపదములుంట సహజము. నేడు శుద్ధాంధ్రులయిన శ్రీ వైష్ణవులు తమిళ పదజాలమును నిత్యవ్యవహారమున వాడుట మనకుఁ దెలియనిదిగాదు.

చోడుని నివాసభూమి తమిళకర్ణాటాంధ్రభాషలకుఁ గూడలివంటిది. కావుననే యాతనిభాషయం దీ మూడుభాషలపలుకుబళ్లు కానవచ్చుచున్నవి.

శ్రీ వీరరాజుగారు కుమారసంభవకర్త వాడిన పదములు కొన్ని తరువాతి కవులును వాడినట్లుచెప్పి యాయా కవుల పేళ్లను, వారు వాడిన పదములను నుదాహరించినారు. అందు సోమనాథుఁడు, తిక్కన, విన్నకోట పెద్దన, మంచెన, అల్లసాని పెద్దన మున్నగువారు గలరు. మఱికొన్ని చోడుని పదములు శాసనములందును గానవచ్చుచున్నవి.

వీని నన్నింటి నాధారముగాఁగొని చోడుని పదపరికరమున కర్థనిర్ణయ మొనరించి యాంధ్రభాషను బెంపొందింపఁ జేసికొనుట

యుక్తముకాని యాతఁడు వాడిన వన్యభాషాపదములని, పనివట్టి వాటిన
ప్రాఁతమాటలని యీసడించుకొనుట యుక్తముకాదు.

మఱియొక్క విషయము. చోడుఁడు వాడిన పదము లాంధ్రదేశీ
యములే యనియు, నవి తరువాతివారు వాడమిని నశించియుండుననియు
నిర్ణయించుటగూడ, అనుచితముగాదు. నేఁడును తమిళాంధ్రకర్ణాట
భాషలలో సమానమైన పదజాలము వలసినంత కలదు. ఈ విషయమునఁ
బూజ్యులు శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారి యీ క్రింది వాక్యములు
పరమప్రామాణికములని భావించి వానినుదాహరించి దీనిని ముగింతును.

"ఇక శబ్దవిషయమున దీనిలో వాడిన పెక్కు పదములు భాషలో
నశించెను. ఆంధ్ర ద్రవిడ కర్ణాటాదులు సోదరీభాషలగుటచే నొకదానిలో
నస్తమించిన వేఱొకట నిలుచుట సంభవించుటచేఁ బెక్కుపదములకు
ద్రవిడ కర్ణాటకములఁ బ్రాచీన ప్రామాణిక కృతులలోనుండి ప్రయోగ
ములు చూపితిని. కొందఱు తద్భాషావాసనలేక నన్నెచోడుఁడు కన్నడము
నుండి శబ్దముల దొంగిలించెనని పాండిత్య వైచిత్రి చూపెదరు. దేశ్య
పదములన్నియు మూఁడుభాషలలోఁ గలవు. నే నపూర్వపదములకుఁ
బ్రయోగములిచ్చితిఁగాని తిక్కన శంభుదాసాది పదములకు నవీన కర్ణా
టకముననుండి చెవులు చిల్లులువోవునన్ని ప్రయోగసహస్రములు చూపె
దను. వీరెల్లరు కన్నడమునుండి దొంగిలింపవలయునా? భాషలలోనివి
సామాన్యదేశ్యపదములు. మఱియు విస్మృతపదములమాట యట్లుండఁగా
భాషలో మహాకవిముఖముగ నవతరించిన పదములలో సైతము చోడుని
యర్థము శబ్దోత్పత్తికి దగ్గరించియున్నది కాని తిక్కన కవుల యర్థము
లక్ష్యకోటిలో నంతరాంతరితమై భిన్నార్థము నాశ్రయించుచున్నది...
ఇట్లే దీనిలో శబ్దశోధనముచేసిన నవి ప్రాచీనరూపములై లక్షణ నాశ్ర
యింపక మూలార్థమునే యావహించుచుండును."

(పూజ్యులు శ్రీ మానవల్లి రామకృష్ణకవి M. A. గారి కుమారసంభవ
ద్వితీయభాగ పీఠికనుండి.)

# భారవి - నన్నెచోడుఁడు

నన్నెచోడ మహాకవి కృత్యాదిని సంస్తుతించిన గీర్వాణ కవులలో భారవి యొక్కఁడు. చోడుఁడు భారవిని స్తుతించిన పద్యమిది :

"భారవియు వస్తుకవితను
భారవియును బరగి రుదయపర్వత శిఖరా
గ్రారోహణేంద్రకీల న
గారోహణ వర్ణనల జనారాధితులై. " (1 ఆ. 20 ప.)

పై పద్యమునుబట్టి చోడునికి భారవియెడఁ బ్రత్యేకాభిప్రాయము గలదని తేలుచున్నది. చోడ మహాకవి యవలంబించిన వస్తు కవితా సంప్రదాయమునందు భారవి పేర్కొనఁ దగినవాఁడఁట ! పై పద్యము కిరాతార్జునీయమునందలి ఇంద్రకీలనగారోహణ వర్ణనమునందు వస్తు కవితా సంప్రదాయములు కలవని చెప్పుచున్నది. ఆ విషయము వస్తు కవితను గూర్చిన ప్రకరణమున వచించితిని. ఇట్లు మన కవిరాజుచే స్తుతింపఁబడిన భారవి యనుకరణములు కాని, యనువాదములు గాని కుమారసంభవ కావ్యమున నేమయిన నున్నవా ? లేవా ? యని పరిశీలించుటయే ఈ ప్రకరణముయొక్క లక్ష్యము.

గీర్వాణ భాషయందు ముఖ్యములగు నయిదు కావ్యములలో కిరాతార్జునీయ మొక్కటి. తత్కర్త భారవి. గీర్వాణ భాషయందలి

"ఉపమా కాళిదాసస్య భారవే రర్థ గౌరవమ్
దండినః పదలాలిత్యం మాఘే సంతి త్రయో గుణాః".

అను శ్లోకము అర్థ గౌరవమున భారవి మహాకవి రచనము మిన్న యయినదని చెప్పుచున్నది. మన కవిరాజును నర్థగౌరవము నెడ నాదరము గలవాఁడయియే తన కావ్యరచనము గావించెననుట నాతని యీ క్రింది పద్యము వచించుచున్నది.

"సరళముగాగ భావములు జానుతెనుంగున నింపు పెంపుతోఁ
బిరిగొన వర్ణనల్ ఫణితిఁ బేర్కొన నర్థము లొత్తగిల్ల బం
ధురముగఁ బ్రాణముల్ మధుమృదుత్వ రసంబునఁ గందళింప న
క్షరములు సూక్తు లాద్యులకుఁ గర్ణరసాయనలీలఁ గ్రాలఁగాన్"

(1 ఆ. 35 ప.)

దీనినిబట్టి చోడమహాకవి భారవియెడ నాదరాభిమానములు కలిగి తన కుమార సంభవమున నాతని సంప్రదాయములఁ గొన్నింటిని గ్రహించి రచనము సాగించెనని యూహింపనగుచున్నది.

మహాకవు లయినవారు కొందఱు తమ పూర్వులయిన వారిలో తమ కాదరణీయు లయినవారి రచనల ననుకరించుటయుఁ గొన్నిచోట్ల వారి వాక్యముల నున్నవి యున్నట్లుగానే తమ కావ్యములందు సంద ర్భానుకూలముగా వాడుకొనుటయు నపూర్వము గాని, నింద్యము గాని కాదు. కవికుల గురువగు కాళిదాస మహాకని రఘువంశ మహాకావ్య మున వాల్మీకి వచనములు కానవచ్చుచుండుట తజ్ఞులకుఁ దెలియనిది కాదు. అట్లే యాతని కుమారసంభమునందును వ్యాసుని వాక్కులు కావలసినన్ని కానవచ్చుచున్నవి.

ఈ క్రింది శివ పురాణము నందలి శ్లోకములను కాళిదాసుని శ్లోకము లతో పోల్చినప్పుడు వానికిఁ గలసంబంధము స్పష్టమగును.

1. అస్త్యుత్తరస్యాం దిశివై గిరీశో హిమవాన్మహాన్
పూర్వాపరౌ తోయనిధీ సువిగాహ్య స్థితో హి యః
నానారత్నాకరో రమ్యో మానదండ ఇవక్షితేః.

(శి. పు. పార్వతీఖండము)

అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా
హిమాలయో నామ నగాధిరాజః
పూర్వాపరౌ తోయనిధీ విగాహ్య
స్థితః పృథివ్యా ఇవ మానదండః. (కాళి. కుమా.)

2. కాలక్రమేణాథ తయోః ప్రవృత్తే సురతే మునే
గర్భో బభూవ మేనాయాః...." (శి. పు. పార్వతీఖండము)
కాలక్రమేణాథ తయోః ప్రవృత్తే
స్వరూపయోగ్యే సురత ప్రసంగే
మనోహరం యౌవన ముద్వహన్త్యా
గర్భో உభవ ద్భూధరరాజపత్న్యాః." (కాళి. కుమా.)
3. "అద్యప్రభృతి తే దాసః
తపోభిః క్రీత ఏవ తే." (శి. పు. పార్వతీఖండము)
అద్యప్రభృ త్యవనతాంగి తవాస్మి దాసః
క్రీత స్తపోభి రితి...." (కాళి. కుమా.)

పైవి యుదాహరణ మాత్రమునకై చూపినట్టివి. ఇట్టివి కాళిదాస కుమార సంభవమున నన్ని సర్గలయందును గలవు. వాని నన్నింటి నెత్తి చూపుట కిది తావు కాదు. ఈ విధముగా వ్యాస వాల్మీకుల వాక్యములను తన గ్రంథము లందుంచుకొనుటచేఁ గాళిదాస మహాకవి కవిత కెట్టి కొదువయు లేదు. కలదని భావించుటయు యుక్తముకాదు. అది యా మహాకవులయెడ కాళిదాసునకుఁ గల యాదరాభిమానములను మాత్రమే చాటును.

ఇట్టి యనుకరణరచనలు తెలుఁగుభాషలోను నపూర్వములుకావు. మన మహాకవులందఱును బూర్వులను గొంచెముగానో, ఎక్కువగానో అనుకరించి, అనువదించి, యనుసరించినవారే. కాని యందు కొందఱు వెంటనే బయల్పడిపోదురు. మఱికొందఱు బహు సూక్ష్మ పరిశీలనమునఁ గాని తేలరు. ఇందు మొదటి కోవకుఁ జెందినవారు పూర్వుల రచనములను మక్కికి మక్కిగా ననుకరించినవారు. వీరిని గుర్తించుట సులభము. రెండవ కోవకుఁ జెందినవా రట్లుగాక పూర్వుల రచనములను క్షుణ్ణముగాఁ జదివి జీర్ణించుకొని యా భావములను గ్రహించి తమ ప్రతిభచే వానికి మెఱుగులిడి స్వీయములుగాఁ జేసికొందురు. వీరిని

గుర్తించుట సులభముకాదు. ఇట్టివారిలో నెన్నఁదగిన యాంధ్ర మహాకవి నన్నెచోడుఁడు. మఱికొందఱు నట్టివారు లేకపోలేదు. వారిలో పింగళి సూరన్న యింకొకఁడు. ఈతఁడు ప్రభావతీ ప్రద్యుమ్నమున "శుచిముఖి" యను పాత్రమును సృష్టించెను. ఆ పాత్రపోషణమునుగూర్చి వివరించుట కిది స్థానముగాదు. ఈ పాత్రము నైషధములోని హంస "శుచిముఖి"న కనుకరణమని గుర్తించుట కొంచెము కష్టమయినపని. సూరన సృజనాశక్తి యట్టిది. అనుకరించుటయన్న సూరన్నదే. ప్రస్తుత మనుసరింతము.

నన్నెచోడ మహాకవి తన పూర్వుల ననుకరించిన విధమును స్థూలముగాఁ జెప్పుట జరిగినది. ఇఁక నీతఁడు భారవి ననుకరించిన విధ మెట్టిదో పరిశీలించవలసి యున్నది.

నన్నెచోడుఁడు భారవికృత కిరాతార్జునీయగ్రంథమును క్షుణ్ణముగాఁ జదివి జీర్ణించుకొనినవాఁడనుట కాతని స్తుతివచనమే ప్రమాణముగదా! అందు నింద్రకీల నగారోహణ వర్ణనమునెడ నీ కవికిఁ బ్రత్యేకాదరము. ఇంతటి యభిమాన మీ కవిరాజున కాతనిపైఁ గలుగుటకుఁ గారణమేమి? యను ప్రశ్నము కలుగవచ్చును. దానికొక కారణమున్నది.

సంస్కృత భాషయందలి పంచకావ్యములలో కిరాతార్జునీయ మొక్క ప్రత్యేక మార్గమునకుఁ జెందినది. కాళిదాసుని కావ్యములు శృంగారరస ప్రధానములు. వానిలో రాజకీయముల కెక్కువ స్థానము లేదు. కిరాతార్జునీయమున నట్లుగాక రాజనీతి కెక్కువ ప్రాధాన్య మీయబడినది. మన రాజకవి నీ విషయము విశేషముగా నాకర్షించియుండును. నన్నెచోడుఁడు రాజమాత్రుఁడు కాఁడు. పరాక్రమవంతుఁడు. రాజనీతి విశారదుఁడు. ఈ విషయమున నాతని గ్రంథమే ప్రమాణము. కవి వ్యక్తిత్వము గ్రంథమునఁ బ్రతిఫలించునుగదా! ఆతని రాజనీతిపటిమకు 10, 11, 12 ఆశ్వాసములు దర్పణములు. దశమాశ్వాసమున శుక్రాచార్యుఁడు తారకునకు రాజనీతి బోధించుపట్టు గలదు. దీనిని జాగ్రత్తగాఁ

బరిశీలించినచోఁ గవి చాతుర్యమును, కిరాతార్జునీయానుకరణమును గనుపట్టును. కిరాతార్జునీయమునఁ బ్రథమ ద్వితీయ సర్గలందు రాజనీతి ప్రశంసగలదు. విశేషించి ద్వితీయ సర్గయందలి భీమధర్మజుల సంభాషణము రాజనీతికి నిలయము.

కుమారసంభవమునందు దశమాశ్వాసమునందలి శుక్రనీతి మన రాజకవి తన యనుభవజ్ఞానమును కిరాతార్జునీయమునందలి రాజనీతి పరిజ్ఞానముతో జోడించి రచించినదే యనుట సూక్ష్మముగాఁ బరిశీలించిన స్పష్టమగును. మచ్చున కొక్కదానిని జూపుదును.

"అరిషడ్వర్గ జయిత నన
వరత శమావాప్తి లోక వందిత విషయో
త్కర రక్ష సక్షమాగమ
పరిపాలన సద్వృశు లవనిపతులును వ్రతులున్". (10 ఆ. 185 ప.)

పైపద్యములో మొట్టమొదటిది అరిషడ్వర్గ జయిత్వము. దీనినిగూర్చి ధర్మరాజు కిరాతార్జునీయమున నిట్లు చెప్పెను.

"శ్రుతమప్యధిగమ్య యే రిపూన్ వినయంతే న శరీర జన్మనః
జనయం త్యచిరాయ సంపదా మయశస్తే ఖలు చాపలాశ్రయమ్".
(2 స. 41 శ్లో.)

ఇఁక రెండవది శమావాప్తి. ధర్మరాజు దీనిని

"శుచి భూషయతి శ్రుతం వపుః
ప్రశమ స్తస్య భవ త్యలంక్రియా". (కిరా. 2 స. 32)

యని భీమునకుఁ జెప్పినాఁడు.

మూఁడవది క్షమ. రాజులకు

"న తితిక్షాసమ మస్తి సాధనమ్". (2 స. 43 శ్లో.)

అని కిరాతార్జునీయమునఁ జెప్పఁబడినది.

మన రాజకవి యనుకరణమున రెండవకోవకుఁ జెందినవాఁడని ముందుగానే చెప్పితిని. ఈ క్రిందిపద్యమును జూచిన నది స్పష్టమగును.

కిరాతార్జునీయమునఁ బంచమసర్గాదిని హిమవన్నగ వర్ణనము గలదు. దానియందలి యీ శ్లోకమున హిమవన్నగము శివునివలెనున్నట్లు పోల్చఁబడినది.

"తపనమండల దీపిత మేకత స్సతత నైశతమోవృత మన్యతః
హసితభిన్నతమిస్రచయం పుర శ్శివమి వానుగతం గజచర్మణా".

(5 స. 2. శ్లో.) ఈ భావమునే గ్రహించి నన్నెచోడ మహాకవి దానికి మెఱుఁగిడి తన కుమారసంభవమునఁ దృతీయాశ్వాసాదిని హిమవన్నగము నీ క్రిందివిధముగా వర్ణించినాఁడు.

"సురవరవాహినీధరుఁడు, శుభ్రశరీరవిభాసి, నీలకం
ధరపరిశోభితుండు, గుణధాముఁడు, తుంగతనుండు భూధరా
భరణుఁ డుమాసమన్వితుఁ డపారవిభూతి సమేతుఁడైమహే
శ్వరుఁడును బోలెనొప్పు హిమవంతుఁ డనంతమహత్త్వసంపదన్"

పై నన్నెచోడుని పద్యమునందు సురవరవాహినీధరేత్యాదివిశేషణములు శివునకు, హిమవంతునకు సమానముగా నన్వయించును. ఈ విధముగా నుపమానోపమేయములకు రెంటికి నన్వయించునట్లు విశేషణములనిడుట భారవికి నిష్టమయినదే. కిరాతార్జునీయమునందు షష్ఠసర్గలోని ప్రథమ శ్లోక మిందు కుదాహరణము. దానిలో పార్థుఁడు విష్ణువుతోఁ బోల్చఁబడినాఁడు. విశేషణములు ఇరువురకు నన్వయించును. శ్లోక మిది :

"రుచిరాకృతిః కనకసాను మథో పరమఃపుమా నివ పతిం పతతాం
ధృతసత్పథ స్త్రిపథగా మభిత స్స త మారురోహ పురుహూతసుతః"

కుమారసంభవమునందలి హిమవన్నగ వర్ణనములోనిదే మఱి యొక పద్యము :

నెగసి సుడిసి తావి మిగులుచుఁ దరులతా
కలితపుష్పరజము గాలిఁ దూలి
పొలుచు నగవిభునకు పొంబట్టుచేల నా
కసము మేలుకట్టు కట్టినట్లు. (3 ఆ. 12 ప.)

సరిగా నిట్టిభావమే కిరాతార్జునీయమునఁ బంచమసర్గయందు యక్షుఁడు హిమవన్నగమును వర్ణించుపట్టునఁ గలదు.

"ఉత్ఫుల్లస్థలనళినీవనా దముష్మా
దుద్ధూత స్సరసిజసంభవః పరాగః,
వాత్యాభి ర్వియతి వివర్తిత స్సమంతా
దాధత్తే కనకమయాతపత్రలక్ష్మీం". (5 స. 39. శ్లో)

(పొంబట్టు - బంగారుపట్టువస్త్రము)

ఈ విధముగా మఱికొన్నింటినిగూడఁ జూపవచ్చును. కాని స్థలము చాలమి నొక్కటి మాత్రము చూపి యీ ప్రకరణమును ముగింతును.

కుమారసంభవమున షష్ఠాశ్వాసమున శరత్కాలవర్ణనము గలదు. అందలి దీ క్రింది పద్యము :

"శరదాగమమున శోభా
కరముగఁ గై వ్రాలఁ బండి కలమవనంబుల్
గరుసున నెలమిగ తామర
విరిపువ్వుల తావి కెఱఁగు విధమునఁ బొలిచెన్". (6 ఆ. 119 ప.)

కిరాతార్జునీయమున చతుర్థసర్గయందు శరద్వర్ణనముగలదు. అందలి దీ క్రింది శ్లోకము :

"అమీ పృథు స్తంబభృతః పిశంగతాం
గతా విపాకేన ఫలస్య శాలయః
వికాసి వప్రాంభసి గంధసూచితం
నమంతి నిఘ్రాతుమి వాసితోత్పలం". (4 స. 26 శ్లో.)

కుమారసంభవములోని పై కందపద్యము కిరాతార్జునీయ శ్లోకమున కనువాదము కాదనఁగలమా ?

నన్నెచోడ భారవులందుఁ గొన్ని సమానధర్మములున్నవి. ఇరువురును రాజనీతియెడ ననురక్తులు. ఇరువురకును ప్రకృతి పరిశీలనమున నాసక్తి మెండు. ఆటవిక స్త్రీలను, జనులను, పల్లెపట్టుల యందలి దృశ్య

ములను, వర్ణించుటయం దిద్దఱకును నిష్టమే. ఈ విషయములు వారి గ్రంథములఁ జదివిన స్పష్టమగును. కావుననే మన కవిరాజు కృత్యాదిని భారవి మహాకవిని ఘనముగా స్తుతించినాఁడు.

## కాళిదాస మహాకవి - నన్నెచోడదేవుఁడు

వ్యాసవాల్మీకుల స్తుతించినవెంటనే నన్నెచోడుఁడు కాళిదాస మహాకవి నీక్రింది విధముగా స్తుతించెను.

"భాసురమతి వాల్మీకి
వ్యాసాదులు చనిన జగతి వరకవితా సిం
హాసనమెక్కి కవీంద్రుల
దాసులఁగా నేలెఁ గాళిదాసుఁడు పేర్మిన్." (1. ఆ. 19 ప.)

పైపద్యము గీర్వాణసాహిత్యమునఁ గాళిదాసమహాకవి స్థాన మెంతటిదో వివరించుచున్నది. కాళిదాసు వ్యాసవాల్మీకుల తరువాత వెన్వెంటనే పేర్కొనఁ దగినవాఁడనియు, నాతఁడు పైకవులు గతించిన పిదప వెలసిన సంస్కృతకవులందఱకును బ్రభువై శాసకుఁడై కవితా సామ్రాజ్యము నేలిన వాఁడనియుఁ జోడుని కందము వచించుచున్నది.

పై పద్యమునం దొక్క విశేషము గమనింపఁ దగియున్నది. కాళిదాసకవి యింత గొప్పవాఁడయినను నాతఁడు వాల్మీకి వ్యాసుల తరువాతఁ బేర్కొనఁ దగినవాఁడుమాత్రమే. అనగా వ్యాసవాల్మీకు లంత కన్న గొప్పవారని యాతని భావమై యుండును.

దీనికిఁ గారణమును లేకపోలేదు. చోడుని దృష్టిలో వాల్మీకిది కవితా విషయమున నగ్రస్థానము. ఆతఁడు కవితామృతోదయమునకు సముద్రము, ఆదికవి, వస్తుకావ్యాబ్ధిరవి. కాళిదా సట్టివాఁడు కాఁడుగదా! వాల్మీకి దత్తవిషయమునుగొని యాతని వాక్కులనే యెడనెడ గ్రహించి రఘువంశకావ్యమును రచించినవాఁడు.

వేదవ్యాసుఁడును వాల్మీకి యంతటివాఁడే. ఆతఁడు వేదాంత భారత పురాణగ్రంథముల రచించుటయే కాదు, బ్రహ్మకును సాధ్యము కాని వేదవిభజనముచేసిన ఘనుఁడు. కాళిదాసట్టి మహాకవి రచించిన శివ పురాణములోని కథను గ్రహించి, యెడనెడ నాతని వచనములనే యిడి కొనుచుఁ కుమారసంభవకావ్యమును రచించినవాఁడు.

అట్లనుటచేఁ గాళిదాసు ప్రతిభాహీనుఁ డనుటగాదు, కాని యాతఁడు వాల్మీకి వ్యాసులకుఁ దరువాతనే లెక్కింపఁ దగినవాఁడనుట.

పై నన్నిచోడుని పద్యమున నింకొక విశేషమును గలదు. చోడుఁడు తాను కుమారసంభవ కావ్యమును రచింపఁబోవు చున్నాఁడు. కాళిదా సంతకుఁబూర్వమే కుమారసంభవకావ్యమును రచించి మహాకవి యనఁబరఁగినవాఁడు. తన కనేక విషయములం దాతని గ్రంథము మార్గ దర్శకము కావలసియున్నది. అయినను పై పద్యమునఁ గాళిదాసు కుమార సంభవప్రశంస కానరాదు. దీనినిబట్టి చోడుఁడు కాళిదాసమహాకవిని ప్రత్యేకముగాఁ గుమారసంభవమును రచించినందుకుఁ గాక యాతని గవితాశక్తికి మాత్రమే పొగడినట్లు స్పష్టమగుచున్నది. చోడుఁడు కాళి దాసస్తుతి తరువాత నుద్భటుని స్తుతించుపట్టున కుమారసంభవ ప్రశం సను చేసియుంటచేఁ గాళిదాసు విషయమున నా ప్రశంస నెత్తికొనకుండు టకుఁ గారణము పైదేయని స్పష్టముగాఁ జెప్ప వీలగుచున్నది.

అట్లయినఁ గాళిదాస కుమారసంభవము నెడఁ జోడున కాదరము లేదా ? యను ప్రశ్న కలుగును. దీని కాతని గ్రంథమే సమాధానము. చోడుఁడు కాళిదాసుని కుమారసంభవ శ్లోకముల ననేకముల ననువదించి తన గ్రంథమున వేసికొనినాఁడు. ఆ యనువాదములను జూడఁగా చోడుఁడు కాళిదాసుని కుమారసంభవమును బాగుగాఁ జదివినవాఁడనియు దానిని ప్రక్కనే యుంచుకొని యవసరమయినపుడెల్ల నా గ్రంథమును బరిశీలించుచు తనకు నచ్చినచోటుల నందుండి శ్లోకముల ననువదించి తన గ్రంథమున నిడికొనుచుఁ దన రచనమును సాగించెననియు తేలును.

ఆ యనువాద విధానము నీ ప్రకరణముననే వివరింతును. ప్రస్తుతము చోడుఁడు తన కుమారసంభవమునఁ గాళిదాసు కుమారసంభవ మొక్క దానినే యనుసరించెనా? లేక యాతని యితర గ్రంథములనుండికూడ నేమయిన గ్రహించెనా? యని విచారింపవలసి యున్నది.

"మంగళాచరణము" అను ప్రకరణమున నన్నెచోడ మహాకవి స్రగ్ధరావృత్త రచనమునకుఁ గాళిదాసాది మహాకవుల కృతులు ఒజ్జబంతు లయి యుండునని సూచించితిని. అట్లే యీ క్రింది చోడరాజుపద్యమును జదివినప్పుడు ఆతఁడు కుమారసంభవమును మాత్రమే గాక కాళిదాస మహాకవి ఇతర గ్రంథములను సైతము చూచి యందముగా నున్నచోట్ల వాని యనుసరణములను దన గ్రంథమునందుఁ జేర్చుకొనెనని చెప్ప వీలగుచున్నది.

కుమారసంభవమునందలి యష్టమాశ్వాసముచివర సూర్యోదయ వర్ణనము గలదు. అందలిదీ క్రింది పద్యము.

అస్తగిరిఁబొందె రా, జుదయాద్రి నెక్కె
నినుఁడు, తేజస్వులగువారి కెల్ల ప్రొద్దు
మానితంబగు నిల నొక్కమాట పొందు
హానివృద్ధులు సూచించునట్లు పోలె. (8 ఆ. 190 ప.)

అచ్చముగా నిట్టిభావమే గల శ్లోకము కాళిదాస మహాకవి రచించిన అభిజ్ఞాన శాకుంతల నాటకమునందలి చతుర్థాంక ప్రారంభమునఁ గలదు.

యాత్యేకతోఽస్త శిఖరం పతిరోషధీనా
మావిష్కృతారుణ పురస్సర ఏకతోఽర్కః
తేజోద్వయస్య యుగపద్వ్యసనోదయాభ్యాం
లోకో నియమ్యత ఇవాత్మ దశాంతరేషు. (శాకుం. 4 అం. 2 శ్లో.)

ఇట్టిదే మఱియొకటి కుమారసంభవమునఁ గాళిదాసు శాకుంతల నాటకానుకరణము గలదు.

కుమారసంభవమున షష్ఠాశ్వాసమునందుఁ బార్వతి తపోవనమున కరుగుచుఁ దానప్పటివఱకు సాకిన హంస కీర మయూర కోకిలములను జెలుల కప్పగించి వానిం గాపాడ వేడును. ఈ ఘట్టము అభిజ్ఞాన శాకుంతలము చతుర్థాంకమందలి శకుంతలా ప్రయాణ ఘట్టమును జ్ఞప్తికిఁ దెచ్చుచున్నది.

ఇంతకుఁ దేలిన సారాంశ మేమనఁగా నన్నెచోడ మహాకవి కాళిదాసును గుమారసంభవ కర్త యయినందువలన మాత్రమేగాక కవితా ప్రాగల్భ్యముచేత గొప్పవాఁడయి యనేక కృతుల నిర్మించినవాడగుట చేతఁ దన కృత్యాది నాతనిని బొగడినాఁడనుటయే. కావుననే యాతఁడు కాళిదాసును బ్రశంసించియు నందు గుమారసంభవమును బ్రశంసింపక విడుచుట సంభవించినది. అయినను నాతఁడు కాళిదాస కుమార సంభవమునుండి యనేక విషయముల గ్రహించినాఁడు.

అంతేగాదు. నన్నెచోడ మహాకవి కుమారసంభవమునకుఁ గాళిదాస మహాకవి కుమారసంభవమే మూలమను వాదమును గలదు. దీనిని బ్రతిపాదించినవారు కీ. శే. శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రులుగారు, శ్రీ. ల. శాస్త్రులుగారు నవమ సర్గాది కథనుగూడ చోడుఁడు తన గ్రంథమున ననుకరించెనని వచించి యొందు రెండు ఘట్టములందుఁ బై గ్రంథములందున్న సామ్యములను జూపి యిది యాధారముగా నన్నెచోడకవి కాలమును నిర్ణయింపఁ బ్రయత్నించిరి.

ఇది యుక్తముగా దోపదు. నవమ సర్గాదికథ కాళిదాస మహాకవిది కాదనుట తిరుగులేని సిద్ధాంతముగాదు. పోనీ కాదనియే యనుకొన్నను, వ్రాసినవాని కాలముగాని తదితర విషయములుగాని స్పష్టముగాఁ దేల్చబడలేదు. వ్యాఖ్యాతలు ఆ భాగమును స్పృశించనంతమాత్రమున నది వారికిఁ దరువాతనే వ్రాయఁబడవలెనను నియమమునులేదు. వారికి ముందుగానే యాభాగము వ్రాయఁబడి యుండవచ్చును. వారది కాళిదాస రచనము కాదని యెఱిఁగి యుండుటచేత దానికి వ్యాఖ్య వ్రాయక విడిచియుండ

వచ్చును. కావున నిట్లు వివాదగ్రస్తములయిన విషయము లాధారము లుగాఁ జోడుని కాలమును నిర్ణయించుట యుక్తము కాదనుట యుక్తి దూరముగాదు.

ఇంతకును శ్రీ శాస్త్రిగారే అష్టమసర్గవఱకును గల భాగమునుండి యనేక శ్లోకముల ననువదించి తన గ్రంథమునందుఁ జేర్చుకొన్న చోడు డవతలి గ్రంథమునుండి యొండు రెండు ఘట్టములనే స్వీకరించినట్లు వచించి యా ఘట్టములు నన్నెచోడుఁడు సంస్కృత కుమారసంభవము నుండియే గ్రహించెనని చెప్పనవసరము లేదనియు నిరువురును సమా నముగా నేయితర కావ్యమునుండియో కాకతాళీయముగా గ్రహించుటయు నసంభావ్యము గాదనియు వచించినారు. (చూ. కుమారసంభవ విమర్శ పుట 88)

ఇంతకును శ్రీ లక్ష్మీపతి శాస్త్రిగారు చూపిన నాలుగు పద్యము లలోఁ జివరిది యొక్కటి మాత్రమే వారిచ్చిన మూలమునకు దగ్గఱగా నున్నది. ఆ పద్యము నిట నొసఁగి యా పద్యమునకు మూలమనఁదగి నది వారిచ్చినది గాక ఇంకేదయినఁ గలదేమో విచారింతము.

కరిణీబృందముఁబాసి యొక్క మదనాగం బద్రిరత్నోరుకం
దర సంక్రాంత నిజప్రభాతిఁ బ్రతివేదండంబుకాఁ జూచి దు
ర్ధర రోషంబునఁ బోరుచుండె నతిమాత్సర్యంబునం దా మహే
శ్వరు శైలేంద్రముతోడ నీలగిరి వెల్చం బోరున ట్లున్నతిన్.

(1 ఆ. 89 ప.)

శ్రీ శాస్త్రిగారు దీనికి మూలమని చూపిన శ్లోకమిది :

హేమావనీషు ప్రతిబింబ మాత్మనో
ముహూ ర్విలోక్యాభిముఖం మహాగజాః
రసాతలోత్కీర్ణ గజభ్రమాత్కృథా
దంత ప్రకాండ ప్రహతాని తేనిరే. (14 స. 23 శ్లో.)

ఈ గ్రంథమునందే మఱియొకచోట నన్నెచోడ మహాకవి భారవి నెట్లనుసరించెనో వివరముగాఁ జెప్పఁబడినది. పై భావమునే కొంచె మించుగా గ్రహించి రచించిన గజభ్రమ విషయిక పద్య మొకటి కిరాతార్జునీయమున షష్ఠసర్గయందుఁ గలదు.

"ఉపలభ్య చంచల తరంగ ధృతం
మదగంధ ముత్థితవతాం పయసః
ప్రతిదంతినా మివ స సంబుబుధే
కరియాదసా మభిముఖాన్కరిణః" (6 స. 14 శ్లో.)

దీనిబట్టి నన్నెచోడుని గజభ్రమ భారవ్యనుకరణ మనుటయు హేతు దూరము కాదు. శ్రీ లక్ష్మీపతి శాస్త్రిగారు చెప్పినట్లు భారవి రచనమే ఈ యిరువురి పద్యములకు మూలము కావచ్చును.

ఇక కాళిదాస కుమారసంభవము నుండి నన్నెచోడుఁడు శ్లోకముల నాంధ్రీకరించిన విధమును సంగ్రహముగా వచించి ఈ ప్రకరణమును ముగింతును. దానికిముం దొక్క విషయము చెప్పవలసి యున్నది. కాళిదాస కుమారసంభవమున నున్నవానిఁ గొన్నిటి నీ మహాకవి తన గ్రంథమున గ్రహింపలేదు. మఱికొన్నింటి నెక్కడనుండియో గ్రహించి కాళిదాసీయమున లేకున్నను దన గ్రంథమునఁ జేర్చినాడు. మఱికొన్నింటిని మార్చినాడు. కాళిదాసుని శ్లోకముల ననువదించుటయందును నన్నెచోడుఁడు తన స్వీయశక్తిని గోల్పోయి మక్కికి మక్కిగా వానిని దన గ్రంథమునఁ జేర్చుకొనలేదు, కొన్ని మార్పులు చేర్పులు చేసినాడు. ఇట్లీ మహాకవి కాళిదాసుని శ్లోకముల నెన్నింటి ననువదించి తన గ్రంథమునఁ జేర్చుకొనినది శ్రీ శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రిగారు వివరముగాఁ దమ కుమారసంభవ విమర్శయందుఁ జూపినారు. నేను వాని నన్నింటి నిచ్చుట మాని యాతని యనువాద విధానమును, అందలి స్వీయ ప్రతిభను జూపుటకు మాత్రమే యొండు రెండుదాహరణములఁ జూపుదును.

పంచమ సర్గయందుఁ బార్వతీ తపశ్చర్యను వర్ణించు పట్టునఁ గాళిదాసు క్రింది శ్లోకమును రచించెను.

"స్థితాః క్షణం పక్ష్మసు తాడితాధరాః
పయోధరోత్సేధ నిపాత చూర్ణితాః
వలీషు తస్యాః స్ఖలితాః ప్రపేదిరే
చిరేణనాభిం ప్రథమోదబిందవః" (5 స. 24 శ్లో.)

పై శ్లోకమునఁ బార్వతీదేవి లోకాతిశాయి సౌందర్యమును, సమాధ్యవస్థయు వర్ణితములయినవని విమర్శకులు భావించినారు.

అప్పయ దీక్షితులు తన చిత్రమీమాంసాగ్రంథారంభమున "యత్ర వాచ్యాతిశాయి వ్యంగ్యం స ధ్వనిః" అని ధ్వనిని నిర్వచించి దాని కుదాహరణముగాఁ బై కుమారసంభవ శ్లోకము నుదాహరించి వివరించినాఁడు. ఆతని వివరణమున ముఖ్యభాగము నుదాహరింతును. "అత్ర తపస్యన్త్యా దేవ్యా దేహోపరి నిపతతాం ప్రథమవృష్టి బిందూనాం క్రియాస్వభావవర్ణనేన దేవ్యాస్సమాధ్యుచితావస్థానాభివ్యక్తిద్వారాచిరనిదాఘ తప్తదేహోపరినిపతనేన సుఖపారవశ్య సంభ్రమహేతౌ ప్రథమవృష్టావప్యవిహతాసమాధ్యవస్థావ్యజ్యతే" (తెనుఁగు: పై "స్థితాఃక్షణ"మిత్యాది శ్లోకమునందుఁ దపోనిమగ్నయగు పార్వతిదేహముపైఁ బడిన ప్రథమ వృష్టి బిందువుల క్రియాస్వభావ వర్ణనచేతఁ బార్వతీదేవి సమాధ్యవస్థ ప్రకటింపఁబడుటయేకాక మండువేసఁగిచేఁబరితప్తమైన ఆమెదేహముపైఁబడినపుడు సుఖపారవశ్యసంభ్రమములఁ గలిగించు ప్రప్రథమ వర్షబిందువుల వల్లను పార్వతి సమాధికి భంగము వాటిల్లలేదని ధ్వనితమగుచున్నది.)

సమాధియందున్నవారి యవస్థ యీ క్రిందివిధముగా నుండునట.

"నాసాగ్రన్యస్తనయనః సంవృతాస్యః సునిశ్చలః
ధ్యాయీత మనసా దేవం ఉరో విష్టభ్య చాగ్రతః."

ముక్కు చివరిపై దృష్టినిలిపి, నోరు మూసికొని, సునిశ్చలుఁడై వక్షమును ముందుకు నిలిపి దేవుని మనస్సుతో ధ్యానింపవలెనని పై

శ్లోకమున కర్థము. పార్వతి యిట్టి సమాధ్యవస్థయం దున్నదనుటను పై శ్లోకము ధ్వనింపఁజేయుచున్నది. లేనిచోఁ బక్ష్మములపైఁ గొంచెముసేపు నిలిచి, మోవిపైఁబడి, వెంటనే పయోధరముల మీఁదికి దుమికి ముక్కలై త్రివళులయందు స్ఖలితములై యా ప్రథమోదక బిందువులు నాభియందుఁ జేరుట సాధ్యముగాదుగదా! అంతేగాక పై శ్లోకమునఁ బార్వతి పక్ష్మము లలోని సాంద్రతయు, అధరోష్ఠపు సౌకుమార్యమును, స్తనముల కాఠి న్యమును, త్రివళుల విస్పష్టతయు, నాభియొక్క గాంభీర్యమును ధ్వనిత ములగుచున్నవి. (చూ. చిత్రమీమాంస. 1. 2. పుటలు.)

ఇంత మనోహరార్థముగల యీ శ్లోకమును మన కవిరాజు ఏరీతి ననువదించి తన గ్రంథమున నిడికొనెనో చూతము. నన్నెచోడుని పద్య మిది.

(అడరు నవాంబుధారలు జటాటవిలోఁబడి విభ్రమించి వె
ల్వడి చనుదెంచి రాలుగొని) పక్ష్మములన్ వెడనిల్చి మోవిపైఁ
బడి కుచఘట్టనం జెదిరి పాఱి రయంబున ముత్తరంగలన్
(మడుగులువాఱి) నాభికెడ మానకసొచ్చె ననుక్రమంబునన్.

(6 ఆ. 111ప)

ఇక్కడ నన్నెచోడ కవి యనువాద విధానమును గొంచెము చూడవలసియున్నది. మూలములోని భాగమంతయు యథాతథముగా ననువదింపఁబడుటయేకాక మూలభావమునకు ముందుగాఁగొంత క్రొత్త భావము కల్పింపఁబడినది. దానిని పై పద్యమునఁ గుండలీకరణ చిహ్న భావములచే సూచించినాను. కాళిదాసు పక్ష్మములపైనే జలబిందువులు పడి నట్లు చెప్పగా నన్నెచోడుఁడు దానికి ముందు జటాటవిని జేర్చినాఁడు.

ఇటఁగల యటవీశబ్దము పార్వతి శిరోజముల సంస్కారరాహిత్య మును సూచించుచున్నది.

మూలములోని భాగమంతయు యథాతథముగాఁ దెనిఁగింపఁబడు టచే నప్పయదీక్షితుఁడు "స్థితాః క్షణ"మిత్యాది శ్లోకమున నున్నదన్న

విశేషార్థమంతయు నన్నెచోడ దేవుని యాంధ్రపద్యమునందు నుండు టకు వీలగుచున్నది. నన్నెచోడుని పద్యముగూడ పార్వతి తపస్సమాధిని, సౌందర్యమును, మూలశ్లోకమువలెనే వివరించుచున్నది.

ఇఁకఁ బోగా నన్నెచోడుని పద్యమున మఱియొక విశేషము చేరి నది. అది యాతని కల్పనాఫలితము. ఆ పడినవర్షధారలు (ప్రవాహ ములు కానవసరము లేదు. చిన్నధారలు కావచ్చును.) జటలనునటవిలోఁ బడినవఁట. ఇది యీకవిరాజు ప్రత్యేకత. అడవులు మేఘముల నాక ర్షించి వర్షములఁ గుఱియఁజేయునని గదా శాస్త్రజ్ఞులందురు. కావుననే యా వర్షాంబువులు పార్వతి జటాటవిలోఁ బడినవి.

అడవిలోఁబడ్డ నీరేమగును ? మెల్లమెల్లగా ప్రవాహమై కట్టి యాటంకముల నధిగమించుచుఁ బయనించి గమ్యమును జేరుకొనును గదా ! అట్టి ప్రకృతిరమణీయమగు దృశ్యమొక్కటి నన్నెచోడుని పద్యముచే ధ్వనితమగుచున్నది. నిజముగా కవిరాజిట్టి భావము నుద్దేశించి యుండునా ? యను ననుమానముండరాదు. నిజముగా నట్టిభావమేలేనిచో నాతఁడు "ధారలు, విభ్రమించు, పాఱి, మడుగులు" అను ప్రవాహాను కూల పదములఁ బద్యమునఁ జేర్చియుండఁడు. కాళిదాస శ్లోకమునే తా ననువదించి గ్రహించినను తత్పద్య రచనమునఁ దన ప్రత్యేకతను నన్నెచోడుఁడు చూపక విడువలేదు.

ఇట్టిదే మఱియొక పద్యము సప్తమాశ్వాసమునఁ బార్వతిని పరీక్షించుటకై కృతక బ్రహ్మచారి పలికినది.

తొడవులు చివికిన యెమ్ములు,
గుడిముట్టు కపాల, మిల్లు గుడిముడి, యెద్దె
క్కుడు, గట్టువలువు తోలగు
బడదునకై నవయ నేమి ప్రళయము వచ్చెన్ ? (7 ఆ. 39 ప.)

ఈ పద్యము శివుని యాకారమును సుమనోహరమగు ఫక్కికలో వర్ణించుచున్నది. అన్ని పదములును దేశీయములే. భావ స్ఫోరకములగు

శబ్దముల కూర్పున్న నిట్లుండవలె. పాల్కురికి సోమనాథ మహాకవి బసవపురాణావతారికయందు "అల్పాక్షరముల ననల్పార్థ రచన గావిం చుటయగాదె కవి వివేకంబు" అని వచించినాఁడు. దానికిఁ బై నన్నె చోడుని పద్య ముదాహరణ మగును.

పై పద్యమునకు సరిగా మూలమనఁదగిన యొకేయొక శ్లోకము కాళిదాసీయమున లేదుగాని పై పద్యములోని భావములు చెదరు వదరుగా నందుఁ గలవు. వానిని చూపుట యిట నప్రస్తుతముకాదు.

పై పద్యమున మొదటివి శివుని యాభరణములు. అవి యెముకలే కాని యన్యములుకావు. కాళిదాసీయమున నెముకల విషయములేదు. "వలయాకృతాహి" యని మాత్రమే (5-66 శ్లో) కలదు. శివపురాణము నందు మాత్ర మీఘట్టమునందే "క్వచ హార స్త్వదీయో మైక్వచ తన్ముండ మాలికా" యని శివుని కంఠహారము కపాలమాలయని చెప్పఁబడినది. దానిని గ్రహించియే రాజకవి యిట్లు చెప్పియుండును. ఈ విషయమే ద్వితీయాశ్వాసమందు దక్షాధ్వరమునను జెప్పఁబడినది. (చూ. విరుద్ధాచార కంకాలకాపాలోగ్రాహి జటాజినాస్థిధరుఁడా భస్మాంగి రానర్హుఁడే (2-21) కావున నిది యొకవిధముగా చోడుని స్వకపోలకల్పనమే.

ఇఁక రెండవది శివుని భోజనపాత్రము. అది కపాలము. కాళి దాసీయమున "ద్వయం గతం సంప్రతిశోచనీయతాం సమాగమప్రార్థనయా కపాలినః" అను బ్రహ్మచారి వచనమునను, "కపాలి వాస్యా దథవేందు శేఖరం న విశ్వమూర్తే రవధార్యతే వపుః" అను పార్వతి సమాధానము నందును శివుని కపాలిత్వము వచింపఁబడినది. దానిని "కుడిముట్టు" గా వర్ణించినాడు మన కవిరాజు.

మూఁడవది శివ నివాసస్థలము. అది "కుడిముడి" శ్మశానము. ఈవిషయము కాళిదాసీయమునందు "అలక్తకాంకాని పదాని పాదయో ర్వికీర్ణకేశాసు పరేతభూమిషు" అను బ్రహ్మచారి వచనముచేతను "త్రిలోక నాథః పితృసద్మగోచరః" అను పార్వతి వచనముచేతను జెప్పఁబడినది.

"కుడిముడి" యనగా శ్మశానము. ఈ యర్థము యీ. ప్రతిలో గాని, నిఘంటువులందుఁగాని కానరాదు. కాని సందర్భమును బట్టి యీ యర్థమే యని స్ఫురింపక మానదు. "ఇల్లు గుడి" యని యెంచుట మూలమునకు విరుద్ధము గదా!

శ్రీరామకృష్ణకవిగారు "గుడిముడి=స్మశానము" అనియే వ్రాసిరి. (చూ. కుమా. 1 భా. అనుబంధము 8 పుట)

నాలుగవది శివుని వస్త్రమునకు సంబంధించినది. ఆతఁడు గజాజిన వసనుఁడు గదా! ఈ విషయము కాళిదాసీయమునందు "*గజాజినం శోణిత బిందువర్షి చ*" యను బ్రహ్మచారి వాక్యమునను "*గజాజినాలంబి* దుకూలధారి వా" యను పార్వతి సమాధానమునను గలదు.

ఇట్టి యమంగళాకారముగల శివుని వరించుట పార్వతికి యుక్తము కాదని "బడరునకై నవయ నేమి ప్రళయము వచ్చెన్" అను భాగముచే వచించినాఁడు బ్రహ్మచారి. నవయుట యనగాఁ శ్రమపడుట, కృశించుట యని రెండర్థములు. పార్వతి శివునికై కృశించి శ్రమపడుచున్నది గదా!

"ఏమి ప్రళయము వచ్చెన్" ఇది కవి స్వకపోలకల్పనము. దీనికి మూలము కాళిదాసీయమున లేదు. ఉండుటయు సాధ్యముగాదు. ఉన్నను దాని కింతటి యర్థ మా భాషలో రాదు.

తెలుఁగువారీ ప్రళయశబ్దము నొక ప్రత్యేకార్థద్యోతకముగా వాడు దురు. "ఇప్పుడేమి *ప్రళయము* వచ్చినది?" అను వాక్యములోని ప్రళయ శబ్దము సంస్కృతములోని 'అత్యాహిత' మను నర్థమును సూచించును. అనఁగా "నేమి యుపద్రవము సంభవించినది?" యని యడుగుట. బ్రహ్మచారి పార్వతి నట్లే యడిగినాఁడు. "శివుని వివాహమాడకున్న నామెకు మునిఁగినదేమున్నది?" యని యా బ్రహ్మచారి ప్రశ్నము.

కాని ఈ ప్రళయశబ్దమును వాడుటలో నిక్కడఁ జూపిన ప్రతిభ యత్యద్భుతము. పార్వతి శివుని వివాహమాడఁ దగినంతటి ప్రళయ మేదియు సంభవింపలేదు. నిజమే! కాని యట్టి ప్రళయమే సంభవించి

వచో(ఁ బార్వతి శివుని వివాహమాడుట తగునన్నట్లే కదా! అనఁగా నీ వివాహము పార్వతిని ప్రళయమునుండి కాపాడఁ గలదన్నమాట. ఎందుకన నా ప్రళయము శివుని యధీనములోనిది గదా! తారకునివలన దేవతల కిప్పుడు ప్రళయమే సంభవించినట్లున్నది కనుక పార్వతి శివుని వివాహమాడుట యుక్తమే యని ఈ పదము సూచించుచున్నది.

ఇంతటి మనోహరమయిన భావము నుద్దేశించి ఈ పదమును సంఘటించినాఁడీ మహాకవి. అట్టి ప్రతిభకు నమోవాకములు.

కాళిదాసు నీ మహాకవి యనుకరించిన విధమునకు మఱియొక యుదాహరణము బ్రహ్మచారి స్వరూపమును వర్ణించు పద్యము. దాని నొక్కదానిని జూపి ఈ ప్రకరణమును ముగింతును.

కాళిదాసు కుమారసంభవమున కృతకబ్రహ్మచారివేష మీ క్రింది విధముగా వర్ణింపఁబడినది.

"అథాజినాషాఢధరః ప్రగల్భవాగ్
జ్వలన్నివ బ్రహ్మమయేన తేజసా
వివేశ కశ్చి జ్జటిల స్తపోవనం
*శరీరబద్ధః ప్రథమాశ్రమో యథా."* (5 సర్గ. 30 శ్లో.)

ఈ సందర్భముననే బ్రహ్మచారిని వర్ణించు భాగము శివపురాణ మున నీ క్రింది విధముగాఁ గలదు.

"పరీక్షాఛద్మనా శంభు ర్ద్రష్టుం తాం తుష్టమానసః
జాటిలం రూప మాస్థాయ స యయౌ పార్వతీవనమ్
అతీవ స్థవిరో విప్రదేహధారీ స్వతేజసా
ప్రజ్వల న్మనసా హృష్టో దండీ ఛత్రీ బభూవ సః...
ఆగతం తం తదా దృష్ట్వా బ్రాహ్మణం తేజసాద్భుతం...
విప్ర ఉవాచ: అహమిచ్ఛాభిగామీచ వృద్ధో విప్రతను స్సుధీః"
(శివపు. పా. ఖం. 26 అధ్యా.)

నన్నెచోడుని బ్రహ్మచారి వర్ణన మిది :

"మెఖలఁగుఁ *దీఁగియతోడి మేఘమ్ము నా జన్ని
దముతోడఁ గృష్ణాజినము ధరించి
మకరధ్వజముతోడి మరుపచ్చవిల్లునా
గోచితో మోదుగుఁ గోలవట్టి
చంద్రికతోడి తుషారపుంజమ్ము నాఁ
దను కాంతితో భూతిధామ మెసఁగ
వీణారవముతోడి వేదనాదమ్ము నా
రాగమ్ముతోడ శివాగమములు
సదువుచును బ్రహ్మవర్చస పదవితోడి
(దివ్యతేజమ్ము మొగమునఁ దేజరిల్ల)
*సుందరాకార మమర బాలేందుధరుఁడు*
తాల్చి చనుదెంచె గిరిరాజ తనయకడకు." (7 అ. 3 ప.)

పై ముగ్గురి వాక్కులు చదివినచో నొక భేదము స్పష్టముగాఁ గానవచ్చును. శివపురాణమునందలి బ్రహ్మచారి స్పష్టముగా వృద్ధుఁడు. కాళిదాస కుమారసంభవములోని బ్రహ్మచారి మూర్తీభవించిన బ్రహ్మచర్యమన నొప్పినవాఁడు. నన్నెచోడుని బ్రహ్మచారి పై ఇరువురకన్న భిన్నుఁడు. ఆతఁ డభినవ మునికుమారుఁడట ! (చూ. 7 అ. 4,6 వచ.) సుందరాకారము గలవాఁడట ! కావుననే యాతని వేషము వ్యాస కాళిదాసుల బ్రహ్మచారుల వేషముకన్న భిన్నముగా శృంగార భావానుకూలముగా మన కవిరాజుచే వర్ణితమైనది. తనకుఁ గాఁబోవు భార్యను జూచుట కేగువాని యాకారమును గవిరాజు అర్హమగు విధముగా నుండునట్లు మూలమును మార్చి వ్రాసినాఁడు. ఈ వచ్చిన బ్రహ్మచారి

---

* బ్రహ్మచారికి జందెమొక్కటే కాన బహువచనము యుక్తము కాదు. నేను జూపినదే కవి హృదయము కావచ్చును. ముద్రితప్రతులు మూఁటియందును బహువచనమే గలదు.

కేవల బ్రహ్మచారి కాఁడు. గృహస్థుఁడు కాఁబోవు బ్రహ్మచారి. ఈ విధ మగు భావమే ఈ ఘట్టమునం దంతటను పోషింపఁ బడినది. ఆ భావ మున కనుకూలముగానే కవిరాజు పైయనువాదము వెలసినది.

ఈ విధముగా నొక్కొక్క శ్లోకమునే యనువాదముతో చూపుచు నేగినఁ బ్రత్యేక గ్రంథము వ్రాయఁదగును. ఏమయినను నన్నెచోడునకుఁ గాళిదాసుపై గౌరవాదరము లున్నవనుట నిశ్చయము.

## చోడునిపై బాణభట్టు ప్రభావము

కృత్యాదిని నన్నెచోడ మహాకవిచే సంస్తుతులయిన గీర్వాణకవుల యందు బాణభట్టు నున్నాఁడు. చోడుఁ డాతని స్తుతించిన పద్య మిది :

"కరములు దునుముడుఁ బరముని
వరదునిగాఁ గొలిచి కవితవలననె మగుడం
గరములు వడసి జగంబునఁ
బరగె మహాకవి యనంగ బాణుఁడు పేర్మిన్." (1-22)

పై పద్యమువలన బాణుని కవితాశక్తియు, శివభక్తియుఁ దెలియ నగు చున్నవి. బాణుని కరచ్ఛేదమునకు సంబంధించిన విషయము పండి తారాధ్య రచితమయిన శివతత్వసారమునందును జెప్పఁబడినది, కాని యందు బాణుఁడు తన కవితా ప్రతిభవలననే తిరిగి హస్తముల సంపా దించికొన్నట్లు చెప్పఁబడలేదు. ఈ క్రిందిది శివతత్వసారములోని పద్యము.

"చేతులు రెండును దునిమి మ
హా తాత్పర్యమున మిమ్ము నర్చించి జగ
త్ఖ్యాతముగ మగుడఁ బడయడె
భాతిగ నీచేత భట్టబాణుఁడు రుద్రా!"

(శివతత్వసారము; ఆంధ్రసాహిత్య పరిషత్ప్రచురణము 396 ప.)

బాణుని హస్తచ్ఛేదగాథ పాల్కురికి సోమనాథుని బసవపురాణమునందును

గలదు. కాని యందలి బాణుఁడు బాణకవి కాక బాణాసురుఁడైనట్లు అందే స్పష్టముగాఁగలదు. శివతత్త్వసారములోని బాణుఁడు బాణాసురుఁడు కాఁడను విషయము పైపద్యమే స్పష్టపఱచుచున్నది. బాణాసురుఁడు సహస్రబాహువు కాని ద్విబాహువు కాదు. పైగా నతఁడు భట్టబాణుఁడని పండితారాధ్యులు స్పష్టముగానే చెప్పినాఁడు. పై శివతత్త్వసార పద్యమునే కొంచెము వివరించి చెప్పినది మన నన్నెచోడుని పద్యము.

భట్టబాణుని యీ కరచ్ఛేదగాథను పండితారాధ్య నన్నెచోడు లిరువురును వచించినను అన్యత్ర యీ విషయము కానరాదు. పండితారాధ్యుల కీవిషయమున నాధారమేదియో ? మనకుఁ దెలియదు. ఇంతకు నీబాణుఁడు కాదంబరీ గ్రంథకర్తయేనా ? మఱియొకఁడా ? నిర్ణయించుట కష్టకార్యము. వారిద్ద ఱొక్కరేయను భావమునకు నన్నెచోడుని పద్యమవకాశమును గలిగించుచున్నది. కావున భట్టబాణుని ప్రభావము నన్నెచోడ మహాకవిపై నెంతవఱకుఁ బడినదో, తెలిసికొనుటయే యీ ప్రకరణమునందలి ముఖ్యవిషయము.

భట్టబాణుఁడు రచించిన గ్రంథములందు కాదంబరీ, హర్షచరిత్రములు సుప్రసిద్ధములు. అందుఁ గాదంబరి దగ్రస్థానము. వర్ణనలఁజేయుటయందు బాణమహాకవి ప్రత్యేకతకు "బాణోచ్ఛిష్టం జగత్సర్వమ్" అను నానుడియే తార్కాణము. బాణుఁ దేదేని యొకదానిని వర్ణింప మొదలిడెనా, దాని నన్ని దృక్కోణములనుండి సమగ్రముగాఁ బరిశీలించి యన్ని విధముల వర్ణింపనిదే విడువఁడు. ఇది యాతని వర్ణనలందు సర్వత్ర కనిపించు సామాన్యధర్మము. అంతేగా దుపమానోపమేయముల సమానధర్మములను శ్లేషచే సాధించుటయు నాతనికి మిగుల నభిప్రేత విషయము. ఉత్ప్రేక్షల కాతని రచనలు పుట్టినిండ్లు. నన్నెచోడదేవునకు నీ విషయము లభిప్రేతములే యనుట కాతని గ్రంథమే సాక్షి. మును ముందు వీని నుదాహరించి చూపుదును. ప్రస్తుతము నన్నెచోడ బాణభట్టులందు సమానముగా గనిపించు విషయములు కొన్ని చూపుదును.

నన్నెచోడుని కృత్యాదిని కుకవినింద గలదు. నన్నెచోడునిచే స్తుతింపఁబడిన పూర్వకవు లెవ్వరు నీ కుకవి నిందను దమ గ్రంథము లందుఁ జేసినట్లు కానరాదు. నన్నయభట్టు సయితము మహాభారతారంభమునఁ గుకవి నిందను జేయలేదు. కాని చోడుఁడు పేర్కొన్న బాణ మహాకవి యొక్కఁడు మాత్రము తన గ్రంథములయందుఁ గుకవి నిందను జేసినాఁడు. (చూ. కాదంబరీ, హర్షచరితములు) అంతేగాదు కుకవులను బాణుఁడు నన్నెచోడునివలెనే కుక్కలని నిందించుచు హర్షచరితమున

"సంతి శ్వాన ఇవాసంఖ్యా జాతిభాజో గృహేగృహే
ఉత్పాదకా న బహవః కవయ శ్శరభా ఇవ." (1 ఉచ్ఛ్వా. 5 ప.)

అని చెప్పినాఁడు. నన్నెచోడుఁడును

"చెనసి గుణమైన దోషంబు సేయనేర్చుఁ
గుకవి; కృతులందు దోసంబు గుణము సేయ
నేరఁ డదియట్ల; దొంతులు సేర నాయి
దోర్చనేర్చుఁ గాకది యేమి సేర్ప నేర్చు?" (1-29)

నని కుకవులను కుక్కలని నిందించినాఁడు.

కుమారసంభవమునందలి తృతీయాశ్వాసమునఁ బార్వతి యౌవన వర్ణనము గలదు. అందలి దీ క్రింది పద్యము :

"స్మరమందిరమ్ము శోభా
కరముగ మెఱుఁగారు పసిడి కంబములనగాఁ
గరమొప్పు నగ తనూజకుఁ
గరభోరులు వొలుచు మదనకరికర లీలన్" (2-48)

ఈ పద్యములోని పార్వతి యూరువర్ణనము హర్షచరితాదినిగల సరస్వతి జంఘావర్ణనమును బోలుచున్నది. అందలి వర్ణన మిది :

"మదననగర తోరణస్తంభ విభ్రమం బిభ్రాణా జంఘాద్వితయమ్,"

అట్లే షష్ఠాశ్వాసమునందలి "దివ్యఋషులపల్లి"

"భారతి నడపాడు పదగతులన మెల్పు
దలకొని క్రాలు పదక్రమములు" (6-56)

కలిగియున్నట్లు చెప్పఁబడినది. హర్షచరితమునందలి పై సరస్వతీ వర్ణనముననే

"పదక్రమముఖరేణ నూపురయుగళేన వాచాలిత చరణా"

యని కలదు. పైవాని పోలిక స్పష్టము.

ఈ ఋషిపల్లి వర్ణనముఁ జదివినప్పుడు కాదంబరిలోని జాబాల్యాశ్రమము జ్ఞప్తికి వచ్చుచుండును.

తృతీయాశ్వాసమున మేనకకుఁ బార్వతి

"పూర్వదిక్సతి కతిస్ఫురణతో నుత సుధా
కరరేఖ యుదయించు కరణి వోలె" (3-29)

నుదయించెనని వర్ణింపఁబడినది. కాదంబరియందు శుకనాసపత్ని గర్భ వర్ణనములోని యీ క్రింది వాక్యము నన్నెచోడుని యీ భావనమున కుద్బోధకమయి యుండుననుట యసంభావ్యముగాదు. కాదంబరిలోని వాక్యమిది :

"ఉదయగిరి తిరోహిత శశిమండలా మివ విభావరీం...విలాసవతీం దదర్శ."

షష్ఠాశ్వాసమునందు శరద్రాత్రిని వర్ణించుచు నన్నెచోడ మహాకవి యీ క్రింది పద్యమును రచించెను.

"శ్వేతద్వీపము చంద్రబింబము; మహాక్షీరాబ్ధి తత్ జ్యోత్స్న ద
ద్భూతిం గృష్ణుఁడు దన్మృగాంకము, లసత్పద్మాలయాక్షిద్యుతుల్
ప్రీతిం జారు చకోరదంపతులు; నాఁ బృథ్వీధరుంబోలి వి
ఖ్యాతిం బొల్పగు శారదాభినుత రాకారాత్రు లత్యున్నతిన్." (6-117)

పై పద్యము కవికి కాదంబరిలోని యీ క్రింది రాత్రి వర్ణనముతోఁ బరిచయము కలదనుటను సూచించుచున్నది.

"అథ నాతిదూరోద్గతేన.... వమతా... అమృతసాగరపూరానివోద్గిరతా చంద్రమండలే నాప్లావ్యమానే జ్యోత్స్నయా భువనాంతరాళే శ్వేతద్వీప నివాసమివ సోమలోకదర్శనసుఖ మివానుభవతి జనే మహావరాహ దంష్ట్రామండలనిభేన శశినా క్షీరసాగరోదరాదివ ఉద్ధ్రియమాణే మహామండలే." (కాదంబరి "వావిళ్ళ" 156పు.)

అష్టమాశ్వాసమున శివుఁడు హిమవన్నగరమును బ్రవేశించు పట్టును గాదంబరిలోని చంద్రాపీడుని విద్యాభ్యాసానంతర పురప్రవేశ ముతోఁ బోల్చిచూచినచో నా రెండు వర్ణనములందు గల పోలికలు స్పష్టమగును. ఒక్కటిమాత్ర ముదాహరింతును.

"వనజంబులుఁ గలువలుఁ బూ
చిన కొలఁకులమాడ్కిఁ బెనఁగి చెలువడరెఁ బురిన్
జనపతులు సతులు నీశ్వరుఁ
గనుఁగొనుచో వీథి వీథిఁ గనుఁగవరుచులన్." (8-70)

"క్రమేణ తం (చంద్రాపీడం)... నగరమార్గ మనుప్రాప్త మవలోక్య......రజనికరోదయ పరిబుధ్యమాన కుముదవనానుకారీ జన స్సమజని." (కాదంబరి "వావిళ్ళ" 81 పుట)

పై రెండుఘట్టములందలి పురస్త్రీల సంభ్రమము గమనింపఁదగినది.

ఇంకొక్కదానిని మాత్రము చూపి యీ ప్రకరణమును ముగింతును. కుమారసంభవమునందలి దశమాశ్వాసమున శరవణ సరోవర్ణనము గలదు. ఇది కాదంబరియందలి యచ్ఛోద సరోవర్ణనమును బోలి యున్నదనుట యీ రెండు వర్ణనలు పరిశీలించినచో స్పష్టమగును.

"ధూమధ్వజుండు శరవణ సరసి కరుదెంచె నది *యనిమిషాస్పదం బగుట నమృతాన్వితంబగుచు, ఖరదండ సహితంబగుటం గుముదాన్వితంబగుచు, సద్విజావాసంబగుటం గుశాన్వితంబగుచు, హంసాశ్రయం బగుటం గూర్మాసనాన్వితంబగుచు*" (10-18)

పై వచనములోని కాదంబరీశైలి వివరింపకయప్రకటమగుచున్నది.

"కమలాభిశోభితము హరి
రమణీయము విద్రుమాభిరామము శుకర
మ్యమునై *గగనాభ్ధులతో*
*సమమై వనమధ్యా జలజ షండంబొప్పెన్".* (10-19)

అను పద్యము అచ్ఛోద సరోవర్ణనమునందలి

"తస్యతరుషండస్య మద్యభాగే...జలాకారం గగనతలస్య"

అను దానిని బూర్తిచేయు మనోహర వర్ణనామయమే యనుట సహృదయులు నమ్మరానిది కాదు.

చంద్రాపీడుని నచ్ఛోద సరోవర మాహ్వానించినదాః యనునట్లున్న దని బాణభట్టీ క్రింది వాక్యములచే వచించినాఁడు.

"తం చ సమ్ముఖాదాగతేన కుసుమరజః కషాయామోదినా జలసంసర్గ శిశిరేణ శీకరిణా చందనరసస్పర్శే నాలింగమాన ఇవ జలతరంగ మారుతేన కమలమధుపాన మత్తానాం చ శ్రోత్రహారిభిః కలహంసానాం కోలాహలై రాహూయమాన ఇవ ప్రవివేశ".

పరిగా నిట్టి భావమునే గ్రహించి నన్నెచోడ మహాకవి నవమాశ్వాసమున హరగిరిజలకు కమలాకర మారుతమ్ముచే స్వాగతమ్ము నిప్పించినాఁడు.

"చెదరి తోఁబరతెంచు చెందమ్మిరేకులు
గెడగొని మొగుపుఁ గెంగేలుగాఁగ
నెలమి లేఁదరఁగల నెలయు తుంతుర్వాని
సదమల మౌక్తికాక్షతలు గాఁగ
నులియు నానావిధ జలపక్షికుల కల
రవ మించు పంస్తుతి రవముగాఁగ
జలజాత కైరవోత్పల కలహారాది
గంధంబు లోలి సద్గంధములుగ

నర్థిఁ దన యాదిమూర్తికి ననిలుఁ డర్చ
లీ ముదమ్మున వచ్చిన ట్లీశ్వరునకు
నెదురువచ్చి పథశ్రమ మెల్లఁ బాచె
గారవమున సరోవర మారుతంబు". (9-72)

ఈ విధముగా మఱికొన్ని పోలికలు నీ యుభయ కవులందుఁ గాననగును. వాని నన్నింటిని జూపుచుఁ గూర్చుండుటకన్న నన్నెచోడ మహాకవికిఁ గవిరాజమార్గమను కన్నడ గ్రంథమున నృపతుంగుఁడు కావ్య రచనాశక్తికిఁ గారణముగాఁ జెప్పిన యనేక కృతిపరిచయము కలదని విన్నవించుచు నృపతుంగుని పద్య ముదాహరించి దీనిని ముగించుచున్నాను.

"ప్రతిభావత్త్వము మకృతక
చతురతెయుం పరమబుధజనోపాసనముం
కృతిపరిచయముం (తర్కం)
ప్రతీతి (యం) వాగ్విదగ్ధతా నిపుణతె యోళ్"
(కవిరాజమార్గము 1 పరిచ్ఛేదము 11 ప.)

## నన్నెచోడుఁడు - ఉద్భటుఁడు

నన్నెచోడ మహాకవి గ్రంథాదిని స్తుతించిన గీర్వాణకవులలో నద్భటుఁడు అయిదవవాఁడు. అతఁ డుద్భటుని స్తుతించిన పద్యమిది.

"క్రమమున నుద్భటుఁడు గవి
త్వము మెఱయఁ గుమారసంభవమ్మ నలంకా
రము గూడ(?)వస్తుమయ కా
వ్యముగా హరులీలఁ జెప్పి హరు మెచ్చించెన్." (1-21)

సంస్కృత భాషయందుఁ గుమారసంభవమును రచించిన మఱియొక మహాకవి కాళిదాసు. కాలమునుబట్టి కాళిదాసు ప్రాచీనుఁడు, ప్రసిద్ధుఁడు. కాని మన కవి కాళిదాస కుమారసంభవమ్మును ప్రశంసింపక

యీ యుద్భటుని కుమారసంభవమ్మును మాత్రమే ప్రశంసించినాఁడు. ఈవిషయమును గొంత కాళిదాసునిగూర్చిన ప్రకరణమున వివరించినాను.

ఉద్భటుఁడు కాశ్మీరవాసి. క్రీ. శ. 778-813 ప్రాంతములఁ గాశ్మీర దేశము నేలిన జయాపీడుని యాస్థాన విద్వాంసుఁడు. ఈతని వేతనము దినమునకు లక్ష దీనారములఁట ! ఈతఁ డొక కుమారసంభవకావ్యమును రచించెనఁట ! కాని యది నేడు కానరాదు. కొందఱాతఁడు కుమార సంభవ కావ్యమును ప్రత్యేకముగా వ్రాయలేదనియు నలంకారములకు లక్ష్యముగాఁ గుమారసంభవైకదేశమును మాత్రమే రచించెననియు భావించుచున్నారు. ఈ విషయము వివరముగా కీ. శే. శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిలుగారి "కుమారసంభవ విమర్శనము"న వ్రాయబడినది.

నన్నెచోడుఁడు వచించిన యుద్భట కుమారసంభవము నామ మాత్రావశిష్టము. నన్నెచోడుఁ డుద్భటుఁడు పూర్తిగాఁ గుమారసంభవము వ్రాసినట్లు చెప్పలేదనియుఁ గుమారసంభవైకదేశమును మాత్రమే యలం కారముల కుదాహరణముగా రచించెనని చెప్పెననియు శ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు భావించినారు. కుమారసంభవైకదేశము నేఁడు మనకు లభ్యమగుచున్నది.

ఉద్భటుఁడు రచించిన యలంకారగ్రంథము కావ్యాలంకార సంగ్ర హము. ఉద్భటుఁ డలంకార ప్రాధాన్యవాది. ఆతఁడు పేర్కొన్న అలం కారములు నలువది యొక్కటి. వాని లక్ష్యశ్లోకములందు కుమారసంభవ కథనుగూర్చినాఁ డీమహాకవి. పార్వతీతపశ్చర్యయు బ్రహ్మచారి యాగమ నమును నుద్భటుని యీ కుమారసంభవైకదేశమున వర్ణితమైన కథా భాగము. ఇతివృత్తమున దీనికిని కాళిదాస కుమారసంభవమునకును గొంత భేదము గలదు. కాళిదాసు కుమారసంభవమ్మున శివుఁడు పార్వతీ విరహ ముచే బాధపడినట్లు లేదు. ఉద్భటుఁడు శివునకు విరహమును వర్ణించి నాఁడు. అట్లే యీ సందర్భమున నుద్భటుఁడు 20 శ్లోకములతో శరదృతు వును వర్ణించినాఁడు. ఇదియును కాళిదాస కుమారసంభవమున లేదు.

ఉద్భటుని పోలికలు కొన్ని మన నన్నెచోడ మహాకవి కుమార సంభవమునఁ గానవచ్చుచున్నవి. వాని నీక్రింద నిచ్చుచున్నాను.

(1) ఉద్భటుని కావ్యాలంకార సంగ్రహమున నలువదియొక్క యలంకారములు చెప్పఁబడిన ట్లింతకుముందే వచించినాను. ఉద్భటుని యలంకారగ్రంథమును మన రాజకవి యెఱిఁగియే యున్నాఁ డనుట కాతని పద్యమే నిదర్శనము. కావున నీ విషయమున వీరి కేదయిన సామ్యము గలదేమో విచారింపవలెను.

నన్నెచోడుఁడు తన కావ్యము నలంకారములతో నలంకరింతునని స్పష్టముగాఁ జెప్పినాఁడు.

(i) "దేశిమార్గమ్ముల దేశీయములుగా న
    లంకారములఁ దా నలంకరింప" (1-36)

(ii) "చతురోక్తుల నుతపద బహు
    గతుల నలంకార భావకాంతి రసార్థో
    న్నతిగతి నతి రసికుల వర
    సతిగతి నెఱిఁగింపవలదె సౌభాగ్యమునన్?" (1-39)

ఇంతేగాదు చోడరాజీ యలంకారముల కొక సంఖ్యనుగూడ వచించి నాఁడు. అవి ముప్పదియారట.

"దశప్రాణంబుల సప్రాణంబై నవసరభావరితంబై
షట్త్రింశ దలంకారాలంకృతంబై రమణీయంబైన." (1-45)

ఈ సంఖ్య (36) ఉద్భటుని యలంకారసంఖ్యకేమయిన దగ్గఱగా నున్నదా ? చూడవలెను. స్థూలముగాఁ జూచినచోఁ బోలిక లేనట్లే తోఁచును. కాని నిదానముగాఁ బరిశీలించినచోఁ బోలిక యున్నట్లు తేలును.

ఉద్భటుఁడు పేర్కొన్న యలంకారముల సంఖ్య నలువది యొక్కటి గదా ! అందు మూఁడు శబ్దాలంకారములు గలవు. అవి ఛేకాను ప్రాసము, అనుప్రాసము, లాటానుప్రాసములు. ఇవి మూఁడు పోఁగా

మిగిలినవి ముప్పది యెనిమిది. వీనియందును మరి రెండు తగ్గవలసి యున్నది. అవి సంకరము, సంసృష్టి. ఇవి రెండును బ్రత్యేకాలంకారములు గావు. కావున నిట్లుద్భటుఁడు చెప్పినవానిలో శబ్దాలంకారములు, (3) సంసృష్టి సంకరములు (2) తీసివేసినచో మిగిలిన యర్థాలంకారములు ముప్పదియాతే. ఇది నన్నెచోడుని యలంకార సంఖ్యకు సరిపోవు చున్నది. ఇది యీ యిద్దఱిలోని యొక పోలిక.

శబ్దాలంకారముల వేరుచేసి యర్థాలంకారముల మాత్రమే పరిగణించు నాచారము నన్నెచోడ మహాకవి కాలమున నుండెననుట కాధారమును గలదు. ఈ చోడరాజునకుఁ గొంచెము తరువాతి కాలమున జీవించిన విన్నకోట పెద్దన తన కావ్యాలంకార సంగ్రహమునందు శబ్దాలంకారములను వదలి యర్థాలంకారములను నన్నెచోడ మహాకవి వలెనే ముప్పది యాఱని వచించినాఁడు.

2. ఇక నన్నెచోడ కుమారసంభవమునఁ గనిపించు మఱియొక యుద్భటానుసరణము శివుని విరహము. ఇది కాళిదాసీయమున లేదని యీవఱకే చెప్పఁబడినది. శివపురాణమునందును శివునకు విరహావస్థ వర్ణితము కాలేదు. అందు శివుఁడు తనకు వివాహేచ్ఛ లేదనియు, అయినను దేవహితార్థము గిరిజను వివాహమాడెద ననియు దేవతలకుఁ జెప్పినాఁడు. ఈ క్రింది శ్లోకముఁ జూడుఁడు:

"నాస్తి యద్యపి మే కశ్చి ద్వివాహకరణే రుచిః
వివాహయిష్యే గిరిజాం పుత్రోత్పాదనహేతవే."
(పా. ఖం. 24అ-75 శ్లో.)

తరువాత పార్వతి తపోమహిమచే విస్మితుఁడై యామెను వివాహ మాడుటకు శివుఁడు నిశ్చయించినట్లు శివపురాణము వచించుచున్నది.

"గిరిజా హి తదా తాత తతాప పరమం తపః
తపసా తేన రుద్రోఽపి పరం విస్మయ మాగతః
సమాధే శ్చలిత స్సోఽభూ ద్భక్తాధీనోఽపి నాన్యథా." (పా. ఖం. 25 అ.)

అయినను నాతనికిఁ బార్వతియెడ సహజానురక్తి యున్నట్లు శివ పురాణమునందలి ఈ క్రింది వాక్యము సూచించుచున్నది :

"పరీక్షా ఛద్మనా శంభు ర్ద్రిష్టుం తాం తుష్టమానసః
జాటిలం రూప మాస్థాయ స యయౌ పార్వతీవనమ్".

(పా. ఖం. 26 అ.)

శివుఁ డామెను పరీక్షా వ్యాజమునఁజూడ నరిగెనట! అనురాగము లేనిదే ఇది యెట్లు పొసఁగును ?

నన్నెచోడుఁడు శివుని విరహమును బహు మనోహరముగా నాలు పద్యములలో వర్ణించినాఁడు.

శివుఁడు పార్వతి తపస్సుచే నాకర్షింపఁబడి "కంతు లతాంతాస్త్రహతాంతరంగుండై" తన పూర్వ కృత్యమును దలంచి "యాత్మచింత విడిచి విరహచింతఁ దగిలినాఁ"డఁట! అంత నాతనికి పార్వతీ రూపమే యహోరాత్రములు సాన్నిధ్యమై వర్తింపఁ జొచ్చినదఁట! అంతే గాదు. ప్రకృతి యంతయు శివునకుఁ బార్వతిగాఁ గనుపట్టినదఁట! ఇంకే మున్నది! ఈ యదనుఁ జూచి మన్మథుఁడు తన పగ దీర్చుకొనఁ గడఁగినాఁడు. పాపము! విరహానలము చల్లాఱుటకుఁ బార్వతీ సరోవరము దక్క మార్గాంతరము లేదనుకొన్నాఁడు శివుఁడు. ఆతని హృదయమునం బార్వతి రూపము నచ్చొత్తించినాఁడు మన్మథుఁడు. ఇట్లు శివుఁడు విరహార్తి నొగులుచుండగాఁ బార్వతి తపశ్శక్తి యాతని నాకర్షింపఁ దొడఁగినది. బ్రహ్మచారియయి యాతఁడు పార్వతి తపోవనమునకు బయలు దేఱినాడు.

ఈ విరహావస్థాకల్పనము నిక్కముగా నుద్భటానుకరణమే. అయినను నౌచిత్యమునకు భంగము లేనంతవఱకే చోడుఁ డెవ్వరినయిన ననుకరించునని ఇదివఱకే చెప్పఁబడినది.

ఉద్భట కుమారసంభవమున శివుఁడు విరహావస్థ ననుభవించుచుఁ బార్వతి తన విరహమును భరింపలేక చనిపోయియుండదు గదా! యని యనుకొన్నాఁడని చెప్పఁబడినది. ఈ క్రింది శివవచనముఁ జూడుఁడు:

"చండాల కల్పే కందర్పం ప్లుష్ట్వా మయి తిరోహితే
సంజాతాతుల నైరాశ్యా కిం సా శోకాన్మృతా భవేత్" (కావ్యా.సం.)

ఇట్టి యమంగళభావము, అంతేకాదు శివుని సర్వజ్ఞత్వమునకు లోటుదెచ్చునట్టిది, నన్నెచోడుని కుమారసంభవమున గ్రహింపఁబడునా? అతఁడా భావమునే గ్రహింపలేదు. శివుఁడు తన్ను చండాలునితోను మన కుమారసంభవమునఁ బోల్చుకొనలేదు. అతఁ డుదాత్తమూర్తి, మహాపురుషుఁడు. అట్టియవస్థయందును ననపోహమగు దృష్టికలవాఁడే. ఈ విషయమును గవిరాజెంత సమంజసముగా వర్ణించినాఁడో యీ క్రింది పద్యమును జూచిన స్పష్టమగును.

"హరునకుఁ జూడఁగా మహిఁజరాచరరూపములెల్ల సమ్మతిన్
గిరిసుతరూపమై విరహఖేదముఁ జెప్పఁదొడంగునట్లు కా
కరయగ నాదిశక్తి సచరాచరరూపము కావునన్ మహా
పురుషులకన్న కాన్కి యనపోహమకావు డిదేమిచోద్యమో?"

3. నన్నెచోడ మహాకవి గ్రంథమునఁ గనిపించు మూడవయుద్భటానుసరణము పార్వతి తపోవర్ణనసమయమునందలి శరదృతువర్ణనము. కాళిదాసీయమున నీ సందర్భమునందలి ఋతువర్ణనమింత దీర్ఘముగాదు. కాళిదాసు చెప్పిన ఋతువులైనను మూఁడు మాత్రమే. శివపురాణమునందును మూఁడు ఋతువులే సంగ్రహముగా నీ సందర్భమున జెప్పఁబడినవి.

నన్నెచోడుని కుమారసంభవమునందీ సందర్భమున నారు ఋతువులును వర్ణితములయినవి. అయినను దీర్ఘముగా వర్ణితములైన ఋతువులు మూఁడే. అవి వర్షా శర ద్గ్రీష్మములు. శరత్తునకు కాళిదా

ష్యమునఁగాని, శివపురాణమునఁగాని ప్రసక్తిలేదు. కావున నిది నిశ్చయముగా నుద్భటానుకరణమేయని చెప్పవచ్చును.

అయినను చోడుఁడు దీనిలో మక్కీ మక్కీగా నుద్భటశ్లోకముల ననువదించిపెట్టలేదు. ఇందు భారవి యనుకరణములు ననువాదములు గలవని భారవినిగూర్చిన ప్రకరణమున వచించినాను. అట్లే కాదంబరి యనుకరణములును గలవని చెప్పుట జరిగినది. అయినను శరద్వర్ణనమున నుద్భటునిభావములు కొన్ని లేకపోలేదు. కాని యనువాద పద్యములు మాత్రము లేవు. భావమును బూర్తిగా మక్కీకి మక్కీగైకొన్నవియును లేవు.

నన్నెచోడుఁ డుద్భటుని భావమును దీసికొని తాను దానిని పరిపుష్టమొనర్చిన పట్టు లిందుగలవు.

ఈ క్రింది యుద్భట శ్లోకపాదములుచూచి నన్నెచోడుని పద్యమును చూచినచోఁ జోడుఁ డుద్భటుని భావము నెట్లు గ్రహించి పరిపుష్టమొనర్చెనో తెలియదు.

. "కాశాః కాశా ఇవాభాన్తి, సరాంసీవ సరాంసి చ
చేతస్యాచిక్షిపు ర్యానాం నిమ్నగా ఇవ నిమ్నగాః."

"కాంతల హారప్రకాశమ్ముతోడన
కాశ ప్రకాశ వికాస మెసఁగె
మడతుల తిన్నని నడుపులతోనన
నయమున రాయంచ నడపు లడరె
పొలతుల కనుగవ పొలపంబుతోడన
నలిఁ జకోరంబుల పొలప మెలసె
వెలఁదుల ముఖకాంతి వెలుఁగుటతోడన
విమలమై శశికాంతి వెలుగు డమరెఁ

దెఱవ లెదలఁ గలకఁదేఱట తోడన
యేఱులందుఁ గలకఁదేఱఁదొడఁగె
మదనవతుల మద సముదయంబుతోడన
పంబి శారదోదయంబు దనరె." (6-115)

"చేతస్యాచిక్షిపు ర్యూనా" మ్మని యుద్భటుఁడు వాచ్యముగాఁ జెప్పగా నాభావమునే మన కవిరాజు తన సీసముచే ధ్వనితమొనర్చినాఁడు.

"నేత్రైరి వోత్పలైః, పద్మైః ముఖైరివ, సరశ్శ్రియః
తరుణ్య ఇవ భాన్తిస్మ, చక్రవాకైః స్తనైరివ." (1 సర్గ. 40 శ్లో)

ఉద్భటుని పై శ్లోకభావమును మన కవిరాజు శరవణ సరోవర్ణనమునందు పొదిగిన విధానమును జూడుఁడు :

"లోలాంబుజాలముల్ నీలాలకములుగా
బాలమృణాలముల్ కేలు గాఁగ
దళితాంబుజాతంబు తెలిమోముగా నుత్ప
లములు విశాల నేత్రములు గాగ
జక్కవకవ నిండు చనుగవఁగాఁ బులి
నస్థల మురు జఘనంబు గాఁగ
మొలచు లేఁదరఁగలు ముత్తరంగలు గాఁగ
శోభిల్లు సుడి నిమ్ననాభి గాఁగ
నబ్జ వనలక్ష్మి శంభువీర్యమునఁ గొడుకుఁ
బడసి దివిజుల కీఁబూని పావకునకు
నొలసి తన రూపు చూపున బ్లొప్పుఁదోఁచె
శ్రీకరంబగు నా కమలాకరంబు." (10-29)

"నేత్రైరివోత్పలైః" "సరశ్శ్రియః" అను పై శ్లోకభావమునే గ్రహించి మఱియొకచోట (శరత్కాల వర్ణనమున) నెంత చక్కని పద్యమును గల్పించినాఁడో పరికింపుఁడు.

"జలవాసులైన హరి ల
క్ష్మలు వర్షనిశావసానమున మేల్కని క
న్నులు విచ్చి చూచినట్టులు
జలజోత్పలరుచులు వెలసె శారదవేళన్". (6-113)

ఈ విధముగా మఱికొన్నింటిని సైతము చూపవచ్చును. మొత్తము మీఁదఁ దేలిన సారాంశ మేమనఁగా నన్నెచోడ మహాకవి తన గ్రంథ రచనముకు మార్గదర్శకులయినవారిలో నుద్భటునిగూడ గ్రహించి యాతని ననుసరించి యాతనిఁ గృత్యాదిని గృతజ్ఞతా సూచనముగఁ స్తుతించె ననుటయే.

## నన్నెచోడునిపై వాల్మీకి ప్రభావము

నన్నెచోడుఁడు కుమారసంభవ కావ్యాదిని వాల్మీకి మహాకవి నీ క్రింది విధముగా స్తుతించెను :

"కవితామృతోదయాంబుధిఁ గవితాసజ్జనకు వస్తుకావ్యాబ్జరవిన్
కవితారంభంబుల సత్కవు లభినందింతు రాదికవి వాల్మీకున్" (1-17)

పై పద్యమును బట్టి నన్నెచోడ మహాకవి వచించిన వస్తు కవితా సంప్రదాయమున కాద్యుఁడు వాల్మీకి మహాకవియని తేలినది. అనఁగా వాల్మీకి ప్రారంభించిన ఈ సంప్రదాయమునే తా ననుసరించితినని చెప్పుట చేతఁ జోడునకు వాల్మీకి మహాకవి యెడ నమిత గౌరవభావము గలదని తేలుచున్నది. "సత్కవు లభినందింతు రాదికవి వాల్మీకున్" అను పై పద్యభాగము నన్నయభట్టారకుని వాల్మీకి స్తవమును జ్ఞాపకముఁ జేయుచుఁ జోడ మహాకవి కా పద్యముతోఁ బరిచయము గలదని సూచించుచున్నది. నన్నయ వాల్మీకిని గూర్చి

"....దుర్భర తపోవిభవాధికున్ గురు పద్యవిద్యకు నాద్యు నం
బురుహగర్భ నిభుం బ్రచేతసుపుత్త్రు భక్తిఁ దలంచుచున్"

అని ఆంధ్రభారత కవితారంభమున స్తుతించినాఁడు. కావునఁ జోడుని యభిప్రాయమున నన్నయభట్టు సత్కవియే యగుననుట నిశ్చితముగదా! ఇఁక నన్నెచోడ మహాకవి వాల్మీకిని దనగ్రంథమునం దేమయిన ననుకరించెనేమో చూతము.

అందుఁ బ్రథమమునఁ జెప్పఁదగినది వస్తుకవితా విషయము. దీనియందు వాల్మీకిని చోడుఁ డనుసరించియుండుట నాతఁడే స్పష్టముగా వచించినాఁడు కదా! ఇఁకఁ గడమ విషయములఁ జూతము.

నన్నెచోడ మహాకవి తన కావ్యమునఁ గైకొనిన యితివృత్తమునకు మూలము ముఖ్యముగా శివపురాణమునఁ గలదని పండితు లంగీకరించియే యున్నారు. కాని కథా విషయమున నీ రెంటియందును గొన్ని భేదములు గలవు. అంతేగాదు పురాణములలో నెక్కడను గానరాని రెండు విషయముల నీతఁడు తన కుమారసంభవ కథలోఁ జేర్చినాఁడు. అందొక్కటి గణపతి జన్మమునుగూర్చినది. రెండవది శరవణ సరోవరమును గూర్చినది. వీని విషయముఁ బ్రస్తావించి శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు కుమారసంభవ ప్రథమభాగ పీఠికయందు "ఈ మార్పులీ కవి చేసినవే యని యూహించెదను. ఎట్లైన నివి మనోహరములే" యని వచించినారు. ఇది 1909 నాటి మాట. తరువాత చోడుని "గణపతి జన్మకథ" కు మూలము ప్రాచీన తమిళ వాఙ్మయము నందును, శైవాగమ గ్రంథములందును గలదని శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు వచించినారు. (చూ. యూని. ప్రతి: అనుబంధము 61 వ పుట) ఆగమముల ప్రాచీనతను గూర్చి సందేహము కలవా రగుటచేత నేమో? వారా యాగమము పేరు నుదాహరింపలేదు. శ్రీ నిడదవోలు వేంకటరావుగా రది "సుప్రభేదాగమ"మని తమ కవుల చరిత్రయందు వచించి శ్లోకముల నందుండి యుదాహరించినారు. దీనినిబట్టి శ్రీ కవిగారు చెప్పినదానియందుఁ బూర్వార్థము మాఱిపోవలసి వచ్చినది. అనఁగా గణాధిప జన్మ

కథను చోడుఁడు తానై కల్పించినవాఁడు కాఁడనియుఁ బూర్వ గ్రంథముల నున్నదానిని గ్రహించి మాత్రమే వర్ణించినవాఁడనియు ననుట.

ఇఁక రెండవది శరవణ సరోవర విషయము. శివపురాణమున దీని ప్రశంస లేదు. కావున నిది చోడుని కల్పన మయిన నయి యుండ వలెను. లేదా మఱి యెక్కడనుండియైన గ్రహించి యుండవలెను. శ్రీమద్రామాయణ బాలకాండమునందుఁ గుమారసంభవ కథ గలదు. దానిని విశ్వామిత్రుఁడు రామునకుఁ జెప్పెనట. అందు శివుఁడు దేవతలను దన వీర్యమును భరించువా రెవ్వరో చెప్పుఁడనగా వారు "యత్తేజః క్షుభితం హ్యేత త్తద్ధరా ధారయిష్యతి" యని చెప్పిరఁట. ఆ సందర్భ మున నీ క్రింది శ్లోకములు గలవు.

"ఏవముక్త స్సురపతిః ప్రముమోచ మహీతలే
తేజసా పృథివీ యేన వ్యాప్తా సగిరికాననా
తతో దేవాః పునరిద మూచుశ్చాథ హుతాశనమ్
'ప్రవిశ త్వం మహాతేజా రౌద్రం వాయు సమన్వితః'
తదగ్నినా పునర్వ్యాప్తం సంజాత శ్శ్వేతపర్వతః
దివ్యం శరవణం చైవ పావకాదిత్యసన్నిభం
యత్ర జాతో మహాతేజాః కార్తికేయోఽగ్నిసంభవః"

(బాల. 36 సర్గ.)

పై రామాయణ శ్లోకములందుఁ జివరి రెండు పాదములఁ జూచి నచో నన్నెచోడుని శరవణ సరోవర విషయమునకు మూలము శ్రీమద్రామాయణమే యని తెలియఁగలదు. అయినను రామాయణమున నది సరోవరమని స్పష్టముగా లేదు. కుమారసంభవమున స్పష్టముగా శరవణము సరోవరమే యనియు దానికి సర్వమును భరించుశక్తి వరము వలన లభించినదనియు వచింపఁబడినది. ఈవర మెక్కడిదో తెలియదు.

ఈ శరవణ సరోవరము స్త్రీ వలె నున్నదని కవిరాజొక్క సీస ముచే వర్ణించినాఁడు (10-29). శ్రీమద్రామాయణ కిష్కింధాకాండమునఁ బ్రస్రవణ పర్వతముమీఁది నదిని వాల్మీకి

"పులినై రతిరమ్యైశ్చ హంససారససేవితైః
ప్రహసన్తీవ భాత్యేషా నారీ సర్వవిభూషితా"
(కిష్కి. 27 స. 21 శ్లో.)

అని వర్ణించినాఁడు. కవిరాజు దీని నాధారముగాఁ గొనియే శరవణ సరసిని స్త్రీగా నుత్ప్రేక్షించి యుండవచ్చును.

కవిరాజు వర్షర్తు వర్ణనమునఁ బచ్చిక లేచినప్పటి భూమి కంబళిఁ గప్పుకొన్నదా యనున ట్లున్నదని వర్ణించెను (చూ. 6-100). దీనికి వాల్మీకి ఈ క్రింది శ్లోకము మూలముగా నున్నది.

"బాలేంద్రగోపాంతరచిత్రితేన విభాతి భూమి ర్నవశాద్వలేన
గాత్రానువృత్తేన శుకప్రభేణ నారీవ లాక్షోక్షిత కంబలేన"
(కిష్కి. 28 స. 24 శ్లో.)

ఇంతేకాక నన్నెచోడుని ఋతువర్ణనమునందలి యనేక విషయములు వాల్మీకి రామాయణమునఁ గలవు.

ఈ యుదాహరణములు వాల్మీకిని చోడుఁ డనుసరించిన విధమునకు మచ్చులు మాత్రమే. దీనినిబట్టి చోడునకు వాల్మీకియెడ భక్తి గలదనుట స్పష్టము.

## నన్నెచోడునిపై వ్యాసుని ప్రభావము

### శివపురాణ కుమారసంభవముల సంబంధము

నన్నెచోడ మహాకవి కృత్యాదియందు వ్యాసు నీ క్రిందివిధముగా స్తుతించెను.

"వేదాంత భారత పురా
ణాదులు సేయు డొక పేర్మియని చనఁ బొగడం
గా దెడద నజుఁడు నోపని
వేదము లేర్పఱచెనని వేదవ్యాసున్"

బ్రహ్మదేవునకైనను సాధ్యముకాని వేదవిభాగముఁ గావించి వ్యాసుఁడు పేరొందినవాఁ డనియు నాతఁడు వేదాంతభారత పురాణాదులు రచించినవాఁ డనియుఁ బై పద్యభావము.

## కుమారసంభవ కథ

వ్యాసుఁడు రచించిన యష్టాదశ పురాణములలో శివపురాణ మొక్కటి. ఇందుఁ గుమారసంభవ కథ విపులముగా వర్ణింపఁబడినది. శివపురాణమునందలి యేడు సంహితలలో రెండవది రుద్రసంహిత. దీనియందు మఱల నైదు ఖండములుగలవు. (1) సృష్టి ఖండము (2) సతీ ఖండము (3) పార్వతీ ఖండము (4) కుమార ఖండము (5) యుద్ధ ఖండము. ఈ యయిదు ఖండములందు వర్ణింపఁబడిన శివపురాణకథయే నన్నెచోడుని కుమారసంభవ కథకు మూలమని యీ రెండుకథల విధానమును జూచిన స్పష్టమగును. ఇట్లు కుమారసంభవ కథకు మూలము శివపురాణమే యయ్యును చోడుఁడు దానిని మక్కికి మక్కిగా గ్రహించినవాఁడుకాఁడు. దానిని కావ్యానుకూలముగా మార్చు కొనుటయే కాక కొన్ని యితర గ్రంథములలోని విషయములను నైత మందుఁ జేర్చినాఁడు. కుమారసంభవములోని గణపతి జన్మకథకు మూలము సుప్రభేదాగమమునను బ్రాచీన తమిళ వాఙ్మయమునందును గలదని యిదివరకే చెప్పఁబడినదిగదా! శరవణ సరోవర విషయము శ్రీమద్రామాయణమునుండి గైకొనఁబడినదనియు నిదివరకే వచించితిని గదా! ఇవి చోడుఁ డితర గ్రంథములనుండి గ్రహించిన కథా విషయ మున కుదాహరణములు.

ఇఁకఁ దాను స్వయముగాఁ గల్పించినవియును గొన్నిలేకపోలేదు. అట్టివానిలో రతి మన్మథుని వారించిన విషయమొక్కటి. చతుర్థాశ్వాసము నందు కవి వర్ణించిన రతీమన్మథ సంభాషణమునకు మూలము శివపురా ణమునఁగాని కాళిదాసు కుమారసంభవమునఁగాని లేదు. దీనిని చోడుఁడే

స్వయముగాఁ గల్పించినవాఁ డనవచ్చును. కాళిదాసీయమునందు "రత్యాద్వితీయః శంకరంమనుప్రయాతః" అను వాక్యమున రతీదేవి యనుమానము సూచితమయినది. ఇదియే చోడరాజు కల్పనకు హేతువు కావచ్చును. ఏమయినను చోడుని యీ కల్పనము దంపతులలోని సంభాషణము నిసర్గముగాఁ జిత్రించి మించినదనుటకు సందేహములేదు. ఈ సంభాషణమును కల్పించుటచేత నన్నెచోడకవి రతీపాత్రమునకుఁ గాళిదాస కుమారసంభవమునందు గాని, శివపురాణమునందుఁగాని లేని నూతన శోభ చేకూరినది.

శివపురాణకథను చోడుఁడు మార్పులుచేసి గ్రహించిన యింకొక పట్టు దక్షాధ్వర ధ్వంసము. వీనిలోని భేదములు "నన్నెచోడుఁడు-వీర శైవము" అను ప్రకరణమునఁ జూపినాను. చోడుని యీ మార్పునకు హేతువేమో తెలియరాదు. ఇదియు నే యాగమములందైనఁ గలదేమో? పరిశీలింపవలయును.

కథా విషయమునఁ జోడుఁ డనేకములగు మార్పులు చేసినట్లు శివపురాణ కుమారసంభవ కథలను బోల్చిచూచినచోఁ దెలియఁగలదు. పురాణకథను యథాతథముగాఁ గావ్యమునఁ జేర్చుకొనరామి నిట్టి మార్పు లవసర మయ్యెనని యెంచనగును. ఈ మార్పు లన్నియు హృద్యములై రసపోషణమునకుఁ దోడ్పడినవనుట నిర్వివాదాంశము.

## ఇతర విషయములు

కుమారసంభవమున సూచించిన కొన్ని విషయములకు శివపురాణమే మూలముగాఁ గనుపట్టుచున్నదను విషయము నీ క్రింది యుదాహరణములచే గ్రహింపనగును.

(1) చతుర్థాశ్వాసమునందలి రతీమన్మథుల సంవాదమున మన్మథుఁడీ క్రింది వచనమును రతితో ననెను :

"అరయఁగా స్త్రీ పురుషాకారములై చిత్తవృత్తిగలిగినఁ జాలున్
వారెల్లఁ గామవశులగువారని నియమించి నాకు వర మజుఁడొసఁగెన్"
(4-81)

పై పద్యమున బ్రహ్మ మన్మథునకు వరమిచ్చిన విషయము చెప్పఁబడినది. దీని గూర్చిన కథ శివపురాణమున సతీఖండమందలి ద్వితీయాధ్యాయమునఁగలదు.

బ్రహ్మ దక్షప్రముఖులగు ప్రజాపతులను సృష్టించిన పిదప నాతని మనస్సునుండి సంధ్యయను సుందరాంగి జన్మించెనట. ఆమెను గూర్చి బ్రహ్మాదులు చింతించుచుండఁగనే బ్రహ్మమనస్సున మన్మథుఁడు జనించి ముందు నిలిచి తానేమి చేయవలెనో యానతినిమ్మని బ్రహ్మ నడిగెనఁట. అప్పుడు బ్రహ్మ యాతనితో నీ క్రింది విధముగాఁ బలికెనఁట:

"అనేన త్వం స్వరూపేణ పుష్పబాణైశ్చ పంచభిః
మోహయన్ పురుషాన్ స్త్రీంశ్చ కురు సృష్టిం సనాతనీం
అస్మిన్ జీవాశ్చ దేవాద్యా స్త్రైలోక్యే సచరాచరే
ఏతే సర్వే భవిష్యంతి న క్షమా స్తవ లంఘనే
అహం వా వాసుదేవో వా స్థాణుర్వా పురుషోత్తమః
భవిష్యామ స్తవ వశే కిమన్యే ప్రాణధారకాః ?"

చోడుఁడు శివపురాణమునందలి బ్రహ్మవాక్కులనే మన్మథునిచే రతికిఁ జెప్పించెననుట స్పష్టముగానే కనుపట్టుచున్నదిగదా !

(2) గంగావతరణమునఁ దపమునకై శివుఁడు వచ్చెనని యెఱింగి హిమవంతుఁ డాతనికడకువచ్చిన సందర్భమును కవిరాజ్ క్రిందివిధముగా రచించెను.

"....చనుదెంచి పరమేశ్వరునింగని ముహుర్ముహుర్మహీతలాలంకృత సర్వాంగుండై నిజదేహాది సమస్తరాజ్యవిభవంబులు నీశ్వరు శ్రీపాదంబులకు నివేదించి

వినుతించుచున్న గిరిపతిఁ గని గిరిశుఁడు సన్మనమునఁ గారుణ్యాలో
కన వార్ధి సుధారసవారి నిమగ్నునిజేసి సురవరేణ్యుని జేసెన్."

(3 ఆ. 97-98)

పై కుమారసంభవ వాక్యములందు హిమవంతుఁడు శివుని వినుతించుచున్నట్లు చెప్పఁబడినది. కాని యందు హిమవంతుని శివస్తుతి వర్ణింపఁబడలేదు. కాళిదాసీయ కుమారసంభవమునను నిక్కడ హిమవంతుఁడు శివుని స్తుతించినట్లు చెప్పఁబడలేదు. అందు శివుని తపోవర్ణనము తరువాత

"అనర్ఘ్య మర్ఘ్యేణ తమద్రినాథః స్వర్గౌకసా మర్చిత మర్చయిత్వా
ఆరాధనాయాస్య సఖీసమేతాం సమాదిదేశ ప్రయతాం తనూజామ్."

(1 స. 58)

అని మాత్రమే సంగ్రహముగా హిమవంతుఁడు పార్వతిని శివపరిచర్యకు నియమించిన విధము వర్ణింపఁబడినది.

శివపురాణ పార్వతీఖండమం దేకాదశాధ్యాయమున నట్లుగాక యీ సందర్భమున హిమవంతుఁడు శివుని పన్నెండుశ్లోకములచే స్తుతించినట్లు చెప్పఁబడినది (11 అ. 12-23 శ్లోకములు). కుమారసంభవమున చోడుఁడు సూచించిన దీశివపురాణములోని శివస్తుతినే యని నిశ్చయముగాఁ జెప్పవచ్చును గదా!

(3) దక్షాధ్వరమునఁ బార్వతి దక్షునికి శివుని మాహాత్మ్యము నెఱింగించుటకు బ్రహ్మవిష్ణువులు శివలింగముయొక్క ఆద్యంతముల నెఱుంగనేరని విషయమును వచించినది (2-30). ఈ కథయు శివపురాణముననే విద్యేశ్వరసంహితయం దేడవ యధ్యాయమున వర్ణింపఁబడినది.

శివపురాణమునుండి కథను, కొన్ని కథల విషయములనుమాత్రమే గాక నన్నెచోడ మహాకవి కొన్నిభావములను సైతము గ్రహించినాఁడు.

(1) చతుర్థాశ్వాసమునఁ దారకాసుర బాధలను వర్ణించుచుఁ గవి రాజు "గరుడోరగామర తరుణుల నందఱఁ జేకొని తన విలాసినులఁ జేసె" నని వర్ణించినాఁడు. ఇట్టిభావము కాళిదాస కుమారసంభవమునలేదు. శివపురాణమున "యావత్యో వనితా స్సర్వే యేచాప్యప్సరసాంగణాః। సర్వాస్తాశ్చాగ్రహీద్దైత్య స్తారకో ఽసౌ మహాబలీ" యని గలదు. కవిరాజు భావమునకు మూలము శివపురాణమే యనుట స్పష్టము.

(2) పంచమాశ్వాసమునందలి రతీవిలాపమున నరణ్యమునందలి చెట్లుకూడ రతితోఁగూడి శోకించినట్లు వర్ణింపఁబడినది. (82, 83 ప) కాళిదాస కుమారసంభవమున నిది లేదు. శివపురాణమున "అభవన్ దుఃఖితా స్సర్వే స్థావరా అపి నారద" అని చెప్పఁబడినది.

పంచమాశ్వాసమునందలి పార్వతీ విరహ వర్ణనమునకును మూలము శివపురాణముననే గలదు. కాళిదాసీయమునఁ బార్వతి విరహ వర్ణనము లేదు. శివపురాణ పార్వతీఖండమందు 21 అధ్యాయమున నది గలదు. (చూ. 8 శ్లో. నుండి)

మేనకా హిమవంతులు శక్త్యారాధనచేసి పార్వతిని సుతగాఁ బడిసిరని చోడకవి కుమారసంభవ తృతీయాశ్వాసమున వర్ణింపఁబడినది. దీనికిని మూలము శివపురాణమే. (చూ. శి. పు. పా. ఖం. 5. అధ్యా.)

ఈ విధముగా మఱికొన్నింటిని నైతము చూపవచ్చును. కాని గ్రంథవిస్తర భీతిచే నీ ప్రకరణము నింతతో ముగించుచున్నాను.

## తెలుఁగున శతకవాఙ్మయ ప్రారంభము నన్నెచోడునితోనే

### (దారిద్ర్య విద్రావణ దశకము)

నన్నెచోడ మహాకవి కుమారసంభవ దశమాశ్వాసమున "దారిద్ర్య విద్రావణా!" యను మకుటముతోఁ బది పద్యములు వరుసగా నింద్రుఁడు

శివుని స్తుతించినట్లు రచించెను. ఇందలి విషయము శివుని మాహాత్మ్యము. ఈ పద్య దశకము శతక వాఙ్మయశాఖకుఁ జెందినదా ? కాదా ? యను విషయమే మనకుఁ బ్రస్తుతము విచారింపఁదగినది.

ఆంధ్ర వాఙ్మయమునందు ముఖ్యములగు శాఖలలో శతక వాఙ్మయ మొక్కటి. శతకమనునది నూఱు పద్యముల సమూహము నకు వాచకమయిన నూటికిమించి రచించినవానినిసైతము మనము శతకమనియే వ్యవహరించుచున్నాము. శ్రీ వంగూరు సుబ్బారావుగారు శత సహస్ర సంఖ్యలకుఁగల ప్రాముఖ్యమును దమ శతక కవుల చరిత్ర పీఠికయందు విపులముగా వివరించినారు. జపతపాదులందు శతసహస్ర సంఖ్యలకుఁగల స్థానమును వారు వేదాదులనుండి యుదాహరించి చూపినారు. కావున నా విషయములన్నియు నిక్కడఁ జూపుటకు నేను పూనుకొననుగాని యొక్క విషయమును మాత్ర మిక్కడ వచింతును. జపతపాదులందు శత సహస్ర సంఖ్యలకుఁగల ప్రాముఖ్యము దశ సంఖ్యకును గలదనుటయే యది.

ఏదేని మంత్రమును జపింపవలసినచో వేయిమాఱులో లేక నూట యెనిమిది మాఱులో జపించుట యాచారమని శ్రీ సుబ్బారావుగారు వచించిరి. కావుననే శతకమున నూటయెనిమిది పద్యములో, వేయిపద్యములో యుండుట కానవచ్చుననియు వారనిరి. అది యుచితమయినదే.

కాని శతకవిషయము జపసంఖ్యతో నెట్లు సంబంధించియున్నదో దశకవిషయమునట్లే జపసంఖ్యతో సంబంధించి యున్నదిగదా ! ప్రత్యేక సంఖ్య విధించిన ప్రత్యేకమంత్ర విషయమునఁగాక సామాన్యముగా మంత్రముల విషయమున సహస్రసంఖ్య పెద్దదికాగా దశసంఖ్య చిన్నదిగా మనకు జపహోమాదులలో కానవచ్చుచున్నది. అనగా మంత్రమును వేయిసారులుగాని నూటయెనిమిది సారులుగాని, చివరకు పది పర్యాయములుగాని జపింపవలయుననుట. దశగాయత్రి, అష్టోత్తర (శత) గాయత్రి, సహస్రగాయత్రి అను జపసంఖ్యలు మన కపరిచితములుగావు.

కావుననే సహస్రసంఖ్యాక పద్యముల గుంపు శతకవాఙ్మయమున కెట్లు చెందునో దశకములునట్లే శతకవాఙ్మయమునఁ జేరుట సంభవించినది. అనగా శతకమునకు సంగ్రహరూపముదశకము కాగా విరాడ్రూపము సహస్రకముగా నున్నదనుట. అట్లనుటచే నన్నెచోడుఁడు రచించిన "దారిద్ర్యవిద్రావణ దశకము" ను శతకవాఙ్మయశాఖకుఁ జెందినదే యగును.

కథాసంవిధానమును వర్ణించు శతకములు నున్నను శతకములలో భావప్రధానములే యెక్కువగా నున్నవనుట తఙ్జులెఱింగినదియే. ఈ భావము భక్తిభరితముగాని శృంగారభరితముగాని యగును. దారిద్ర్య విద్రావణదశకమున కథాసంవిధానము లేదు. ఈ పది పద్యములకును భక్తియే బీజము. భావమే ప్రధానము. కావున నీ దారిద్ర్య విద్రావణ దశకము భావప్రధానమయిన భక్తిశతక శాఖకుఁ జెందినదని చెప్ప వచ్చును.

శతకమునకు మకుటము మణికిరీటమువంటిది. ఇది రెండు విధ ములుగాఁ గానవచ్చుచున్నది. అందొక్కటి సంబోధనాత్మకము. రెండ వది విషయసామ్యమును పదసామ్యమును గలది. పుసులూరి సోమకవి "చంద్రదూత" యీ రెండవ కోవకుఁ జెందినది. "ఇందూ నందుని మందనుండికద నీ వేతెంచుటల్ రాకలన్" అనునది చంద్రదూతలోని మకుటము. తెలుఁగు శతకములందు సామాన్యముగా సంబోధనాత్మక మకుటయుతములే యెక్కువ. సంబోధనాత్మకమకుటమే శతక ముఖ్య లక్షణముగాఁ దెలుఁగునఁ బరిగణింపఁబడుటకు వాని విరివియే కారణము. దారిద్ర్య విద్రావణదశకము సంబోధనాత్మక మకుటము గలది. కావున నిది యీ శాఖకుఁ జెందినదే యనుట.

మకుటములోని సంబోధనలందు మఱల రెండు విధములు కాన వగును. అందు మొదటి దొకేయొక సంబోధనముతో మకుటముండుట. రెండవది ఒకటికన్న నెక్కువ సంబోధనము లుండుట. "దాశరథీ!

కరుణాపయోనిధీ." దీనియందు రెండు సంబోధనము లున్నవిగదా! దారిద్ర్య విద్రావణ దశకమునం దొక్క సంబోధనమే గలదు.

ఏకసంబోధనాత్మక శతకములందును మఱల రెండు విధములు కాననగును. శివతత్త్వసారమున సంబోధనపద మొక్కటేకాని యది యన్నిపద్యములందు నొక్కవిధముగానే యుండక మాఱుచుండుట కాననగును. కావుననే యది శతకమా? కాదా? యనుసందేహము కలుగుటయు సంభవించినది. ఆ సంబోధన మన్నింటియందు నొక్క విధముగానే యుండుట మఱియొక్క విధము. ఇట్టివే తెలుఁగు భాషయందలి శతకములన్నియును. దారిద్ర్యవిద్రావణ దశకము నట్టిదియే.

ఈ పై కారణము లన్నింటినిబట్టి దారిద్ర్య విద్రావణ దశకము శతకవాఙ్మయశాఖకుఁ జెందినదని నిశ్చయముగాఁ జెప్పుట కవకాశ మేర్పడుచున్నది. ఇఁక తెలుఁగు శతకములం దిదియే యాద్యమా? కాదా? యను విషయమును విచారింతము.

నేఁటిదనుక తెలుఁగు శతకవాఙ్మయమున మల్లికార్జున పండితారాధ్యుని శివతత్త్వసారము మొట్టమొదటిదిగా భావింపఁబడుచున్నది. శ్రీ వంగూరి సుబ్బారావుగారు వట్లే భావించిరి. కాని తెలుఁగు శతక లక్షణములలో ముఖ్యమయిన నియతమకుటమిందుఁ గానరాదు. అందుచేఁ గొందఱు పాలకురికి సోమనాథుని వృషాధిప శతకమే యాంధ్రములోని మొట్టమొదటి శతకమని భావించుచున్నారు. "బసవా! బసవా! వృషాధిపా!" యనునది వృషాధిప శతకములోని మకుటము. కాని నన్నెచోడుఁడు పాలకురికి సోమనాథుని తరువాతి కాలమువాఁడను వాదము దుర్బలమయినదగుటచేతను, గొన్ని శతకవాఙ్మయ ప్రారంభలక్షణములు నన్నెచోడునియందుఁ గానవచ్చుచుండుటచేతను నన్నెచోడ మహాకవియే శతకవాఙ్మయశాఖ కాంధ్రభాషయందు మొట్టమొదటివాఁడని నిర్ణయింపవలసి యున్నది.

నన్నెచోడుఁడు వీరశైవమతముతోఁ బరిచయములేనివాఁడని నే నిదివఱకే వచించియున్నాను. కావున వీరశైవము బాగుగా వ్యాప్తినందిన తరువాత జన్మించిన సోమనాథుఁడు నన్నెచోడునకు ముందున్నవాఁడనుట యుక్తముకాదు.

సంస్కృత ప్రాకృత భాషలలోని శతకవాఙ్మయ ప్రాదుర్భావ వికాసముల చరిత్రలను సవిమర్శముగాఁ జూచినచో నొక క్రమము గోచరించును. మొదట నవి కథాసందర్భముననుసరించి మధ్యలో స్తోత్ర రూపములుగా నుద్భవించి క్రమక్రమముగా నొక ప్రత్యేక విభాగముగా నేర్పడుటయే యా క్రమము. (చూ. శ్రీ వంగూరి సుబ్బారావుగారి శతకకవుల చరిత్ర పీఠిక) తెలుఁగు వాఙ్మయమునందు నీ క్రమ మిట్లే యున్నదను టను నన్నెచోడుని "దారిద్ర్య విద్రావణ దశకము" నిరూపించి చూపుచున్నది.

నన్నెచోడ మహాకవి తాను శతక వాఙ్మయమునకుఁ బునాదులు వేయుచున్నానని యెఱిఁగినవాఁడు కాఁడు. అంతేగాదు ఆతని నాటికి తెలుఁగు భాషయందు శతకములేర్పడియు నున్నవనుట కాతని గ్రంథమున నాధారములును లేవు. కావుననే యాతఁడు తన పద్య దశకమును "దారిద్ర్య విద్రావణ స్తవము" అనియే వ్యవహరించినాఁడు. (10ఆ.99ప.)

శివతత్త్వసారమే యాంధ్రములోని యాద్య శతక గ్రంథమగుచో నది కందపద్యములందుంటచే పాలకురికి సోమనాథుఁడును గందముల లోనే శతకమును వ్రాయవలసియుండెను. కాని యాతఁడట్లు చేయక వృత్త పద్యములందే తన శతకమును రచించెను. సోమనాథుఁడొక్కఁడే కాదు, శతక వాఙ్మయమునఁ బ్రథమయుగమునకుఁ జెందిన కవులు పలువురు నిట్లే వృత్తములందు నియతమకుటముతోఁ దమ శతకములను రచించినారు. వారి కీ మార్గమును జూపినవాఁడు నన్నెచోడుఁడే యనఁ జెల్లును.

కీ॥ శే॥ శ్రీ మానపల్లి రామకృష్ణకవిగారీ దారిద్ర విద్రావణ దశకమునుగూర్చి తమ కుమారసంభవ ద్వితీయభాగ వివరణమునందు "ఈ పద్య దశకము కవి బాల్యముననో యెప్పుడో తెనిఁగించియుండి తరువాత దీనిలో నెక్కించుకొన్నట్లు తోఁచుచున్నది" అని వచించినారు. కవిగారి భావమే నిజమైనచో నివి పదిమాత్రమేకాక మఱికొన్నియుండ వలయును. బహుశః నూఱువఱకు నవి యొకశతకముగానే వ్రాయఁబడి యుండవచ్చును. కాని యిది యిట్లే జరిగెననుట కూహయొక్కటే యాధారమగుటచే నీ విషయమును వదలివేయుదును.

మఱియొక విషయ మేమనగాఁ గవిగారు వీని నాంధ్రీకరణములుగా వచించుట. ఇవి వేని కాంధ్రీకరణములో వారు వ్రాయలేదు. వీనికి మూలములేవో తెలియవచ్చుటలేదు.

కవిగారీ పద్యములు నన్నెచోడుఁడు బాల్యమున రచించిన ట్లను మానించుటయు నాకు యుక్తముగాఁ దోపదు. కుమారసంభవమునందీ సందర్భమున నింద్రుఁడు కేవలము ఈ పద్యదశకముతోడనేగాక దీనికి ముందు నాగ మురజ బంధములతోడను స్తుతించినట్లు గలదు. దీనినిబట్టి చూడఁగాఁ గవిరాజు దారిద్ర్య విద్రావణదశకమును గుమారసంభవ రచన తోనే వ్రాసియుండుననియు నంతకుముందు వ్రాసి పిదప సందర్భాను కూలముగా గ్రంథములోని కెక్కించియుండఁడనియు నెంచుట యుక్త ముగాఁ దోఁచుచున్నది. ఈ పద్యదశకపు శైలియు దీనినే బలపఱచు చున్నది. ఇక్కడ దీని కుపోద్బలకమయిన మఱియొక విషయమును జెప్పక తప్పదు.

షష్ఠాశ్వాసమునఁ బార్వతి శివుని స్తుతించిన రెండు పద్యములు గలవు. (6 ఆ. 146 147 పద్యములు) వీనిలో నొకదానిచివర "నీశ్వరా!" యనియు నింకొకదానిచివర "శంకరా!" యనియు సంబోధనములు గలవు. వీనిలోని విషయమును దారిద్ర్య విద్రావణ దశకములోని దానివంటిదే. అయ్యును నవి దారిద్ర్య విద్రావణ దశకముతో సంబం

ధించినవి కావనుటకు వానిలోని సంబోధనములే యాధారము. నిజముగాఁ గవిరాజు దారిద్ర్య విద్రావణ దశకపద్యముల నంతకుముం దెప్పుడో రచియించినచో నిక్కడఁగూడఁ బది పద్యములను వానినే యుంచి యుండెడివాఁడు.

ఇంకొక్క విషయము. ఈ దారిద్ర్య విద్రావణ దశకమును జదివినచో నిక్కడ స్తుతించువాఁ డింద్రుఁడేయయినను నాతఁడే వీనిని బలికినట్లుకాక ఇంద్రముఖమున కవియే శివుని స్తుతించుచున్నట్లు కాన నగును. కవి యిట్లు తానే తన భావములను వెలువఱచు కవిత యాత్మాశ్రయ కవిత యగుసుగదా! (Subjective Poetry) ఈ పద్య దశకము ఆత్మాశ్రయ కవితాశాఖకుఁ జెందినదానివలె నున్నది. లేనిచో "నిన్నెదం దలపంగాంచి సురేంద్రుఁడై వెలయఁడే" (10-91) యని యింద్రుఁడే శివునితో ననునా? అట్లే చివరిపద్యమున నీ స్తవముఁ బఠించినవారి కశేషసుఖము లొసంగుమని శివుని వేడినట్లుగలదు (10-99). దీనినిబట్టి శ్రీ కవిగారి యూహయే సమంజసమేమో?

ప్రబంధ నిర్మాణమునకును, బంధ చిత్ర కవితలకును వలెనే శతక కవితకును చోడుఁడే యాంధ్రమున మార్గదర్శియని నా నమ్మకము.

## అష్టాదశ వర్ణనములు

నన్నెచోడ మహాకవి కుమారసంభవ కృత్యాదియందుఁ దన కావ్య మష్టాదశ వర్ణనలచే నిండియున్నదని వచించుచు నీ క్రింది పద్యమును రచించినాఁడు.

"వన జలకేళీ రవి శశి
తనయోదయ మంత్ర గతి రత క్షితిప రణాం
బునిధి మధు ఋతు పురోద్వా
హ నగ విరహ దూత్య వర్ణనాష్టాదశమున్". (1-44)

కవిరాజునకుఁ గొంచెము తరువాతి కాలమున జీవించిన విన్నకోట పెద్దన తన కావ్యాలంకార చూడామణియందు "నగర ముఖ్యాష్టాదశ వర్ణనములచేత జరుగునదియును భవ్యప్రబంధ మనఁగ" (3 ఉల్లా. 91 ప.) నని భవ్యప్రబంధ మష్టాదశ వర్ణనాపూర్ణమయి యుండుటను జెప్పి ఈ క్రింది పద్యమున నవియేవో వచించెను. ఆ పద్య మిది :

"పుర వారాశి మహీధరర్తు శశభృ త్సూర్యోద యోద్యాన పు
ష్కర కేళీ మధుపాన మోహన వియోగ క్షేమ యాన స్వయం
వర పుత్రోత్సవ మంత్ర దూత్య రణ దోర్వైక్రాంతి సంకీర్తనా
కర మష్టాదశవర్ణనాన్వితము తత్కావ్యంబు భవ్యం బిలన్".
(కావ్యాలంకార చూడామణి 3 ఉల్లా. 92 ప.)

వీని రెంటినిబట్టి మహాకావ్యమున నుండఁదగిన యష్టాదశ వర్ణనములీ క్రిందిరీతి నేర్పడును. (1) పుర వర్ణనము (2) వారాశి వర్ణనము (3) పర్వత వర్ణనము (4) ఋతు వర్ణనము (5) చంద్రోదయ వర్ణనము (6) సూర్యోదయ వర్ణనము (7) ఉద్యాన విహారము (8) జల విహారము (9) మధు పానము (10) సంభోగ వర్ణనము (11) విరహ వర్ణనము (12) యాత్రా వర్ణనము (13) వివాహ వర్ణనము (14) కుమారోదయ వర్ణనము (15) మంత్రాలోచనము (16) దూత ప్రేషణము (17) యుద్ధ వర్ణనము (18) నాయకాభ్యుదయ వర్ణనము.

ఇవి యప్పకవినాటికిఁ గొంచెము పెరిగినవి. మఱి కొన్నింటిని జేర్చి యాతఁడు వీని నిరువదిరెం డొనర్చెను. అతని పద్యముం బరికింపుఁడు:

"[1]పురమును [2]ఋతు షట్కమును [3]ప్రయాణంబును,
[4]శైలంబు [5]వేటయు, [6]సాగరంబు
[7]మౌనీంద్ర పుణ్యాశ్రమంబును, [8]మంత్రంబు
[9]ద్యూతంబు, [10]పిదప నద్భుతరణంబు,

[11]విజయంబు, [12]మద్యపానజ వికారంబును,
[13]వన విహారంబును, [14]వారికేళి,
[15]*కన్యాంగ సౌందర్య కథనంబు*, [16]హిమకరా
భ్యుదయంబు, [17]విప్రలంభోదితంబు,
[18]పద్మ మిత్రోదయంబును [19]బరిణయంబు,
[20]సురతమును, [21]*దౌహృదంబు*ను, [22]సుత జననము,
ననఁగ నిరువది రెండు వర్ణనలు గూర్చి
చెప్పవలయుఁ బ్రబంధంబు శ్రీనివాస!" (అప్ప. 1 ఆ. 28 ప.)

నన్నెచోడుఁడు, పెద్దన చెప్పిన యష్టాదశ వర్ణనలకు (1) వేఁట, (2) మౌనీంద్ర పుణ్యాశ్రమము, (3) కన్యాంగ సౌందర్య కథనము, (4) దౌహృదము అనువానిని జేర్చినా డప్పకవి. దౌహృదమునకు వేవిళ్ళనియు, దోహదమనియు రెండర్థములు.

ప్రతాపరుద్ర చక్రవర్తి యాస్థానమునందున్న యాలంకారిక మహాకవి విద్యానాథుఁడు తన ప్రతాపరుద్రీయమున నష్టాదశ వర్ణనముల నీ క్రింది విధముగా వచించి యందుఁ గొన్ని తగ్గించుటయుఁ గొందఱ కిష్టమే యని నుడివెను.

"నగరార్ణవ శైలర్తు చంద్రార్కోదయ వర్ణనమ్
ఉద్యానసలిలక్రీడా మధుపాన రతోత్సవాః
విప్రలంభో వివాహశ్చ కుమారోదయ వర్ణనమ్
మంత్రద్యూత ప్రయాణాజి నాయకాభ్యుదయా అపి
ఏతాని యత్రవర్ణ్యంతే తన్మహాకావ్య ముచ్యతే
*ఏషా మష్టాదశానాం యైఃకైశ్చిదూన మపీష్యతే*".
(ప్రతాపరుద్రీయము - కావ్యప్రకరణము 69 : 71 శ్లో.)

ఇవి నన్నెచోడుఁడు, పెద్దన చెప్పిన యష్టాదశ వర్ణనలతో నేకీభవించుచున్నవి. ప్రతాపరుద్రీయకారుఁడు చెప్పిన యష్టాదశ వర్ణనలును దండ్యా

చార్యుని కావ్యాదర్శములోని యష్టాదశ వర్ణనలు నొక్కచేయని యీ క్రింది కావ్యాదర్శ పద్యములు సాక్ష్య మిచ్చుచున్నవి.

"నగరార్ణవశైలర్తు చంద్రార్కోదయ వర్ణనైః
ఉద్యాన సలిలక్రీడా మధుపాన రతోత్సవైః
విప్రలంభై ర్వివాహైశ్చ కుమారోదయ వర్ణనైః
మంత్రదూత ప్రయాణాజి నాయకాభ్యుదయైరపి
అలంకృత మసంక్షిప్తం రసభావ నిరంతరం
సర్గై రనతివిస్తీర్ణైః శ్రవ్యవృత్తైః సుసంధిభిః".

(కావ్యాదర్శము 1 పరిచ్ఛేదము 16 – 18 శ్లో.)

దండికావ్యాదర్శమున నష్టాదశవర్ణనలే చెప్పబడినవిగదా! ఈతనికి చాలకాలము తరువాత జీవించిన విశ్వనాథ కవిరాజు తన సాహిత్య దర్పణమునందు నీ మహాకావ్యములోని వర్ణనవిషయమున నీ క్రింది విధముగాఁ జెప్పెను.

"[1]సంధ్యా [2]సూర్యేందు[3] [4]రజనీ [5]ప్రదోష [6]ధ్వాన్త [7]వాసరాః
[8]ప్రాత [9]ర్మధ్యాహ్న [10]మృగయా [11]శైలర్తు[12] [13]వన [14]సాగరాః
[15]సంభోగ [16]విప్రలంభౌచ [17]ముని [18]స్వర్గ [19]పురాధ్వరాః[20]
వర్ణనీయా యథాయోగం సాంగోపాంగా అమీ ఇహ.
......సాంగోపాంగా ఇతి [21]జలకేళి [22]మధుపానాదయః"

(సాహి. దర్ప. 6 పరిచ్ఛేదము 322-324, వానితరువాతి వివరణము.)

ఇవి యిరువది రెండని పై గణనము చెప్పుచున్నది. సాహిత్యదర్పణ కారుని వర్ణనల సంఖ్య అప్పకవి చెప్పినసంఖ్యకు సమానముగానున్నది. అంతేగాదు కవిరాజు గాని చోడుఁడు గాని చెప్పక అప్పకవి చెప్పిన వేట, మునీంద్రాశ్రమవర్ణనములు నీ సాహిత్యదర్పణమునఁ జెప్పఁబడినవి. ఇవికాక అప్పకవి చెప్పిన సౌహృదము, కన్యాంగ సౌందర్యకథనములకు మూలము తెలియరాదు. బహుశః వీని నాతఁడు పూర్వకావ్యములందుఁ జూచి తానే చేర్చియుండును. కుమారసంభవాష్టాదశ వర్ణనాపరిగణనమున

వీనికి స్థానము లేకున్నను గుమారసంభవమున నివి సందర్భోచితముగా వర్ణింపఁబడియే యున్నవి.

ఈ సాహిత్యదర్పణమును రచించిన విశ్వనాథ కవిరాజు పదు నాల్గవ శతాబ్ది ప్రాంతమువాఁడు. కావున నాతనికిఁ బూర్వమున వర్ణనములసంఖ్య పదునెనిమిదిగానే యుండి రాగా రాగా నాతనినాఁటి కిరువది రెండుగానయి యుండుననుట హేతుదూరము గాదు. నన్నెచోడుఁడు, పెద్దన, విశ్వనాథ కవిరాజునకుఁ బూర్వమున్నవారగుటచే వారు దండ్యాదులు వచించిన విధమున గ్రహింపఁగా నప్పకవి తరువాత విశ్వనాథుని ననుకరించి పరిగణనముచేయుట జరిగెననుట యుక్తియుక్తము.

ఇంతకును సంస్కృత మహాకావ్యములందీ వర్ణన లిట్లే యుండ వలయుననికాని యేమాత్రము తగ్గరాదనికాని ప్రాచీనులగు దండ్యాదులు కాని, తరువాత విశ్వనాథ కవిరాజుగాని నియమము నేర్పఱుపలేదు. ప్రతాప రుద్రీయమున "ఏషా మష్టాదశానాం యైఃకైశ్చిదూన మపీష్యతే" అని తక్కువగా నుండుటయు దోషముగాదని స్పష్టముగానే చెప్పఁబడినది. సాహిత్యదర్పణమునందలి "వర్ణనీయా యథాయోగమ్" అను దానికి వ్యాఖ్య రచించుచు, శ్రీరామచరణ తర్కవాగీశ భట్టాచార్యుఁడు "యథా యోగం యథా సంభవమ్. ఏ తేన యేనకేనాప్యంగేన హీనమపి కావ్యమ్ న దుష్ట మితిభావః" అని వచించెను. కావున నీ వర్ణనల విషయమున సంస్కృతాలంకారికుల కంత గట్టిపట్టుదల లేదనుట నిర్ణీతమగుచున్నది.

కాని మన పెద్దనగాని యప్పకవిగాని యీ వర్ణనలు కొన్ని తగ్గించ వచ్చునని సూచింపనైనలేదు. పైపెచ్చు వానిని దప్పక వాడవలసినదే యని కట్టడిచేసినవారివలెఁ గనుపట్టుచున్నారు. వీరికి లక్షణము నెడ నేమాత్రము సడలింపు నిష్టమైనట్లు కానరాదు. తత్ఫలితమే "ప్రబంధ" ప్రాదుర్భావము.

ముందు కుమారసంభవమునందుఁ గవిరాజు వచించిన యష్టాదశ వర్ణన లెట్లెక్కడనున్నవో చూపి తరువాత నీ "ప్రబంధ" శబ్దమును గూర్చిన నా యభిప్రాయమును నివేదింతును.

## 1. వనవిహారము

పై పద్యమున మొదటిదిదగు వనవిహారము అష్టమాశ్వాసమున "నుమామహేశ్వరు లారామ క్రీడావలోకనాసక్తులయి లీలోద్యానమున కరుగుదెంచిన" సమయమునఁ గలదు. (చూ. 107 ప. నుండి 126 ప. వఱకు) ఇందే పుష్పాపచయమును వర్ణింపఁబడినది. అట్లే యీ క్రింది పద్యముచే చెట్లకు దోహదక్రియలు వర్ణితములయినవి.

"మఱియుం గొన్నిమహీరుహంబుల నాత్మీయ క్రియావిశేషంబులం బుష్పోద్గమంబు లొనరించుచు. 121

"తన్నినఁ బూచె నెందుఁ గడుదైన్య మశోకము, బాహుపీడనం
గ్రన్ననఁబూచె నీ కురువకంబును, నెంగిలి కల్లు సల్లినన్
మన్ననదప్పిపూచె దొరమాయగఁ గేసర, మేము సూచుడుం
గన్నులసన్నఁ బూచెఁ దిలకంబని దానికి మెచ్చి రంగనల్."
(9-122)

ఈ స్త్రీల పుష్పాపచయవర్ణనమును, దోహదక్రియలను దరువాతి కాలపుఁ బ్రబంధకవులందఱచేతను దూ. చా. తప్పక వర్ణితములయినవి. వీనిం జూచియే కాఁబోలు నప్పకవి ప్రబంధమున దోహదములు వర్ణితములు కావలెనని నిర్దేశించినాఁడు.

సాహిత్యదర్పణ వివృతి పూర్తిచి రచించిన దుర్గాప్రసాద పండితుఁడుద్యానవిహారవర్ణనములోని విశేషాంశము లిట్లుండఁదగునని పై వర్ణనలకు వివరణము వ్రాయుచు వచించినాడు, అక్కడి శ్లోకమిది :

"ఉద్యానే సరణిః సర్వఫలపుష్పలతాద్రుమాః
పికాళి కేకి హంసాద్యాః క్రీడావా వ్యధ్వగస్థితిః."

ఫలపుష్పభరితలతావృక్షములు, పికములు, నెమళ్లు. తుమ్మెదలు, హంసలు, క్రీడాసరోవరములు నుద్యానవర్ణనమునం దుండవలెనఁట.

పుష్పభరితమగు నొక పొన్నచెట్టు వర్ణనముగల యీ క్రింది పద్యము మిగుల రమణీయము.

"అవని మధ్యసంస్థిత కుజావలిలో నొక పిన్నపొన్న తొ
ల్పూవులు పుట్టి యాక్షణము భూరుహ సంహతిమీద నెల్ల నె
త్తావి రయంబునన్ నెగసి తందడిఁ గప్పిన క్రమానుక్రమానికిం
బూవులులేకయున్ సుడిసెఁ బుష్పలిహాలి సుగంధలుబ్ధలై."

(9-97)

జపాసక్తిఁదగిలిన యలివర్ణన మీ క్రింది పద్యము :

"మదనోత్సవ మధువమని
సదమలమతి బంధు జీవసంఘం బచిరా
స్పదమని యన్నిటి నొక యలి
వదలి జపాసక్తి నిలిచె వరమునివోలెన్." (9-103)

"వాసితానన రుచిర నిశ్వాసములకు
ముసరి వారించు నెలఁదేటి ముసురఁజోపి
చోపి పోఁజోపనేరక. (9-111)

"ఆ వనితలు చంపక పు
ష్పావలి చేఁబట్టుకొనుచు నతిరయమునఁ గై
దీవియలు పట్టికొను చను
భావనఁజని రుద్ధతాలి పటలములోనన్." (9-120)

అని వర్ణింపఁబడినది. తుమ్మెదలు చంపకములఁ జూచినఁ బాఱిపోవును గదా ! మంచి యుపాయమే. వారి కాసమయమునకు స్ఫురించినది. అది విశేషము. ఇతర ప్రబంధములందలి మగువల కీ యుపాయము తెలియదు. లేకున్న వారును దుమ్మెదలబారిఁ బడక సురక్షితముగా నుండెడివారే.

ఆరామ లారామ విహారావసరమున "పరిమళాక్రాంతానంద లతాంత మందిరాంతరంబుల, *జలవిహంగరవాఘూర్ణితసరోవరంబులఁ జంద్ర కాంతమణిసోపాన దీర్ఘికాతటంబులం* గనక వాలుకాభిరామ నిర్ఝర పులిన తటంబుల"....నభిరామ క్రీడానిరతి విహరించిరఁట.

ఈ విధముగా నీ వనవిహారవర్ణనము రమ్యతరమై యొప్పి తరువాతివారికిఁ ద్రోవఁ జూపినది.

## 2. జలకేళి

నన్నెచోడ మహాకవి చెప్పిన వర్ణనమునందు జలకేళి రెండవది. నవమాశ్వాసమున పదునైదు గద్యపద్యములచే నీ జలకేళిని మనోహరముగా వర్ణించినాఁడు మన కవిరాజు (చూ. 9 ఆ. 77 వచ. నుండి 93 ప. వరకు). గిరిజాహరులు జలక్రీడావలోకన తత్పరులై సరోవరతీరమున నున్న యొక పారిజాతలతామంటపమున వేదికాసీనులు గాగా వారి యెదుట విటీవిట జనంబులు వినోదార్థమై జలక్రీడ లొనరించినారఁట.

సాహిత్యదర్పణ వివృతిపూర్తియందు జలకేళినిగూర్చిన విశేష విషయములు—

"జలకేళౌ సరఃక్షోభః శ్చక్రహంసాపసర్పణం
పద్మగ్లానిః పయఃక్షేపో దృగ్రాగో భూషణచ్యుతిః."

అని వర్ణింపఁబడినవి.

కవిరాజు మొత్తము జలకేళి నొక్క పద్యముచేఁ గన్నులకుఁ గట్టునట్లెంత మనోహరముగా వర్ణించినాఁడో యీ క్రింది పద్యముఁ జూచిన విశదమగును.

"కరమొప్పఁ గాముక కామినీతతి ప్రీతిఁ
గూడి జలక్రీడ లాడదొడఁగి
(1) పంకజాకరములోఁ గ్రుంకి యాడెడువారు
(2) వేడుక జల్లుఁబోరాడువారు
(3) ననురాగమున నీఁది యాడెడువారు (4) నా
హ్లాదంబుతో నోలలాడు వారుఁ
(5) బెనఁగి యొండొరుఁ బట్టుకొని ముంచువారు (6) నొం
డొరులపై జలధార లొత్తువారు

(7) కమల మృదు బిసములు కల్హార కుముదోత్ప
లములఁ బెఱికికొని నయమునఁ బ్రణయ
మొదవ సంకులముగ నొండొరుతో నాట
లాడువారు (8) తన్నులాడువారు". (9-80)

పై పద్యమున జలకేళినిఁ బూర్తిగాఁ జూపినాఁడు కవిరాజు. ఇంత కన్న జలక్రీడయందుండు విశేషములేమి? పై పద్యమున నింకొక విశేష మేమనఁ గొన్ని జలములందే యాడఁదగిన క్రీడా విశేషములను జెప్పుట. అవి (1) క్రుంకి (నీటిలో) యాడెడి యాట (2) చల్లుఁబోరాడుట (3) ఈఁది యాడుట (4) ఓల లాడుట. వీనినిగూర్చి కొంచెముగా వచింతును :

(1) *నీటిలోఁ గ్రుంకి యాడెడు నాట* : ఇది మెట్టపై నాడుకొను దాగుడుమూతల వంటిది. ఇందొక్క దొంగ కడమవారిలో నొక్కని ముట్టుకొని దొంగను జేయవలయును. కాని విశేష మేమనగా ముట్టు కొనుటకు వెళ్ళునపుడు నీటిలో మునిగియే వెళ్ళవలయును. ఈ లోపుగా నక్కడివాఁడు వెళ్ళిపోవచ్చును. కాన దొరుకుట కష్టము. ఇదియొక విధమగు క్రీడ.

(2) *చల్లుఁబోరాడుట:* జనము రెండుగాఁ జీలిపోయి పరస్పరము చేతితో నీరు చల్లుకొనుట. కొందఱు హస్తలాఘవముచే బహుదూరము నీటిని చిమ్మఁగలవా రుందురు. ఎదుటివారు చల్లు నీరు ముఖముపైఁ బడు చుండును గానఁ గన్నులు కనిపింపకయు, నూపిరి యాడకయు నొక పక్షమువారు పాఱిపోవలసి యుందురు. ఇదియొక విధమగు జలక్రీడ.

(3) *ఈఁది యాడుట* : నీటిపైఁ గనిపించునట్లుగానే యీఁదుచు నేదే నొకవిధముగా నాడుకొనుట. అది పందెముగా నుండవచ్చును. దొంగ యయినవా డితరులను ముట్టుకొనవచ్చును. ఇదియొక విధమగు జలక్రీడ.

(4) ఓల లాడుట: ఈ యాట వసుచరిత్రమునందును వర్ణిత మయినది. అక్కడను దీని విధము స్పష్టముగా లేదు. నన్నెచోడ మహా కవి ఈ 'ఓల' యాటను గూర్చి ఈ క్రింది పద్యమునందుఁ గూడఁ జెప్పినాఁడు:

"తన ముఖ మంబుజాతమని తండడిమూవు నళివ్రజంబుతోఁ
బెనఁగు విదగ్ధమోల నొక బేలసతింగని యోలఁబెట్టి పి
ల్చిన నది తన్నుఁ బట్ట (ట్టు?) నని చేరినఁ దేటులఁ దాని మూవికొం
దనుచును గ్రుంకిపోయి చదురాలయి నవ్వుచు లేచె నొక్కెడన్".
(9-88)

ఈ పద్యమునుబట్టి యీ యాటవిధ మేమయిన నెఱుఁగనగు నేమో? పరిశీలింతము.

పై పద్యమున నొక స్త్రీ ఆటయందు దాడుకొనుచుండగా నామె ముఖము నంబుజముగా భావించి తుమ్మెద లామెను బాధింపసాగెను. ఆమె వాని బాధను బాపుకొనుటకు తుమ్మెదలతోఁ బెనఁగుచుండు సమయమును గనిపెట్టి మఱియొక స్త్రీ (ఆటలోని దొంగ కాఁబోలు) యామెను సమీపించి ఆమెను 'ఓల' యని పిల్చినది. వెంటనే చతురురాలగు మొదటియామె తన్ను బాధించు తుమ్మెదలు తననువిడిచి యా 'దొంగ'ను బాధించుట కనువుగా మునిగిపోయి మఱియొకచోటఁ బైకి లేచెనని వర్ణింపఁ బడినది.

వసుచరిత్రమునందును నీళ్లే యొక్క స్త్రీ మఱియొక స్త్రీని బిలిచి 'ఓల' యని యనగా నామె నీటిలో మునిగి మఱియొకచోట లేచెనని వర్ణింపఁబడినది. రామరాజ భూషణుని యా పద్య మరయుఁడు.

"ఓలంబాలక యోలయోలయన నోలోలంచు మేలంబునన్
రోలంబాలక యొర్తు గ్రుంకి బిసవల్లుల్ దున్మి తూటాడికెం
గేలంబట్టి తటాలునన్ నెగసె...." (వసుచ. 3 ఆ. 162 ప.)

దీనినిబట్టి 'ఓల' యనునది యీ యాటలోని యొక సంకేత శబ్ద మనియు ఎవరి పేరుఁ జెప్పి యాటలోని దొంగ దీని నుచ్చరించిన, వారు వెంటనే నీటిలో మునిఁగి మరియొకచోటఁ దేలవలయు ననియుఁ దేలుచున్నది. అట్లు నీటిలోఁ గ్రుంకి పాఱిపోనిచో వారు ఆటలో 'దొంగ' గాఁ బరిగణింపఁ బడుదురేమో ? అనగా దొంగ ముట్టుకొను టకు ముందు వారికి చేయు హెచ్చరికయే యీ 'యోల' యను పదమని నిర్ణయింపవచ్చును. ఈ హెచ్చరిక చదరంగపుటాటలోని ' షా ' యను మాటవంటిదయి యుండవచ్చును. చదరంగమున 'షా' యనుట, "ఇఁకఁ దప్పుకొననిచో రాజు బందీ యగు" ననుటను సూచించును గదా। ఆ హెచ్చరిక విన్నవెంటనే యెదుటి యాటకాఁడు తన 'రాజు' ను సురక్షిత స్థానమునకుఁ జేర్చుకొనును. అట్లే యీ జలక్రీడయందును "దొంగ" "ఓల" యని యెవ్వరిని హెచ్చరించునో వారు వెంటనే మునిఁగిపోయి సురక్షితస్థానమును జేరుకొనవలయును. లేనిచో దొంగకుఁ బట్టువడిపోదురు. ఈ యాటయే మన కవిరాజుచే వర్ణితమయ్యెననుట కాతని పద్యమే సాక్ష్యము. ఈ యాటలన్నియు నాంధ్రదేశీయములు. నేఁటికిని వేసఁగికాలములందు బాలురిట్టి యాటల నాడుకొనుట యక్కడ దక్కడఁ గాననగును. ఇట్టియాటను వర్ణించు చోడుని పై పద్యము మిక్కిలి రమణీయముగా నుండుటయేగాక యా స్త్రీల ముఖసౌందర్య మునుగూడ స్ఫురింపఁజేయుచున్నది.

జలక్రీడవలనఁ గలతవడిన చక్రవాకాదులెట్లు సరోవరమును వీడి పోయెనో కవి యీ క్రింది పద్యమున మనోహరముగా వర్ణించి యున్నాఁడు.

"గురుకుచ, వక్త్ర, నేత్ర, గతి, కుంతల, బాహులతాధరంబులన్
బరువడిఁ బోలియున్కిఁగని బాలిక లల్గియడంచిరొక్కొ నా
నురుతర చక్రవాక, జలజోత్పల, మత్తమరాళి కాళి, బా
సురబిస బంధుజీవ తతి చూడ నదృశ్యములయ్యె నయ్యెడన్."

(9.82)

అందొక స్త్రీ మనోహరముగా వెల్లికిలగా నీటిపై నీఁదినదఁట. (9-84) ఆనాఁటి స్త్రీలంత నేర్పుగలవారేమో ?

"ఒక స్త్రీ యలికలితాంబుజమునుజూచి తన ప్రియుని ముఖమని భ్రమించి దానిపైఁ జిమ్మనగ్రోవితో నీటినిజల్ల నారంభించెనట ! ఆమె భ్రమ నెఱింగిన ప్రియుఁడు పరిహాసముగా నవ్వెనట ! ప్రియుని యప్పటి దంతకాంతినిజూచి అది యాతఁడు తనపైఁజల్లు నీరని భ్రమించి యామె తన ముఖమును బ్రక్కకుఁ ద్రిప్పికొనెనట !" (9-89)

"పాపము జలక్రీడలాడిన యువతుల వస్త్రములన్నియుఁ జల్లనై పోయినవి. అవి సామాన్యవస్త్రములా ? "అంబరము"లు. కనుకనే స్నానముచేసినంతనే మాయమయినవట ! ఎంతసన్ననివో ? అంతకు ముందు సుఖముగానేయున్నది. కాని యా యువతులు నీటినుండి వెలువడఁగానే తమ యాకృతులు జూచుకొని సిగ్గుపడినారు. పాపము ! వారికది సహజమే ! చుట్టుముట్టును బురుషసమూహము ! లజ్జకాదా ? పురుషులన్ననో మిగుల సంతోషించినారు. ఆ వస్త్రములు అంత సన్నముగానుండుట వారికి నేత్రానందహేతువయినదట ! కాని యా యానంద మెంతసేపు ? క్షణమే ! ఆ వస్త్రములట్లే మఱికొంతసేపున్న మఱింత బాగుండును. కాని యట్లు జరుగలేదు. యువతులు ఒడ్డుపైకివచ్చి నిలచిరో ? లేదో ? గాలికి వారి బట్టలు తడియాఱిపోయి వారి కటి ప్రదేశముల నా యంబరములు కనుపట్టినవట. అవి "యంబరము"లు గదా ! కనుకనే కటిప్రదేశములందుఁ గనుపట్టినవి. ఇది వనితల కానందముఁగూర్చినది. కాని విటాలికి ఖేదమును గలిగించినది." (చూ. కుమా. 9ఆ. 93వ పద్యము)

ఇదియొక వర్ణనము. ఎంతయుచితముగాను, మనోహరముగాను నున్నదో వివరింపఁబనిలేదు. ఆనాఁటి వారి వస్త్రము లంత సన్నముగా నుండెడివేమో ? అనుమాన మెందుకు ? ఉండెననియే చెప్పవచ్చును. లేకున్న గవిరా జసత్యము వ్రాయునా ? కొంచె మించుమించుగా నీ కవి

తరువాతికాలమున నాంధ్రదేశమును సంచరించిన "మార్కోపోలో" యాంధ్రదేశపు వస్త్రములఁ గొనియాడియే యున్నాఁడుగదా! అంత సన్నగా సున్నితముగా లేనిచో నైగుప్త సమ్రాట్టుల శవములను మన దేశపు వస్త్రములచే నానా దేల నలంకరించుచుండిరి? దేశదేశాంతరము లందు మన నేతకాండ్రకా ప్రసిద్ధి యేల కలిగెడిది? కావున మన కవి రాజు కాలమునాఁడు అతఁడు వచించిన "అంబరము"లు మనదేశమున నుండెననియే నిశ్చయముగాఁ జెప్పవచ్చును.

ఈ విధముగాఁ గవిరాజ శిఖామణి "జలకేళి"ని మనోహరముగా రచించిమించినాఁడు.

## 3. సూర్యోదయవర్ణనము

మన నన్నెచోడ మహాకవి రచించిన మనోహరవర్ణనములలో నష్టమాశ్వాసాంతమునఁగల సూర్యోదయవర్ణనమొక్కటి. ఈవర్ణనము నందలి విశేషాంశములను వివరించుటకుముందు సాహిత్యదర్పణవివృతి పూర్తికారులు సూర్యోదయవర్ణనమున నేయేయంశము లుండవలయునని చెప్పిరో చూతము. ఆ శ్లోకమిది:

"సూర్యేఽరుణతా రవిమణిచక్రాంబుజ పథికలోచన ప్రీతిః
తారేందు దీపకౌషధి ఘూక తమ శ్చోర కుముద కులటార్తిః".

కవిరాజు సూర్యోదయ వర్ణనమునఁ బైశ్లోకమునందలి పెక్కు విషయ ములు వర్ణింపఁబడినవి. అనగా నీ లక్షణమును దగ్గఱ నిడికొని యాతఁడు వర్ణనముల రచించెననుట గాదు. లక్షణము ఉత్తమ కవుల గ్రంథపరిశీలనమువలన నేర్పడు నియమములేకాని యన్యములు కావని విమర్శకులు భావింతురు. అట్లయిన వానిం బాటించుటయందుఁగాని మానుటయందుఁగాని కవికి స్వాతంత్ర్యముగలదన్న మాట. ఆ వర్ణనలు సందర్భోచితముగా నుండవలయును. కవియొక్క ప్రతిభ యందుఁ

గనిపింపవలయును. సూర్యోదయాది వర్ణనలు కొన్ని కాలసూచకము లుగాఁ గావ్యములందు వర్ణితములగును. అట్టి కాలసూచన మవసర మయిన సందర్భములందే సూర్యోదయాది వర్ణనలు రమణీయతరములుగా భాసిల్లును. లేనిచోఁ గవి కావలెనని తెచ్చియుంచినట్లు కానవచ్చును.

మన కవిరాజు సూర్యోదయ వర్ణనము కథాసందర్భమున కెట్లదుకు చున్నదో పరిశీలింతము.

శివుఁడు వివాహమున కొక దినము ముందు సపరివారముగా నోషధీప్రస్థ పురమునకుఁ జేరుకొనెను. హిమవంతుఁ డాతని నెదుర్కొని యంతఃపురమున విడిది నేర్పఱచి యా భవనమున వచ్చినవారినందఱ విడియఁజేసెను. తెల్లవారినచో వివాహము. కావున నీ మధ్యకాలమును సూచించుటకిట సూర్యాస్తమయ వర్ణనమును, రాత్రి వర్ణనమును జేయ వలసివచ్చెను. కాని యా రాత్రి మామూలు రాత్రియా? అందఱు నా నందరసమునఁ దేలియాడు రాత్రి. కావున నోషధీప్రస్థపురము నందలి జనుల యా రాత్రి వ్యవహారములను వర్ణించినాఁడు కవిరాజు. తరువాతఁ దెల్లవారినదని చెప్పవలయును. తెల్లవారిననేగదా వివాహము జరుగవలసి యున్నది?

కాని యీదినమునకు నొక ప్రత్యేకత గలదు. హరగిరిజల వివాహ దిన మది. ఎన్నియో యేర్పాటులు చేయవలసిన దిన మది. ఎంతయో త్వరపడినగాని వివాహ ముహూర్తమున కన్నియు సమకూర్చుకొనలేరు. అందుకని యానాఁడు వధూవరుల పక్షముల రెంటను జనులు చాల ప్రొద్దుననే మేల్కొనవలెను. ఇట్టి కాలము నంతటిని గవిరాజు తన వర్ణనచేత సూచిత మొనర్పవలెను. దానిలో నొక క్రమముండవలయును. లేకున్నచో నది సందర్భమున కతుకదు.

ఈ విషయమును సమగ్రముగా నెఱింగినవాఁడు కావుననే చోడ కవి యిక్కడి యీ వర్ణనమును మిక్కిలి యుచితముగా నడిపినాఁడు. అందు చక్కని క్రమమును బాటించినాఁడు.

మొట్టమొదటఁ దెల్లవాఱుటకు ముందుగా "ప్రభాతసమీరణము వీచిన"దఁట. ఆ వెంటనే కోళ్లు మేల్కాని "రవములు" చేసినవఁట. వాని వెంటనే చెఱువులందును, నదులందును, వృక్షములమీదను వివిధ పక్షి కులములు కలకలరావ మొనరించినవఁట. అటుపిమ్మట గృహములలోని దీపములు వెలవెలఁ బారినవఁట. ఆ వెంటనే మింట చుక్కలకాంతి తగ్గి పోయినదఁట. అంత చంద్రుఁ డస్తమింపగాఁ గలువలు ముడిచికొని పోయినవఁట. కమలముల ముఖములు వికాసోన్ముఖము లయినవఁట. అప్పుడు సూర్యుఁ డుదయాద్రిపైనెక్కి నిక్కిచూచినాడఁట. అప్పు డాతని కాంతిచే జగమంతయు బంగారుపూత పూసినట్లు పచ్చనయ్యెనఁట. తరువాత నా కిరణముల కరుణవర్ష మందగా జగమంతయు నరుణద్యుతి నందెనఁట.

ఇది కవిరాజు సూర్యోదయమును వర్ణించుటలోఁ జూపిన క్రమము. ఇందెంత పొందికయున్నది? అన్నియు నవసరములే. ఏ యొక్కటి వదలి నను నీ సొగసు చెడిపోవును. వర్ణనము సాంగముగాదు. క్రమమున వెనుక ముందులును యుక్తములుగావు. ఒకదాని తరువాత నొకటి యట్లే జరిగిపోవలయును. వీని నన్నింటి నెఱిఁగి కవిరాజు పై వర్ణనమును మనోహర మొనర్చినాఁడు. ఈ పట్టులోని యొక రమణీయ పద్యము నుదాహరించి యీ విషయము నింతతో వదిలివేయుదును.

"రాజరుచి వాయఁ *గువలయరమణ* దఱఁకెఁ
గలయఁదమ్ముల మొగములు నెలమి మిగిలె
*శీతకరుఁ*డైన రాజు పాసిన ధరిత్రి
వందుఁగా కెందు దాయలు వగతురెట్లు ?" (9-188)

పై పద్యమున రాజు, కువలయము, తమ్ములు అను శబ్దములను శ్లేషించునట్లు కూర్చి యొక చక్కని భావమును కలిగించినాఁడు చోడరాజు. "తమ్మి"లను శబ్దము శ్లేషించునట్లు రచించిన భట్టుమూర్తి

వసుచరిత్ర పద్యము హృద్యతకుఁ బేరుమోసినది. పైపద్యము దానికి మూలమా యనునట్లు మిగుల మనోహరముగా నున్నది. అనాఁడు—

"ఈ హరుఁ డగసుత నేఁడు వి
వాహంబై పడయు మాకు వల్లభునని యు
త్సాహమునఁ జెలఁగుగతిఁ బురి
గేహంబులఁ జెలగెఁ గలయఁ గృకవాకంబుల్".

అని వర్ణింపఁబడినది. ఈ పద్యము కథా సందర్భమున కనుకూలముగా నున్నది.

## I. చంద్రోదయవర్ణనము

కవిరాజు వచించిన వర్ణనాక్రమమునం దిది నాలుగవది. చంద్రోదయవర్ణనమునం దుండదగిన విశేషాంశము లెట్లుండఁదగునో దుర్గాప్రసాద పండితుఁడు చూపిన శ్లోక మిది :

"చంద్రే కులటా చక్రాంబురుహ విరహి తమోహాని రౌజ్జ్వల్యమ్
జలధి జవనేత్ర కైరవ చకోర చంద్రాశ్మ దంపతిప్రీతిః."

నన్నెచోడ మహాకవి సూర్యోదయ వర్ణనమునందువలెనే చంద్రోదయ వర్ణనమునందును మంచి యౌచిత్యమును బ్రదర్శించినాఁడు. కథా సందర్భమున కదుకునట్లు వివాహపూర్వదినమున నీ వర్ణనమును క్రమము దప్పక వర్ణించి తన చాతుర్యమును లోకమునకుఁ జాటినాఁడు.

దీనికి ముందు సూర్యాస్తమయవర్ణనము గలదు. సూర్యు డస్తమించుటకు కవిరాజు వచించిన కారణముఁ జూడుఁడు.

"మృడుబలము లుర్విఁ గ్రిక్కిన
విడిసిన దశశతకరుండు విడియఁగఁ దన కె
య్యెడ నెడ సాలక యరిగిన
వడువున నపరాద్రి నందవనమున కరిగెన్. (8-87)

ఈకవి వర్ణనలం దొక వైశిష్ట్యము గలదు. వర్ణనములు వర్తమానకథతో సంబంధించి ప్రకృత విషయమును బాగుగా నర్థము చేసికొనుట కుప యోగించుటయే యది.

పై పద్యమునకు ముందు శివుఁ డోషధీప్రస్థపురమునకు సపరి వారుఁడై వచ్చి విడిసిన విషయము విపులముగా వర్ణింపఁబడినది. శివుని పరివార మనంతము. బందుగులు లెక్కలేనంత మంది. అందఱును ముఖ్యులే. మహనీయులే. ఎంత యైశ్వర్యము కలిగిననేమి ? వచ్చినవా రందఱకు నుచిత భవనముల నేర్పాటు చేయఁగలఁడా హిమ వంతుఁడు ? అయినను హరిపరమేష్ఠిపురందరాద్యమరవరులకు రమ్య హర్మ్యముల నేర్పాటుసేయించినాడఁట. తదితర దేవతలు పురప్రముఖుల యిండ్ల విడిసియుందురు. కడమవారికి నివాసము నేర్పాటు సేయుట యెట్లు ? వారు తమంతతామే యొక యేర్పాటుచేసికొనవలెను. పురా భ్యంతర బాహ్యోద్యానంబుల విడిసినారఁట వారు. అంతకన్న మార్గాంత రము లేదుగదా ! అయ్యూ నాయూరి పౌరులు వారి కుచిత మర్యాదలఁ గావించుటచే వారికిని సుఖముగానే యున్నదఁట. పరమేశ్వరుని వివా హమునకు వచ్చినజనముతో నిట్లు క్రిక్కిఱిసిన యోషధీప్రస్థపుర ప్రాంత ముల నిఁక స్థలమేది ? భూమండలమే క్రిక్కిఱిసి యుండవచ్చును. చతుర్దశ భువనములలో భూమండల మొక్కటి. ఇక్కడివారికన్న నిది సరిపడునేమో ? లేదా మఱియొక్క లోకమువారువచ్చిన నెట్లో సరిపుచ్చు కొనవచ్చునేమో ? కాని సమస్త భువనములలోని జనులు తమతమ వస్తువాహనములతో మెఱసివచ్చి భూలోకమున విడిసిన నిక్కడ స్థలము చాలునా ? అంతకు ముందున్నవారు అక్కడినుండి తప్పుకొనవలసి వచ్చినది !

కవిరాజీయొక్కపద్యముచే హరుని వివాహసందర్భమున నోషధీ ప్రస్థమునందలి సమ్మర్దమును గన్నులకుఁ గట్టినట్లు చూపినాఁడు.

మఱియొక పద్యముచే సాంఘికాచారము నెంత మనోహరముగా మన మహాకవి యీ ఘట్టమునఁ జిత్రించెనో చూడుఁడు:

"పోంక నళినీరజస్వల
సోంకిన దోషంబువాయ సూర్యుఁడు గలితా
శంక నపరాంబునిధిలోఁ
గ్రుంకెనొకో యనఁగఁ బ్రొద్దు గ్రుంకుడు నంతన్." (8-89)

సూర్యుఁడు తన కరములచే రజస్వలయయిన నళినిని దాఁకినాఁడఁట. ఆ దోషము పోఁగొట్టుకొనుటకై పశ్చిమాబ్ధిలో స్నానమాడెనోయనఁ గ్రుంకులిడినాఁడఁట!

కావ్యప్రయోజనములలో లోకజ్ఞానము కలుగజేయుటయు నొక్కటని శాస్త్రజ్ఞులు "కావ్యం యశసే ఒర్థకృతే వ్యవహారవిదే" యను దానిచే వచించిరి. రజస్వలను దాకిన స్నానము చేయవలయుననిశాస్త్రము; వ్యవహారము. సూర్యునిచే నట్టి స్నానమును జేయించిన కవిరాజు కావ్య ప్రయోజనమును జక్కఁగా నెఱిఁగి రచించెననుటలో సందేహములేదు.

సూర్యాస్తమయము తరువాత దూర్పుదిక్కునుండి నలుపు మెల్ల మెల్లగా నాకాశము నావరించినదఁట. ఇఁకఁ గొలదికాలమునఁ జంద్రోదయము కానున్నది. జనులెల్లరు నానందము నందినారు. "కువలయారి చని (పోయి) కువలయహితుఁడగు రాజు వచ్చుట జనుల కానంద హేతువే గదా! ఆచంద్రుఁడు తన ప్రియురాలగు రజనినిఁ బాసి చాలకాలము గడచినది. ఆతఁ డిప్పుడు తన ప్రియురాలితోఁ గలసికొన నున్నాఁడు. పరస్పర సందర్శనమున నొక్కుమ్మడి వారి దేహములు చెమర్చినవి. ఆ చెమట బిందువులే ఆకాశములోని చుక్కలు."

ఎంత మనోహరమగు కల్పన! పార్వతి నెడఁబాసియున్న కాలము శివునకు మిగుల దీర్ఘము! దాని నీ కల్పనము ధ్వనింపఁ జేయుచున్నది. ఆ పురాణ దంపతులు బహుదినములకు మఱలఁ గలిసికొనఁ బోవుచున్నారు గదా!

అప్పుడు జను లిండ్లలో దీపము లిడుకొన్నారు. మెల్లమెల్లగా నాకాశమంతయు నంధకార మావరించినది. ప్రపంచమంతయు నొక్కు మ్మడి నేకవస్త్వాకారము నందినది. అప్పటి యా స్థితిని మన కవిరా జెట్లు వర్ణించెనో చూడుఁడు :

"నుత వర్ణాంతర నిమ్నో
న్నతతల నిఖిలోచ్చనీచ నానావస్తు
స్థితి సమము సేసె గతగౌ
రతఁ జీఁకటి దుర్వివేకిరాజ్యము పోలెన్". (8-98)

ప్రపంచమంతయు నంధకారావృత మయిన నందు వర్ణభేదము కానవచ్చునా ? అన్ని వర్ణములును సమానముగనే కనుపట్టును (కన్ను లకుఁ గాదు). వస్తువుల కుచ్చనీచ భేదమును నిర్ణయింపరాదు. ఇది యంతయుఁ దమ మావరించి నప్పటి స్థితి. ఇదియు దుర్వివేకి రాజ్యము నొకే విధముగా నున్నవఁట.

ఈ పద్యము కవిరాజు రాజ్య పరిపాలనానుభవమును, అందులోని మంచి చెడ్డలను, సమకాల రాజకీయ పరిస్థితులను, చక్కఁగా వివరించు చున్నది.

మన కవిరాజు బసవేశ్వరునికిఁ గొంచెము ముందువెనుకల జీవించియుండునని గదా నేఁడు విమర్శక బాహుళ్యము తలంచుచున్నది! ఆనాటి దేశపరిస్థితులు పై పద్యములో సూచింపఁ బడినట్టివే యయి యుండును గదా! రాజు దుర్వివేకి యయినచోఁ గలుగు ముప్పది. బసవ పురాణముఁ జదివి యానాఁటి కల్యాణినగర రాజ్య పరిస్థితి నూహించి కొన్నచో బిజ్జలుని దుర్వివేకము బోధపడఁ గలదు. పరిస్థితు లేమియు నాతని యదుపులో నున్నట్లు కానరాదు. ఇట్టి పరిస్థితియే మఱికొన్ని రాజ్యము లందునుండి యుండుననుట యానాఁటి మతరాజకీయ పరిస్థితు లనుబట్టి హేతుదూరమని వచింపలేము. ఆ పరిస్థితు లెఱిఁగిన కవిరాజు వానియెడఁ దన విముఖతను సూచించుటయే కాక, వారి దుర్వివేకమును

పైతము చక్కఁగా నెత్తిపొడిచినాఁడు. కవి లోకజ్ఞుఁడయి యుండవలెనని గదా శాస్త్ర ముద్ఘోషించుచున్నది! అనఁగా నుత్తమ కావ్యమునకుఁ గారణమయిన వానిలో లోకజ్ఞానము నొక్కటన్నమాట. కావ్యప్రకాశము నందలి యీ క్రింది కావ్యోద్భవ కారణములను పరికింపుఁడు:

"శక్తి ర్నిపుణతా లోక శాస్త్రకావ్యా ద్యవేక్షణం
కావ్యజ్ఞ శిక్షయాఽభ్యాస ఇతిహేతు స్తదుద్భవే" (1 ఉల్లా. 3 శ్లో.)

నన్నెచోడుఁడు లోకజ్ఞుఁ డనుటను బై పద్యము సూచించుచున్నది.

తరువాతఁ గొంతసేపటికిఁ బ్రాచీ గర్భమునఁ జంద్రుఁడున్న చాయను గవి యిట్లు వర్ణించినాఁడు. ఇప్పు డామె యిందుగర్భ.

"తమమను నీలవర్ణ పరిధానము వీడఁగఁ బూర్వశైల శృం
గములను నున్నత స్తనయుగంబు దనర్పఁ జకోరబంధు వ
ర్గము ముదమొందఁగా, నిజముఖద్యుతి వెల్వఁగ, నిందుగర్భచి
హ్నము లభిరామమయ్యె నమరాధిపదిక్సతికిం గ్రమంబునన్".
(8-106)

తదనంతరంబున చంద్రుఁ డుదయించినాఁడు. మెల్లమెల్లనఁ బైకెగఁ బ్రాకుచున్నాఁడు. అప్పటి యీ స్థితిని కవి యెంత యుచితముగా వర్ణించి నాఁడో చూడుఁడు:

"సంధిల్లి పూర్వ దిక్సతి కటిమణికాంచి
రంజిల్లు నాయకరత్న మొక్కొ
విలసిల్లు నద్దేవి వృత్త స్తనాంతరా
పూరిత కాశ్మీర పుంజ మొక్కొ
తనరారు నా హరిత్తరళాక్షి పరిపక్వ
బింబారుణాధర బింబ మొక్కొ
మేలిల్లు నబ్బాల ఫాల తటంబున
విలసిల్లు రోచన తిలక మొక్కొ

మవ్వమొప్పఁ దన సమాగమంబునకు నా
రమణివలనఁ బర్వు రాగ మొక్కొ
యనఁగఁ దరతరంబ తనరె నత్యరుణాంగ
భాతిఁ గువలయైకబాంధవుండు". (8-108)

ఈపద్య మొక్క యమృతగుళిక యనుటయం దావంతయు సంశయింపఁ బనిలేదు. సీసమునడక సుమనోహరము. మనకు వాచ్యముగాఁ జెప్పకయే కవిరాజు, చంద్రుని క్రమక్రముగా నాకాశమున కెగఁబ్రాకించిన విధము మిగుల రమణీయము.

పై పద్యమున "మునుముందు చంద్రుఁడు ప్రాచీదిగ్వధూకటిస్థ మణికాంచికయందు వెలుగొందు నాయకమణివలె భాసిల్లినాడఁట. ఆపిదప కొంచెముసేపయి చూడ మరికొంచెము మీదికెగఁబ్రాకి యా సతిస్తనాంతరమున నిడుకొన్న కుంకుమమువలె విరాజిల్లినాడఁట. మఱి యాపిమ్మట నింకను బైకిఁ బ్రాకగా నాదిక్సతి యధరబింబమా యన నొప్పినాడఁట. అంతతో నాగినాఁడా? మఱియుం బైకిఁ బ్రాకినాఁడు చంద్రుఁడు. అప్పుడా దిగ్వధువు నొసటనిడుకొన్న తిలకమువలె వెలుగొందినాఁడు. కాని యింకను బైకిఁ బ్రాకుచునేయున్నాఁడు. ఎంతవరకట్లు పైకి వచ్చునో చూడగా నాదిక్సతి చంద్రసమాగమముఁ గోరుటలోని యనురాగ బింబమా యనునట్లు మఱిమఱి పైకెక్కుచున్నాఁడఁట."

కల్పనమన్న నిట్లుండవలె. దీనిలోని క్రమవికాసమును వివరించుట యింక ననావశ్యక మనుకొందును.

ఇక్కడఁ జంద్రుని వర్ణించిన పన్నెండు పద్యములు నొక్కొక్కటి యొక్కొక్క క్రొత్త విశేషముతో నొప్పుచున్నవి. కావున వానినన్నింటిని వివరించుట మాని యొక్క పద్యమునుమాత్ర ముదాహరించి యీ ప్రకరణమును ముగింతును.

"తరుణతర శశిమండలాత్యరుణరుచులు
గొడఁగు లెదఁగ్రుచ్చి వడినెత్తికొనిన సాంద్ర

తిమిర పటలంబు వొలుపారె దీపదీప్తి
పరివృతంబైన కజ్జల పాత్రవోలె". (8)

చంద్రకరములు చుట్టువ్యాపింప మధ్యమున్న తిమిరపటలము దీపముపైఁ బట్టిన కజ్జల పాత్రవోలె నున్నదఁట.

ఈ విషయముల నింత సూక్ష్మముగాఁ బరిశీలించు స్వభావముగల నన్నెచోడ మహాకవి శ్లాఘనీయుఁడనుట సర్వవిధముల యుక్తము.

చంద్రోదయ వర్ణనము తరువాత నా రాత్రి జరిగిన విశేషములను కవిరాజు దీర్ఘముగా వర్ణించినాఁడు. వానిని మఱియొక సందర్భమున వివరింతును.

## 5. తనయోదయ వర్ణనము

కుమారసంభవ దశమాశ్వాసమునఁ గుమారోదయ వర్ణనము గలదు. ఇది యంత దీర్ఘము కాకపోయినను గావ్యమున ముఖ్యమయిన పట్టుగా నున్నది. కావ్యమే కుమారసంభవము గదా! కుమారోదయ వర్ణనమునం దుండఁదగిన విశేషాంశములఁ గూర్చి ప్రాచీనాలంకారికు లేమి వచించిరో చూతము :

"కుమారే శస్త్ర శాస్త్రశ్రీ కలాబల గుణోచ్ఛ్రయాః
బాహ్యాలీ ఖురలీ రాజభక్తి స్సుభగతాదయః"

(కావ్యాదర్శము 18 పుట.)

దశమాశ్వాసమునఁ గుమారోదయమును వర్ణించు పద్యములు నాలుగే నాలుగు. అయ్యు నవి మిక్కిలి మనోహరములు. తరువాత నారదాగమనమును, ఆతఁడు కుమారుని జూచి యాతని తేజమ్మున కాశ్చర్యచకితుఁడై యింద్రున కీ వార్త వినిపింప వెడలుటయు వర్ణితము లయినవి. కుమారోదయమును వర్ణించు పద్యమిది :

"ఎలుఁగెత్తనోడి మున్నెందేని డాఁగిన
వేదనాదంబులు విస్తరిల్ల

వాయెత్తనోడి పర్వతములు సొచ్చిన
    కిన్నర గంధర్వ గీతు లెసఁగఁ
దలలెత్తనోడి భూతలమునం దడఁగిన
    నిధు లడుగడుగున నెఱయఁ దెఱవ
మొగమెత్తనోడి దిక్కామ్యంబులై యున్న
    యాశాననాబ్జంబు లలరి పొలయ
బలిమి మిన్నుముట్టి వెలిగెడి తారక
ప్రభ యడంగఁ బొందువాసి నవయు
దివిజచక్రమెల్లఁ గవగూడిచొచ్చిన
పదవితోఁ గుమారుఁ డుదయమయ్యె". (10-48)

పై పద్యమునఁ దారకప్రభచే లోకము పరితాపమందిన విధమును గుమారోదయమున నా లోకము దుఃఖముక్తిఁ గనుటయును మనోహరముగా వర్ణితములైనవి. తారకుని పరిపాలనమున వేదముల నాదములే లేవఁట. గంధర్వకళ కాదరము లేకపోయినదఁట. నిధులు తలలెత్తక భూమిలో నణఁగిపోయినవఁట. సకల దిక్కులును చిన్నవోయి విన్నదనము బొందినవఁట. దివిజులు పరస్పర సంబంధములేక వేఱువేఱయి జీవించినారట! దీనికంతటికిని హేతువు తారక ప్రభ. కుమారోదమయినది గావునఁ దారకప్రభ యడఁగుననియు వేదాదుల యుద్ధరణము జరుగుననియుఁ బై పద్యము భావము.

తరువాతఁ గుమారుఁ "డీశ్వరు నురులింగాకారంబు పురుషాకారంబు దాల్చినట్లు" విరాజిల్లెనని వర్ణింపఁబడినది. ఇందెంత గంభీరార్థముగలదో? పుత్రుఁడు తండ్రి యాకారముననుండుట యుక్తమే కదా! అట్లేయుండవలయునని శాస్త్రములు వచించును. పుత్రుఁడన్న నేమి? తండ్రియేకదా యీ రూపమున నవతరించెను? ఇది మన భారతీయ సంప్రదాయము. "ఆత్మా వై పుత్రనామాసి" యని శ్రుతి

వచనము. ఇంత భావము నిమిడ్చియే రాజకవి పై వాక్యమును రచించి నాఁడు.

అతఁడు తండ్రికన్న నేడాకు లెక్కువ చదివినవాఁడు. కనుకనే శివున కైదు శిరములుండఁగా నీతని కారు శిరమ్ములుండుట సంభవించినది. "సర్వతో జయమన్విచ్ఛేత్ పుత్రాదిచ్ఛే త్పరాజయమ్" అని వచనము కావునఁ గుమారుఁడు తండ్రిని మించినవాఁడగుట యుక్తమే.

అప్పటి దేవాదుల యుత్సాహమును రెండుత్సాహ వృత్తములతో వచించినాఁడీ మహాకవి. వీనిలోని యౌచిత్యము "పద్యౌచిత్యము"ను వివరించుపట్టున వివరింపఁబడినది.

లోక కంటకుల జన్మసమయమున దుశ్శకునములును, నుత్పాతములును గలుగును. దుర్యోధనుని జన్మసమయమున నట్టి వుప్పతిల్లినట్లు మహాభారతమునఁ గలదు.

లోకోపకారకుల యుద్భవావసరమున సమస్త మంగళ సూచనలు జరుగుననుటయు మన సంప్రదాయము. ఆ సంప్రదాయమును జక్కఁగా నిలిపినాఁడీ మహాకవి. కుమారోదయ సమయమునందలి స్థితిని వర్ణించు నీ క్రించి పద్యమును బరికింపుఁడు:

"సుర మహీరుహాలివండె సురభులోలిఁజేపె నా
సుర గజంబు మదముసేసె సుర సమూహికెద భయా
తురత వాఁపె బెరిగె దేవదుందుభుల్ సెలంగె నీ
ధరణి సస్యవృద్ధిఁబొందె ధర్మచరిత మిగులగాన్." (10-51)

పిమ్మట నాతని నారదుఁ డాకాశ మార్గమున వచ్చుచుఁ జూచి పోయి యింద్రునకుఁ జెప్పెనని ముందే వచింపఁబడినది. నారదుఁ డాకాశమునుండి కుమారుని జూచి భావించిన విధమును వర్ణించు నీ క్రింది కుమారసంభవ పద్యముఁ గనుఁడు:

"వినువీధి నెడయాడి విసివి కాలిచ్చలో
నిలదావ గొనియున్న వెలుఁగుఱేఁడొ

లవణాబ్ధి వెలుపలమై చవుదువో౯ దియ్యని
రాదంగ౯ జొచ్చిన యమృతకరుఁడొ
ముదిమివో నిందుల యుదకంబు సేవించి
యెలఁబ్రాయమైయున్న నలువయొక్కొ
తా నీలగిరిమీద మేనొత్తునని తమ్మి
విరులపై నెనసిన గిరిశుఁడొక్కొ
యబ్జ నిలయమైన యమ్మతో నరిమిలిఁ
దగిలియున్న తమ్మి దాల్పుఁడొక్కొ
యనుచు నుత్తరోత్త రైశ్వర్యుఁడగు బాలు
గారవించి చూచె నారదుండు." (10-56)

ఆకాశమునుండి క్రమక్రమముగా నారదుఁడు కుమారుని యాకృతిని బరీక్షించి నిరీక్షించువిధ మీ పద్యమున మిక్కిలి రమణీయముగా వర్ణితమైనది.

అతఁడు మునుముందు మిగుల దూరముగా నాకాశమునుండి పరోవరమును జూచినాఁడు. అందవయవములు స్పష్టముగాఁ గనిపింపని యొక తేజఃపుంజ మాతనికి కనుపడినది. అయ్యు నది మానవాకృతియేకాని యగ్నివంటి పదార్థము గాదని యాతనికి వెంటనే స్ఫురించినది. అందుకే యప్పు డద్దాని నాతఁడు "ఆకాశమునఁ దిరిగితిరిగి వేసారి విశ్రాంతిఁ గొనుచున్న సూర్యుఁడా ?" యని యూహించినాఁడు. ఆతని కీ వింత యేమో పూర్తిగాఁ దెలిసికొనవలెనను కుతూహల మెక్కువయి మఱికొంచెము ముందుకు బాలుని కభిముఖముగావచ్చి చూచినాఁడు. వచ్చి చూచుటయేమి ? చూచుచునే వచ్చుచున్నాఁడు. మనస్సును చిత్తమును నా బాలునియందే లగ్నములయియున్న వాతనికి. అందుకే యెప్పటికప్పు డీ బాలునిగూర్చి యొక భావ మాతనికి గలుగుచు వచ్చినది. మొదటిమాఱు సూర్యునిలోవలె నీబాలునియం దాతనికి తేజోవిశే

షమే కనిపించినది. కాని యీమాఱు దేవర్షికి బాలునియందలి యాహ్లాద కత్వమును, లోకరంజకత్వమును గోచరమయినవి. కావుననే తన ముందటియభిప్రాయము నాతఁడు మార్చుకొని "యీబాలుఁడు తియ్యనీరాడ వచ్చిన యమృత కరుఁడయి యుండునా ?" యని యనుమానించినాఁడు. కాని యా భావము నాతనికి స్థిరముగా నిలువలేదు. ఇంతలోనే యాతఁడు మఱికొంచెము బాలునకు దగ్గఱగా వచ్చినాఁడు. అప్పుడాతనికి బాలునిలో సామాన్య దేవతాతీతమయిన శక్తియొక్కటి కలదని తోచినది. అంతే గాదు కుమారుని బహుముఖములు నాతనికి కనిపించినవి. కావుననే "యీ బాలుఁడు ముదిమి వీడిన బ్రహ్మదేవుఁడు కాఁడుగదా !" యని యనుమానించినాఁడు. అదియు నొక్క క్షణమే. కుమారు నాకార విశేషమున, శివుని పోలికను గమనింపఁ గలిగినంత దగ్గఱకు వచ్చినాఁడా సురముని యిప్పుడు. వెంటనే "కైలాసగిరిపై మేనొత్తునని యుక్కఁడ తమ్మివిరులపైఁ బవళించిన శివమూర్తియయి యుండునా ?" యని యనుమానించినాఁడు. 'తమ్మివిరులు' ఆతనికిఁ గనిపించఁగానే కుమారుని యాకృతి యాతని మనమునుండి కొంచెము ప్రక్కకుఁ దొలఁగి యుండును. లేనిచో "నీ బాలుఁడు లక్ష్మితో నరిమిలిఁ దగిలియున్న నారాయణుఁడయి యుండు" నను భావ మాతనికిఁ గలిగియుండదు. ఏమయిన నేమి యా బాలుని పద్మసాహచర్యమే యాతని యీ క్రొత్త భావమునకు హేతువయినది. ఇంతకు నా దేవముని దివ్యచక్షువుతో బాలుని వృత్త మెఱుంగక చర్మచక్షువుల తోడనే బాలుని పరీక్షించుటచే నిట్టి తబ్బిబ్బుల కవకాశ మేర్పడినది. పాపము ! ఆ మునిమాత్ర మేమి చేయఁ గలఁడు ? ఈ బాలుని జూచిన క్షణముననే యాతఁడు తనను తా మఱచినాఁడు. ప్రాకృతికమయిన కుతూహల మాతనిని ముంచివేసినది. చిత్తము, కన్నులు, సర్వము నా బాలుని దప్ప నన్యమును గూర్చి యాలోచించుటకుఁ గాని, చూచుటకుఁ గాని యిచ్చగింపకున్నవి. ఇట్టి స్థితిలో నా దివ్యముని దివ్యచక్షుర్జ్ఞానము పనిచేయునా ? ఇది యప్పటిస్థితి.

ఇంత మనోహరమగు భావమును వర్ణించుచున్నది పై పద్యము. నారదుని యప్పటి మానసిక స్థితియు, బాలుని యాకార విశేషమును బై పద్యమున మిగుల మనోహరముగ వర్ణింపఁబడి యుండుట స్పష్టము.

ఇంతటి భావఘర్షణ మా దివ్యముని మనమున జరిగినది కావుననే యాతఁ డింద్రునికడకుఁ బరుగులిడి

"హరునకు నెద్ది పేర్మి ! దనుజారికి నెద్ది రమావిభూతి ! భా
స్కరునకు నెద్ది తేజము ! దిశాపతి సంహతి కెద్ది నిల్పు ! చం
దురునకు నెద్ది కాంతియు ! చతుర్దశ లోకవిభుత్వ మెద్ది నీ (కు) !
ఇరవుగ నా కుమారుఁడిల నింకొక యించుకసేపు నిల్చినన్".

(10-60)

అని సాహసించి పలికినాఁడు.

నన్నెచోడుని కవితా ప్రతిభకుఁ గై మోడ్పులు.

## 6. మంత్రాలోచనము

కవిరాజు పేర్కొన్నవానిలో నిది యాఱవది. మంత్రాలోచనము నందలి విశేషాంశము లీ క్రిందిరీతిని ప్రాచీనులచేఁ బేర్కొనఁ బడినవి:

"మంత్రే పంచాంగతా శక్తి షాడ్గుణ్యోపాయ సిద్ధయః
ఉదయా శ్చిన్తనీయాశ్చ స్థైర్యోన్నత్యాది సూక్తయః".

రాజు మంత్రులతోఁ గార్యాలోచనము చేయుట మంత్రము. సామాన్యముగా నిది యుద్ధవిషయకముగానే యుండును. తారకుఁడు రాజు, శుక్రాచార్యుఁ డాతని మంత్రి. శుక్రుని రాజనీతిజ్ఞత జగమెఱిఁగి నదిగదా ! వారి యిద్దఱి యాలోచనమును గవి దశమాశ్వాసమున వర్ణించినాఁడు.

దేవతలు సేనాని నాయకత్వమున దండువెడలి యా విషయమును నారాయణుని సూచన చొప్పున దూత ముఖంబునఁ దారకునకుఁ జెప్పంపి నారు. వాఁడు తారకునితో సేనాని మాటలు చెప్పఁగా విని కోపగించిన

తారకుఁడు దూతనే చంపివేయ సమకట్టినాఁడు, కాని శుక్రుఁడు నివారింపఁగా నంగీకరించి యుద్ధస్థల నిర్దేశమును తెలుపుటకై తారకుఁడు ప్రతిదూతను దేవతలకడకుఁ బంపినాఁడు. వాఁడు దేవతల యుత్సాహమును భగ్నము చేయఁ దారకుని పరాక్రమమును వర్ణించి 'యుద్ధరంగము'ను నిర్దేశించి వెడలిపోయినాఁడు. ఇరుపక్షములును యుద్ధసన్నాహమున నున్నవి. అట్టి సమయమున మన కవి శుక్రునిచేఁ దారకాసురునకు మంచి యాలోచనమును జెప్పించినాఁడు. కాని తారకుఁడు శుక్రుని మాటలను వినక యుద్ధ సన్నద్ధుఁ డయినాఁడు.

ఇక్కడి శుక్రతారక మంత్రాలోచనము రాజనీతికి నిలయము. నన్నెచోడుఁడు స్వయముగా రాజు. రాజనీతి కుశలుఁడు. కావున నీ పట్టును బహు చతురతతో రచించినాఁడు. ఇది యేదో యెక్కడనో జరిగినట్లును శ్రుతపాండిత్యమో ? గ్రంథపాండిత్యమో ? ఆధారముగాఁ జేసికొని వ్రాయఁబడినట్లునుగాక నన్నెచోడ మహాకవి శాస్త్రపాండిత్యము ననుభవముతో సమన్వయపఱచి యుక్తియుక్తముగాఁ గన్నులముందఱ జరిగినట్లు రచించిచూపినాఁడు. శుక్రతారకుల సంభాషణములోని వైచిత్రి నరయుదము.

దేవదూతవచ్చి తారకునకుఁ గుమారుని సందేశమును వినిపించినాఁడు. తారకుఁ డామాట విని "యీ కుమారుఁ డెవ"రని ప్రశ్నించినాఁడు. వాఁడు "కుమారుఁడు శివకుమారుఁ"డని చెప్పినాఁడు. తారకుఁడు వెంటనే గ్రహింపవలసి యుండెను. కాని వాని యప్పటిస్థితి యందు కనుకూలముగా లేదు. వాఁడాగ్రహావేశమున నున్నవాఁడు. ప్రక్కనే యున్న శుక్రుఁడు దీనిని గ్రహించినాఁడు. అయినను మాట్లాడలేదు. సమయమునకై వేచి, వేచి, అందు కనుకూలసమయము లభింపఁగానే తారకునకు చక్కని హిత ముపదేశించినాఁడు. కాని యప్పటికే పరిస్థితి చేఁజాఱిపోయినది. అంతేగాదు తారకుని స్వభావమును శుక్రుని వచన పరిపాలనమున కనుకూలమయినది గాదు. వీఁడు రాక్షసులందు హిరణ్యా

కశిపు రావణాదుల కోవకుఁ జెందిన మానధనుఁడు. (సమయమాసన్న మైనప్పుడు) చావునకు జడియని పరాక్రమశాలి. కావుననే శుక్రుని వాక్యములకుఁ జక్కని సమాధానముచెప్పి యుద్ధోన్ముఖుఁడైనాఁడు.

శుక్రుఁడు తారకునితో నెట్లు మంత్రప్రసక్తిని గొని వచ్చినాఁడో చూడుఁడు :

"తా నేలవచ్చు భూసతి
మానవపతి చరిత నీతిమార్గంబైనన్
తా నేల వచ్చు భూసతి ?
మానవపతి చరితనీతిమార్గంబైనన్." (10-180)

నీతియుత చరితముగల రాజు భూమి నవిచ్ఛిన్నముగా నేలుటలో సందియము లేదు. నీతిబాహ్యమగు చరితగల రాజును భూసతి విడిచిపెట్టుననుటయు సందేహము లేనిదే. కావున రాజు రాజనీతినెఱిగి కార్యముల సాధింపవలయునేకాని తొందఱపడి కార్యమును జెఱుపరాదు. సర్వదా పరాక్రమమే సమస్తకార్యముల సాధింపలేదు. తాటిచెట్టెక్కువానిని తల దన్నువాఁ డుడకపోఁడు. ఆ విషయమును రాజెఱుంగవలెను.

"తన కధికుల కతిభక్తియు,
మనమున నెయ్యంబుఁ దన సమానులకును, హీ
నునియందుఁ గృపయుఁ, జేకొని
మను జనునకు వగయుఁగలదె మదిఁబరికింపన్?" (10-187)

రాజు ఏచింతయు లేక తన రాజ్యమును బాలించుచు సుఖముగా నుండుటకిది యుపాయము. ఇది శుక్రుఁడు తారకునకుఁ జెప్పిన దాని సారాంశము. ఈ పద్యము కొంచెము వివరింపఁ దగినది.

పై పద్యమును శుక్రుఁడు తారకునకుఁ జెప్పినట్లు కవి రచించినను నన్నెచోడుని నాఁటి రాజకీయ పరిస్థితులలో రాజ్యమును గాపాడుకొనుటకింతకంటె వేఱొక యుపాయము పనికిరాదనుట యానాఁటి రాజకీయ స్థితిని జూచినఁ దెలియును.

నన్నెచోడుఁ డొక చిన్నరాజ్యమునకుఁ బ్రభువు. పూర్వులు దొడ్డవారే. కాని యాతనినాఁటిస్థితి యది. అంగబలముగాని యర్థబలము గాని యెక్కువలేని రాజ్యమాతనిది. ఒకవైపు తనతో సమానులగు మాండలిక ప్రభువులును, మఱియొకవైపు విశాలమయిన చోళసామ్రాజ్యమును నానాఁటి యాతని సమకాలమున ప్రభుత్వమును నెఱపు వ్యవస్థలు. కొంచెము సమకాలముననో, ముందుగానేనో, పశ్చిమచాళుక్యుల దండయాత్రలకాంధ్రదేశము దద్దరిల్లినట్లానాఁటిచరిత్రాంశములు వచించుచున్నవి. మఱియొకవైపు కాకతీయులు సామ్రాజ్యమును విస్తరింపఁజేయుట కెదిరి చూచుచున్న దినములవి. ఇట్టి స్థితిగతులు తన చుట్టుముట్టు నున్న తఱుణమున నొక చిన్న రాజ్యాధిపతి యెట్టి నీతి నవలంబింపవలెను ? దానికే పైపద్యము సమాధానము. ఆ నీతి నమలుపఱచి సుఖశాంతులతో తన రాజ్యమును ఎట్టి చింతయు లేక యేలుకొనఁ గలిగినవాఁడు కావున నన్నెచోడుఁడు "కవిరాజశిఖామణి"గాఁ బేరు పొందఁగలిగినాఁడు.

కావుననే నన్నెచోడుఁ డుత్తమ రాజనీతి విశారదుఁడని వచించుట యుక్తియుక్తమగుచున్నది.

శుక్రునకుఁ గుమారునిచేఁ దారకుఁడు తెగుననుటముందే తెలిసినది. కావుననే యాతఁడు యుద్ధముమాని దేవతలతో సంధిచేసికొని సుఖముగా బ్రదుకుట మేలని తారకాసురునకుఁ జెప్పినాఁడు. ఆ విషయము తారకునకుఁ దెలియదా ? వానికిని దెలియును. అయినను నాతఁడు యుద్ధము చేయుటకే కృతనిశ్చయుఁడయ్యెను. కావుననే తారకుఁడు హిరణ్యకశిపు దుర్యోధనాదుల కోవకుఁ జెందిన మానధనుఁడని వచించితిని. కవి యుద్దేశము నిదియే. అందుకనియే నన్నెచోడుఁడు తారకునిచే నేమని చెప్పించినాఁడో చూడుఁడు :

"మంచిగఁ బ్రీతిబాయక సమస్త జనంబులుఁ దన్నుఁగొల్వ జీ
వించిన ధన్యుఁ డా మహిమ వీడిన జీవము మేన నిల్పనా

సించి విభుండు దానొకట సేవకుఁడై మనుకంటె ముందఱా
ర్జించిన కీర్తినిల్వ గతిసేకుఱగా నని చావు సేగియే?" (10-197)

పందియై పదేడులు జీవించుటకన్న నందియై నాల్గునాళ్ళు బ్రదుకుట యుక్తమని తారకుని భావము. అతఁ డింతదనుక సను సైశ్వర్యము లనుభవించినాఁడు. సమస్త సుఖములఁ జూరగొన్నాఁడు. కీర్తిని సంపాదించినాఁడు. ఆ కీర్తి, సుఖము, ఐశ్వర్యము నశించువేళ వచ్చినది. అవి పోయిన పిమ్మట వాని బ్రదుకెందుకు? ఒకనికి సేవకుఁడుగాఁ జిరకాలము బ్రదుకుటనా తారకునివంటి పరాక్రమశాలి యపేక్షించఁదగినది? వా డిందుకేనా బ్రహ్మనుఁ గూర్చి యంత తపమొనరించినది? కాదు. కావుననే యట్టి స్థితి పోనున్నదని వానికిఁ జింతలేదు. ఇఁకఁ బ్రాణము పైనను దీపిలేదు. తీపిలేకపోవుటయేగాదు. ఏహ్యాభావము గూడఁ గలిగియుండును. నేటిదనుక వాఁడు కోరినదెల్ల లభించినది. అట్లు లభింపని దొక్కటే. అది చావు. అది నేఁడు లభింపనున్నది. అట్టి యవసరమును వాఁడు వ్యర్థపఱచుకొనెనా మఱల కోరినను నది లభింపక పోవచ్చును. చావేగాదు వానికింక నేమియు లభింపదు. ఆ స్థితికన్న హీనస్థితి మఱియొకటి యుండునా? బ్రదుకుటలో సౌఖ్యములేక చచ్చుటకు వీలులేని స్థితి అది. జీవులు బ్రదుకు నేల కోరుదురు? సుఖముగా జీవించుటకేగదా! అది లభించునాశ నశించిననాఁడు జీవించవలయునను కోరికయు నశించుట సహజము. కావుననే తారకుఁడు శుక్రునిమాటలు వినక యుద్ధమునకు సిద్ధమయినాఁడు. ఇది నన్నెచోడ మహాకవి తారకుని పాత్రమును పోషించిన విధానము. తారకుఁడు దుర్మార్గుఁడే. లోక కంటకుఁడే. అయినను యుక్తాయుక్త జ్ఞానములేని మూర్ఖుఁడుకాఁడు. పరిపాలనా సామర్థ్యములేని చచ్చు దద్దమ్మకాఁడు. వానిరాజ్యమున జనులకు సౌఖ్యమే కాని దుఃఖముండరాదు. ఇందుకుఁ బ్రాకృతిక ధర్మములను మాఱవలసినదే. ఋతుధర్మములయినను గతితప్పి తారకాజ్ఞకు లోఁబడవలసినదే. అది వాని శాసనము. అట్లు రాజ్యపరిపాలనము నింద్రునికన్న మిన్నగాఁ

జేయఁగలిగిన ప్రతిభాశాలి తారకుఁడు. కనుకనే యింద్రుఁడు దిక్కులేక కుయ్యో మొఱ్ఱో యని మొత్తుకొనవలసి వచ్చినది.

కవిరాజీ తారకుని పాత్రము నింత యుదాత్తముగా సృష్టించి, వాల్మీకి భారవులకోవలో స్థానమును సంపాదించినాఁడు. భారవి దుర్యోధనుని పరిపాలనమును గూర్చి కిరాతార్జునీయ ప్రథమ సర్గయందు వనేచరునిచే పదునెనిమిది శ్లోకములచే ధర్మరాజునకుఁ జెప్పించినాఁడు. అవి దుర్యోధనుని పరిపాలనా కౌశలమును చక్కగా వివరించుచున్నవి. అందు లోని దొక్క పద్యము :

"వసూని వాంఛన్ నవశీ నమన్యునా
స్వధర్మ ఇత్యేవ నివృత్తకారణః
గురూపదిష్టేన రిపౌ సుతేఽపి వా
నిహంతి దండేన స ధర్మవిప్లవం" (1-13)

ఇంత ధర్మమార్గమునఁ బ్రవర్తించిన రారాజు దుర్యోధనుఁడు. కనుకనే ప్రజలు ధర్మజునెడల ననురక్తులయ్యు దుర్యోధనుని పరిపాలనమును సహించినారు. అట్టి రహస్యమును గుర్తించినవారే మహాకవులు. భారవి యట్టివాఁడు. నన్నెచోడుఁ డట్టివాఁడు. వాల్మీకియు నట్టివాఁడే. విభీషణునిచే రావణుని గూర్చి యాతనిముందు వాల్మీకి యేమని చెప్పించెనో చూడుఁడు :

"న ధర్మవాదే నచ లోకవృత్తే న శాస్త్రబుద్ధిగ్రహణేషు చాపి
విద్యేత కశ్చిత్తవవీరతుల్య స్త్వం హ్యుత్తమ స్సర్వసురాసురాణాం."
(సుందర. 52 సర్గ. 17 శ్లో.)

తారకాసురునివలెనే రావణ దుర్యోధనులును జావునకు భయపడలేదు. వీరోచితముగాఁ జచ్చుటయే వారి కోరిక.

మహాకవి తారకుని మంత్ర వృత్తాంతమును రమ్యముగాఁ జిత్రించినాఁడని వేరుగాఁ జెప్పఁబనిలేదుగదా!

## 7. యాత్రా వర్ణనము

కుమారుఁడు తారకాసురుని జయించుట కమర సేనావాహినితో రణరంగమును జేరుటకుఁ జేసిన ప్రయాణమును మన కవిరా జేకా దశాశ్వాస ప్రారంభమున వర్ణించియున్నాఁడు. ప్రయాణ వర్ణనమున నుండఁ దగిన విశేషాంశములను గూర్చి ప్రాచీను లీ క్రింది విధముగా వచించిరి :

"ప్రయాణే భేరి నిస్స్వాన భూకంప బలధూలయః
కరమోక్ష ధ్వజ చ్ఛత్ర వణి క్ఛకట వేశరాః".

(సా. ద. వివృతి పూర్తి)

ఏకాదశాశ్వాస ప్రారంభమునందుఁ గుమారస్వామి తారకు నిర్జించుటకై విజృంభించి ప్రస్థానభేరిని వాయింపం బంచినాఁడు. ఆ ప్రస్థానభేరీ ధ్వని విని యమరసేనానివహ మొక్కసారి యుద్ధమునకు సన్నద్ధ మయినది.

ఆ సందర్భమున సేనానివహంబునఁ గలిగిన సంక్షోభమును గవి యీ క్రిందివిధముగా వర్ణించినాఁడు ;

"దారలు వట్టఁ బంపు తలతంత్రముఁ దావడి పంపు రత్న భం
డారముతోడ గుఱ్ఱపు దడంబులు ముంగలి పంపు సందడిం
జేరఁగనీకు మేనుగులఁ జిందముల న్మొఱయింపు మెక్కడే
వారువమందు పంపు సహవాసుల నంతిపురంబు కాపుగాన్".

(11-6)

ఇవి యక్కడివారు ఇతరుల కిచ్చు నాదేశములు. "ఒక్కడు బాకాలూదుమని యాజ్ఞాపించినాఁడు (మఱొక్కడు కత్తులకు పదనుపెట్టుమని యఱచినాఁడు). ఇంకొక్కఁడు "ముందు రత్నభండార మున్నది. దానిని గాపాడుటకు సైన్యమును, గుఱ్ఱపుదళమును బంపు"మని హెచ్చరించి నాఁడు. మఱి యింకొక్కఁడు శంఖము లూదుమన్నాఁడు. అంతకుముందే మఱియొకఁడు ఏనుఁగుల కే చప్పుడును వినరాకుండఁ జూడుఁడని

వచించినాఁడు. మఱియొకఁడు మనతో వచ్చిన స్త్రీలను గాపాడుటకై రక్షకుల నియమింపుమని యఱచినాఁడు." ఇవి యన్నియు వినుపించు కొన్నవా రున్నారో? లేరో? పెద్ద యలజడి. అందఱును అందఱకును హెచ్చరికలు చేయువారే. అంత హఠాత్తుగా వారికి భేరీరావము వినబడినది. వారి కాలోచనమున కవకాశము లేదు. వెంటనే బయలుదేఱవలె. వేగముగాఁ బనులన్నియుఁ బూర్తిగావలె. అందఱకును తొందరయే. ఎవరితొందర వారిది. ఈ సంక్షోభము నంతను కన్నులకుఁ గట్టినట్లు వర్ణించినది పై పద్యము.

ఇంత సంక్షోభ మిట్లు జరుగుచుండఁగానే సేనాని యేనుఁగుపై నెక్కి ముందుగా ప్రయాణము సాగించినాఁడు. అతని గజారోహణమును గవి యిట్లు వర్ణించినాఁడు :

"చెలఁగన్ నిర్జర దుందుభుల్ మునిగణాశీర్వాద నాదంబుతోఁ
జెలువొందన్ సురపుష్పవృష్టి గుఱియన్ శేషాక్షతౌఘంబుతో
నలి నీశాత్మజుఁ డెక్కె బృంహితరవానందాశ్రుదానాంబు స
ల్లలితేభంబు దినేశ్వరుం డుదయ శైలం బెక్కిన ట్లున్నతిన్"

(11-8)

ఇక్కడ నొక విషయము ప్రస్తావించుట యప్రస్తుతము గాదు. కుమారస్వామి మయూర వాహనుఁడు. శివపురాణమునందు కుమారస్వామి విమానారూఢుడై తారకాసురునితోఁ బోరుటకు వెడలిన ట్లీక్రింది శ్లోకము చెప్పుచున్నది.

"విమానమారుహ్య తదా మహాయశా స్స శాంకర స్సర్వగుణై రుపేతః
శ్రియాసమేతః పరయా బభౌ మహాన్ సంవీజ్యమాన
శ్చమరై ర్మహాప్రభైః"

(శివపు. కుమారఖం. 6 అ. 16 శ్లో.)

మన నన్నెచోడ మహాకవి కుమారుని వాహనమగు మయూరమునకు యుద్ధరంగమునఁ బ్రవేశము నొసఁగలేదు. దీనికిఁ గారణము

మయూరము యుద్ధమునకుఁ బనికిరాదని యాతఁడు భావించియుండును. మఱి శివపురాణమునందువలె కుమారుని విమానారూఢుని గావించి తారకునితోఁ బోరింపవచ్చును గదా! కవిరా జట్లును జేయలేదు. కుమారుని గంధగజముపై నారూఢు నొనర్చియే రణరంగమునకుఁ బంపినాఁడు. ఇందు కేదేని కారణ ముండియుండవలెను.

ఆలోచింపఁగా గుమారసంభవమునందలి యీ యుద్ధము, యుద్ధయాత్ర నన్నెచోడుని నాఁడు జరిగినవాని వలెనే కనిపించును గాని యెక్కడనో పురాణకాలమున జరిగినట్లు కానరావు. నన్నెచోడుని కాలమున హైందవరాజులు కాని, సేనానాయకులు కాని వాహనముగా నుపయోగించినవి యేనుఁగులేయని చరిత్రజ్ఞులు వచించుచున్నారు. భారత కాలమునందున్న రథముల యుపయోగ మీ కాలమునకుఁ జాల భాగము వెనుకపట్టినది. మహమ్మదీయులు మనదేశము నాక్రమించిన తరువాత మన యుద్ధ విధానమునఁ గొన్ని మార్పులు జరిగినవి. వానిలో ముఖ్యమయినది అశ్వముల యుపయోగము. ఈ యాశ్వికులను సైతము మన కవిరాజు యుద్ధమునకు రప్పించినాఁడు. కావుననే తన కాలపు టాచారము ననుసరించి నన్నెచోడమహాకవి కుమారస్వామికి గజమును వాహనముగాఁ గూర్చినాడు.

శివపురాణమున యాత్రావర్ణన మింత విపులముగా లేదు రామాయణమునందుమాత్ర మట్లుకాక రాముని ప్రస్థానము మిగుల మనోహరముగా వర్ణితమయినది. నన్నెచోడ మహాకవి దాని ననుసరించి తన కావ్యమున విపులముగా నీ వర్ణనము గావించియుండును.

శివకుమారుని వాహనమును మార్చినను దిక్పతులు వారివారి వాహనముల మీఁదనే యుద్ధమునకు వచ్చినట్లు చెప్పినాఁడు కవిరాజు. దేవతాపక్షమున యుద్ధమునకు వచ్చినవా రొక్క యమరులే కారు, భూచరులు, ఖేచరులును వచ్చినారఁట. అప్పటి యా సేనాసమూహము పయనించిన విధముఁ గనుఁడు:

"అశ్వాశ్వతర శిబికాందోళ కరి కరి
ణీకర భారదానీక వాహ
నంబులు నిజ విభవంబులు వెలయంగఁ
గరమర్థి నెక్కి భూచరులు నడవ
మానితానేక విమాన సహస్రముల్
పరువడి నెక్కి ఖేచరులు నడవ." (11-12)

నా సేనావాహిని కదలి సాగినదఁట. పై పద్య ప్రథమ పాదమున నానాఁడు రాజులు యుద్ధసమయముల నుపయోగించు వాహనములన్నియు వర్ణితములైనవి. ఆనాడు గుఱ్ఱములేకాక కంచరగాడిదలుసైతము వాహనములుగా వాడఁబడుచుండెడివని పై పద్యములోని "యశ్వతర" శబ్దము సూచించుచున్నది.

నడుచుచున్న సేనల బాహుళ్యమును వర్ణించు నీ క్రింది పద్యమును జూడుఁడు.

"నలుగడ నింతయంతయని నాలుకఁ జెప్పగఁ బెద్ద యమ్మెయిం
గల నిజ మింతయంతయని కన్నులఁ జూడగఁ బెద్ద తద్దయుం
జెలువుగ నింతయంతయని చిత్తమునం దలపోయఁ బెద్ద నాఁ
బొలిచె మహేశు పేర్మియును బోలెఁ గుమారు బలం బనంతమై."
(11-13)

ఆ సైన్య నివహ మింతగలదని నాలుకతోఁ జెప్పరాదు; కన్నులఁ జూచుటకైన సాధ్యముగాదు; చిత్తమునందయిన నూహింపరాదు. అంత గొప్ప సైన్యముతో బయిలుదేరినాఁడు సేనాని యుద్ధమునకు.

ముందర నింద్రుఁడు, వెనుక వరుణుఁడు, ప్రక్కలకు యమ కుబేరులు, మీద ఖేచరనాథులు, భూమిపై నర్గళములవలె నహీంద్రులు రాఁగా నా సేనాని పయనమును సాగించెను. ఆ పద్యమును జూడుఁడు :

"ఎలమిఁ గుమారు ముంగలి సురేంద్రుఁడు రా నుదధీశ్వరుండు పిం
గలి నడవం గుబేరుఁడును గాలుఁడు నేర్పడఁ బన్ని ప్రీతితోఁ

గెలఁకుల రాఁగ మీఁదఁ దగు ఖేచరనాథులు రా నహీంద్రు ల
ర్గలగతిఁ గ్రిందరాగఁ ద్రిజగద్భరితంబయి తోచె వాహినుల్."

(11-16)

పై పద్యమునం దొక విశేషమున్నది. కుమారునకు ముందర నింద్రుఁ డున్నాఁడు. వెనుక వరుణుఁ డున్నాఁడు. కుడి యెడమలందు యమకుబేరు లున్నారు. ఇది కవిరాజు చెప్పిన వరుస. కుమారుఁ డే వైపుగాఁ బయనించుచున్నాడో కవిరాజు వచింపలేదుగాని యీ పద్యము జూడఁగా నాతఁడు తూర్పుదిక్కు పయనించుచున్నట్లు తోఁచుచున్నది. తూర్పునకేగుచున్న కుమారునకు ముందున్నవాఁ డింద్రుడు. అతఁడు తూర్పున కధిపతి. పశ్చిమమున కధిపతి వరుణుఁడు. కనుకనే యాతఁ డిప్పుడు సేనానికి వెనుక నున్నాఁడు. ఇట్లే దక్షిణాశానాథుఁ డగు యముఁడు దక్షిణ పార్శ్వమునను, ఉత్తరదిక్పతి యగు కుబేరుఁ డుత్తరమునను నున్నారు. స్వస్థానములందున్నవారు కుమారుని రక్షణమునకు సర్వవిధముల సమర్థులగుదురు. స్థానములు మారినచో వారా పనిని చేయఁజాలరు.

ఎద్దులందుఁ గొన్ని వలపల నడచు నలవాటు గలిగియుండును. మఱికొన్ని దాపల నడచు నలవాటు గలిగియుండును. బండితోలువాని కీవిషయము తెలియవలయును. లేకున్న నెడమవైపు నడచుట కలవాటు పడిన యెద్దును గుడివైపు గట్టినను, కుడివైపుదాని నెడమవైపు గట్టినను నా బండి సురక్షితముగా గమ్యమును జేరునను నమ్మకముండదు.

ఈ దిక్పతు లట్టివారు. వారివారి స్థానములందున్నప్పుడే వారుప యోగింతురు. స్థానము మాఱిన వారి కా శక్తి లేదు. ఈ విషయము నెఱిఁగియే కవిరాజు దాని కనువుగాఁ బై పద్యమును రచించినాఁడు.

తరువాతఁ గుమారుసేన తీఁగవలె నున్నదని చమత్కరింపఁ బడినది. ఆపద్యమును బరికింపుఁడు :

"గంధసింధురములు గండంబులుగ మహా
వ్యాళసమూహముల్ మూలములుగ
నస్త్రశస్త్రానీక మంకురోద్గమముగా
వరకేతుతతి పల్లవములుగాఁగఁ
జదలంది క్రాలెడు చామర చ్ఛత్ర దం
డమ్ములు శాఖాచయమ్ముగాఁగ
మణిభూషణ సమితి కుట్మల గుచ్ఛములుగాఁగ
వివిధాతపత్రముల్ విరులుగాఁగ
మానితాప్సరోవిమాన మాలికలోలిఁ
బొలియు క్రమానఁ బండుగొలలుగాఁగ
బలసి త్రిభువనములు బందిరిగా దేవ
దేవతనయు వాఁగుఁదీవ వఱచె." (11-17)

పై పద్యమునందు సేనాబాహుళ్యము చక్కఁగా వర్ణితమయినది. అంతే గాదు. సైన్యము తీఁగయని చెప్పుట నీ సైన్యము లోకకంటకమయినది గాక తీగఁవలె ముల్లోకములపై నల్లుకొని చల్లనినీడ నిచ్చి జనులకానంద కారకమయినదని సూచింపఁబడుచున్నది. ఇట్టి భావమునే మఱియొక పద్యముచే దేవసేనను వర్షాగమముతోఁ బోల్చి (11-18) సూచించినాఁ డీమహాకవి. వర్ష మెంతజోరుగాఁ గురిసి తాత్కాలికముగా భీతికి హేతు వయినను దరువాత దాని ఫలితములు లోకమునకు క్షేమమునే కూర్చును. ఈ దేవసేనలోని యౌద్ధత్యము నట్టిదేయని కవిరాజుభావన. వర్షాకాలము కొంత గడచిన తరువాత వచ్చువానలు పరదలకు హేతువులే. అవి మఱల సత్ఫలితము లీయవు. కావుననే కవిరాజు నిర్జరవాహిని "క్రొక్కాఱో" యనునట్లున్నదని యుక్తముగా వచించినాఁడు. ఈసేన యుద్ధభూమిని సమీపించి యారాత్రి విశ్రమించు విధము బహారమ ణీయమయి కవికి యుద్ధములందుఁగల యనుభవమును, ప్రతి "వస్తువును సహజముగా చిత్రించు నేర్పుగల"దనుటను దెలుపుచున్నది.

దేవసేన యుత్సాహముతోఁ బయనించి తారకాసురుని దూత చెప్పిన యుద్ధభూమిని జేరుకొని మహానదీతీరమున విడిసినదఁట. అప్పుడు సేనలు విడిసిన విధమును కవి యిట్లు వర్ణించినాఁడు :

"వాహనంబులు డిగ్గువారును, పన్నులు
విడుచువారును, తమ వీళు లెఱుఁగఁ
దమతమ చిహ్నముల్ దనరఁగఁ బట్టించు
వారు, నొండొరుఁ బిల్చువారుఁ, జెలఁగి
గుళ్లు మండియలును గూడారములును బం
దిళ్ళును గలయ నెత్తించువారు,
మడుగులపొందుల, మ్రాకుల నీడల
పెరవులఁ గని కని విడియువారుఁ
బిఱుఁదఁజిక్కినవారలఁ బిలువఁబోవు
వారు, నెడఁగని తోడ్కొని వచ్చువారు
వీళులెఱుఁగక వెసఁదప్పి వెదకువారు,
నెటిఁగి తమతమ వీళ్ళకు నేగువారు." (11-29)

విడియు స్థానముఁ జేరఁగానే సైనికులు ముందు వాహనములు దిగినారట. అక్కడినుంచి వారి సందడి యారంభమయినది. ఏర్పాట్లు ప్రారంభమయినవి. ముందు పన్నులు విడిచినఁగాని గుడారములకు వలయు సాధనములు లభింపవు. ఆపని గావించినారు. అన్ని గుడారము లొకే విధముగా నుండిన గుర్తించుట యెట్లు ? అందుకని తమతమ చిహ్నములను వాని కదికించినారు. ఇఁక గుడారముల నిర్మించుకొన వలెను. కాని యవి యొక్కరే నిర్మించుకొన వీలుగాదు. కావున సహాయార్థమై యొక్కరి నొక్కరుఁ బిల్చుకొన్నారు. అందఱకును తొందరయే. ఎవరికివారే తమ గుడారము ముందు లేవవలయునని భావించినారు. కనుకనే యలజడి. సరే ! ఎట్లో సద్దుకొన్నారు. గుళ్ళు, మండియలు, పందిరులు, గుడారములు సిద్ధమయినవి. అందు సామాను సద్దినారు

కొందఱు. మఱికొంద ఱీగుడారములందు "గోల"గా నుండునని దూర
ముగాఁ జెట్లనీడలందు నీటిపట్టుఁ జూచుకొని విశ్రమింప నరిగినారు.
ఇట్లు తమసంగతి తాము చూచుకొనినపిదపగదా ! ఇట్టి సందర్భములలోఁ
దమవారినిగూర్చి యాలోచించుట సంభవించును. వారు స్వస్థపడి తమ
వారింకను వెనుకనే యుండుట నెఱిఁగి వారిని తోడ్కొనిరాఁ గొంత
మంది వెడలినారు. మఱికొంతమంది వెనుకకుఁ జిక్కినవారు తమ
గుడారముల విషయము తెలియక వెదకివెదకి యక్కడివారి నడిగి
యడిగి తుదకు తాముండఁదగిన గుడారములఁ జేరుకొనుచున్నారు."
ఇట్లు వీరందరిచే సేనా నివహమంతయు సందడిగా నున్నదని కవిరాజు
పై పద్యముచే వర్ణించినాఁడు.

ఈ వర్ణనమునకు సామాన్యానుభవము చాలదు. అనుభవమున్నను
జెప్పుటకు వలయు చతురత వలయును. కన్నులకుఁ గట్టినట్లు వర్ణించు
శక్తి యీ కవిరాజునకుఁ గలదనుటకుఁ బై పద్య మొక్కటి చాలును.

ఇంతకు నీ సేన లింత తొందరపడుటకుఁ గారణ మేమియో
యెఱుఁగుదురా ? అది సాయంసమయము. చీకటి యయినచోఁ బై పను
లన్నియుఁ జేయలేరు. అందేయొక్కటియును సాధ్యముగాదు. కనుకనే
పాపము ! వారు త్వరత్వరగా నన్ని యేర్పాటులను పూర్తిచేసికొన్నారు.
ఏమాత్ర మాలస్య మయినను వారికి చాల కష్టమయ్యెడిది. ఇప్పుడును
వారన్ని పనులు పూర్తిచేసికొని కొంచెము విశ్రాంతిఁ గైకొనినారో ?
లేదో ?

"శివుతనయు బలపదాహతిఁ
గవిసిన మెయి ధూళి వోవఁ గడిగికొనంగాఁ
దివిరి చనుకరణి నిజమతి
రవి రయమునఁ బశ్చిమాంబురాశికిఁ జనియెన్" (11-31)

ఎంత శ్రమ ! ఎంతో దూరమునుండి పయనించిరాక ! దానికిఁ
దోడు దేహమునిండ దుమ్ము ! వచ్చినంతనే శిబిరములలోఁ బై జెప్పి

నంత హడావుడి! ఇంత యలసట గలిగినప్పుడు స్నానము చేయకున్న నెట్లు? అందుకే సూర్యుఁడు తన దేహముఁ గడిగికొనఁ బోయినాఁడు! సైనికు లేమిచేసిరో? వారును ధూళిధూసరిత శరీరులై సూర్యునివలెనే శ్రమకు లోనయిరి గదా! కవిరాజు చెప్పలేదు గాని వారును "మెయి కడిగికొని"యే యుందురు! వారికి ముం దిది తోచకున్నను సూర్యుని జూచియయిన నా పనికి వారును గడఁగియుందురు! కూర్పున్న నిది!

ఇంకఁ దెల్లవారిన యుద్ధము. ఆ రాత్రి వారు శిబిరములందు మెలఁగిన విధము బహు రమణీయముగను, సందర్భోచితముగను, అతి సహజముగను వర్ణించినాఁ డీ కవిరాజు.

రాత్రియయిన పిదపఁ గాగడాలు వేయించినారఁట. తరువాత "ననంత మాండలిక, మహాసామంత, దండనాయక, అమాత్య, భృత్యా ద్యఖిలజనపరివృతులై" అనంతశయన, సురాధీశ్వర, దిగధీశ్వరాది, భువనభవనాధీశ్వరులు తమతమ శిబిరములందుఁ బేరోలగం బున్నారఁట.

కుమారుని సేన అనంతము. కుమారస్వామి దానికి సర్వసేనాని. ఆయనయే సర్వ నియంత. నారాయణుఁడు, అష్టదిక్పాలకులు, తదితర భువనాధీశ్వరులు, కుమారుని క్రింది దండనాయకులు. వారికి మఱల మాండలిక, మహాసామంత, దండనాయకామాత్యులు సహాయకులు. వారిక్రింద మఱలఁ గొంత సైన్యము. ఇది యా సేనల విభాగ విధానము. ఇట్టి విభాగములే లేకున్న నంత యనంత సైన్యము నడుపులోనుంచి యొక త్రాటిమీఁద నడపుట సాధ్యమా?

ఇప్పుడు యుద్ధమునకు ముందొక్కసారిగా దండనాయకులు తమ క్రిందివారి నందఱ నొక్కచోఁ జేర్చి కొలువు దీరినారు. యుద్ధములో నెవరెట్లు ప్రవర్తింపవలయునో? ఏమేమి చేయవలయునో? నిర్ణయము చేసికొని యా నిర్ణయము ప్రకారమే యుద్ధమును క్రమశిక్షణముతో సాగింపవలయును. అంతేగాక భటుల ధైర్యోత్సాహములను గనుగొనుటయు, వానిని పెంపొందించుటయు నాయా నాయకుల కిప్పు డవశ్యకర

జీయములు. వెనుక బీరములాడి యుద్ధమునకు సిద్ధమయినవా రందఱు నిప్పుడు తీరా యుద్ధ మారంభ మగుసరికి నిలచెదరో? లేక భీరువులై పాఱెదరో? ఎవరు చెప్పఁ గలరు? అందును బ్రతిపక్షము బలహీన మయినది గాదు. వారికి నాయకుఁడు తారకుఁడు. ఆ తారకాసురుని దెబ్బ సురలకుఁ దెలియనిది కాదు. ఇదివఱ కాతని పేరు చెప్పిననే యింద్రాదులకు హడలు! ఇఁక సామాన్యుల మాట చెప్పవలెనా? కనుకనే అన్ని విషయములఁ బరీక్షించి కార్యవిధానమును నిర్ణయించుటకు సేనాపతులు తమ తమ శిబిరములందు సమావేశ మయినారు.

దిగధీశుల ప్రమేయ మవసరము లేకయే భటుల యుత్సాహ వాక్యములు ఘానభోఽంతరములు నిండిపోయినవి. అప్పటి వీరభటుల వచనములను నన్నెచోడ మహాకవి పదునైదు పద్యములచేత వర్ణించి నాఁడు. భటులందఱును యుద్ధ మెప్పుడెప్పుడని యెదిరి చూచుచున్న వారివలెను, ప్రభుభక్తి పరాయణులుగను, శూరులుగను, విశ్వాసపాత్రులుగను, క్రమశిక్షణ గలవారుగను నున్నట్లు ఆ భటుల వచనములు చదివినఁ దెలియును. ఈ భట వచనములను బట్టి కవిరాజ శిఖామణికాలము లోని యనేక యుద్ధ విషయములు తెలియ వీలున్నది. ఒక వీరుఁడు పలికిన వాక్కులు వినుఁడు:

"కనుచూడ్కిఁ దునియలుగా నేయు విలుకానిఁ
గవిదలఁ బడవైచు సవడికానిఁ
గొనిమిట్టి పడవైచు కొంతంపుకానిఁ బి
ట్టెడ లుచ్చిపోవైచు నిడెకానిఁ
గడిఖండముగఁ జేయు కడితలవాని జ
ర్జరితంబుగాఁ బొడ్చు చురియవాని
నెంపనుర్పుడుసేయు నేనికకాని ము
క్కొఁయ్యలు వడ ద్రయ్యు గుంటుకాని

మిగుల నిన్ను నన్ను మిగులదు ననువారి
మిగిలి మాఱువీట మిగిలివచ్చు
మగలనెల్ల నేను మగిడింతు నెక్కటి
వీరుఁడనఁగ రెండు వీళ్ళయందు." (11-39)

పైపద్యమునం దానాఁటి యాయుధములు వర్ణితములయినవి. వానితో యుద్ధముచేయువా రానాఁడు విశేషముగా నుండియుందురు. ఈ యాయుధము లందుఁగొన్ని యాంధ్రదేశ్యములయి యుండును. ఆనాడు వాడిన యాయుధము లివియఁట. (1) విల్లు, (2) సవడి, (3) కొంతము, (4) ఈటె, (5) కడితల, (6) చురియ, (7) ఏనిక, (8) గుంటు. వీనిలో విల్లు, ఈటె, చురియలు తక్క తక్కినవాని యాకారము మన కెఱుఁగరాదు. "కొంతము" కుంతశబ్దభవమనుకొన్నచో నదియొక యాయుధ విశేష మని నిఘంటువు లర్థముఁ జూపును. వీనిలోఁ గొన్ని శబ్దములను బలు మాఱు వాడినాడు. ఎన్నిసారులు వాడిననేమి? తరువాతివారు వానికి తమ గ్రంథములందు స్థానమీయ కుండుటచే నవి మనకుఁ దెలియని స్థితి యేర్పడినది. "ఏనిక" నేనుఁగుగానే మన మెఱుఁగుదుముకాని యాయుధ విశేషముగా నెఱుఁగము. ఇట్లు నన్నెచోడుఁడు సందర్భాను కూలముగా నానాటి విషయము లనేకములను గ్రంథస్థ మొనరించి యున్నాఁడు. సేవకులకు జీతముక్రింద జొన్నలిచ్చు నానాటి యాచారము నీసందర్భముననే యొక భటునిచేఁ జెప్పించినాఁడు.

స్వామిసేవకుల సంబంధ మెట్లుండవలెనో యను విషయమునఁ దన యభిప్రాయము నీ మహాకవి యొక భటునిచేఁ జెప్పించిన యీ క్రిందిపద్య మాతని రాజకీయ పరిపాలనానుభవ సామర్థ్యములకు నిదర్శనము :

"ఈవలయు నర్థము, ఇచ్చియు
సేవకు మన్నింపవలయు జితమతి విభుఁడు, ఆ

యీవికి మన్ననకుం దగఁ
జావలయు భటుండు పతికి జయముగఁ బోరన్." (11-44)

సేవకులును ప్రభువును నిట్టివారయిన రాజ్యమునకుఁ గొదవయుండునా? నన్నెచోడుని పరిపాలనమున నట్లుండవచ్చును. లేదేని ప్రస్తుతమున దేవతల పక్షమున యుద్ధమునకు వచ్చిన భటుల భావ మిట్టిది యనుకొన వలయును. అట్టి భటులుగల పక్షమున కపజయము సంభవించునా?

వీరుల వీరాలాపములఁగూర్చి వారి యుత్సాహమును బెంచుట కును, పిఱికితనమును బోఁగొట్టుటకును నొక్క వీరుఁడు వారి నేమను చున్నాఁడో పరికింపుఁడు:

"పొడవుచూడ మగల పొల్లలు నాళుల
పొల్లలును నిజంబపోలె నుండుఁ
గలన దూఱనెత్తగాఁ బాఱునప్పుడ
కాని చూచి యెఱుగఁ గాదు మున్న." (11-45)

"ఆళ్ళు ధాన్యవిశేషము. వానిలోని పొల్లగింజలు, చూచుటకు నిజమయిన యాళ్ళవలెనే కనిపించును. వానిని పైకెత్తి తూర్పారఁబట్టినఁగాని పొల్లలు బైటపడవు. భీరువులును చూచుటకు వీరులవలెనే కానవత్తురు. యుద్ధ మారంభమయి పరుగెత్తిపోవునప్పుడుమాత్రమే వారి నైజము కానవచ్చును" అని యా వీరుఁడు భీరువులను నిందించినాఁడు. ఇది సైనికుల పిఱికితనమును బోఁద్రోలుట కుపకరించును.

ఇట్లు వీరాలాపములాడి, చావన్న భయము వోయి, యే చింతయును లేని ఆనందము నందినారు భటులు. అప్పుడు వీరమద్దెలలు మ్రోసినవి. అప్పటి "స్కందుని స్కంధావారము ధరాంగనానర్తకి నర్తనస్థానము" వలె మనోహరముగా నున్నదని కవిరాజు వర్ణించినాఁడు. కావుననే భటులుత్సాహముతో నానందముగా నారాత్రి యుద్ధమునే కోరుచు "ఔమ్మనంజేయిడి నిద్రవోయినారు". మఱునాఁడే యుద్ధము.

## 8. సురత వర్ణనము

సురత వర్ణనమునం దుండఁదగిన విశేషాంశము లీ క్రింది శ్లోకమునఁ జెప్పఁబడినవి.

"సురతే సాత్వికా భావాః సీత్కారః కుడ్మలాక్షతా
కాంచీ కంకణ మంజీర రవో ఽధరనఖక్షతే"

కాళీదాస కుమారసంభవాష్టమ సర్గయందు శివపార్వతుల సురతము విపులముగా వర్ణింపఁబడినది. శివపురాణమునందును గిరిజాహరులు దేవమానముచే వేయి వత్సరములు విహారాసక్తితో నున్నట్లు వర్ణింపఁబడినది.

మన నన్నెచోడ మహాకవియు హర గిరిజల సురతమును నవమాశ్వాసమున వర్ణించి యున్నాఁడు. అంతేగాక యష్టమాశ్వాసమునందును గొంత యీ సురత ప్రసంగము గలదు.

చతుర్విధ పురుషార్థములందుఁ గామము మూఁడవది. కామమును గూర్చి మహామునులు శాస్త్రగ్రంథములనే రచియించినారు. వారిలో వాత్స్యాయనుని కామసూత్రములు మనకు లభించినంతవఱకు మొట్టమొదటివని పండితులు వచించుచున్నారు. అంతకుఁ బూర్వము నా శాస్త్రముగలదని వాత్స్యాయనముని తన గ్రంథమున ననేక స్థలములందు వచించినాఁడు. కాని యా గ్రంథములు నేడు మనకుఁ గానరావు. వాత్స్యాయనముని తరువాత నీ శాస్త్రమును గూర్చిన గ్రంథములును, వ్యాఖ్యానములు ననేకములు బయలుదేఱినను గామశాస్త్రమునుగూర్చి వాత్స్యాయనముని గ్రంథమునందువలె నా పురుషార్థమును గూర్చి యితర గ్రంథములందుఁ బవిత్రతానియమ విషయమునకుఁ బ్రాధాన్య మీయఁబడలేదనియు, నందుకని వాత్స్యాయనీయమే యుత్తమ గ్రంథమనియుఁ బెద్దల తలంపు. కామ పురుషార్థమును గుఱించి వాత్స్యాయనముని దృష్టి నీ క్రింది సూత్రము వివరించుచున్నది :

"శరీరస్థితి హేతుత్వా దాహార సధర్మాణోహి కామాః" (1-2-46)

ఈ సూత్రమునకు జయమంగళుని వ్యాఖ్యనరయుఁడు "అత్ర సంప్రతిపత్తి

మాహ. ఆహార సధర్మాణ ఇతి: ఆహార తుల్యాః యథా ఆహారః అజీర్ణాదిదోషం జనయన్నపి ప్రతిదినే శరీరస్థితయే సేవ్యతే, తథా కామోఽపి. అన్యథా రాగోద్రేకా దున్మాదదోషేణ చ న శరీరస్థితి రితి."

ఈ విధముగా ధర్మార్థ భంగముకాని కామపురుషార్థము దూష్యము కాదుగదా! పై పెచ్చు యుక్తాయుక్తముల నెఱిఁగి సేవించుటయ యుక్త మనియు వాత్స్యాయనముని మతము.

వాత్స్యాయనుఁడు తన గ్రంథమున సురతమును నాయికా భేద మునుబట్టి మూఁడు విధములుగ విభజించి, తద్విధానముల వచించి నాఁడు. నాయికలు స్వీయనిలయు (అనగా భార్యలు), పరదారలనియు, వేశ్యలనియు ముల్విధములవారు గలరు. ఈ మూడు ప్రకరణముల కాతఁడు భార్యాధికరణమనియు, పారదారికమనియు, వైశికమనియుఁ జేపలిడెను.

పైమూఁటిలో రెండవదగు పారదారికము కూడదని యాతఁడే యా ప్రకరణమున కంతమున నీ క్రింది విధముగా నిషేధించెను :

"పాక్షికత్వా త్ప్రయోగాణా మపాయానాం చ దర్శనాత్
ధర్మార్థయోశ్చ వైలోమ్యా న్నాఽచరే త్పారదారికమ్".

ఇఁకఁ బోగా మిగిలినవి రెండు. ఈ రెంటిని నన్నెచోడ మహాకవి తన కావ్యమున వర్ణించియున్నాఁడని ముందే వచించితిని గదా!

కవిరాజ శిఖామణి యష్టమాశ్వాసమున వైశికమును, నవమా శ్వాసమున హరగిరిజల సురతమును వర్ణించియున్నాఁడు. ఇందొక్కొక్క దానినే కొంచెము వివరింతును.

## వేశ్యల విహారము

శివపార్వతుల వివాహమునకుఁ బూర్వదినమున రాత్రి వేశ్యల విహారమును వర్ణించినాఁడు కవి. వారిని వర్ణించిన పద్యములన్నియు

శృంగార రసమున కాటపట్టులై చక్కగా నున్నవనుట చెప్పఁదగినదే కాని వివరించినచో గ్రంథము విస్తరమగును.

కవిరాజు చేసిన యీ వర్ణనమును మూఁడు భాగములుగఁ జేయ వచ్చును. అందొక్కటి వారవనితలు విటులతోఁ గావించిన సరసములకును విహారములకును సంబంధించినది. ఇంకొక్కటి వృద్ధవారాంగన (అత్తగంతు) విటులతో మాట్లాడిన విధమును, బిమ్మటఁ దన నందనల నుద్బోధించిన విధమును గూర్చినది. మఱొక్కటి విటులు కొందఱు వారాంగనల పొందునుగూర్చి తమలోఁ దాము మాటాడుకొనుటను గూర్చినది.

వేశ్యకు ధనము ప్రధానముగాని కామముగాదు. కావుననే దాని కామము కృత్రిమమే కాని సహజము గాదని వాత్స్యాయనముని వచించినాఁడు. వేశ్యల కది వృత్తి. అర్థార్జనకగు రతి కృత్రిమ మని "కృత్రిమమర్థార్థ"మ్మను సూత్రముచే వచించినాఁడు వాత్స్యాయనముని. అయినను దానిని వేశ్య స్వాభావికమువలెనే ప్రదర్శింపవలయునఁట. లేనిచో ధనము రాదుగదా! అది నిత్య మలంకరించికొని రాజమార్గమున నిలిచి కొంచెము మాత్రము ఆకారమును చూపుచుఁ బూర్తిగఁ గనుపడక నిలుచుండవలెనఁట: (పురుషాకర్షణమునకుఁగాఁబోలు!) సర్వవిధుల విటుల చిత్తముల నాకర్షించి వారివలన ధనము లాగుటయే వేశ్యలకుఁ గర్తవ్యము. ధనమీయనివారిని దరికిఁ జేరనీయరాదు. తన వృత్తిలో నామెకు సహాయపడునది దాని తల్లి. ఆతల్లి క్రూరురాలై యుండవలెను. అర్థార్జనపరురాలై యుండవలెను. ఆతల్లి కీవేశ్య యధీనురాలుగా నుండవలెను. దీనినివాత్స్యాయనుఁ డీక్రింది సూత్రమునఁ జెప్పినాఁడు: "మాతరి చ క్రూరశీలాయాం అర్థపరాయాంచ ఆయత్తా స్యా త్తదభావే మాతృకాయాం." (9-2-3) ఇట్టివే మఱియుఁగొన్ని నియమములు వైశికమునుగూర్చి వాత్స్యాయనుఁడు తదధికరణమున వచించినాఁడు. ఇవియన్నియుఁ గుమారసంభవమున వర్ణింపఁబడినవనుట యావర్ణనమును జూచిన నెఱుఁగనగును.

వేశ్యావృత్తమునుగూర్చి దాని తల్లి యేమని హిత ముపదేశించు చున్నదో చూడుఁడు :

"కలువక కల్చినట్లు, తమకం బెద లేకయు గల్గినట్లు, చేఁ
గల విటు నర్థమంతయును గైకొను నంతకుఁ బొచ్చపోక, చేఁ
గల పురులేదుడున్, విడిచి గ్రక్కున నెక్కడియేనివానిఁగాఁ
దలఁచు, ధనేతరున్ మదనుఁ దా నొరు గల్వమి నేర్పు వేశ్యకున్."

(8-42)

ఈ యన్నింటిని వాత్స్యాయనుఁడు నంగీకరించినాఁడుగదా !

నన్నెచోడ మహాకవి వేశ్యామాతచే దాని బిడ్డలకుఁ జేయించిన బోధనలం దింకొక క్రొత్త విషయము గలదు. అది "మగ లంజియ" లను గూర్చినది. చూడుఁడా ముసలిది తన కూఁతుల కేమని బోధించు చున్నదో ?

"పలుచని పూతలున్, మెఱుఁగుఁబంతులు, నున్నని కోరకొప్పులున్,
పలుకులతీపుఁ, జెన్ను, పొరపచ్చెముఁ, బొచ్చముగాగ మాయలన్
లలనలఁ దేర్పఁజూచు "మగలంజియలం" గని వారి పొంతఁ బో
వలవదు రొక్కమీఁగలుగువాఁడె మనోజుఁడు కూలియాలికిన్."

(8_143)

ఇట్టివారు చోడునినాఁ డుండిరేమో ? లేకున్న నాతఁడట్లేల వ్రాసెడివాఁడు?

దీని పిమ్మట నొక పద్యమున భద్ర, పాంచాల, దత్తక, కూచిమారులను నాయకుల విధము వర్ణింపఁబడినది. వీరి లక్షణములు వాత్స్యాయనీయమునఁగాని, కొక్కోకుని రతిరహస్యమునందుఁగాని కానరావు. శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారీపద్యములోని కఠినశబ్దముల కర్థములు వ్రాయుచు, పాంచాలుఁడు బాభ్రవీయుఁడనియు, ఆతఁడు సాంప్రయోగికమున ననురాగ మృదూపచార రసానుభవమునే ప్రతిపాదించెననియు, దత్తకుఁడు కేరళదేశపు రతి శాస్త్రజ్ఞుఁడనియు, నాతఁడు వైశికాధ్యాయమును రచించి యందు వేశ్యానురాగచర్యలు నాయకుని

యూవి కనుగుణముగా నుండునుగాక యని శాసించె ననియు, కూచి మారుఁడు కూచిమారతంత్రమున మూఁడు పటలములలో మంత్రౌషధా ద్యుపనిషద్ప్రకరణమునే మేలుగాఁ జెప్పెననియు, వ్రాసి తరువాత "భద్రాదులు నలుగురు నాయకులుగా గ్రహించుకొనఁదగు" నని యుల్లేఖించిరి.

చోడుని పద్యము వారిని శాస్త్రకర్తలనుగాఁ జెప్పుటలేదు. వీరు నాయకులయియుండినట్లే చోడుని సందర్భము సూచించుచున్నది. ఇట్టిదే వీరు నాయకులేయని నిర్ణయించుట కనువయిన మఱియొక పద్యము కృష్ణవిలాసమునం దున్నదని శ్రీ మానపల్లి రామకృష్ణకవిగారే వారి గ్రంథమునఁ జూపినారు. శ్రీ కవిగారి గ్రంథ మిప్పుడు లభింపదుకనుక పాఠకుల సౌకర్యార్థ మాపద్యము నుదాహరించుచున్నాను. ఆ పద్యమును బట్టి వీరు విటులనియు నిశ్చితమగుచున్నది.

"నిజరూపరేఖల నెలఁతల వలపించు
 చాతురిగల భద్రజాతి విటులు
వలసిన ధనము లవ్వారిగా నొసఁగుచుఁ
 దరుణులఁ గరగించు దత్త విటులు
మణిమంత్రములచేత నణుమధ్యలఁగరంచు
 మగటిమిగల కూచిమార విటులు
వలరాజు కళలుండు నెలవుల భేదించి
 సతులఁ దేలించు పాంచాల విటులు
వరుస నందఱుఁ దమజాతి వారివారి
జాతవదనలఁగూడి సంజాత మదన
కదనకేళీ విహారసంపదలఁ బొదలి
మెదలుదురు వీట నధిక సమ్మదము లొదవ." (కృ. వి. ఆ. ౧)

వీరు తమ జాతి వారిజాతవదనలఁ గూడిరనుటచే నాయికలందు నీ భేద ములు కలవని చెప్పవలసియుండును.

తరువాతఁ గవిరాజు విటుల గోష్ఠి నేర్పఱచి యందు వారిచే వేశ్యాగమనములోని మంచి చెడ్డలను మాట్లాడింపఁ జేయించినాఁడు. ఆ సందర్భములోని పద్యము నొక్కదాని నుదాహరించి యీ వైశిక మును ముగింతును. ఇది గోష్ఠిలో నొక్కరు వేశ్యలతోడి పొత్తును వివరించి చెప్పినది.

"భావజకేళి నచ్చుపడి పైపడి తన్విటు నిచ్చఁగూడి రాఁ
గా వివిధోపచారములఁ గామ సుఖంబులు నల్పిపుచ్చి తా
రోవెల నీగి వేఁటొకని రోయుఁ దగున్ వెలయాలి కూటముం
బూవుల మేలికంపుఁ దమ పొందున కాకటమీఁద నిల్చునే."

(8-158)

ఈ గోష్ఠి వేశ్యల వృత్తమునుగూర్చి భిన్నాభిప్రాయములఁ బ్రక టించి, కవికిఁగల కళాశాస్త్ర పరిచయమున కద్దమువలె నున్నది. ఏ విష యమును వర్ణించినను దానిని నిసర్గముగా వర్ణించుట యీ కవి కవితా సంప్రదాయమనుట కీప్రకరణము నుదాహరణముగాఁ జూపవచ్చును.

*హరగిరిజల సురతవర్ణనము*

నవమాశ్వాసమున పార్వతీ శంకరుల లీలావిహారమును గవి పది పద్యములలో వర్ణించినాఁడు. ఇందాతఁడు చూపిన సంయమనమును, శాస్త్రపరిచయమును, వర్ణనా కౌశలమును, లోక పరిజ్ఞానమును శ్లాఘా పాత్రములు.

శివుఁడు పార్వతిని రతికై ప్రోత్సహించిన ఈ క్రింది పద్యమును జూచినచో కవికిఁగల కళాశాస్త్ర పరిచయము తెలియనగును.

"నయమున భీతివాపి, మది నన్నునఁ దేఁకువవాపి, మాటలం
బ్రియ మొనరించి, పొంతనల బేటముఁ బెంచుచు, సమ్మదంబునన్
బయిపడి గుహ్యముల్ బయలుపర్చుచుఁ, జెయ్వుల లజ్జవాపుచున్,
మెయివడి గౌరి నీశ్వరుఁడు మేకొలిపెన్ రతికిం గ్రమంబునన్"

(9-146)

వాత్స్యాయనముని కామసూత్రములందు "కన్యా విస్రంభణాధ్యాయమను" ప్రత్యేకముగా రచించెను. అందాతఁడు నవోఢయగు భార్యను వరుఁ డెట్లు అనునయించి తన కనుకూలగాఁ జేసికొనవలయునో వివరముగా వచించెను. పై నన్నెచోడ మహాకవి పద్య మాయధ్యాయస్థ విషయము లన్నింటిని సంగ్రహముగా వచించి వాని నాచరించి శివుఁడు నవోఢయగు తన యర్ధాంగి ననుకూలవతినిగా నొనర్చికొనినాఁడని వచించుచున్నది. ఈ పద్యమునకు వివరణము వ్రాయవలెనన్న నాయధ్యాయ సూత్రముల నన్నింటిని వివరింపవలయును. కాన నా పనిని పాఠకులకే వదలివేయుచున్నాను.

హరగిరిజల యాలింగనమును వర్ణించు నీ క్రింది సీసపద్యము నరయుఁడు :

"కరలత లందంద కామపాశంబుల
　　　నదిమి బంధించుచున్నట్లు బిగియ
నొదవఁ జేర్చిందులఁ బదనైన పూఁత లం
　　　గమునకు వజ్రలేపములు గాఁగఁ
బులకలొండొరుల మేనుల నుచ్చిపోయి డ
　　　గ్గఱ మొలలిచ్చిన కరణి గాఁగఁ
గనకంపుఁ బ్రతిమలు కాచియంటించిన
　　　ట్లొడఁగూడి తనువు లొండొంటిఁ గదియఁ
దగఁగ నొక్కతలయు మొగములు రెండైన
పగిదిఁ దలలు మాఱుమొగము వడఁగ
గీఱి మేనుమేను దూఱ గాఢాలింగ
నంబుసేసి రంగనయుఁ బ్రియుండు" (9-149)

వాత్స్యాయనముని యాలింగనములఁ గూర్చియుఁ దన గ్రంథమున విపులముగ వ్రాసెను. ఆతఁ డా సందర్భమున "లతావేష్టితక"మను నాలింగన భేదము నీ క్రింది సూత్రమునఁ జెప్పినాఁడు :

సూ. "లతేవ సాల మావేష్టయంతీ, చుంబనార్థం ముఖ మవనమయేత్,
ఉద్ధృత్య మంద సీత్కృతా, తమాశ్రితా వా, కించిద్రామణీయకం
పశ్యేత్, తల్లతావేష్టితకమ్" (2-2-16 కామ సూ.)

నన్నెచోడుని పద్యము వాత్స్యాయనముని లతావేష్టితక లక్షణము నకు మెఱుఁగులిడి చెప్పిన యుదాహరణముగా నున్నదని చెప్పఁ బని లేదు గదా।

హరగిరిజల రతులను వర్ణించిన యీ క్రింది సీసపద్యము నన్నె చోడకవి కళాశాస్త్ర పాండిత్యమున కింకొక్క యుదాహరణము:

"రతిలోలురై బాహ్యరతియు, నాభ్యంతర
రతియు, నుత్తమ సమరతియు, నీచ
రతియు, నింపగు మృదురతియు, ప్రచండోరు
రతియు, నెంతయు గూఢరతియు, ప్రకట
రతియును నాఁ బెక్కురతములు వరుసడి
రతిపతి శాస్త్రచోదితము గాగ
సతికిఁ దెలియఁ జూపెఁ బతి వాని నన్నియు
మగువ వరుసఁ బతికి మగుడఁ జూపె
సతియుఁ బతియు నేర్పు రతిభక్తి తలపోయ
రతులు నవములయ్యెఁ బ్రతిదినంబు" (9-152)

పై పద్యమునఁ గల రతి భేదముల వివరించుట గ్రంథ విస్తార హేతువు. వీని భేదము లన్నింటిని కళాశాస్త్రవేత్తలు వివరించియే యున్నారు. కవిరాజు వీనిలో సమరతియే యుత్తమమని పైన వచించి నాఁడు. కావుననే యాతఁ డష్టమాశ్వాసమున సమరతి నీ క్రింది విధ ముగ వివరించినాఁడు.

"తనమతి సతి రతిఁ బతిమతి
కనుకూలముగా నిరీక్షణాలాపాలిం

గనచుంబన వరకరణా
సన విద్యలు గూడునేని సమరతి వడయున్". (8-161)

శాస్త్రకారులు పురుష లొనర్చిన క్రియలకుఁ బ్రతిక్రియలను స్త్రీలు రతికాలమం దొనర్చుట నంగీకరించినారు. కావుననే చోడమహాకవి శివుఁడు చూపిన రతి భేదముల నన్నింటిని పార్వతి మగుడ నాతనికిఁ జేసి చూపెనని వర్ణించి యున్నాఁడు.

ఈ మహాకవి గావించిన యీ వర్ణన మాతని శాస్త్ర పరిచయము నకు తార్కాణమని వచించుచు దీనిని ముగించుచున్నాను.

## 9. నాయకాభ్యుదయము

కావ్యమునందలి యష్టాదశ వర్ణనల బేర్కొన్న కవిరాజశిఖామణి పద్యమునందు "క్షితిప" వర్ణనముగలదు. కాని నాయకాభ్యుదయమును గూర్చి యేమియు లేదు. అయినను దండియు, విద్యానాథుఁడును చెప్పిన యష్టాదశ వర్ణనలందు నాయకాభ్యుదయము గలదు. పిన్నకోట పెద్దన వచించిన వానియందును (నాయకుని) "దోర్వైక్రాంతి" వర్ణింపఁబడి నది. అప్పకవీయమున "విజయము" చెప్పఁబడినది. కావునఁ జోడుని పద్యములోని "క్షితిప" శబ్దము నాయకాభ్యుదయమునే చెప్పుచున్నదని యెంచి యీ మహాకావ్యమున నది యెట్లు వర్ణింపఁబడినదో పరిశీలింతము.

కుమారసంభవమున నాయకుఁడు శివుఁడు. కావుననే తారకాసురుని జయించిన కుమారుఁడు దేవతలతో సహితముగాఁ గైలాసమునకేగి యా విషయమును శివునకు నివేదించెను. ఆతఁడు కుమారుని గ్రుచ్చి యెత్తికొని యాతని రణశ్రమమును బోఁగొట్టి యౌవరాజ్య పట్టాభిషిక్తుం గావించి యమరులకుఁ దమతమ పూర్వపదవుల నిచ్చి మనిచెనని కావ్యోపసంహారము కావింపఁబడినది. కావ్యారంభమునందును బ్రహ్మ శాసనమున దక్షప్రజాపతి భూతసృష్టి చేయదలఁచి యాదిశక్తి నారా ధించి యామెను దనకుఁగూతురై జన్మించి శివునకు పత్నియగునట్లుగాఁ

ప్రార్థించి తరువాత శివుని బ్రత్యక్షముఁ జేసికొని సతి నర్పించి సృష్టి కర్తృత్వముఁ బడసెనని చెప్పఁబడినది. ఇట్లీ కావ్యమున నాయకుఁడగు శివుఁ డాదినుండి యంతముదాక వర్ణింపఁబడుటచేఁ గావ్యమున నుపక్రమోపసంహారములు చక్కఁగా నిర్వహింపఁబడెనని తెలుచున్నది.

నన్నెచోడ మహాకవి కుమారవిజయమును శివవిజయముగానే వర్ణించినాడు. అభ్యుదయమన విజయముగదా : కావున నిందు శివాభ్యుదయమే నాయకాభ్యుదయము. ఆతఁడు పార్వతిని దన యర్ధాంగిగా జేసికొని కుమారలాభమునందె సుఖమున్న విషయము కావ్యాంతమున మనోహరముగా వర్ణితమయినది.

## 10. యుద్ధ వర్ణనము

యుద్ధమునందు వర్ణింపఁదగినవానిని బ్రాచీనులు క్రిందివిధముగా వచించిరి.

"యుద్ధేతు వర్మ బలవీర రజాంసి తూర్య
విశ్వాసనాద శరమండప రక్తనద్యః
భిన్నాతపత్ర రథ చామర కేతు కుంభి
ముక్తాసురీవృత భటామర పుష్పవర్షాః."

నన్నెచోడ మహాకవి కుమారసంభవమున నేకాదశ ద్వాదశాశ్వాసములందు దేవదానవయుద్ధమును మిక్కిలి విపులముగా సుమారు మూఁడువందల యేఁబది పద్యములతో వర్ణించినాఁడు. అనఁగా గ్రంథమునందు ఏడవ భాగమును గవి యీ యుద్ధవర్ణనమునకే యుపయోగించె నన్నమాట. దీనినిబట్టి నన్నెచోడ మహాకవి యీ యుద్ధవర్ణనమున కిచ్చిన ప్రాధాన్యము గుఱుతెఱుంగనగును. ఈ యుద్ధమునకు ముందు జరుగవలసిన దౌత్య మంత్రాలోచన ప్రయాణవర్ణనములనుగూడఁ గూర్చిన గ్రంథమున మూఁడవవంతగును. కవి యీభాగము నింత విపులముగా రచించుటకుఁ గారణ మాతని కందుఁ గల యభిరుచియు, ననుభవమును

ననుట యుక్తిదూరము గాదు. నన్నెచోడుఁడు దేవాసురులకు జరిగిన యుద్ధమును వర్ణించినతీరుఁ జూచిన నాతఁడు రణనీతి పారంగతుఁడనియు, రాజనీతి విశారదుఁడనియుఁ జెప్ప వీలగుచున్నది.

తిక్కన యుద్ధములను గన్నులకుఁ గట్టినట్లు వర్ణించుటయందుఁ బ్రసిద్ధుఁడనుట విజ్ఞులకు సువిదిత విషయము. చోడుని యుద్ధవర్ణనముఁ జూచినచోఁ దిక్కన కాతఁడే యీ విషయమున 'నొజ్జబంతి' ని 'బెట్టించిన' వాఁడని యనిపింపకమానదు.

చోడుని యుద్ధవర్ణనముఁ జూచిన నది పురాణకాలమున జరిగిన యుద్ధమువలెఁగాక చోడుని కాలమున జరిగినదానివలెఁ గనుపట్టును. అందుపయోగించిన యాయుధములు, వాహనములు, యుద్ధవిధానములు, సాంఘికాచారములు, అన్నియుఁ జోడుని నాటివిగానే కనుపట్టును. ఈ యుద్ధమును నిర్వహించుటయందు కవిరాజశిఖామణి యొక క్రమమును బాటించినాఁడు. అది యానాటి పద్ధతిని తెలుపుచున్నది. బలములను నడుపుటలో నొక ప్రత్యేక పక్కిక నవలంబించినాఁడు. అవి సైన్యము లోని క్రమశిక్షణమును దెలుపుటయేకాక మన కా విషయములన్నియుఁ గన్నులముందు జరిగినట్లు తోపింపఁజేయుచున్నది. యుద్ధముల నిర్వహించుటయం దెంతో యనుభవమును, విజ్ఞానమును, సమయోచిత స్ఫురణమును, దీక్షయు నున్ననేగాని యీ విధముగా యుద్ధములను నడిపించుట సాధ్యముకాదు.

ఇఁక నీ కవిరాజు యుద్ధమును వర్ణించిన తీరుఁ బరికింతము. యుద్ధమున కొక్కదినము ముందుగానే యమర సైన్యములు యుద్ధభూమికి సమీపమున స్కంధావారమున విడిసినవి. ఆ రాత్రి యందఱును దమ యుత్సాహములఁ బ్రదర్శించినారు. యోధులతో వారి భార్యలును వచ్చినారు. వారికి మాత్రము నిద్రలులేవు! ఆ పుణ్యసతులు రాత్రియంతయుఁ దమభర్తలు మరణించినఁ దామేమిచేయవలయునో యాలోచించి చివరకుఁ దాము మరణింప నిశ్చయించుకొన్నారు. భటులు పరస్పర విద్వేష

ములు మాని ప్రాణములయెడఁ దీపినిబాసి యర్థములయెడ రోతవహించి సర్వస్వదానులయినారు.

వీరిక్కడ నిట్లుండగాఁ గుమార హరి పురందరాది బృందారక నాయకులు తమ తమ వాహనములకు నాయుధములకును బూజలొనరించి నీరాజనము లిచ్చి పరమేశ్వరుని జయార్థ మర్చించినారు. యుద్ధమునకు ముందు వాహనములను నాయుధములను బూజించుట ప్రాచీనాచారముగాఁ గనుపట్టును. విజయదశమి సందర్భమున నేటికి నాయుధపూజ మన యందు గలదు. ఈ యాచారమునే కవిరాజు వచించిన ట్లున్నది. ఇట్లాయుధపూజ గావించిన తరువాత సూర్యోదయ మయినది.

సూర్యోదయానంతరము కుమారుఁడు తత్కాలోచిత క్రియల నిర్వర్తించినాఁడు. ఇతర యోధులును వారివారి పనులఁ బూర్తిచేసికొని యుందురు. అప్పుడు కుమారుఁడు 'సన్నాహభేరి'ని వాయింపఁ జేయించి నాఁడు. అది దిక్కులలో ప్రతిధ్వనించినది. ఒక్కసారి యా చప్పుడు విని కుమారుని సేనలందు సంచలనము బయలుదేఱినది. అందఱును త్వరత్వరగాఁ దాము సిద్ధమయి ప్రక్కవారిని తొందర పెట్టినారు. సైన్యములన్ని తమ తమ స్థానములందు సిద్ధమై నిలచినవి.

అందు మొదట సుసన్నద్ధమై నిలిచినవి గంధగజములు. వాని వెంటనే యన్ని విధములగు నేర్పాట్లతో వచ్చి నిలబడినవి రథములు. అవి గుఱ్ఱములుపూన్చి ప్రయాణమునకు సిద్ధముగానున్నవి. నిలువఁగానే వచ్చి రథికులు రథముల నారోహించి నిలిచినారు. వానివెనుక గుఱ్ఱములు నిలిచినవి. ఆ వెనుక వివిధాయుధముల ధరించి 'కాలుబలము'వలె కాల్బలము నిలచినది. వాని నన్నింటిని వ్యూహములు పన్ని రణరంగ మునకు నడపించినా రాయా నాయకులు.

అప్పుడు కుమారుఁడు శివు నర్చించి మునిజనుల వేదాశీర్వాదము లును, జయజయ నినాదములును, వివిధ వాద్యములును కలసి ఘోరని చెలఁగఁగా సురవనితలు సేసలు చల్లుచుండఁగా వచ్చి తనకై సిద్ధపఱచిన

మదగజము నధిరోహించినాఁడు. వెంటనే హరి పురందరాద్యమరనాయకులు తమ తమ వాహనములనెక్కి కుమారునకు ముందఱ నడచినారు. వారందఱు నిట్లు రణరంగమును జేరుకొని సైన్యమును వ్యూహముగా నిలిపి యుద్ధమునకు సిద్ధముగా నిలిచినారు.

అప్పుడు తారకాసురుని చతురంగబలమును బైవిధముననే వచ్చి రణరంగమున వ్యూహముఁ బన్ని నిలచినది. ఈ విధముగా రెండు పక్షములవారును సమరసన్నద్ధు లయియున్న సమయమునఁ దారకాసురుఁడు శుక్రాచార్యునిం బిలిచి దేవతల పక్షమునఁ బోరికి వచ్చినవారిలో నెవ్వరెవ్వరో తనకుఁ దెలుపుమని యడిగినాఁడు. శుక్రుఁ డాతనికిఁ బేరు పేరున నందఱనుజూపి చెప్పినాఁడు. దేవతాపక్షములోని వీరులనీవిధముగా శుక్రుఁడు తారకునకుఁ జూపుచున్న సమయముననే కుమారునిచే నాదిష్టుఁడై బృహస్పతి యాతనికి రాక్షసపక్షమునఁ బోరికి వచ్చినవారి పేరులు చెప్పి వారి పరాక్రమమును వర్ణించి చెప్పినాఁడు.

ఈ విధముగా శుక్ర బృహస్పతులు చెప్పగాఁ బరస్పరము చూచుకొన్న తారక కుమారులు ఒండొరులపైఁ గోపము గలవారై తమ సైన్యములఁ గలయఁ బరికించి చేతుల నూపి యుద్ధ మారంభింప నాజ్ఞయిడినారు. వెంటనే యుద్ధ మారంభమైనది.

## ప్రథమ దివస యుద్ధము

గజారూఢులు గజారూఢులతోను, రథికులు రథికులతోను, నాశ్వికులాశ్వికులతోడను, భటులు భటులతోడను దలపడి ఘోరముగాఁ బోరఁ దొడఁగినారు. అప్పటిస్థితి యిట్లున్నదఁట :

"రణ తూర్యంబులు బోరనం దివిరెఁ దద్రావంబుతోడన్ ధను
ర్గుణ ఘోషంబులు పెల్లునం జెలఁగె దద్ఘోషంబుతో సద్భటా
గ్రణి హుంకార నినాదముల్ దనరెఁ దద్గంభీరనాదంబుతోఁ
బ్రణుతాస్త్రాహతి భీషణధ్వను లనిం బర్వెన్ దిశాఘాటమై"(11-107)

తరువాత సమరము భయంకరమయినది. ఉభయపక్షములందును వీరులు విజృంభించి యుద్ధముచేసినారు. కొంచెముసేపుననే యుద్ధరంగమునఁ బీనుఁగులు "పడుగుపేకలు"గా నల్లుకొని పెల్లుకొన్నవి. వీరులు మిగుల పరాక్రమముతోఁ బోరినారు. నెత్తురు చూచినకొద్ది వారి పౌరుషములు విజృంభించినవి. వారు తమ దేహముల లక్ష్యపెట్టక పరబలంబుల రూపుమాపఁ గడంగినారు.

ఇది యిట్లుండ నొక ప్రక్క గజములు గజములతో ఢీకొన్నవి. ఆ యుద్ధ మప్రతిమానము. అవి చతురంగబలములనెల్ల మట్టుపెట్టుచు వీర విహారము గావించినవి. మఱియొకవైపు రథికులు పరపక్షముల వారితోఁ బోరాడసాగినారు. సారథులు చనిపోయినఁ దామే సారథ్యము చేయుచుఁ బోరినారు. గుఱ్ఱములు చనిపోయినచోఁ గ్రిందికి దుమికి కత్తి చేతఁబట్టి యెదుటివారిని నఱుకసాగినారు. ఆ కత్తులును చేజాఱిపోయిన నేసాధనములు లేకయే ముష్టియుద్ధమునకుఁ దలపడినారు. "తౌరంగిక వీరులు" మాత్ర మూఱకున్నారా? వారును భయంకరముగా యుద్ధముచేసినారు. పదాతి దళములును వివిధాయుధములఁ గొని పరపక్షములఁ జీల్చి చెండాడినవి.

ఏ పక్షమువారును దీసిపోలేదు. రెండు పక్షములందును మృతుల సంఖ్య లెక్కకు మిక్కిలి యయినది. వీరు లత్యుత్సాహముతోఁ దమ యంగ ఖండనమును సైతము లక్ష్యపెట్టక పోరాడినారు.

ఒకని చేతులు తెగిపోయినవి. వాఁడు వెంటనే కత్తిని నోటితోఁ బట్టుకొని పరపక్షముపై యుద్ధమునకుఁ బోయి కవిసినాడు. మఱి యొకఁడు శత్రువుపై నొక యమ్మును ప్రయోగించి యది పనిచేయదని యెఱిఁగి వెంటనే యా బాణమునకన్న ముందుగాఁ బరుగిడి చురకత్తితో శత్రువును బొడిచి చంపెనట. ఇంకొక్కఁడు తన తలతెగి పడిపోయినను చేతిలోని యాయుధమును మాత్రము వీడక యుద్ధము చేయుచుండెనట.

వారందఱు నద్భుత పరాక్రములు. ప్రభుభక్తి పరాయణులు. చావనైన చత్తురుగాని వెనుదిరిగి పాఱిపోరు. వారి రణదీక్ష యట్టిది.

ఇంత తుములముగా యుద్ధము జరుగ నా భూమి పీనుఁగుపెంట యయ్యెను. పిశాచవర్గములు వానిని జూచి నర్తించెను. నక్కలు సంతోషించెను. ఎక్కడఁ జూచినను పీనుఁగులే. ఎక్కడఁ జూచినను రక్తమే. భూమిమీఁదనే గాదు. ఆకాశము పైదాక చిమ్మినదా వీరుల రక్తము. ఎంత తప్పుకొని చరించినను పాపము! సూర్యుఁడు నా రక్తమునఁ దొప్పఁ దోగినాఁడు. ఆతని దేహమంతయు రక్తమయ మయినది. దానిని గడిగికొనుటకై సూర్యుఁడు పశ్చిమాంబుధిని గ్రుంకినాఁడు. సాయంతన మయినది. యుద్ధము చాలింపఁబడినది. చావఁగా మిగిలిన వీరులందఱు తమ తమ నెలవుల కరిగినారు. ఈ విధముగా మొదటినాటి యుద్ధము ముగిసినది. ఈ మొదటినాటి యుద్ధమున విశేష మేమనగా నుభయపక్షము లందును వీరు లనేకులు మడిసిరికాని ముఖ్యు లెవ్వరును యుద్ధరంగమున ముందు కుఱికినట్లు కానరాదు. ఆ రాత్రి వీరులు తమ తమవారి వెదకు సంభ్రమంబున

"పొలికల నెల్లరోసి కొనిపోయెడువారును, పోయి పోటులన్
సలలిడువారు, పందులు భృశంబుగఁ బెట్టెడువారుఁ, గొందఱి
ట్టలముగ మంత్రతంత్రము లెడన్ పవరింపుచు నుండువారునై
కలయగ వీడువారు నిటు గైకొని యుత్సవమందు చుండి"రఁట.

యుద్ధారంభమున నన్నెచోడ తిక్కనలు

మహాభారతమున భీష్మ పర్వమునందు భారతయుద్ధము ప్రారంభ మయిన విధమును తరువాత యుద్ధమును వర్ణింపఁ బడినవి. తిక్కన యుద్ధ ప్రారంభము కొన్నియెడల నన్నెచోడుని యుద్ధారంభమును బోలి యున్నను కొన్ని ముఖ్యభేదములు వీరిద్దఱిలో లేకపోలేదు. వానిని కొన్నింటి నిక్కడ నుదాహరింతును.

1. నన్నెచోడుని కుమారసంభవమున యుద్ధము జరుగునాఁడు సూర్యోదయమునకు ముందే కుమార హరి పురందరాద్యమరవరులు తమ తమ యాయుధములకును, వాహనములకును బూజలు గావించి నీరాజనము లొసఁగినట్లు వర్ణింపఁ బడినది. తిక్కన భారతమునం దిట్టి వర్ణనము లేదు. ఇది దేశీయాచారమని యెంచవలెను. తిక్కనకు దేశీయాచారముల నెడ నభిమానమున్నను నాతఁడు మూలము ననుసరించి వ్రాయవలసినవాఁ డగుటచేత నిట్టి యాచారమును వర్ణింపక విడిచెనని యెంచనగును.

2. కుమారసంభవమున సేనాని గజారూఢుఁడై యుద్ధమున కరిగినట్లు వర్ణితమయినది. మహాభారతమున సేనానాయకులును తదితర ముఖ్యులును రథారూఢులయియే యుద్ధరంగమునకు వచ్చిరి. ఇదియు నొక ముఖ్యభేదమే. చోడునినాటికి యుద్ధమున రథముల వాడుక వెనుక పట్టుచున్నట్లున్నది. ఆ నాటి రాజు లెల్లరును గజారూఢులయియే యుద్ధములు చేయువారు. రథములు లేకపోలేదు. కాని వానికిఁ జతురంగబలమున మొదటిస్థానము లేదు. గజములు ముఖ్యస్థానము నాక్రమించి రథములు రెండవస్థానమునకు వచ్చినవి. మహాభారత కాలమునాఁడు రథములదే ముఖ్యస్థానము. అందుకే తిక్కన తననాటి యాచారములను గాక భారతమునాటి యాచారమును బట్టి సేనానాయకులను రథములలో యుద్ధభూమికి రప్పించినాఁడు.

3. సేనానులు యుద్ధభూమికి వచ్చుటలోను వీరిద్దఱియందు భేదము లున్నవి. కుమారసంభవమున సేనాని గజారోహణమునకు ముందు మునిగణాశీర్వాదమును గైకొనుటయు నాతనిపై స్త్రీలు సేసలు చల్లుటయు వర్ణితము లయినవి. ఇవియును భారతమునందు వర్ణింపఁ బడలేదు.

4. భారతమునందు యుద్ధారంభమున ధర్మజునకు శుభశకునములును, దుర్యోధనున కశుభ శకునములును గలిగినట్లు వర్ణింపఁ బడినది. చోడుఁడు శకునముల వ్యవహారమును వర్ణింపలేదు.

5. మహాభారతమున ముఖ్యులగు సేనానాయకు లిరువురును తమ సైన్యముఖముల నిలచి పోరినట్లు వర్ణింపఁబడినది. కుమారసంభవమునందట్లు లేదు. ముందు సేనానాయకులు నిలిచినట్లు కుమార సంభవమున లేదు. పై పెచ్చు వారు మిక్కిలి వెనుక నెక్కడనో యున్నారు. సేనాగ్రముల నున్నవా రుభయ బలములలోని వీరులు మాత్రమే. ఇదియును యుద్ధనీతియందు మహాభారతమునాటికిని చోడుని నాటికిని గల భేదమును సూచించును. మహాభారతమునాడు సేనలకు ముందు సేనానాయకులుండి పోరు జరుపుట యాచారము. సేనా నాయకులతోఁ బోరి యెదుటి వ్యూహమును భేదించినఁగాని చతురంగబలము లెదురివారితోఁ బోర నానాఁడు సాధ్యమయ్యెడిదిగాదు. వ్యూహము భేదింపఁబడుదాక కడమవారు చూచుచు నూఱకుండవలసినదే. ఇది భారత కాలమునాటి యుద్ధవిధానము. పద్మవ్యూహ సందర్భమున నివి చక్కగా వర్ణింపఁబడినవి. చోడునినాటి యాచార మదిగాదు. సేనానాయకులు వెనుకనుండి యుద్ధముల నడుపుట యానాటి యాచారము. ఇది రాయల యుగముదనుక నట్లేయుండినది. నేడు నంతేయని యనవచ్చును. రాయలు రాజు (యుద్ధము నడుపువాఁడు ముఖ్యుఁడు) సేనాముఖమునకు వెళ్ళరాదని యాముక్తమాల్యదయందు స్పష్టముగా వచించినాఁడు. తాళికోట యుద్ధమున రామరాయలీ నియమము నుల్లంఘించుటచేతనే విజయనగరపు సేన లోడిపోయెనని పండితులు భావించుచున్నారు. కావున నీ యాచారముఁ దననాటికున్న విధమునఁ గవిరాజ శిఖామణి వర్ణింపఁగా దిక్కున మహాభారతమునాటి విధానమునే తన గ్రంథమున వర్ణింపవలసినవాఁ డయ్యెనని చెప్పవలసియున్నది.

6. చోడుని కుమారసంభవమున నుభయసైన్యములును యుద్ధసన్నద్ధమై నిలిచినప్పు డుభయ సేనానాయకులు శుక్ర బృహస్పతులఁ బిలిచి యెదుటి వీరులఁగూర్చి యడిగి తెలిసికొనిన విధము మహాభారత

మున లేదు. చోడుఁడు సమయోచితముగా దీనిని కల్పించి తన ప్రతిభను జూపె ననవలెను.

7. మఱియొక విశేష మేమనగాఁ గుమారసంభవమునందు మొదటినాటి యుద్ధమున నుభయపక్షములందును బేరుగల పెద్దలెవ్వరును పాల్గొనినట్లు వర్ణింపఁబడలేదు. పెద్దలందఱును వెనుకనుండుటయేగదా, చోడునినాటి యాచారమని ముందుఁ జెప్పితిని. కావుననే వారెవ్వరును మొదటినాఁడు యుద్ధమునఁ బాల్గొనలేదు. ఆనాఁడు యుద్ధమునకు వచ్చిన వారును, జచ్చినవారు నందఱును సామాన్యవీరులే. మహాభారతమునం దట్లుకాదు. ముఖమునందున్నవారే సేనానాయకులు, తక్కుఁ గల ముఖ్యులు. కావున మహాభారతయుద్ధమున మొట్టమొదటినాఁడే యుభయ బలములందలి వీరులందఱును యుద్ధమున ముందుండవలసివచ్చినది. ధర్మజ దుర్యోధనులును, భీష్మ ధృష్టద్యుమ్నులును నానాఁడు యుద్ధము చేసినారు. ఆనాఁడు చచ్చినవారిలోఁ బేరులేనివారు పలువురున్నను శల్యునిచేత నుత్తరుఁడును జచ్చినాఁడు. ఈ విధముగాఁ దిక్కన నన్నెచోడుల ప్రథమ దివస యుద్ధముననును భేదము లేర్పడినవి. ఇందుకుఁ గారణ మాయా కాలములందలి రణనీతులలోఁ గల భేదములే యని మఱలఁ జెప్పనవసరములేదు.

8. మొదటినాఁటి రాత్రియందు జరిగిన విషయములను వర్ణించుట యందుఁ దిక్కన నన్నెచోడులు భిన్నపద్ధతుల నవలంబించినారు. నన్నెచోడ మహాకవి యానాటి రాత్రి తమ తమ శిబిరములందు

"పొలికలనెల్ల రోసి కొనిపోయెడివారును, బోయి పోటులన్
సలలిడువారు, మందులు భృశంబుగఁ బెట్టెడివారుఁ, గొంద ఱి
ట్టలముగ మంత్రతంత్రము లెడన్ సవరింపుచునుండువారునై
కలయగ వీరు వారు నిటుగైకొని యుత్సవమందుచుండఁగాన్."

ఇట్లుభయబలంబులందు ననేకు లనేక ప్రకారంబుల దివ్యౌషధ ప్రకారంబుల నారాత్రియంద విక్షతవేదనాముక్తులగుచుండి రని వర్ణించి

నాఁడు. ఇదియు నానాటి రణవిధానమునే సూచించుచున్నదనఁ జెల్లును. యుద్ధమాగిపోయినప్పుడు సైనికులు గాయములను మాన్పుకొనుటకుఁ బ్రయత్నముచేయుట సహజముగదా! రాయలుకాఁబోలుఁదన సైన్యమున గాయపడినవారికి జికిత్సలకుఁ దాను ప్రత్యేకముగా నేర్పాట్లు చేయుచుండువాఁడఁట: తిక్కన భారతమున నిట్టి స్థితి కానరాదు.

భారత యుద్ధమున మొదటినాటి రాత్రి ధర్మరాజు గోపాలదేవునితో మంతనములాడుటయందే గడపినాఁడుకాని గాయపడినవారినిగూర్చి యాలోచింపలేదు. చనిపోయిన యుత్తరునిగూర్చియు మాట్లాడినవారు లేరక్కడ. అది యొకవిధముగా యుక్తమే కావచ్చును. కాని బ్రదికి గాయములపాలయిన సైనికులగూర్చి విచారింపకపోవుట యుక్తమనలేము. కాని యది యానాటి యాచారమేమో? మూలమననుసరింపక యిచ్చట నిచ్చవచ్చినట్లు మార్చుట యుక్తముకాదుగదా! కావుననే తిక్కన మూలానుసారముగా నిక్కడ రచియించినాఁడు.

ఈ విధముగాఁ గవిరాజు తన మొదటినాటి యుద్ధమును దన కాలమునాఁటి యాచారములను బాటించి తన యనుభవమును దానికి జోడించి దేశీయమార్గమున వర్ణించి చూపినాఁడు. తిక్కన కొంత దేశీయతను జూపినను, మూలముననుసరించి కొన్నియెడల మహాభారతకాలము నాటి స్థితిగతులనే తన గ్రంథమునందు వర్ణించినాఁడు. కావుననే వారిరువురి యుద్ధవర్ణనములందుఁ గొన్ని భేదములు కలుగుట సంభవించినది.

## రెండవనాఁటి యుద్ధము

మొదటినాఁటి యుద్ధమునఁ బేరుగల పెద్దలెవ్వరును యుద్ధమునందుఁ బాల్గొనలేదని ముందుగానే చెప్పఁబడినదిగదా! రెండవనాఁడుభయపక్షములందును ముఖ్యులగువారెల్ల యుద్ధమునందుఁ బాల్గొనినట్లు కవిరాజశిఖామణి వర్ణించినాఁడు. కవిరాజీద్వితీయదినమున ముఖ్యులగు

వారిని యుద్ధమునఁ బ్రవేశపెట్టిన విధమును, గ్రమమును నొక ప్రత్యేక విధముగానుండి యీ యుద్ధవర్ణనమునకు శోభను గూర్చుచున్నది.

రెండవనాఁడును దొలినాఁటివలెనే యుద్ధమారంభమయినది. ఉభయ పక్షములవారును గలియఁబడి యొక పక్షమువారి నింకొకపక్షమువారు తెగనఱకికొన్నారు. కాని యీస్థితి యెంతోసేపు నిలువలేదు. కొలఁది సేపటిలోనే రాక్షససేనలు బలహీనమయి వెనుకకు మఱలి పరుగులిడ నారంభించినవి. ఆ పరుగులెత్తు సైన్యమును మఱల మఱలించి ప్రోత్స హించుచుఁ గుంజరాక్షుఁడను దైత్యసేనాని యుద్ధరంగమున నుఱికి పరపక్షములఁ జెండాడ నారంభించినాఁడు. ఈ విధముగా మొదట రాక్షస పక్షమునుండి యొక ముఖ్యసేనాని యుద్ధరంగమునఁ బ్రవేశపెట్టఁ బడినాఁడు.

కుంజరాక్షుఁడు రాక్షస సామాన్యుఁడుగాఁడు. వాని నెదుర్కొ-నుటకు దేవతాపక్షమునఁగల సామాన్యవీరులు పనికివత్తురా? అందుకని కవిరాజీతనితో యుద్ధముఁజేయుటకుఁగాను దేవతలపక్షమున నీశానుని రప్పించినాఁడు. కొంతసేపు వారిరువురును హోరాహోరిఁ బోరాడినారు. కాని చివరకు, ఈశానునిచేత నా కుంజరాక్షుఁడు చచ్చినాఁడు. ఇంకేమి? దేవతలపక్షము జయజయ నినాదముల నొనరించి రాక్షసులపైఁబడినది. వారు వికావికలై పరుగెత్తినారు. అప్పుడు మఱల నింకొక రాక్షస ముఖ్యుఁడు ఉగ్రదంష్ట్రుఁడనువాఁడు యుద్ధమునకువచ్చి యీశాను నెదు ర్కొ-న్నాఁడు. వీరిద్దఱికిని బోట్లాట సంభవించిన జయమెవ్వరిదో మనము తేలికగా నూహింపవచ్చును.

ఈశానుఁడు కుంజరాక్షునివంటి యోధాగ్రణితో యుద్ధము చేసిచేసి యలసినవాఁడు. ఉగ్రదంష్ట్రుఁడన్న నింతదనుక వెనుకభాగమున నూఱక చూచుచు నెట్టి పరిశ్రమములేక యున్నవాఁడు. ఈ యిద్దరకే యుద్ధము ఘటించినచో నీశానుఁ డోడుట నిశ్చయము.

కావుననే కవిరాజు దేవతాపక్షమునుండి యుగ్రదంష్ట్రి నెదుర్కొనుటకుఁ గుబేరునిఁ బిలిపించినాఁడు. వారిరువురును బోరఁగాఁ బోరఁగాఁ గుబేరునిచేత నుగ్రదంష్ట్రిఁడు మరణించినాఁడు. మఱల మామూలే!

ఈసారి వచ్చిన రాక్షసనాయకుఁడు మందారకుఁడనువాఁడు. వీఁడు తారకాసురుని కొడుకు. ఈతఁడు తారకాసురునంత పరాక్రమవంతుఁడు. వాని నెదుర్కొనువాఁ డెవ్వఁడు? వాయువే. మందారమెంత బలమైన దైనను గాలికది లెక్కయా? వాఁ డనిలునిచేత నేల కొరఁగినాఁడు.

తరువాత మహాబాహుఁడు రాగా వానిని వరుణుఁడు కడతేర్చి నాఁడు. వాని పిమ్మట నారణి దుర్వారు లిరువురు రాగా వారి నిద్దఱనొక్క నిరృతియే యుక్కడఁగించినాఁడు. ఇట్లే కేతుమాలిని యముఁడును, మహాకాయు నగ్నియును రూపుమాపిరి.

ఇక్కడ యుద్ధమున మఱియొక ఘట్ట మారంభమయినది. ఒక్క డొక్కఁడుగా యుద్ధమునకు వచ్చుట యంత బాగులేదని కాఁబోలు కేతుమాలియనంతరము, జంభాసురుఁడు తానింద్రునిపైకిఁ బోవుచు దంభ కుంభోదరాది రాక్షసాధీశ్వరులను శుకచరాది దైత్యవరులను గూడ దేవతలపైకి యుద్ధమునకుఁ బురికొల్పినాఁడఁట! దేవతాపక్షమునమాత్రము వారినెదుర్కొనఁదగిన వీరులు లేరా? అష్టవసువులు, ద్వాదశాదిత్యులు, ఏకాదశరుద్రులు, అశ్వినీదేవతలు, నందఱు నొక్కుమ్మడిఁ గుంభోద రాదులపై కుఱికి వారిని యమపురికిఁ బంపించిరి. కుంభోదరాదుల మరణమును గాంచి జంభాసురుఁడు మిగులఁ గోపించి దేవతాబలముపై కుఱికెను. వాని ధాకకాగలేక దేవతాబలములు వెనుదిరిగి పాఱిపోఁజొచ్చినవి.

ఆ సమయమున నింద్రాదుల కండగా నిలచినవాఁ డిక్ష్వాకు మహారాజు. ఈతని పరాక్రమ మందఱికన్న గొప్పది. కావుననే— యీనాఁడు లొక్కొక్కరితోఁ బోరినమాత్రనే యలసిపోయినట్లు ముందుఁ జెప్పఁబడినది గదా!— ఇక్ష్వాకు మహారాజు వారివలె నలసిపోలేదు. కనుకనే ఆతఁడు మొదటఁ దనమీఁదికి వచ్చిన ధూమ్రధుర్ధరులను జయించి తరు

వాత వచ్చిన త్రిశిరుఁడను రాక్షసుని మట్టుపెట్టి యక్కడికిని విసుఁగులేక జంభాసురునిమీఁది కుఱికినాఁడఁట! ఆ జంభాసురుఁడు ఇక్ష్వాకు మహారాజు గారి ధాక కాఁగలేక ఆతనితోఁ బోరుమాని మఱియొక దిక్కున కరిగి యక్కడ నున్న యింద్రునితో తలపడెనఁట.

ఇట్లు జంభజంభారులు కొంతసేపు హోరాహోరిఁ బోరిరి. వారిరు వురును సమాన బలపరాక్రమోపేతులు. కావుననే జయాపజయములు శీఘ్రముగాఁ దేలలేదు. కాని చివరకు జంభుఁ డింద్రాయుధహతుఁడై నేల కొరఁగినాఁడు. తారకాసురుఁ డాతని మరణవార్త విని మిగుల ఖిన్నుఁ డయినాఁడట.

తరువాత నరకాసురుఁడు, మురుఁడు నొకరి తరువాత నొకరు రాఁగా వారిని నారాయణుఁడు వధించెనఁట. ఆ పిమ్మట సహస్రకవచుఁడు రాఁగా నరుఁడు నారాయణ పక్షమున నిల్చి వాని కవచములం దొక్కదానిం దక్క మిగిలినవాని నన్నింటిని భేదించెనఁట. సహస్రకవచుఁ డేక కవచుఁడై పాఱిపోఁగాఁ గాలనేమి యనువాఁడు హరి నెదుర్కొనెనట. వాని నాతఁడు కొంతసేపటికి నారాయణాస్త్రమున హత మొనరించెనఁట.

ఈ విధముగా సమస్త రాక్షస ముఖ్యులను నిహతులయిన పిదపఁ దారకాసురుఁడు తన మూలబలమును యుద్ధమునకుఁ బంపెనఁట. వారు నూరుకోట్లు. వారు భయంకరముగా దేవగణముపైఁ బడఁగా గణనాథుని యాజ్ఞచొప్పునఁ బ్రమథులు వారి నాక్రమించి నిర్జించిరఁట. వీరభద్రుఁడును విజృంభించి చేతికిఁ జిక్కినంతమందిని మట్టువెట్టి వీరవిహారముఁ గావించెనఁట.

మూలబలముకూడ నశించిన పిదపఁ దారకుని సేనానాయకుఁడు రక్తబీజుఁ డనువాఁడు యుద్ధమునకు రాఁగా వానిని చండిక కాళీసాహాయ్యమున నంతమొందించినదఁట. రక్తబీజ మరణానంతరము తారకాసురులు పదివేలమంది వచ్చి తాఁకఁగా వారి నందఱిని "కుమారానుజుఁడగు" (బహువ్రీహి) గణపతి రూపుమాపినాఁడఁట.

ఇంత యయినపిదప నప్పుడు తారకాసురుఁడు తానే బయలుదేఱి యుద్ధరంగమునకు వచ్చినాఁడఁట. తారకుని ధాకకు నిలువక పాఱు సైన్యము జూచి కుమారుఁడు రణరంగమునకు వచ్చినాఁడు. వా రిద్దఱు నానాఁడు సాయంకాలముదాక పోరినారు. చివరకుఁ గుమారునిచేతఁ దారకుని విల్లు విఱిగిపోయినది. అప్పుడు సాయంసమయ మగుటచే యుద్ధ మాపివేయఁ బడినది. ఉభయపక్షములవారును దమ తమ శిబిరముల కరిగినారు.

## రెండవనాటి రాత్రి

రెండవనాఁటి రాత్రికిని, మొదటినాఁటి రాత్రికిని గొంత భేదము గలదు. మొదటినాఁటి రాతిరి యుభయబలములకు నొక్కవిధముగానే గడచినది. రెండవనాటి రాత్రి యట్లుగాదు. తారక పక్షమువా రోడి కుమారపక్షము జయించు విషయము రెండవనాఁడు నిశ్చయమైనది. రాక్షస పక్షమున ముఖ్యులగువా రందఱును యుద్ధమున నిహతులైరి. కావున వారిసతు లానాఁటి రాతిరి మిగుల దుఃఖముతో గడపుట సహజము. ఆ దుఃఖమునే వర్ణించి చూపినాఁడు కవిరాజు. తారకునకు నా రాత్రి యతికష్టముగానే గడచినది. ఆలోచనమునకును నెవ్వరు మిగులలేదు. సూర్యోదయము సమీపించినకొలఁది తారకప్రభ తఱుగఁ దొడఁగినది. అది సహజమే గదా!

## మూఁడవనాటి యుద్ధము

మూఁడవనాఁ డుదయమున హతశేషులగు వీరులతో నుభయ పక్షములును యుద్ధరంగమునకుఁ జేరినవి. యుద్ధము మొదలయినది. కాని యీ మూఁడవనాఁటి యుద్ధమున రాక్షసుల పక్షమువారి కుత్సాహము బొత్తిగా లేదు. ఏదో పోరు జరుగవలెఁ గావునఁ బోరినట్లున్నది. దేవతల పక్షమున నట్లుగాక జయము నిశ్చయమను బుద్ధితో మంచి యుత్సాహము

కనిపించినది. కుమారుని గజమే యెంతో యుత్సాహమున వైరివీరులను, గజములను మట్టుపెట్టినదఁట! కుమారుఁడును తెగఁబడి పరపక్షములఁ జీల్చి చెండాడినాఁడు. తారకుని యస్త్రశస్త్రము లా కుమారుని ముందు శక్తిహీనము లైనవి. తారక బలముల మాయలు కుమారుని ముందఱ శక్తిలేనివై మాయమయినవి. ఇదిచూచి తారకుఁడు కోపగించి తన శరీరమును బెంచి భూమ్యాకాశము లావరించి కుమారునిపై కుఱికినాఁడు. కుమారుఁడు యుద్ధము చాలింపనెంచి తనశక్తి నాతనిపైఁ బ్రయోగించినాఁడు. ఆ శక్తి తారకుని హృదయమును జీల్చి మఱల కుమారుని దగ్గఱకు వచ్చినది. తారకుఁడు నేలకొఱఁగినాఁడు. యుద్ధము ముగిసినది. అమ్మలవాన వెలసినది. సకల లోకములందును సంతోషము వెల్లివిరిసినది.

## నన్నెచోడుని యుద్ధవర్ణనములోని వైశిష్ట్యము

1. ఈమహాకవి వర్ణించిన యుద్ధము ప్రాచీనకాలమున నెప్పుడో జరిగిన దానివలెఁగాక కవికాలముననే జరిగిన దానివలె నున్నదని యిదివఱకే చెప్పఁబడినది. ఈ యుద్ధమునందలి సేనలు, ఆయుధములు, యుద్ధవిధానము నన్నియు నానాఁటి యాంధ్రదేశీయాచారము ననుసరించియే యున్నవి. ఇక్కడ నొక విషయమును బ్రస్తావించుట యప్రస్తుతము కాదని యెంతును.

## చోడునినాఁడు కోటలు లేవా?

నన్నెచోడుని యుద్ధవర్ణనమునందు దుర్గముల ప్రస్తావము కానరాదు. కాకతీయ యుగమునాఁటి యుద్ధములందును, విజయనగర చక్రవర్తులనాఁటి యుద్ధమునందును గోటలకు మిగులఁ బ్రాముఖ్య ముండెనని తత్కాల శాసనాధారములు చెప్పుచున్నవనుట తజ్ఞులకుఁ దెలియనిది గాదు. మన దేశమున నేటికిని నిలిచియున్న చారిత్రకావశేషములును

దీనిని బలపఱచుచునే యున్నవి. నన్నెచోడుని కావ్యమున నీ గిరిస్థలాది దుర్గముల ప్రశంస కానరాకపోవుటయు, ఇందలి యుద్ధము హిమాలయమున కుత్తరమునందు "మహానదీతీరము" న (11 ఆ. 27 ప.) జరిగినట్లు చెప్పఁబడుటయుఁ జూడఁగాఁ జోడకవినాఁటి కింకను 'గోట'లు ముట్టడించి శత్రువుల నాక్రమించు విధము ప్రచారమునకు రాలేదనియు, నానాఁ డుభయపక్షములవారు నొక్క స్థలము నేర్పఱచుకొని యక్కడికిఁ జేరి యుద్ధ మొనరించి జయాపజయముల నిర్ణయించుకొనుచుండిరనియు నిశ్చయముగాఁ జెప్పవచ్చును. ఈ విషయము నీ యుగముననే జరిగినట్లు చెప్పఁబడు పలనాటియుద్ధమును, కాటమరాజు కథయును బలపఱచుచున్నవి. ఉత్తరహరివంశమునందు నాచనసోమనాథుఁడు నట్లే వర్ణించియున్నాఁడు. (చూ. కృష్ణుని హంసడిభకులతోడి యుద్ధము. లేదా అందే 4 ఆ. 168 ప.) ఈ విషయమును సాధికారముగా నిర్ణయించు నధికారము లేకున్నను సాహసించి వచించినందులకుఁ జారిత్రకుల మన్నింప వేడుచున్నాను.

2. చోడుఁడు దేశీయాచారముల ననుసరించియే యుద్ధమును నడిపినను "కథ పురాణకాలమునాఁటిదనియు, యుద్ధము దేవదానవుల మధ్య" ననియు మఱచినవాఁడుకాఁడు. కావుననే దానవుల మాయాయుద్ధమును సైతము వర్ణించి చూపినాఁడు. ఇట్టి మాయాయుద్ధములు చోడునినాఁడు లేవు. అయినను వానిని వర్ణించియే యున్నాఁడు.

3. చోడునినాఁడు సైన్యమునఁ గాల్బలమునకును గజసైన్యమునకును ప్రాముఖ్య ముండెనని యాతని యుద్ధవర్ణనముఁ జూచినఁ దెలియును. మహమ్మదీయుల యాశ్వికయుద్ధపద్ధతుల నింకను నానాఁటికి హైందవరాజు లవలంబించినట్లు కానరాదు.

4. ఆనాఁడు పగటిపూటమాత్రమే యుద్ధములు ధర్మబద్ధముగా జరుగుచుండెననియు సాయంకాలము కాఁగానే యుద్ధమునాపి యుభయపక్షములవారును దమతమ శిబిరముల కేగి గాయములకుఁ జికిత్స లొన

రించుకొని మఱునాఁటి యుద్ధమునకు సిద్ధమగుచుండిరనియు నీతని యుద్ధవర్ణనము సూచించుచున్నది.

5. యుద్ధమున నగ్రభాగమునం దుండువారు సామాన్యవీరులు మాత్రమే యనియుఁ బోను జరిగిన కొద్ది యవసరమునుబట్టి ముఖ్యవీరులును, సేనానాయకులును, సామంతులును, రాజబంధువులును, మంత్రులును, జివరకు రాజులును యుద్ధరంగమునకు వచ్చుచుండిరని చోడుని క్రమము తెలుపుచున్నది.

ఈతఁడు దిక్పాలకులను యుద్ధరంగమునకు రప్పించిన విధ మొక క్రమములో సాగినది. మొట్టమొదట నీశాన దిక్పాలకునితో నారంభించి క్రమముగా నుత్తర, వాయవ్య, పశ్చిమ, నిర్ ఋతి, దక్షిణా, గ్నేయ, పూర్వ దిక్పతులను రణరంగమునకు రప్పించినాఁడు.

కొందఱు దిక్పాలకుల శత్రువులపేరులు సైతము మనోహరముగాఁ గల్పింపఁబడినవి. మందారకు నూఁడఁబెఱికి నేలకొరఁగఁజేసిన వాఁడు వాయువఁట! మహాకాయుని కాయముఁ గాల్చినవాఁ డగ్నియఁట!

ఇక్ష్వాకుమహారాజు మన కవిరాజునకు పూర్వీకుఁడు. వీ రిరువురును సూర్యవంశమువారే. కావుననే యిక్ష్వాకుమహారాజుగూడ యుద్ధమునకు వచ్చి యింద్రున కండగా నిలిచిన వృత్తాంతమును కవి వర్ణించినాఁడు. ఇక్ష్వాకుమహారాజు బహు పరాక్రమవంతుఁడు. కావుననే యాతఁడీశానాది దిక్పాలకులకన్న ప్రముఖుఁడనియు, నెక్కువమంది రాక్షస వీరులను మడియించియు నారా జలసటఁజెందక జంభాసురునిపై కుఱుకఁగా వాఁడీతని ధాక కాఁగలేక తప్పుకొని మఱియొక దిక్కునకుఁ బోయి యింద్రునితోఁ బోరెననియుఁ గవిరాజు వచించినాఁడు. దీని కంతటికిని గారణము కవిరాజునకుఁగల వంశాభిమానమే యనుట తప్పుగాదు.

6. ఈ కవిరాజు యుద్ధమును రమ్యతరముగా నొనర్చుటకై పురాణములం దన్యత్ర జరిగినవని వర్ణింపఁబడిన దేవాసుర యుద్ధములను సైతము కుమారతారకుల యుద్ధములో భాగములుగానే వర్ణించినాఁడు.

ఇట్టివాని కుదాహరణముగా నారాయణునితోఁ బోరాడిన రక్తబీజుని యుద్ధ మును బేర్కొనవచ్చును.

7. ఈ కవి యుద్ధవర్ణనము మన కాలమున నాటలపోటీలనుగూర్చి యప్పటికప్పుడు చేయు 'గచ్ఛద్వ్యాఖ్యానము' (Running commentary) వలె నున్నదనుట యతిశయోక్తి కాదు.

8. ఈతఁడు యుద్ధవర్ణనమునందు శబ్దాలంకారములను విరివిగా వాడినాఁడు. అవియును నీతని యుద్ధవర్ణనమును రమ్యతర మొనర్చుట కుపకరించినవి. ఉదా: "బృందారక బృందంబుఁ గాందిశీకులం జేసి సంక్రందను నాక్రందనుం జేసి, నారాయణుం బలాయన పరాయణుం జేసి కరిముఖు సమరవిముఖుం జేసి" (12-129) "ముక్తకబంధములగు భూముక్త కబంధములవలన మొగిఁగ్రమ్మ మహారక్తార్ద్రాంబరతల మున రక్తార్ద్రాంబరతనుండు రణరతుఁడాడెన్" (11-177) మున్నగునవి పెక్కులు.

9. ఈ మహాకవి వర్ణనములందు సామాన్యముగఁ గనుపట్టు నొక విశేషాంశ మేమనఁగాఁ బ్రతి చిన్న విషయమును వదిలివేయక జాగ్రత్తగా వర్ణించుట. యుద్ధవిరామమున రథములకు 'కందియనలు' పూయఁబడినవఁట! (12-3)

10. వియ్యమును, కయ్యమును సమానస్కంధులయెడఁ బొసంగి నప్పుడే రమ్యముగాఁ గనుపట్టును. ఈ విషయము నెఱింగియే కవిరాజు సరిసమానముగాఁ బెనఁగఁగల యోధులకు మధ్యనే రణమును గూర్చి నాఁడు. అంతేగాదు. చోడుఁడు తానొకవైపు పక్షపాతము వహించి యా పక్షమువారి బాహుబల విక్రమముల ఘనముగా వర్ణించి రెండవ పక్షము వారి పరాక్రమమును వర్ణించి చెప్పక విడువలేదు. రెండు పక్షములవారిని సమానముగా వారివారి పరాక్రమముల ననుసరించి వర్ణించినాఁడు. కొన్ని పట్టుల రాక్షసవీరుల పరాక్రమమే ఘనమయినదనియు వర్ణించినాఁడు.

11. ఈ కవి తారకాసురుని పరాక్రమమును, యుద్ధవిధమును వర్ణించినతీరు శ్లాఘా పాత్రము. ఆతని పరాక్రమమును వర్ణించు పట్టున నింద్రాదులను సైతము లక్ష్యపెట్టలే దీ మహాకవి. తారకునకోడి దేవతలు పాఱిన విధము నీ మహాకవి యెట్లు వర్ణించెనో చూడుఁడు :

"సుర లనినోడి దిక్పతులఁ జొచ్చిరి, దిక్పతులున్ సురాలియున్
సురపతిఁజొచ్చి, రింద్రుఁడును జుట్టిన దిక్పతులున్ సురౌఘమున్
సరసిజనాభుఁ జొచ్చిరట. చక్రియు నా సురరాజు దిక్పతుల్
సురలుఁ గుమారకున్ శరణుసొచ్చిరి తారకుఁ డంటఁదాఁకినన్".

(12-128)

పై పద్యమునఁ దారకుని పరాక్రమమేకాక దేవతల తత్కాల భీతియుఁ జక్కఁగాఁ గన్నులకుఁ గట్టినట్లు వర్ణింపఁబడినది. ఇట్టి దొక చలన చిత్రమునందు మాత్రమే ప్రదర్శింప వీలగును.

12. ఏ విషయమునైనను నెదుటివారికి మనస్సున కెక్కునట్లు చెప్పుటకు వారికి ఆ విషయమున సమగ్ర పరిజ్ఞానమును, దానిని చక్కని క్రమముతోఁ జెప్పఁగల మాటల నేర్పును గావలయును. ఇవి రెండును మహాకవికిఁ గలవు. కావుననే యాతని యుద్ధవర్ణనము చదువుటకు విసువు పుట్టింపక చవులూరించుఁచు గన్నులకుఁ గట్టినట్లు కనుపట్టుచుండును.

యుద్ధమన్న గవిరాజునకు మహానందము కలుగును. లేకున్నచో నాతఁ డద్దాని నంగనగా రూపింపఁ గల్గెడివాఁడు కాఁడు (చూ. 11-179 పద్య.) యుద్ధ మాతనికొక్క యంగనగా మాత్రమేగాదు మండుటెండలు కాచి కాచి విసుగెత్తించినపిదప దర్శనమిచ్చి హృదయమును చల్లఁబడఁ జేయు క్రొక్కాఱుగాఁ గనుపట్టును. (11-191 ప.) లేదేని కుముదావలీ విరాజమానమగు సరోవరముగా భాసిల్లి యానందింపఁజేయును (11-192) పిశాచగణముల భయంకర సంచార మా మహాకవికి నర్తకీ నర్తనమువలెఁ గానిపించును.

యుద్ధము నెడ నింతటి భయహీనమయిన మనోధైర్యము గల వాఁడు కావుననే యీ మహాకవి యుద్ధవర్ణనము దీర్ఘమయ్యును విసువు గొల్పక యొక యాటలపోటివలెఁ గన్నులముందు జరిగిపోవును.

ఇందనేక మనోహర భావయుతములగు పద్యములున్నవి. వాని నన్నింటిని వివరించి చూపుటకు స్థలము చాలమి నింతటితో నీ విషయ మును ముగించుచున్నాను.

## 11. సముద్ర వర్ణనము

కుమారసంభవమునందుఁ బ్రథమాశ్వాసము చివరఁ గవిరాజు సముద్రము నేడు పద్యములచే వర్ణించినాఁడు. ఏడు సముద్రసంఖ్య గదా : నిజమున కీ సముద్రవర్ణనము కథాగమనమున కుపయోగకారిగా లేదు. దీని యవసరము నక్కడ నున్నట్లు కానరాదు. కవిరా జష్టాదశ వర్ణనలను దన కావ్యమునఁ గావింతు నని ముందుగా వచించినవాఁ డగుటచేతనే యీ వర్ణనమును రచించినాఁడని యెంచనగును.

దక్షుఁడు తన యల్లురను కూతులను జూడ బయలుదేఱినాఁడు. ముందాతఁడు కశ్యపుని గృహమునకరిగినాఁడు. అక్కడినుండి బయలు వెడలి యమధర్మరాజు గృహమున కరుగ నిశ్చయించుకొని బయలుదేఱి పోవుచుండఁగా నాతనికి సముద్రము కనుపట్టినది. అక్కడనే సముద్ర మును వర్ణించినాఁడు కవి. ఆ సముద్రమును జూచుచు దాని మహిమనే కొనియాడుచుఁ బోయి దక్షుఁడు యమధర్మరాజు పట్టమును జేరుకొని నాఁడట !

పై కథా విధానమును బరిశీలించినచో నక్కడ సముద్ర వర్ణనము నకుఁ బ్రసక్తియే కానరాదు. పైపెచ్చు సముద్రవర్ణనమును దీసివేసి నను నిక్కడఁ గథాగమనమున కాటంక మేమియును గలుగదనుటయు స్పష్టము. యమధర్మరాజు గృహమునుండి దక్షుఁడు చంద్రునింటికి వెళ్ళినాఁడట ! చంద్రుని యింటికిఁ బోవుచు దక్షుఁడు సముద్రము

జూచెనని వర్ణించియున్నచో నీ వర్ణన మింకను గొంచెము సందర్భోచిత ముగా నుండి మనోహరముగా నొప్పెడివి.

సముద్రమును వర్ణించు మొట్టమొదటి పద్యము మహాస్రగ్ధర. ఇది సముద్రవర్ణనమున కుచితవృత్తమని యొక సందర్భమున నిదివఱకే చెప్పఁబడినది. ఈ మహాస్రగ్ధరకుఁ బిమ్మటఁ గవిరాజొక వచనమును గూర్చినాఁడు. అది వచనమే యయ్యును గమనవేగముచేతను, పదముల కూర్పుచేతను నొక యుజ్వల వృత్తముగానే గోచరించి సముద్ర వర్ణన మున కనుకూలముగా నున్నది.

"....మహాపరుష వజ్రివజ్రపాత భీతాయాత క్షోణీధరపక్ష విక్షేప క్షుభితానేక నక్ర చక్ర తిమి తిమింగిల తద్గిల కుంభీర కుంభీన సాద్యనేక జలచరకులాకులితలులితాలోల కల్లోలానూనఫేనాయమాన శుక్తిముక్తా ఫలాభిరామంబై." (1-116)

సముద్రములోనున్న ధరణి నీ మహాకవి యేమని భావించెనో చూడుడు :

"సురగిరికర్ణికగా విస్తరితములగు మండలములు దళములుగా న
వ్విరిదమ్మిఁ బోలి క్రాలుచు శరనిధిలో నిఖిలధరణిచక్రము వొలుచున్". (2-121)

సముద్ర మొక సరోవరమైనచో నందున్న భూమి యొక తామర పూవు ! మేరునగము దాని కర్ణిక ! దూరముగా విస్తరించియున్న మండలములు దళములు!

ఈ కల్పనమునకుఁ గవి కెంతటి భావనాబలముండవలెనో ! అతఁడొక్కసారి విమానమెక్కి యాకాశమున నెంతోయెత్తు పైకెగిరి చూచినను భూమి నీ యాకారమునఁ జూడనగుట సాధ్యముగాదు. అట్టి యసాధ్యమునయినను నుత్తమ భావనాబలము గల మహాకవి మనస్సు ననే దర్శింపఁగలఁడు. దర్శించినదాని నన్యులకుఁ జూపఁగలఁడు. అట్టి బలముగల మహాకవి నన్నెచోడుఁడు.

సముద్రము విశ్వవ్యాపకుఁడును, విశ్వంభరుఁడునైన విష్ణువున కన్న గొప్పదట! కాదామఱి! కావుననే యంతటి విష్ణువును సముద్రముపైఁ బవళించి యా సముద్రుఁడు కంఠమున వ్రేలాడవేసికొన్న యింద్ర నీలమణివలె నయిపోయినాఁడు. (1-122)

కవిరాజు సముద్ర వర్ణనము చిన్నదయ్యును మనోహరము.

## 12. మధుపానము

మధుపాన వర్ణనమున నుండఁదగిన విశేషాంశములను బ్రాచీను లీక్రిందివిధముగా వచించిరి :

"సురాపానే వికలతా స్ఖలనం వచనే గతౌ
లజ్జా మానచ్యుతిః ప్రేమాధిక్యం రక్తేక్షణ భ్రమాః"

కల్లుత్రాగినవారు వైకల్యమునందుటయు, వారి మాటలు తడఁబడుటయు, గమనభంగము కలుగుటయు, స్వాస్థ్యముచెడి, సిగ్గు విడిచి, యభిమానమును విసర్జించిఁ భ్రాంతిగలవారై యత్యనురాగముఁ జూపుటయు సహజము.

మన కవిరాజు కుమారసంభవమున నవమాశ్వాసమునందు సుమారు పది పద్యములచే స్త్రీల మధుపానమును వర్ణించినాఁడు. (127 ప. నుండి 135) మధుపానమునకు ముందు వన జల విహారములు వర్ణింపఁబడినవి.

ఓషధీప్రస్థపురమున హర గిరిజల వివాహము వైభవోపేతముగా జరిగినది. ఆ వివాహము సకల లోకములవారికి నానందదాయకమైనది. శివుఁడును బరమానంద భరితుఁడైనాఁడు. అదియే సమయమని యెంచి దేవతలు బృహస్పతి ముఖమున జగదీశ్వరుని మన్మథుని పునరవతరణమునకుఁ గరుణింప వేడినారు. శివుఁడా సమయమున నేదయినఁ గాదనఁ గలఁడా? అతఁడు "రతికి మాత్రము సశరీ

రుఁడుగాను, నన్యుల కనంగుఁడుగాను మన్మథుఁడు వఱలఁ గలఁ"డని వర మిచ్చినాఁడు. వెంటనే కాముఁడు రతిముందుఁ బ్రత్యక్షమైనాఁడు.

అసలే జను లానందవశులైనారు. దానిపై శృంగార రసాధి దేవతయగు మన్మథుఁ డానాఁడు పునర్జన్మము నందినాఁడు. అందుకని వా రుత్సవములఁ జేసికొన్నారు; ఆటలాడినారు; పాటలు పాడినారు; ఉద్యాన క్రీడలు, జల విహారములు గావించినారు; తమ వేడుకలు చూపి యాదిదంపతుల కానందమును గూర్చినారు. ఆ జనము జలక్రీడలును, వనవిహారమును, బుష్పాపచయమును గావించి, యా పూలచే హరగిరిజల నలంకరించినారు.

మఱికొందఱు స్త్రీ లా సమయముననే మధుపానగోష్ఠి గావించి నారు. మధుపానమునకు ముందు మండలార్చన దీర్చి కూర్చుండి *మూలజ, వృక్షజ, గుడ, మధు, పిష్ట, కుసుమ, వికారంబులగు సుగంధా* సవంబులు కనక మణిమయానేక పాత్రములందు నింపి, శివపార్వతు లను స్మరించి, భైరవునికిని, యోగీంద్రులకును నమస్కార మొనర్చి యోగినులకును, వీరవ్రాతములకును మధువుల నివేదించి తృప్తి నొందించి, నవనాథాదుల నామోచ్చారణము చేసి, వారికి మధునివేదనము చేసి తాము మధుపానము నాచరించినారు. కల్లు ద్రాగినవారి యాకారమును గవిరాజు వర్ణించిన విధముఁ జూడుఁడు :

"అసితోత్పలములపై నరుణేందుదీధితుల్
వెలపెనాఁ గనుఁగవ లెఱ్ఱనయ్యెఁ
దొవలపైఁ బ్రాలేయలవములు తనరెనా
మొగములఁ బేర్చెందు లెగయుఁదెంచెఁ
గలహంస పదుపులు గాళ్ళందుఁ దొడరెనా
మట్టంపు నడపులు మందటిల్లెఁ
దరుణవల్లరులపైఁ బురినమ్మ లూగెనా
వెన్నునఁ గ్రొవ్వెదల్ విరిసిప్రేలెఁ

బర్వితావలిఁ దొలుమొల్ల పండ్లరసము
త్రావెనన ముద్దుఁబలుకులు దడుమనయ్యె
మధుమదాసక్తి నిజరూప మహిమలెడసి
యభినవాంగ ప్రభాసితలైరి సతులు" (9-133)

"మద్యమును సేవించిన సతుల కన్ను లెఱ్ఱవడినవి. ముఖములపైఁ జెమటబిందువులు పట్టినవి. నడకలు తడఁబడినవి. సిగలువిడి వీపులపై వ్రేలాడినవి. మాటలు తడఁబడినవి. వారు తమ నిజరూపమును బాసి యభినవాకారములఁ బడిసినారు" ఇది వారి వర్ణనము. పై పద్యముచేఁ గవిరాజు కల్లుదాగినవారినిఁ గన్నులకుఁ గట్టినట్లు చిత్రించినాఁడు.

కవిరా జేవిషయమును వర్ణించినను నావర్ణనము కొంత యపూర్వజ్ఞానమును పాఠకుల కొసఁగునదిగా నుండి కవికిఁ గల యపార పాండిత్యమును, సంప్రదాయజ్ఞతను జాటుచుండును. ఈ క్రింది పద్యమును బరికింపుఁడు :

"అమరులు త్రావుచో నమృతమందురు దీని నహిప్రజం బజ
స్రముగొని యానుచో నిది రసాయనమందురు భూసురౌఘమా
గమవిధి సోమపానమని గైకొని యానుదు రెందు చక్రయా
గమునెడ వస్తువందు రిది కౌశికులీ సురపేర్మి యింతయే ?" (9-130)

ఒక్క మద్యమే యనేకులచే ననేక నామముల వ్యవహరింపఁబడి సేవింపఁ బడుటచే నామభేదమేగాని వస్తుభేదము లేదనియు, దేవతలును బ్రాహ్మణులును దీనిని సేవింతురన్న నిది నింద్యముకాక సర్వజనులకును సేవ్యమే యనియు వారి భావము. కవిరాజు భావము నిదియే యని యనరాదు. అట్లయినచో నాతఁడు శివపార్వతుల చేతనే మధుపానము చేయించెడివాఁడు. అది వారి కుచితము కాదని యెంచియే యంగనాజనముచే మధుపానముఁ జేయించినాఁడు గదా కవిరాజు !

పై పద్యమున నీ మధువునే 'కౌశికులు' 'చక్రయాగము' నెడ వస్తువని వ్యవహరింతురని చెప్పఁబడినది. కౌశికులు శాక్తేయులలో

నొక తెగకుఁ జెందినవారు. లలితా సహస్రనామ స్తోత్రమున నా దేవి 'కౌళమార్గ తత్పరసేవిత' యని చెప్పఁబడినది. ఆమెకే యందు మఱి యొక పేరు 'కౌళిని' యనియు వచింపఁబడినది. కావున నిందలిది చక్ర యాగమే కాని కొన్నింటనున్నట్లు 'చక్రియాగము' కాదు. చక్రయాగ మనగా శ్రీ చక్రార్చనము. శ్రీ చక్రార్చనము శాక్తేయ పద్ధతియం దతి ముఖ్యమయినది.

ఈ శాక్తేయులందు ద్వివిధాచారములు గలవని తత్సంప్రదాయ వేత్తలు వచింతురు. అందొకదానికి దక్షిణాచారమనియు రెండవదానికి వామాచారమనియు పేరులు. ఈ యాచారములఁ బాటించు నిరుతెగలకును గొన్ని భేదము లున్నవి. దక్షిణాచారమును బాటించు శాక్తేయులు మద్య మాంసములను బూజావిధానమున నుపయోగింపరు. తత్ప్రత్యామ్నాయ ములగు వస్తువులను మాత్రమే వారుపయోగింతురు. ఇఁక వామాచారము నకుఁ జెందిన శాక్తేయులు మద్యమాంసాదులను సైతము 'దేవి'కి నివే దింతురు వానిని ప్రసాదముగా స్వీకరింతురు. అది వారికి దూష్యము గాదు. దీనినే కవిరాజు పైపద్యమున వచించినాఁడు. అంతేగాదు మద్య మును 'వస్తు' వని వారు వ్యవహరింతురనియు నీ మహాకవి వచించి నాఁడు. కాని యీ విషయమును సంప్రదాయజ్ఞులగు పండితులను విచా రింపఁగా సత్యమేయని తెలిసినది. అంతేగాదు ఇది సంప్రదాయము నెఱింగిన వారికి మాత్రమే తెలియుననియు నీ విషయమే గ్రంథము లందును గానరాదనియు నా పండితులు వచించిరి,

ఇట్లు కేవలము తత్సంప్రదాయజ్ఞులకు మాత్రమే తెలియనగు విషయమును మన కవిరాజు పైపద్యమునఁగూర్చి తన యపార పరిజ్ఞాన మును మనకుఁ దెలియపఱచినాఁడు.

ఈ క్రింది మఱియొక పద్యముఁ గనుఁడు :

"సురలకు దీనన యజరా

మరమయ్యెంగాక యమృతమథనమునకు ము

న్నెరియరె తెరలరె మృతిఁబొం
దరె యని సుర వొగడిపొగడి తరుణులు ప్రీతిన్." (9-131)

పై పద్యము శ్రీ గురజాడ అప్పారావుగారి కన్యాశుల్కమున గిరీశముగారి 'చుట్టను' గూర్చిన పద్యమునకు మూలమా ? యనున ట్లున్నది.

మద్యములో నొక్క విశేష మున్నదని తజ్ఞులందురు. మద్య పానమునకు ముందు వారేమిచేయ నెంతురో మద్యపానమత్తులై యున్న సమయమున దానినే మిక్కిలి దీక్షతోఁ గావింతురఁట. కావుననే కొందఱు సాధువులు సమాధి స్థిరత్వమునకై గంజాయిని సేవింతురఁట. కల్లుత్రాగి వారి శత్రువులను దిట్టుచు పెడలువారు నేడును మద్యపాన నిషేధము లేవి చోటుల మనకుఁ గనిపించుచునే యుందురు.

మన కవిరాజు మదోన్మత్తలగు సతులచే నేమి చేయించినాఁడో చూడుఁడు :

"అన నక్కజముగానన్ని (?) మేయెఱుఁగ
కాడుచు శంకరు 'నంకమాలికలు'
సనిఁగొన సాహూరి ఫలమంజరంబునఁ
బౌరాళి నాందోళి భైరవి నాట
నునుపార నాలతుల్ మూల్కొనఁజేసి
నునురీతితోడ మనోరాగలీల
వినవింపుగాఁ బెక్కు విధములఁబాడి
వినుతించి రింతులా విశ్వేశు నీశు." (1-135)

మదిరోన్మత్తలగు స్త్రీలు శంకరు నంకమాలికలను వివిధరాగము లతోఁ బాడుచుఁ బరవశలై యానందమున నాట్యమొనరించిరని కవి వర్ణించినాఁడు. ఇది యప్పటివారి స్థితి కుచితముగా నుండుటయేగాక తత్కాలీన దేశీయసాహిత్యమును గుఱించియు, ప్రచారముననున్న రాగ

ములను గూర్చియు, కవిరాజు సంగీతపరిజ్ఞానముఁగూర్చియు వచించు చున్నది.

కల్లుత్రాగకముందు వారేమిచేయుచుండిరో దానినే వారిప్పు డెక్కువగాఁ జేయుచున్నారని గదా, కవిరాజు పద్యము వచించుచున్నది. వారంతకుముందు శివపార్వతుల విలాసార్థము జలక్రీడోద్యాన విహారములను బుష్పాపచయమును గావించినారు. వారికప్పుడు హరగిరిజలుతక్క వింకేమియు దృష్టిలో లేదు. కావుననే మదిరోన్మత్తలయిన యాస్త్రీలు శివపార్వతులను స్తుతించుచు వివిధరాగములలోఁ బాటలుపాడుచుఁ బరవశలై సిగ్గువిడిచి నర్తించిరని కవిరాజు వచించెను. కవిరాజు మధుపాన వర్ణనము మనోహరమనుట సత్యము.

## 13. ఋతువర్ణనము

ఋతువు లారు. అన్ని ఋతువుల నందలును కావ్యములందు వర్ణించవలయునను నిర్బంధములేదు. కొందలు కొందలు కొన్ని కొన్ని ఋతువులను మాత్రమే తను కావ్యములందు వర్ణింతురు. మన కవిరాజట్లు గాక తనకుమారసంభవమున నారు ఋతువులను వర్ణించినాఁడు. అందును వసంత ఋతువును రెండుమారులు వర్ణించినాఁడు. ఒక్కొక్క ఋతు వర్ణనమునే తీసికొని యందలి కవిచాతుర్యమును యథాశక్తి వివరింప యత్నింతును.

### 1. వసంతర్తు వర్ణనము

వసంతర్తువును గవిరాజు రెండుమారులు వర్ణించెననిగదా ముందు చెప్పితిని. మన్మథుఁడు ఇంద్రు నాజ్ఞచొప్పున శివుని జయించి యాతనికిఁ బార్వతితోడి వివాహమును గావింప హిమవన్నగ ప్రాంతమును జేరినాఁడు. అతని వెంటనే రతియును వచ్చినది. మన్మథుఁడు శివాశ్రమ భూములకు

వచ్చి తన మిత్రమగు వసంతునిఁ బిలిచి తన విజయమునకుఁ బరిస్థితు లనుకూలించునట్లుగా నాతనిని తన వైభవముఁ బ్రకటింపుమనెను.

మన్మథుఁడు యుద్ధార్థముగదా పోవుచున్నాఁడు! యుద్ధమునకుఁ బోవువారు తా మేఋతువునఁ బ్రయాణము సాగించిన ననుకూలముగా నుండి విజయము కలుగునో చూచుకొనుట గలదుగదా! రాజులుచేయు యుద్ధములకు శరదృతు వనుకూలముగా నుండునని మన కావ్యాదులందు వర్ణింపఁబడినది. వలరాజు యుద్ధవిదానమే వేఱు; ఆతని పరికరములును భిన్నములే; కావుననే యాతని విజయ యాత్రకు శరత్తునకన్న వసంతమే యనుకూలము. శరత్తునఁ గోకిలలకు నోట మాటరాదు. చూతాస్త్రములు లభింపవు. పద్మములు ముడుచుకొని కాంతివిహీనమగును. బాణములే పనిచేయనప్పు డాతఁడు యుద్ధము చేయుట యెట్లు? అందును శివునితోడనా? శివునకు శరత్తు బలమయిన కాలము. ఆతని కది యుత్సవ కాలము. అందుకనియే మన్మథుఁడు తన చైత్రయాత్రకు వసంతకాలము నెన్నుకొన్నాఁడు. వసంతునితోఁ జెలిమిఁ జేసికొని తన ధర్మమును బూర్తిగా నెఱవేర్పఁ గోరినాఁడు. వసంతుఁడు స్మరునకు నమ్మిన బంటు. కార్యమా? దేవతలది. కావుననే వసంతుఁడు తన యావచ్ఛక్తి నుపయోగించి మన్మథుని విజయమున కనుకూలములగు పరిస్థితులను గల్పించినాఁడు.

మన్మథుఁడు శివుని గెలువ నేఁగుచున్నాఁడంటిమి. యుద్ధమునకేగు వారికి రథముండవలెఁగదా! మన్మథుఁని రథముఁ జూడుఁడు:

"పంకరుహంబులు బండి కన్నులు- చంప
కంబులు నొగ, లుత్పలంబు లిరుసు,
కరవీరములు పలుగాడి, జాదులు సనుఁ
గొయ్య, లశోకముల్ కోడిపీఁట,
సింధువారమ్ములు సీలలు, కేతకుల్
మెట్టులు, మొల్లలు మెట్టుగుదెలు,

పొగడలు పలుపులు, పున్నాగములు పగ్గ
ములు, సహకారముల్ పూనుగాడి,
కురువకానీక మూలపుఁగోల, కైర
వములు మునుకోల, కోకము లావాహనములు
గా వసంతుఁడు సూతుఁడై పూవుఁదేర
నెఱయఁ *గుసుమాయుధంబులు నినిపి* తెచ్చె". (4-83)

రథమునిండ నాయుధములు నింపికొని, భార్యను బ్రక్కనుంచుకొని, బలువైన పుష్పరథము నారోహించి "నిజ సామ్రాజ్యవిభవైశ్వర్యములతో నతిరయంబున" హిమవంతబునకు వచ్చి చేరినాడు రతిరాజు.

అదియే యుద్ధభూమి. మన్మథుఁడు ముందక్కడఁ దన సేనలకు విడిది చూచుకొనవలయును. బలములు స్థానములు చూచుకొని స్థిరపడిన పిదప యుద్ధ మారంభము చేయవలయునుగదా! అందుకే యట్టి యేర్పాటులం జేయుటకు వసంతుని నియమించినాఁడు.

ఆ వసంతుఁడు (రథమునుండి) భూమి కవతరించి యొక్కసారిఁ గలయఁ బరికించి చూచినాఁడో? లేదో? (ఆ పరిసర) భూమియంతయు మన్మథుని పరివారముల యునికి కనుకూలముగా మాఱిపోయినది.

"ధీరన నంకుర పల్లవ కోరక పుష్పఫల వితతిఁ గొమరమరి మనో
హారములై సారములై యారామము లొప్పె మధుసమాగమవేళన్". (4-88)

అని వర్ణింపఁబడినది. మన్మథుని పరివారమునఁ జిగుళ్ళు భుజించువారును, పండ్లరసముపైఁ బ్రదుకువారును గలరు. వారందఱ కాహారమును, నివాసమున కనుకూల వసతులును సిద్ధములైనవన్నమాట! ఈవిధముగా మదన పరివారము విడియుట కనుకూల పరిస్థితులు కలిగిన వెంటనే వారి మిత్రుల కానందమును, శత్రువులకు బాధలును మిక్కుటమయినవి. అది సహజమేగదా! ఆ వలరాజు ప్రభావమట్టిది! చూడుఁడు కవి దాని నెట్లు వర్ణించినాఁడో?

"వేదన విరహులు సేదలు సెడి సంధు
లెడలంగఁ బల్లాకు లెడలెఁ దరుల
రాగిల్లు కవల మేఁదీఁగలఁ బులకంబు
లంకురింపఁగ దరు లంకురించె
సమ్మదంబునఁ గామి జనుల చిత్తంబులు
చిగురొత్తఁ దరులందుఁ జిగురులొత్తె
రతిదోహలముల దంపతుల ముఖాబ్జముల్
విలసిల్ల వికసిల్లె విరులు తరుల
నెలమి చిలుకపిండు తొలుమేనఁజేసిన
తపము పండఁ బండెఁ దరువనంబు
లువిద లింపుమిగుల సూయల పాటలు
పాడ మధుమదమునఁ బాడె నలులు." (4-89)

రాజు తన సేవకులకు జీతములను సరిగా నీయవలయును. లేదేని నసంతృప్తులగు సేవకులు రాజునకై సరిగాఁ బోరు సాగింపరు. రాజున కందువలన నపజయము కలుగును. ఈ విషయమును గవిరాజే యేకాదశాశ్వాసమున నీ క్రింది పద్యముతో వచించెను.

"ఈవలయు నర్థ మిచ్చియు
సేవకు మన్నింపవలయు జితమతి విభుఁడా
యీవికి మన్ననకుం దగఁ
జావలయు భటుండు పతికి జయముగఁ బోరన్." (11-44)

యుద్ధమునకు సేవకులను గొనిపోవు వలరాజు వారికి జీతములిచ్చుకొనవలెనుగదా! కావుననే వసంతుఁడా వలరాజు సేవకులకు జీతములిచ్చుటకు ధనమును గూర్చినాఁడఁట!

"భావజవిభుఁ డలి శుక పిక
సేవక తతి కెదరుదీర జీతము సేయం

గా వెలిఁబోసిన పసిడుల
ప్రోవులునాఁ దమ్మి లెలమిఁ బూచెఁ బెడంగై." (4-92)

సైనికులకు "బంగారము" నే కుప్పలుగా నొసంగుట సామాన్యమా ? అది వసంతుని సాహాయ్యమున నొక్క వలరాజుకే సాధ్యమయినది.

ఆ సేనాశిబిరములందు రాత్రులలో వెలిగించుటకు దీపములు కావలెనుగదా ! వసంతుఁడు వానినిసయితముఁ గూర్చినాఁడు చూడుఁడు:

"నలిమొగ్గలు విరిపువ్వులు
సలలితమై చూడనొప్పెఁ జంపక మత్యు
జ్జ్వలరుచి రేవగ లూరక
వెలిగెడు నుద్దీప దీపవృక్షమువోలెన్." (4-93)

సామాన్య దీపములకు నూనె కావలయును. దీపవృక్షములకు నూనె పనిలేదు. అవి రాత్రింబగళ్లు వెలుగుచునేయుండును. గాలి కాఱిపోవు. గొప్పదీపములే !

ఇట్లు సైనికులకు వలసిన యేర్పాట్లు చేయుటయేగాదు, వసంతుఁడు రతిరాజుగారికిని దివ్యమయిన నివాస మేర్పాటు చేసినాఁడు. అదియును సామాన్య గృహముగాదు ! పంచమణిహర్మ్యము ! చూఁడుఁడా రాజగృహమును :

"మొగడలు వజ్రముల్, విరులు ముత్తెము, లింపగు నన్పుఁగెంపులేఁ
జిగురులు పద్మరాగములు, చిల్కలు వైరిజరాజి(?), తుమ్మెదల్
నగరిపు నీలజాలములునాఁ దలరారె వసంతవల్లభుం
డగు వలరాజు 'పంచమణి హర్మ్యములో' యన జాతభూజముల్." (4-99)

ఆతని కొక్క పంచమణి హర్మ్యమునేగాదు ముత్యాల పందిరినిసైత మేర్పాటుఁ జేయించినాఁడు వసంతుఁడు (చూ. 4 ఆ. 97 ప.).

ఈ విధముగా రతిరాజు పరివారముతో విడిదలలందు విడిసి తన కార్యక్రమమునకుఁ బూనుకొనవలసియుండెను. అతఁడు వచ్చిన కార్య మేమి ? శివుని జయించుటగదా ! కాని యది యాతనికి జ్ఞాపకమున్నగదా దానిపై పూనుకొనుట ! అతఁడు వసంతోత్సవములందు మునిఁగి యా కార్యమునే మఱచిపోయినాఁడఁట ! వసంతుని సేవలవలన నాతనికి సుఖ జీవితమబ్బినది. ఆతనికేగా దా యరణ్యమునందు తిర్యగ్జంతువులును వసంత సమయ సముత్సాహమునఁ బరవశమునంది విహరించినవి. మన్మథుఁడును రతితో సుఖముగా విహరించినాఁడు. సచేతనములే గాదు, అచేతనములగు లతలు వృక్షములును ఋతుధర్మముల నాచ రించినవి. శివుని తపోభూమికి నా ప్రభావము సోఁకినది. అక్కడను వసంత సమయ సముత్సాహము వెల్లివిరిసి శంభు సమాధికే విఘ్నము కలుగుస్థితి యేర్పడినది. ఆ స్థితిని కనిపెట్టిన నంది హస్తసంజ్ఞచే వన మును శాసించినాఁడు. ఆతని యాజ్ఞచే

"మెలఁగక మృగములు, విహగము
లులియక, లేఁదొరలఁ జిగుళు లొత్తక, మలయా
నిలుఁడు చలింపక, నెలవుల
నలవడి వనమమరెఁ జిత్రితాటవి వోలెన్" (5-9)

అని వర్ణింపఁబడినది. అంతటి సంరంభము కలిగినది కావుననే మన్మథుఁ డును దన కార్యమును మఱచి రతిలోలుఁడైనాఁడు.

ఎట్టకేల కాతనికి స్మృతి వచ్చినది. వెంటనే యుద్ధమునకు సంసిద్ధ మైనాఁడఁట. ఆతని యప్పటి స్థితిని వర్ణించిన పద్యముఁ జూడుఁడు.

"దళితాంభోజదళాంగుళీతనుశిరస్త్రాణంబులుం, గోమలే
క్షు లసచ్చాపము, సజ్జసూత్ర గుణముం, జూతాంకురాశోక కు
ట్మలజాతి ప్రసవాస్త్ర పూర్ణశరధుల్, మంత్రించి వంశాక్షతా
దుల సన్నాహము చేసి మారుఁడు జగత్క్షోభంబు సంధిల్లఁగాన్".
(4-117)

పై పద్యమున మదనునియోధవేషము మనోహరముగా వర్ణింపఁ బడినది. తరువాత నాతఁడు శివుని ముందఱి లతానికుంజమును జేరి పార్వతిరాక కెదిరిచూచి యామె వచ్చిన సమయముం జూచి తన యస్త్రమును ప్రయోగింపఁబోయి శివుని మూఁడవకంటి మంటచే భస్మమైన విషయము వర్ణింపఁ బడినది. ఇక్కడ నింకొక్క విషయమును ప్రస్తావింపవలసి యున్నది.

ఇంత బ్రహ్మాండముగా సంసిద్ధుఁడయి దండువెడలిన మన్మథుఁడు కార్యసిద్ధి నేలపొందలేదు ? అను విషయమును మన కవిరాజెట్లు భావించెనో యరయవలయును.

మన కవిరాజు రెండు యాత్రలను వర్ణించి వానిలోని భేదములను మనోహరముగాఁ జిత్రించినాఁడు. వానిలో నొక్కటి మారునిది, రెండవది కుమారునిది. ఒకయాత్ర విజయవంతమయినది. మఱియొకటి ప్రాణాపాయకరముగాఁ బరిణమించినది. ఇదియే మన మారుని జైత్రయాత్ర. దీనికిఁ గారణములను సైతము కవిరాజే యక్కడక్కడఁ జెప్పి చూపినాఁడు. వానిలోఁ గొన్నింటిని నాకుఁ దోఁచినరీతిని జూపుదును.

1. మన కవిరాజు దశమాశ్వాసమున శుక్రునిచేఁ దారకునకు రాజనీతిని జెప్పించిన సందర్భమున నీక్రింది పద్యమును రచించినాఁడు:

"తన కధికుల కతిభక్తియు,
మనమున నెయ్యంబుఁ దన సమానులకును, హీ
నునియందుఁ గృపయుఁ జేకొని
మను జనునకు వగయుఁగలదె మదిఁ బరికింపన్". (10-178)

తనకన్న బలవంతులయినవారియెడ రాజు భక్తితో మెలఁగవలయుననియు, సమానులతో స్నేహవర్తనము జరుపవలయుననియు, తక్కువవారియెడ దయాశీలమును కనుపఱుపవలయు ననియు నట్లు ప్రవర్తించువారికి వగలేదనియుఁ బై పద్యము వచించుచున్నదిగదా! పై నీతికి వ్యతిరేకముగాఁ బ్రవర్తించువారు దుఃఖభాగులగుదురనిగదా కవిరాజు భావము!

మన్మథుఁడు సరిగాఁ బై నీతికి వ్యతిరేకముగాఁ బ్రవర్తించిన వాఁడు. ఆ విషయమును కవి రతిచే బలుమాఱులు మన్మథునకుఁ జెప్పించి నాఁడు. కాని మన్మథుఁ డామె మాటలు చెవినిబెట్టలేదు. పై పెచ్చుఁ దాను శివు నశ్రమంబున జయింతుననియు బీరములు పల్కినాఁడు. భార్య యెదుటనే కాదు; ఇంద్రుని ముందును నీ రతిరాజు పలికిన పలుకులు మిక్కిలి యమాయకముగా నున్నవి. ఇంద్రుఁడు శివునికిఁ బార్వతిం గూర్చినచో వారికిఁ గుమారుఁ డుదయించి తారకు నోర్వఁగలఁడని చెప్పినపుడు మన్మథుఁ డాతనితో నేమనియెనో చూడుఁడు :

"పరము తపం బడంచి మఱి పార్వతియం దనురక్తుఁ జేయు మా
యిరువురకుం గుమారుఁ డుదయించిన మా పగఁ దీఱునంచు న
చ్చెరువుగ నన్నిదొంతులును జెప్పఁగ నేటికి? వానిపై సురే
శ్వర! నను బంపు మీక్షణమ చంపెద మీ పగదీరఁ దారకున్".

సురేంద్రాదులు సహితము జయింపలేమని భయపడుచున్న తార కుని తాను జయింతునన్న యీ వచన మొక్కటే మన్మథుని యమాయ కతను పూర్ణముగాఁ జాటఁదగియున్నది!

ఎదిరిని - తన్ను నెఱుఁగని యమాయకుఁ డగుటచేతనే మన్మ థుఁడు కార్యసిద్ధి నందలేదనుటను గవిరాజే సూచించెను గదా!

2. ఇంద్రుని ముందఱను, రతి యెదుటను, శివుని జయించుట తనకొక లెక్కలోనిదికాదని బీరములు పలికినను నిజమునకు వానికి శివుఁ డన్న హడలే! శివుని దగ్గఱిదాక పోనవసరము లేదు. శివుని యాకార మున నున్న మఱియొక వస్తువును జూచినను వీనికిఁ బ్రాణము లుల్లు మనునట! చూడుఁడు కవిరా జీవిషయము నెంత మనోహరముగా వర్ణించినాఁడో?

మన్మథుని యానతిని వసంతుఁడు విజృంభించినాఁడు. వనము నందలి వృక్షములన్నియుఁ జిగిర్చినవి. మామిడిచెట్లును జిగిర్చినవి. పిమ్మట నవి పుష్పించి ఫలించి మనోహరముగా నున్నవి. వానిని చూచి

నాఁడు మన్మథుఁడు. ఇంకేమున్నది ? వాని ప్రాణము ఝల్లుమన్నది ! ప్రక్కకు జరిగి యోసరిల్లినాఁడఁట ! కారణమేమో యెఱుఁగుదురా ? చూడుఁడు :

"పలఁకెడు కారాకు లలితాస్థిచయముగా
సోలుకొమ్మలు పలుకేలుగాఁగ
బాల పల్లవములు ప్రేలుకెంజెడలుగాఁ
బెనఁగు తీఁగలు దొడ్డ ఫణులుగాఁగఁ
కలకంఠ నికరమ్ము గళమునకప్పుగా
బుప్పొడి మేని విభూతిగాఁగ
ఫలములు వరదాన ఫలముగా నలి
మాలికల్ రుద్రాక్ష మాలికలుగ
శంభుమూర్తిఁ దాల్చి సహకార భూరుహ
చక్రవర్తి నవవసంతవేళ
నతిశయిల్లుచుండె నక్కడఁ గని మది
నుదరిపడి మనోజుఁ డోసరింప." (4-101)

శివునాకారముననున్న సహకారచక్రవర్తినిజూచి భయపడునంతటి భీరు వీ మన్మథరాజుగారు ! ఇట్టివారికా కార్యసిద్ధిగలుగుట !

3. దైవనియతియు మన్మథున కనుకూలముగా లేదు. ఇంద్రుని పిలుపున మదనుఁ డాతనిం జూడ నేఁగినవెంటనే యిక్కడ నాతనిభార్యకు దుశ్శకునముల పరంపర యారంభమయినది. రతి యాతనితోఁ దనకు "దివ్య, ఆంతరిక్ష, భౌమ, ఆంగికా ద్యనేక దుర్నిమిత్తంబులు" కలిగి నట్లు చెప్పి శివునిపై నేఁగు ప్రయత్నమును మాన్పనెంచినది. కాని మన్మథుఁడు రతిపలుకుల లెక్కింపక శివాశ్రమమునకు బయలుదేఱి వసంతుని వలయు సన్నాహములఁజేయ నియమించినాఁడు. అప్పుడు నాతనికి దుశ్శకునమే కలిగినది ! దానిని కవి యెట్లు సూచించెనో చూడుఁడు :

"తన సూఁడగు ధనద దిశాం
గన నిసుఁ దొడఁగూడఁబోకఁ గని యామ్యదిశాం
గన నొచ్చి వెచ్చ నూర్చెనొ
యన శిశిర విముక్త దక్షిణానిల మెసఁగెన్." (4-86)

పై పద్యమున యామ్య దిశాంగనకుఁ బతివియోగము వచింపఁ బడినది. ఇది రతికి ముందు కలుగఁబోవు పతివియోగమునకు సూచన గదా! కాని యీ విషయమును రతితత్పతులలో నెవ్వరును గ్రహింపలేదు.

తరువాత మన్మథుఁడు శివుని యాశ్రమాంగణము చేరినాఁడు. మఱల నపశకునము కలిగినది ! ఈసారి కలిగిన యపశకునము సామాన్య మైనదికాదు ! అది సద్యోమరణ సూచకమయినదఁట ! చూడుఁడు :

"మృడుపై ముంగలి సని తల
పడి మలయానిలుఁడు పోరు భరమై మదనుం
బడలువడఁ బఱచుక్రియఁ దడఁ
బడ ధూళియు గాడ్పు వీచెఁ బ్రతికూలంబై. (5-11)

దీని నొక్కదానిని మాత్రము గ్రహించినాఁడఁట మన్మథుఁడు. కాని యక్కడికైనను జాగ్రత్తపడి యుండిన బాగుండెడిది. ఇంతకును విధినియతి యట్టులుండఁగా నాతఁ డెట్లు తప్పుకొనఁ గలఁడు ? కావుననే వెడలుటయు నక్కడఁ బ్రాణమును గోల్పోవుటయు వానికిఁ దప్పలేదు.

ఇఁక రెండవసారి పార్వతి తపశ్చర్యసందర్భమున మన కవిరాజు చేసిన వసంతవర్ణనము మిగుల చిన్నది. రెండే రెండు పద్యములతో దానిని బూర్తిచేసి చక్కని యౌచిత్యమును బాటించినాఁ డీ మహాకవి. ఆ రెంటియందు నీక్రిందిది వసంత సమయమునందలి లోకస్థితిని హృదయమునకు హత్తునట్లు చిత్రించుచున్నది.

"పొలుపుగనేచి, చెల్వదరఁబూచి, బెడంగుగఁగాచి, పండ్రమా
కులు, మరుఁదేయఁ, గోయిలలుగూయ, మదాలులుమ్రోయ, రాగులన్

వలరసమందఁ, బ్రోషితులు వందఁ, గవల్ ముదమంద, వచ్చె న
త్యలఘువసంత మర్వర ననంతవిభూతినిరంతరంబుగాన్."

(6-132)

*పార్వతి తపశ్చర్యా సందర్భమునందలి ఋతువర్ణనము - వ్యాస కాళిదాస నన్నెచోడులలోని భేదములు*

కుమారసంభవము షష్ఠాశ్వాసమునందుఁ బార్వతి తపశ్చర్యా సందర్భమునఁ గవిరాజు వర్షర్తువుతో నారంభించి యాఱు ఋతువులను వర్ణించి యాయా ఋతువులందుఁ బార్వతి యెట్లు తపము నొనర్చెనో వివరించినాఁడు. ఈ యాఱు ఋతువులును మనోహరముగా వర్ణింపఁ బడినవి.

పార్వతి తపశ్చర్య సందర్భమున కాళిదాసును ఋతువర్ణనమును గావించినాఁడు. కాని యాతఁడు గ్రీష్మ వర్షాహేమంతములను మాత్రమే తన కావ్యమున గ్రహించినాఁడు. శివపురాణమునందును గాళిదాసీయము నందువలెనే గ్రీష్మాదిగా మూఁడు ఋతువులు చెప్పఁబడినవి. ఈ క్రింది శివపురాణ శ్లోకములను జూడుఁడు :

"గ్రీష్మేచ పరితో వహ్నిం ప్రజ్వలంతం దివానిశమ్
కృత్వా తస్థౌచ తన్మధ్యే సతతం జపతీ మనుమ్
సతతం చైవ వర్షాసు స్థండిలే సుస్థిరాసనా
శిలాపృష్ఠేచ సంసిక్తా బభూవ జలధారయా
శీతే జలాంతరే శశ్వ త్తస్థౌ సా భక్తితత్పరా
అనాహారాఽతప త్తత్ర నీహారేషు నిశాసు చ".(పా.ఖం. 22 అధ్యా.)

*తపఃకాలము వ్యంగ్యమార్గమునఁ జెప్పఁబడినది*

నన్నెచోడు డట్లుగాక వర్షాదిగా నాఱు ఋతువులను వర్ణించినాఁడు. మూలకథయందుఁ బార్వతి మూఁడువేల సంవత్సరములు తపమొనరించి

నట్లు చెప్పఁబడినది. కావ్యమున నంత దీర్ఘకాలము తపమొనరించినట్లు చెప్పుట యుక్తము గాదుగదా ! కావుననే కాళిదాసుగాని, నన్నెచోడుఁడు గాని యీ కాలమును దమ గ్రంథములందు గ్రహింపలేదు.

శివపురాణమునందువలెఁ దపఃకాలమును వాచ్యముగాఁ జెప్పక కాళిదాస చోడు లిరువురును వ్యంగ్యమార్గమున దానిని సూచించినారు. కాళిదాసు కుమారసంభవమునఁ బార్వతిచెలికత్తె బ్రహ్మచారితోఁ బార్వతి తపమునుగూర్చి యేమని చెప్పినదో చూడుఁడు :

"ద్రుమేషు సఖ్యాకృతజన్మసు స్వయం
ఫలం తప స్సాక్షిషు దృష్టమేష్వపి
నచప్రరోహాభిముఖోఽపి దృశ్యతే
మనోరథోఽస్యా శ్శశిమౌళి సంశ్రయః". (5 సర్గ 60 శ్లో)

తపోవనమునఁ బార్వతి కొన్ని చెట్లను నాటినది. ఆ చెట్లు పెరిగి పెద్దవై పండ్ల నొసఁగు స్థితికి వచ్చినవి. కాని చంద్రమౌళి నాశ్రయించిన పార్వతి కోరిక కంకురోత్పత్తియైనను జరిగినట్లు కానరాదని పార్వతి చెలి పలికినది. ఈ శ్లోకముచేఁ గాళిదాసు పార్వతి తపఃకాలమును మనోహరముగా సూచించినాఁడు. ఒక చెట్టుమొలచి పెరిగి కాతకాసినంతటి కాలమామె తపము చేసినదని పై పద్యము సూచించుచున్నది. అవి యే చెట్లో ? చెట్లలో ననేకవిధము లున్నవి. కొన్ని త్వరగాఁ బెరిగి కాతకు వచ్చును. మఱికొన్ని చాలకాలమునకుఁ గాని కాతకురావు. ద్రుమ మనగాఁ గొమ్మలుగల చెట్టు. ఇది కాతకు వచ్చుటకు చాల కాలమే పట్టును. ఇది కాళిదాసు ప్రతిభ.

నన్నెచోడుఁడు మాత్రము తక్కువవాఁడా ? అతఁడును కాళిదాసుని మార్గముననే తపఃకాలము దీర్ఘమయినదని బ్రహ్మచారికిఁ బార్వతి చెలికత్తెచేతనే చెప్పించినాఁడు (చూ. కుమా. 7 ఆ. 19 ప.). చోడుఁ డీ సందర్భమున వాడిన "తరు" శబ్దము "ఛాయనొసగెఁడు చెట్టు" అను

నర్థముగలది. అనగాఁ బెద్దచెట్టన్నమాట. పెద్దచెట్టులు కాతగాయుటకు చాల కాలమే పట్టునుగదా। అంతకాల మామె తపము చేసినదని తేలు చున్నది.

కాళిదాస నన్నెచోడులు తపశ్చర్యా కాలమును సూచించుట కవలంబించిన మఱియొక విధానము ఋతువర్ణనము. కాళిదాసు మూఁడు ఋతువులయందలి పార్వతి తపశ్చర్యను మాత్రమే వర్ణించి యూఱకున్నాఁడు. ఆమె కడమ ఋతువులం దెట్లు తపమొనరించినదియు నందు స్పష్టముగా లేదు.

నన్నెచోడుఁ డట్లుగాక వర్షర్తువు మొదలుగా నాఱు ఋతువులందును బార్వతి తపశ్చర్యా విధానమును వర్ణించి చూపినాఁడు. ఇందువలన నామె యేడాదిపొడుగునను నిర్విరామముగా బహువర్షములు తపమొనర్చిన విషయము ధ్వనితమగుచున్నది. ఈ విధముగా నన్నెచోడుని యీ ఋతు వర్ణనము ముఖ్యమయి మనోహరముగా వఱలినది.

*ఋతువర్ణనము : చోడుని దేశీయత*

వ్యాస కాళిదాసు లిరువురును గ్రీష్మర్తువుతో నారంభించిన ఋతువర్ణనమును నన్నెచోడుఁడు వర్షర్తువుతో నారంభించుట కేమి కారణమయి యుండునో చూడవలసి యున్నది. నాకుఁ జూడ నిదియు నాతని దేశీయాభిమానమునే సూచించునదిగాఁ గనుపట్టుచున్నది. ఎట్లయినను చోడుఁడు పూర్తి ఋతువులను వర్ణింపఁదలంచుకొన్నాఁడు. అనఁగా సంవత్సర మంతటి నన్నమాట. తెలుఁగువారికి సంవత్సర ముగాదితో నారంభమగుట మనకెల్లరకుఁ దెలిసినదే. కాని వ్యవహారములన్నియు వర్షాకాలము ప్రారంభముతోనే మొదలగుట నేఁటికిని తెనుఁగుదేశమునఁ జూపట్టును. అందుకుఁ గారణ మీదేశము వ్యవసాయ ప్రధానమయి యుండుటయే కావచ్చును. పల్లెలలో వ్యవసాయదారుల దగ్గఱ జీతమునకుఁ గుదురుటకును, తెగతెంపులు చేసికొని యుద్యోగమునుండి వెడలి

పోవుటకును, అప్పులనుగూర్చిన లెక్కలు మొదలిడుటకును, పెట్టుబడుల ప్రారంభమునకును వర్షారంభమే ప్రారంభకాలము. కావుననే చోడుఁడు గీష్మర్తువుతో నారంభింపక ఋతువర్ణనమును వర్షర్తువుతో నారంభించి యుండును.

## వర్షర్తు వర్ణనము

వర్షర్తు వర్ణనమునం దుండఁదగిన వర్ణనీయాంశముల నీ క్రింది విధముగాఁ బ్రాచీనులు వచించిరి.

"వర్షాసు ఘనశిఖిస్మయహంసగమాః పంక కందలోద్భేదా
జాతీకదంబకేతక ఝంఝానిల నిమ్నగా హలి ప్రీతిః."

పై విషయము లన్నియు నుండునట్లు కవిరాజు వర్షర్తు వర్ణన ప్రారంభము నొక్క పద్యముచే నెట్లు వర్ణించెనో చూడుఁడు :

"గత సంతాపము, శీతలీకృత మహీకాంతాంగ, మత్యుద్గత
స్మితకుందోత్కర కేతకీకుటజరాజిభ్రాజితామోద, మూ
ర్జితవల్లీ ప్రకరంబు, వర్ధిత శిఖిశ్రేణీ ప్రమోదంబు, ర
మ్యతరంబై కుతలంబునం బరగె వర్షారంభ మత్యున్నతిన్".

(6-94)

కవిరాజు వర్షర్తు వర్ణన మాతనిలోని భావయిత్రీ ప్రతిభను గుర్తించుట కనువైన సాధనమని నేను తలంచుచున్నాను.

ఈ మహాకవి వర్ణనమునం దొక క్రమముండునని ముందే వచియించినాను. ఈ వర్షర్తు వర్ణనమునందు నది పాటింపఁబడినది. ఆతఁడు వర్షాకాలమును వర్ణించిన విధము చూడుఁడు.

"గ్రీష్మము పోయినది. వర్షర్తు వారంభమయినది. ఆ వెంటనే వాతావరణమునఁ గొంత మార్పు సహజము గదా! గ్రీష్మమందు వేఁడిచేఁ గలిగిన సంతాపము నశించినది. భూమి యంతయుఁ జల్లఁ బడినది. ఆ ఋతువునఁ బుష్పించు చెట్లు సంతోషించినవి. నెమళ్ళను

ఆనందించినవి. ఇవి యన్నియు వర్షాగమనము నందలి స్థితులు. తరువాత మేఘోదయ మయినది. అవి క్రమక్రమముగా నాకాశ మెల్లెడల వ్యాపించినవి. తరువాత మొట్టమొదటిసారిగా వాన కురిసినది. ఆ తొలి వానచినుకులను మ్రింగుటకై చాతకము లుల్లాసముగా నిటునటు నెగిరి యాడుకొన్నవి. ఆ పిమ్మట భూమిపైఁ బచ్చగడ్డి మొలచి దట్టమైనది. అంతటితో నొక కార్తె గడచిపోయినది. మనకు వర్షములు మృగశిరలో నారంభమగును. దీని తరువాతిది 'ఆర్ద్రికార్తె'. ఈ కార్తెలో నెఱ్ఱగాఁ బట్టుబట్టవంటి ఆర్ద్రపురుగులు చూడ ముచ్చటగాఁ బచ్చగడ్డిపై విహరించినవి. ఆ పిమ్మట మల్లెలు, వానితోడనే కడమచెట్లును సమృద్ధిగాఁ బూలు పూసినవి. వానకాలపుఁ దొలి సంబరము పోయినది. వానలు విపరీత మయినవి. అవి వానలుకావు; కుంభములతోఁ గ్రుమ్మరించినట్లున్న పెద్ద వర్షములు. అంతటి వానలు కురిసినప్పుడు నదు లుప్పొంగి, పొంగి పాఱుట సహజమే. వానిని జూచి జనులు భయపడుటయు సహజమే."

ఇది యీ మహాకవి వర్షర్తువును వర్ణించిన విధము. ఇది వర్షాకాలములోని క్రమమును చక్కఁగా వర్ణించుచున్న దనుట చెప్పఁ బని లేదు గదా!

ఇఁక నీ వర్ణనమునందుఁ గల కవి భావనా పటిమను కొంచెము చూతము. ఆకాశమునందు నల్లగా నాలుగు దెసలను వ్యాపించి వాన కుఱియుటకు సిద్ధముగా నున్న మేఘమండలము నీతఁడు వర్ణించిన చిన్న గీతమును జూడుఁడు :

"ధర నిదాఘ వాతాహతి నెరియకుండ
విధితమాల మంటపము గావించె ననఁగ
నొప్పె నీలాభ్రపటల మ చ్చప్పరమున
కాఱులన నెల్లఁదెస వానకాఱు లమరె" (6-97)

"రోహిణికార్తెలో నెండల వేఁడికి రోళ్ళురోకళ్ళు పగిలిపోవునని మనదేశమునందలి వాడుక. శిలాదారు వికారములయినవాని గతియే

యిట్లున్న భూమి వట్టి మృత్తికగదా! ఆమె సంగతి చెప్పవలయునా? రేకులు, రేకళ్ళు పగిలినచో నంత బాధాకరము గాదు. భూమియే మండి పోయినచో నిక సృష్టి యేమికావలయును? కనుకనే పాపము! సృష్టి కర్త నీ విషయము మిక్కిలి బాధించినది. ఆయన యీ ధర నట్టి యాపదనుండి కాపాడవలయును! అందుకనియే యాతఁ డామె కెండ బాధ కలుగకుండ చల్లని తమాల మంటపమును (తాటాకుల పందిరిగాదు) గట్టించినాఁడు! అదియే యీ మేఘమండలి! మంటపమునకు కాళ్ళు (స్తంభములు) కావలయును గదా! ఇక్కడ వానకాళ్ళే మంటపపుఁ గాళ్ళు."

ఈ (మహా) కవి దయవల్ల భూమండలము నంతటిని గప్పఁ గలిగినంత మంటపము సిద్ధమయినది! ఇందు కెంతటి భావనాబలము కావలయునో? పాఠకులే యూహించుకొందురు గాక!

'వానకాళ్ళు' అను శబ్దమునకు 'వర్షధార'లను నర్థము యూనివ ర్సిటీ ప్రతియందుఁ గలదు. ఇది కాదని యనుటకు నేను సాహసింపను గాని యిక్కడ వర్షధారలు స్తంభములవలె నున్న వనుటకన్న వర్షము నకు ముందు దిగంతములలో మేఘమండలమునకుఁ దోకలవలె వ్రేలాడు చుండు మేఘశకలములు పందిరికిఁ గల స్తంభములవలె నున్నవనుట యుక్తముగా నుండునని నేను భావించుచున్నాను. ఇట్టి దృశ్యములు వానకాలమున మనకుఁ గనుపట్టుచునే యుండును.

ఈ వర్షర్తు వర్ణనములో నేయొక్క పద్యమును సారహీనముగా లేదనుటయందుఁ గొంచెమయిన నతిశయోక్తి లేదు. వాని నన్నింటిని వివరించిన గ్రంథ విస్తరమగు నను భయముచేఁ గలము ముందునకు సాగకున్నది. విడచి ముందునకుఁ బోవుటకు మన మంగీకరింపకున్నది. కావున సంగ్రహముగాఁ గొంత వచించి ముందునకు సాగుదును. పూర్తి పద్యములను గ్రంథమునఁ జూచుకొనఁ బ్రార్థన.

"పరమస్నేహము హృత్సరోరుహమున" న్నిత్యాది- (6-96) పద్యమును జిత్తగింపుఁడు : ఇది కవిరాజు భావనాబలమునకు మరి యొక చక్కని యుదాహరణము. మేఘమండలము పార్వతి శివు నర్చించుటకుఁ దపోగ్ని వెలిఁగించిపట్టినమంత్రక జ్జలమువలె నున్నదఁట! ఇట్టిదీ మహాకవి దృష్టివైశాల్యము! పార్వతి తపోఽగ్ని యాకాశముదనుక వ్యాపించినదఁట ! అయ్యు నిది ప్రారంభస్థితియే. తరువాత మూఁడు జగంబులను బర్విన"దని కవియే వర్ణించినాఁడు. ఆ వర్ణనమున కిక్క డనే బీజావాపనము గావించినాఁడు కవిరాజు !

"చలిగాడ్పుల ముసరులమెయి" నను చిన్ని కందమును బరికిం పుఁడు : అందెంత భావము నిమిడ్చినాఁడో మహాకవి. "కంబల వంతం న బాధతే శీత"మ్మను వాక్యము మనకుఁ దెలిసినదేకదా ! ఈ మహాకవి మహీకాంతకు చలిబాధలేకుండ (చిప్పరువు) కంబళిని గప్పించినాఁడు. దీనికి మూలము వాల్మీకియం దున్నది. కాని యీ పద్యమునఁ గవిరాజు ప్రత్యేకతయు లేకపోలేదు! మూలమునకు మెఱుఁగుపెట్టినాఁడు.

ఈ మహాకవి కభినయముపై నభిమానము మెండు ! అందీతని కభిరుచియేగాదు, శాస్త్రాభినివేశమును గలదు. అవకాశము లభించి నప్పుడెల్ల నభినయవిషయముల నీ మహాకవి తన గ్రంథమున వర్ణించి నాఁడు. వర్షర్తు వర్ణనమునందలి యీ క్రింది పద్యమును చిత్తగించి యీ రాజకవి యాస్థానమున జరిగిన నాట్యగోష్ఠుల నూహించుకొనుఁడు:

"ఆ క్రౌంకారను రాజు మ్రోల నిజరావానంతగేయాభ్రనా
దైకాతోద్యముఁగూర్చి మ్రోయ సురగోపాంభోజరాగ త్రిణా
నీకోద్యద్ధరిదశ్మకస్థల లసన్నృత్యోరు రంగస్థలిన్
గేకీపాత్రములాడె భావముగ నుత్తిష్ఠాగ్ర పింఛంబులై." (6-103)

ఈ కవిరాజునకుఁ బ్రకృతిపరిశీలనమునం దాసక్తి మెండని యొకచోట వచించితిని. అందు కుదాహరణముగా నీ వర్షర్తు వర్ణనము

నందలి చాతక వర్ణనమును నదుల వర్ణనమును గల పద్యముల నుదాహ రించి దీనిని ముగింతును.

"ఉదుటఁ దెమల్చి మ్రింగు సరసోదకబిందుల మౌక్తికంబు లం
గదఁ గబళించుఁ, బీల్చు, వడగండులకుం దను వోసరించుఁ, దో
యదము లదర్చిమూరు, నచిరాంశు లతాగ్రములెక్కు, మెల్పునం
జదలకు నుప్పరంబెగయుఁ జాతకపోతకముల్ సెదర్చుచున్."

(6-99)

ఎంత వాస్తవముగాఁ జిత్రించినాఁ డీ పద్యమును: శ్రీనాథుఁడును జక్కనయు నీ పద్యము ననుకరించినారు.

"దరములు ముంపుచుం, దరులతాతతి వేళులతోన కూలఁగా
నురువడిఁ ద్రోచుచున్, మడువు లోలిఁ గలంచుచు, నంబుజాలి సం
హరణము సేయుచున్, మదజలౌఘముగ్రమ్మ, మదాంధగంధసిం
ధురమును బోలెఁ బెల్లున నదుల్ చనుదెంచె భయంకరాకృతిన్."

(6-106)

శరదృతు వర్ణనము

"శరదిందు రవి పటుత్వమ్, జలాచ్ఛ తాగస్త్యహంసవృషదర్పాః.
సప్తచ్ఛద పద్మ సితాభ్ర ధాన్య శిఖిపక్షమదపాతాః."

"దళితాంభోరుహ సప్తపత్ర సుమహాత్కాశానసౌఘంబు, ని
ర్దళితాంబుప్రద కేతకీకుటజకుందవ్రాత, ముద్భాసితేం
దు లసన్మత్తమరాళకంబు, దతవిద్యుత్కేకిసల్లాస్య, మ
గ్గలమై పర్వె జగంబులం దురుశరత్కాలంబు రమ్యాకృతిన్."

(6-112)

పై పద్యము కుమారసంభవ శరద్వర్ణనములో మొట్టమొదటిది. ఇందు శరత్కాలము స్థూలముగా నొక్కసారి కన్నులకుఁ గట్టినట్లు వర్ణింపఁబడినది. ఏ ఋతువును వర్ణించినను నిట్లు మొట్టమొదట నొక్క

వృత్తముచే నా ఋతువును స్థూలముగా వర్ణించి యాపిమ్మట సూక్ష్మాంశ ముల వర్ణించి చూపుట యీ కవికిఁగల విశిష్టగుణము. దీని నన్ని ఋతు వర్ణనములందును గవి పాటించెననుట యాయా ఋతువర్ణనములఁ బరి కించినచోఁ గానఁగును. వీనియందు మఱియొక విశేషమేమనఁగా నా మొదటి పద్యములు సామాన్యముగా సమాసయుక్తములై యా సమాస ములచేతనే యా ఋతు విశేషములను వర్ణించుట. పై పద్య మిందు కుదాహరణము. ఇట్టి పద్యములే యీతని వర్షా, హేమంత, గ్రీష్మ వర్ణనములకు మొదటను గలవు. శిశిర వసంత వర్ణనల కాదిని వృత్త పద్యములే యున్నను వానిగతి యింకొక విధముగ నున్నది. అయ్యు వానియందును నా ఋతువులలోని ముఖ్య ధర్మముల స్థూలముగాఁ జూపియే ముందుకు సాగినాఁడు కవి.

"శరత్కాల మారంభమయినది. వర్షర్తువున ముమ్మరముగాఁ బూచిన చెట్లు పూలుపూచుట మానినవి. క్రొత్తపుష్పములు శోభాకర ముగాఁ బూచినవి. నెమిళ్ళయాటలు కట్టినవి. హంసల విహార మతిశ యిల్లినది. నీటిలోని మాలిన్యము పోయినది. భూమిమీది తడియాఱి నది. నదులలో నిసుకతిన్నెలు మనోహరములయినవి. స్త్రీలు సంతో షించినారు. ఆకాశము శరచ్చంద్రికా ధవళితమై పాలసముద్రమువలె శోభిల్లినది. ఆకాశమునఁ దోరణములు గట్టినట్లు గుంపులుగుంపులుగాఁ జిలుకలు విహరించినవి." ఇది యీతని శరద్వర్ణనము.

తామరపూలు వికసించిన విధము నీ మహాకవి యెట్లుత్ప్రేక్షించెనో కనుఁడు :

"జలవాసులైన హరి ల
క్ష్ములు వర్షనిశావసానమున మేల్కని క
న్నులు విచ్చిచూచినట్టులు
జలజోత్పల రుచులువెలసె శారదవేళన్." (6-113)

విష్ణువు "నారాయణుఁడు". లక్ష్మి నారాయణ హృదయ పద్మాలయ. కావున నామెయు జలవాసినియే. వర్షారంభమున విష్ణువు లక్ష్మీసహిత ముగా యోగనిద్రాగతుఁడైనాఁడు. శరదంతమున యోగనిద్ర మేల్కాన్నా రాదంపతులు. ఆమె పద్మాక్షి; అతఁడు పుండరీకాక్షుఁడు. నిద్రావసాన మున వారు కన్నులు తెరచినారు. తామరలు వికసించినవి. చిన్నదయి నను భావగంభీరమయిన దీపద్యము.

ఈ కవికి వర్ణనములందాయా ఋతుధర్మములతోఁబాటు స్త్రీలను గలిపి వర్ణించుట యిష్టమయిన విషయమని యీ క్రిందిపద్యము వచించు చున్నది.

"కాంతల హారప్రకాశంబుతోడన
కాశప్రకాశ వికాస మెసఁగె
మదఁతుల తిన్నని నడవుల తోడన
నయమున రాయంచ నడపు లడరెఁ
బొలఁతుల కనుఁగవ పొలపంబుతోడన
నలిఁ జకోరంబుల పొలప మెలసె
వెలఁదుల ముఖకాంతి వెలుఁగుటతోడన
విమలమై శశికాంతి వెలుఁగు దమరెఁ
దెఱవ లెదలఁ గలఁకఁదేఱుటతోడన
యేఱులందుఁ గలఁకదేఱఁ దొడఁగె
మదనవతుల మదసముదయంబుతోడన
పంబి శారదోదయంబు దనరె." (6-215)

ఇట్టివే రెండు సీసపద్యములు చతుర్థాశ్వాసమునందలి వసంత వర్ణనమునందును గలవు. వానిలో నొక్కదానిని వసంతవర్ణనమునుగూర్చిన ప్రకరణమునఁ జూడనగును. ఇంకొక్కటి—

"నెలఁతల పరిమళ నిశ్వాసపవనంబుఁ
దలఁపించె దక్షిణానిలవిలాస

మింతుల దరహాస కాంతి సంభాననఁ
గావించెఁ జంద్రప్రభా విభాతి....” (4-111)

శరత్కాల సాయంసమయాకాశ శోభను కన్నులకుఁ గట్టునట్లు చిత్రించిన యొక్క పద్యమును జూపి దీనిని ముగించుచున్నాను.

“అరుణ శాలి కణిశములు శుకాలి గఱచుకొనుచు నం
బరతలమున నోలి నెగసిపాఱు దిగ్వధూచయం
బరయఁ జెలువమెసఁగు శారదాగమమున నుత్సవో
త్కరవిభాతిఁ దోరణములు గట్టినట్టు లందమై.” (6-120)

హేమంతవర్ణనము

“హేమంతే దినలఘుతా, శీత, యవ, స్తంబ, మరు, బక, హిమాని”.

కవిరాజు హేమంతర్తువును రెండే రెండు పద్యములలో వర్ణించినాఁడు. అందొక్కటి ఋతువును స్థూలముగా వర్ణించి చూపఁగా రెండవది దానికిఁ బ్రకృత కథతో సంబంధమును గలుపుచున్నది.

శరత్కాలమును దీర్ఘముగా వర్ణించినాఁడు కవి. పార్వతికి శరత్కాలమంత దీర్ఘముగాఁ గోచరించియుండునేమో ? అది సహజమే గదా ! ఇంతగాఁ దన కుమార్తె నలరించిన యా శరత్తుపయి హిమవంతునకుఁ గోపమువచ్చుట తప్పు గాదుగదా ! అందుకే యాతఁడు జగముపై విఱచికొని పడినాఁడట !

“శరదాగమమునఁ దన సుత
నురుపరితాపంబు సేయుచుండుట హిమ భూ
ధరపతిగని వానిపయిం
బరిగొనియెనొ నాఁగఁ దుహినపటలము పర్వెన్.” (6-123)

## శిశిరవర్ణనము

"శినోత్యంగం శీతేన శిశిరః. శిఞ్ నిశానే. శీతముచేత దేహము నల్పముగాఁ జేయునది" అని "శిశిర" శబ్దమునకు వ్యుత్పత్తి. మాఘఫాల్గున ములు రెండు శిశిరర్తువనుట యెల్లరు నెఱిఁగినదే. మాఘమాసమునందుఁ గొంచెము చలియున్నను ఫాల్గునము నేడు మనకు చలికాలమువలెఁ గానరాదు. పూర్వకాలమున నట్లుండెకిదేమో ? మాఘమాసారంభము నుండియే నేడు మనకు వసంత చిహ్నములు కానవచ్చుచున్నవి. "వసంతపంచమి"యు మాఘశుద్ధమునందే వచ్చుచున్నది. వీనినిబట్టి ఋతుధర్మములు క్రమముగా వెనుకకుఁ బోవుచున్నవని తజ్జ్ఞు లందురు.

మన కవిరాజు శిశిరమునఁ జలి మిక్కుటముగా నుండినట్లే వర్ణించి నాఁడు. చూడుఁడు :

"శీతాత్యంతనిపీడనం బడి జగజ్జీవాదు లత్యార్తులై
పాతాళంబులు సొచ్చున ట్లిరవు లొప్పన్ భూగృహావాసులై
భీతిన్ వెల్వడకుండ, వహ్నిమెయి కంపింపన్, ప్రచండార్చికిన్
జేతుల్ క్రొవ్వెర వోవుచుండ శిశిరోచ్ఛేదంబు వర్వెన్ మహిన్."

(6-124)

అగ్నికి సయితము చేతులు వంకరలు వోవునంతటి చలికాలమట శిశిరము.

కవి సమయస్ఫూర్తికిని, భావనాబలమునకును, సాక్ష్యమయిన పద్య మొక్కదానిని గనుఁడు :

"తనరి హేమంతమగుడుఁ బద్మంబు లడగి
పోయెఁ బోయిన కొల నొక్కపువ్వు తనకు
విత్తుగా దాఁచికొనియున్న విధమపోలె
శైలసుత ముఖ ముదక వాసమున నొప్పె."

(6-126)

పై పద్యముచేఁ గవిరాజు పార్వతి ముఖశోభనుఁ జూపుటయేకాక యామె పద్మినీజాతి స్త్రీ యనుటను గూడ ధ్వనింపఁ జేసినాఁడు. అంతే గాదీ పద్యము నన్నెచోడ మహాకవి లోకజ్ఞతను గూడఁ జాటుచున్నది.

లోకమునందు వ్యావసాయికులు మొదట చెట్లకుఁ గాచిన కాయలను యథేచ్ఛముగా నుపయోగించియు నిఁకఁ జెట్టు నశించుననియో, లేదా యిఁక కాత మానివేయుననియో భావించఁదగిన స్థితి కలుగఁగానే యా చివరికాయను విత్తనముగా నట్లేయుంచుట కానవగును. ఆ విత్తనపుఁ గాయ యొక్కటియే కదమవానికిఁ గాయలేమియు లేనప్పుడు గూడ బహు జాగ్రత్తగాఁ గాపాడఁబడుచుండును. ఇట్టి దృశ్యములు మన కా సమయములం దేచేలలోనికి వెళ్ళినను గానవచ్చుచునే యుండును. పుష్పవృక్ష విషయమునను నట్లే జరుగుట లోకమునందుఁ గలదు. ఆ చివరి పువ్వును చెట్టుమీదనే జాగ్రత్తగా ముదిరిపోయి యెండిపోనిచ్చినప్పు డందలి బీజములు బలపడి గట్టివాఱి యెండిపోయి మంచి విత్తనములుగా మాఱును. ఇది యంతయు నన్నెచోడ మహాకవి పై పద్యముచేత చక్కఁగా వర్ణించినాఁడు. ఇది యెంతేని లోకపరిశీలనము చేతఁ గాని సాధ్యముగాదు.

తరువాతి పద్యమున నీ (ముఖ) పద్మమునకుఁ జక్కఁగాఁ గాపు వెట్టిన విధమును వర్ణించినాఁడు కవిరాజు (6-128).

*గ్రీష్మ వర్ణనము*

"గ్రీష్మే పాటల మల్లీ తాప సరః పథికశోషవాతాల్యః
నక్తప్రపాప్రపాస్త్రీ మృగతృష్ణాభ్రమాది ఫలపాకాః".

"స్ఫురదురుదావపావకము, శోషిత సింధుచయోదకంబు, సం
హరిత పతంగసంఘ, మసమర్థిత మార్గిగణంబు, తప్తభూ
మిరుహ కులంబు, వర్ధిత సమీరవిదాహ, మశేషదగ్ధ భూ
ధర నికరంబు నాఁ బటునిదాఘము పర్వె భయంకరాకృతిన్"

(6-134)

కవిరాజు గ్రీష్మమును నిదాఘముగానే భావించినాఁడు. గ్రీష్మమున కున్న పలుపర్యాయపదములలో 'నిదాఘ' మొక్కటి. కాని వాని నన్నింటిని విడిచి నన్నెచోడుఁ డీసందర్భమునఁ బలుమాఱులు నిదాఘ శబ్దమునే వాడినాఁడు. "నితరాం దహ్యతే జనోఽత్ర నిదాఘః" అని నిదాఘ శబ్దమునకు వ్యుత్పత్తి.

కవిరాజు గ్రీష్మమును నిదాఘముగా దర్శించినవాఁడు కావుననే యాతని యీ వర్ణనమంతయు గ్రీష్మకాలమునందలి తాపాతిశయమును మాత్రమే వివరించుచున్నది.

"నోరుఁ దెఱచిన నోరె డెండ" యను నా నుడి మనదేశమునఁ గలదు. కవిరాజు వర్ణించిన గ్రీష్మాతప మంతకన్నఁ దాపకరమయినది. చూడుడు :

"తలఁచిన డెందము కందును,
పలికిన నోరెల్లఁ బొక్కుఁ, బ్రభసూచిన ఱె
ప్పలు కమరు ననగఁ బటుతర
విలయానలభాతి నెండ వేసవిఁ గాచెన్". (6-135)

ఆ గ్రీష్మాతప తాపమునకు హరిహరవిరించులే భయపడిపోయినారఁట చూడుఁడు :

"హరి శరధిఁ గ్రుంకె నభవుఁడు
సురనదిఁ దలఁదాల్చె నబ్జజుఁడు గ్రమ్మర నం
బురుహంబు సొచ్చె నతిదు
స్తరదుస్సహ తీవ్రతర నిదాఘ భయముననన్". (6-139)

ఈ ముమ్మూర్తులకుఁ బరుగిడు శక్తి కలదు గాన సురక్షిత స్థానములఁ జేరుకొని ప్రాణములను గాపాడుకొన్నారు. కాని యరణ్యమున నిలిచియున్న చెట్లగతి యేమి ? అవి పరుగెత్తలేవు సరిగదా ! నడువనులేవు ; వాని వెంటనేగడా వాని నీడలును నుండవలె ! కావున వానిగతి యెట్లున్నదో ! కొంచెము పరికింతము.

"ఆతపభీతి నీడలు రయంబున మ్రాకులక్రిందు దూఱెనో?
ఆ తరులుం దృషాభిహతులై తమ నీడలు తార త్రాగెనో
ఖాతి ననంగ నీడ లురుపాదప మూలములం దడంగె గ్రీ
ష్మాతతమధ్యవాసరములందుఁ జలింపకయుండు నెండలన్".

(6-141)

"చెట్టును విడిచి నీడలు కొంచెము దూరమున నున్నవి. ఇంతలో నెండ యెక్కువచ్చినది గాఁబోలు! మనము మార్గమధ్యమునఁ బ్రయాణము చేయునప్పుడు ఎండవేడిమి యెక్కువయిన నేమి చేయుదుము! చెట్లక్రింద దూరెదము గదా! ఆ నీడలు నట్లే చెట్లక్రింద దూఱియుండును! లేదా? పాపము చెట్లే యెండవేళ దాహ మధికమయి నీరు లభింపక పోవుటచేత నగతికముగాఁ గొంత తాపము శాంతించునని యెంచి తమ నీడలనే తాము త్రాగనెంచి పాదముల సన్నిధికి లాగియుండనోపును! లేదేని ఆ నీడలట్లు చెట్లక్రింది కేల వచ్చి నిలిచియుండును?"

ఇది కవి కల్పన! నిదాఘము నెంత భయంకరముగాఁ జిత్రించి నదీ మహాకవి వర్ణనము! మనమును దానిని తలంపరాదు! "తలఁచిన డెందము కందును." కాని యింత భయంకరమయిన యెండవేళ నిర్భయముగానున్న వ్యక్తియు లేకపోలేదు! ఆమెయే పార్వతి! ఆమె తపోనిష్ఠ యట్టిది!

## 14. పురవర్ణనము

"పురే ఽట్ట పరిఖా వప్ర ప్రతోలీ తోరణాదయః
ప్రాసాదాధ్వ ప్రపారామ వాప్యో, వేశ్యా సతీత్వరీ"

ఈశ్వరునకుఁ బార్వతినిచ్చి వివాహము చేయుమని హిమవంతు నడుగుటకు సప్తర్షు లోషధీప్రస్థపురమునకు వెళ్ళిన సందర్భమున నన్నెచోడుఁడు పురవర్ణనముఁ గావించినాఁడు.

సప్తర్షులు కైలాసమునుండి బయలుదేఱి హిమాలయమును జేరి మునుముందు గంగాస్నానము నాచరించి యోషధిప్రస్థపురమును జూచినారు. అది హిమవత్పర్వతోపకంఠమున నున్నదఁట! ఆ తరువాత కవిరాజా పట్టణమునఁ గల తోటలను, వానిలోని కావలిస్త్రీలను ఉద్యాన వనములను, అందలి సరోవరములను, క్రీడాచలములను, వాని పిమ్మటఁ బురబాహ్యప్రదేశముల విహరించు మదగజములను, పిమ్మటఁ గోటను, కోటచుట్టుఁగల కందకమును, పిమ్మట నా కోటలోని హర్మ్యముల మధ్య నున్న రాజభవనమును, ఆ భవనములలోని కపోత ప్రతిమలను, తరువాత దేవాలయములను, వీథులను, ఆ పురిలోని విప్రవైశ్య జనులను, అంగళ్ళ యందుఁ గల సుభటులను, స్త్రీలను వర్ణించి యాపిదప రాకపోకలయందలి సందడిని వివరించి చివరకు ప్రభువగు హిమవంతుని వర్ణించినాఁడు.

పై వర్ణనమునం దొక క్రమము పాటింపఁబడినదనుట స్పష్టముగానే కానవచ్చుచున్నది. ఇది సప్తర్షులు వరుసగా మార్గమధ్యమునఁ దమకుఁ గనిపించినవానిని వర్ణించుచుఁ గ్రమక్రమముగా హిమవత్సాన్నిధ్యమును జేరినట్లుండి యా పట్టణమును పటమునఁ జిత్రించుట కనువుగా సాగినది. ఇదియే యాతని వర్ణనములందలి వైశిష్ట్యము.

కుమారసంభవమునఁ గల యీ యోషధీప్రస్థ నగరవర్ణనమును జదివినప్పుడు శ్రీనాథుని ఓరుగల్లు నగరవర్ణనము (క్రీడాభిరామము నందలిది) జ్ఞాపకమునకు వచ్చుననుట యీ రెండు వర్ణనములు చదివినఁ దెలియును. అంతేగాదు; సుప్రసిద్ధ పర్యాయాత్రికుఁడగు అబ్దుర్ రజాక్, విజయనగరమును వర్ణించిన విధముననున్న దీ కవిరాజు పురవర్ణనము. అందుకుఁ గారణము వీరందఱును దమ కాలమందున్న రాజధాని నగరముల స్వరూపమును యథాతథముగా వర్ణింపఁదలచినవా రగుటచే యనుట సమంజసము.

వీ రందఱును మన కాలమునందువలె గృహములుగల భాగములనే పురముగాఁ దీసికొని వర్ణింపక, పుర బాహ్యములందుఁ గల యుద్యాన

వనములను, చేలను గూడఁ బురములోని భాగములుగానే యెంచి వర్ణించుట కాననగును. ఇందు కానాఁటి నగరనిర్మాణ విధానమే కారణమయి యుండును. శత్రుసైన్యము వచ్చినప్పుడు తమ్మును, తమ ప్రజలను, సురక్షితముగా బహుదినములు కాపాడుకొనుట కనువుగాఁ బురములకు వెలుపల నుండవలసిన చేలచుట్టును గోడలనుంచి వారు నగరముల నిర్మించు చుండిరనుట రజాక్ వ్రాతలవలనఁ దెలిసినదేగదా!

నన్నెచోడుఁ డుద్యానవనములచుట్టును ప్రాకార మున్నట్లు చెప్పలేదు కాని వానినిగూడఁ బురములో నంతర్భాగములుగానే యెంచి వర్ణించినాఁడు.

కాళిదాస కుమారసంభవమునందలి యోషధీప్రస్థ వర్ణనమునందు చోడుని వర్ణనమునందుఁ గల క్రమము కానరాదు. ఇందున్న దేవాలయ వర్ణనము నందుఁ గానరాదు. ఇది నన్నెచోడుఁడు తన కాలమునందుఁ గల దేవాలయములనుజూచి వర్ణించియుండును.

నన్నెచోడుని యీ వర్ణనము మన కానాఁటి పురస్వరూపమును, కొన్ని యాచారములను దెలిసికొనుట కవకాశమును గలిగించుచున్నది.

నన్నెచోడ మహాకవి యోషధీప్రస్థ నగరమధ్యమునందు రాజహర్మ్యము కలదని చెప్పెను. ఇది యానాఁటి రీతియనుట యూహింపఁ దగినది. రాజు ముఖ్యుఁడుగదా! కావున నాతని నివాసగృహము సురక్షిత ప్రదేశమునందే యుండుట లెస్స! కావుననే చోడుఁ డట్లు వర్ణించి యున్నాఁడు.

మఱియొక విశేష మానాఁటి వీథులలోని యంగళ్ళయందు సుభటులు కలరని వచించుట. ఇదియుఁ జోడునినాఁటిస్థితిని దెలుపునదియే యనవచ్చును.

చోడుఁడు పౌరులను వర్ణించుచు బ్రాహ్మణులను, వైశ్యులను మాత్రమే వర్ణించినాఁడు, తరువాతి రాయలకాలపుఁ బ్రబంధములందువలె దీనియందు చాతుర్వర్ణ్య వర్ణనము లేదు.

చోడుని కాలమునఁ బెద్ద భవనములందుఁ బావురపుఁ బ్రతిమ లుండెడి వనియుఁ బావురములను బెంచఁబడుచుండెడి వనియు వానికి సంబంధించిన వర్ణనము సూచించుచున్నది.

ఆనాఁడు వీథులలో రత్నములు రాసులుగాఁ బోసి యమ్ముచుండి నట్లు చోడుని యీ క్రింది పద్యము సూచించుచున్నది :

“పుర వీథులు గనుగొన సుం
దర మగు ఘటయోని సమయఁ ద్రాగిన రత్నా
కరములొకొ వివిధ రత్నా
కరములనా వరమణి ప్రకర భరితములై”. (1-116)

ఓషధీప్రస్థనగర బ్రాహ్మణు లెట్లు వర్ణింపఁబడిరో చూచి చోడుని నాఁటి బ్రాహ్మణుల నిష్ఠ నూహించుకొనుఁడు :

“వేదాచారులు సంతత
వేదాధ్యయనులు సమస్త విద్యానిపుణుల్
వేదాఖిలార్థవిదులు మ
హాదేవ ధ్యాన నిరతు లప్పురి విప్రుల్.” (7-117)

కపోత ప్రతిమలఁజూచి భ్రమించిన బిడాలముల యవస్థ నెట్లు వర్ణించినాఁడో కనుఁడీ కవిరాజ శిఖామణి :

“కమనీయాత్మక సర్వలోహమణి సత్కాష్ఠేష్టికా నిర్మితో
త్తమ హర్మ్యంబుల గండరించిన కపోతవ్రాత పంక్తుల్ బిడా
లము లోలిం గని వానిమీది కలుకన్ లంఘించి, కాకున్నఁ ద
ద్భ్రమఁ బైనూఁగినఁ బల్కఁ బొందెడ గడీపారావతానీకముల్.”
(7-113)

“ఆయిండ్లు లోహము, మణులు, మంచి కలప, ఇటుకలు నుప యోగించి కట్టిన రమ్యహర్మ్యములఁట : వానియందుఁ గపోత ప్రతి మలు గండరించి యుంచిరఁట ! వానిని పిల్లులుచూచి నిజమయినవిగా భావించి వానిని దినుటకై పైకిలంఘించినవఁట ! కాని పాపము ! వానికి

వాంఛాభంగ మయినది! అవి ప్రతిమలుగదా! ఈసంగతి నెఱిఁగిన పిల్లులు ఆయింటనేగల సజీవకపోతములు తమమీఁద నూఁగుచున్నను వానిని ముట్టకొనకున్నవఁట! అనఁగా నింకను నవి మొదటిభ్రమయందే యున్నవన్నమాట."

పిల్లులు పెంపుడు పావురములను బట్టి తినకుండఁ గాపాడుట కిది యొక యుపాయమేమో?

ఆయూరి వెలుపల చేనిలో కాఁపు పడఁతులు చేనికిఁ గాపున్న విధమును గవిరా జెంత మనోహరముగాఁ జిత్రించెనో చిత్తగింపుఁడు:

"నలిఁగమలాననల్ మృదునినాదములన్, వెడఁదొక్కు-పల్కు-లన్
సొలవక చిల్కు-లన్ వెడలఁజోపు నెలుంగులుఁ దమ్మ డాయరాఁ
బిలుచుట గాఁగ నా చిలుకపిం డనిశమ్మును జేలలోన మం
దలుగొని పాయకుండు మదిఁ దద్వచనశ్రవణాభిలాషలై." (7-95)

ఈ పద్యమును, దీనికి ముందున్న పద్యమును గాథాసప్తశతిని గుర్తుకుఁ దెచ్చునవిగా నున్నవి. ఇట్టివే యెన్నో పద్యము లీవర్ణనమునఁ గలవు.

## 15. పార్వతీ పరిణయము

"వివాహేస్నాన శుభ్రాంగ భూషా లూలు త్రయీరవా
వేదీ సీమంత తారేక్షా లాజా మంగళ వర్తనమ్."

శివపురాణమునందుఁ బార్వతీ పరమేశ్వర వివాహ మహోత్సవము పదునెనిమిది యధ్యాయములచే విపులముగా వర్ణింపఁబడినది. కాళిదాసీయ కుమారసంభవమునందును నేడవ సర్గమున గిరిజా వివాహము మనోహరముగా వర్ణింపఁబడినది. నన్నెచోడ మహాకవియు పార్వతీ పరిణయమును రెండాశ్వాసములలో విపులముగా వర్ణించినాఁడు. అయినను నీ ముగ్గురి యీ వర్ణనములందుఁ గొంత భేదము గలదు.

శివపురాణమునఁ బార్వతీ వివాహ సందర్భమును బురస్కరించు కొని పతివ్రతా ధర్మబోధ గావించుట గలదు. అంతేకాక మఱికొన్ని యుపాఖ్యానములను నందు వర్ణింపఁబడినవి. అది పురాణగ్రంథమగుటచే యుక్తమే. కడమ వివాహ విషయములు శివపురాణమునందు వైదిక వివాహమును వివరించు విధముగా నున్నవి. అయినను లౌకికాచారము లను గొన్ని లేకపోలేదు. కాళిదాస మహాకవియు నీ వివాహమును వైదిక మార్గముననే జరిపించినాఁడు.

నన్నెచోడుని వివాహ వర్ణనము వీనికిఁ గొంచెము భిన్నముగా నున్నది. ఇది యవైదిక మనలేముగాని వైదిక విషయములు శివపురాణ, కాళిదాసీయ గ్రంథములం దున్నంత స్పష్టముగా లేవనుటమాత్రము ఉచితము. ఉదాహరణముగాఁ గన్యాదాన విషయమును గ్రహింతము. శివ పురాణమునందుఁ గన్యాదాన విషయమున శివుని గోత్రమును వంశమును గూర్చిన చర్చ గలదు. అది వైదిక విషయము.

కన్యాదాన సమయమునందు వధూవరుల గోత్ర ప్రవరలను జెప్పి ధారా పూర్వకముగా దానము చేయుట వైదిక పద్ధతి. కన్యాదానమునకుఁ బిమ్మట గృహ్యాగ్ని ప్రతిష్ఠయొనర్చుటయుఁ దత్సంప్రదాయమే. ఇవి యెల్లె శివపురాణమునందు వర్ణింపఁబడినవి. కన్యా కరగ్రహణమయిన పిదప శివుఁడు-

"క్షితిం సంస్పృశ్య కామస్య కోఽదాదితి మనుం మునే
పపాఠ శంకరః ప్రత్యాదర్శయన్ లౌకికీం గతిం."

అని చెప్పఁబడినది. ఇదియు లోకమునఁగల వైదికాచారమే. ఆ సమయ మున వరుఁడు చదువవలసిన వేదమంత్ర మిది :

"సోమోఽదదద్గంధర్వాయ గంధర్వోఽదదదగ్నయే
రయించ పుత్రాంశ్చాదా దగ్ని ర్మహ్యా మథో ఇమాం."

ఆపిమ్మట బ్రహ్మయాజ్ఞచే గృహ్యాగ్నిప్రతిష్ఠ జరిగి శివుఁడు పార్వతీ సహితముగా స్థాలీపాకాది హోమముల నాచరించినాఁడని శివపురాణము వర్ణించుచున్నది.

నన్నెచోడుని కుమారసంభవమున నిది యిట్లు లేదు. శివునకన్న ముందే పార్వతి వివాహవేదికకు వచ్చినది. తరువాత శివుఁడువచ్చి వివాహవేదికపై నొక యాసనమునఁ గూర్చున్నాఁడు. ఆ పిమ్మట నాతని ప్రక్కన గిరిజ కూర్చున్నది. ఆమె శివునిఁ జూచినది.

> "అంత బృహస్పతిదత్త సుముహూర్తంబునఁ బరమేష్ఠి హోమపురస్సరముగా విధివిహిత విధానంబున గిరిశుండు గిరిజం బరిణయం బయ్యె."

తరువాత వేదాశీర్వచనము, గంధర్వగానము ఇత్యాదులు జరిగినవి. ఇందుఁ గన్యాదానము విధివిహితముగా జరిగెనని యున్నదే కాని విధి వివరింపఁబడలేదనుట స్పష్టముగానే కానవచ్చుచున్నది గదా!

దీనినిబట్టి చూడఁగా నన్నెచోడుని పార్వతీ పరిణయవర్ణనమున వైదికాచారములకన్న దేశీయాచారములకే యెక్కువ స్థాన మీయఁబడిన దనియు నందుకే యది మూలమునకు భిన్నముగా నుండుట సంభవించిన దనియుఁ దేలుచున్నది.

ఇఁక నీ మహాకవి యిందుఁ జూపిన దేశీయాచారము లేమో కొంచెము చూతము.

శివుఁడు పార్వతికి నిజరూపము చూపిన సమయమున చెలికత్తె యామెను విధియుక్తముగా వివాహ మాడవలెనని శివుని వేడికొన్నది. శివుఁ డందు కంగీకరించి రజతగిరిని జేరుకొని సప్తర్షులను స్మరించి వారిని హిమవంతునికడకు పోయి కన్యావరణమును గావించి రమ్మని యడిగినాఁడు. వారట్లే వెడలి హిమవంతునకు పరమేశ్వరుని కోరిక నెఱింగించినారు. ఇంతదనుక శివపురాణ కుమారసంభవములందు

సమానముగానే కథ జరిగినది. తరువాత కాళిదాసీయమున హిమవంతుఁడు మేనకముఖమును జూచినట్లు గలదు.

"శైల స్సంపూర్ణకామో ఽపి మేనాముఖ ముదైక్షత
ప్రాయేణ గృహిణీనేత్రాః కన్యార్థేషు కుటుంబినః
మేనే మేనా ఽపి తత్సర్వం పత్యుః కార్య మభీప్సితమ్
భవం త్యవ్యభిచారిణ్యో భర్తు రిష్టే పతివ్రతాః." (కాళిదాసీయము)

కాని మన చోడకవి కుమారసంభవమున నీ సందర్భమున మేనక ప్రశంసయే కానరాదు. అందుకుఁ గారణము చోడుఁడు రాజగుటయు, రాజుల యిండ్లయందు స్త్రీలు పురుషుల మధ్యకు రాకుండుటయు మన దేశీయాచారము కాన రాజగు నన్నెచోడకవి యీ సందర్భమున మేనక ప్రశంసలేకుండగనే వ్యవహారము జరిపెనని యూహింపవలసి యున్నది.

అటుపిమ్మట నన్నెచోడ మహాకవి హిమవంతుని యాదేశమునఁ బార్వతి రాఁగా మును లామెను జూచి "ముద్రారోహణ" ము సు జేయించి రని వర్ణించినాఁడు. ఈ "ముద్రారోహణము" దేశీయాచారమే కాని వైదికాచారము గాదు. కన్యానిశ్చయసమయమున సేదే నొక యాభరణ మును గొనివచ్చి యామె కిడుట నేటికి నాంధ్రదేశమునఁ బ్రచారమునఁ గలదు గదా!

తరువాత శివుఁడు హిమవంతుని పురమునకు వచ్చుటయు, నాతఁ డీతని నెదుర్కొని విడిది గృహమునకుఁ గొనిపోవుటయు, వివాహసమయమున రంభాద్యప్సరసల నాట్యగానములును, వాద్యములును, నివి యన్నియును దేశీయాచారము ననుసరించియే వ్రాయఁబడినవి.

శివపురాణమునందుచ్చ్న లాజాహోమాదులు నన్నెచోడ కుమారసంభవమున విడువఁబడుటకు నిదియే కారణమని యూహింపవలెను.

నన్నెచోడుని పార్వతీ పరిణయము మన దేశమున రాజుల యిండ్లలో జరిగిన వివాహమువలె దేశీయాచారముల ననుసరించియున్న దనుట తేలిన సారాంశము.

## 16. నగ వర్ణనము

"శైలే మేఘౌషధీ ధాతు వంశ కిన్నర నిర్ఝరాః
శృంగ పాద గుహా రత్న వనజీవా ద్యుపత్యకాః".

కుమారసంభవమునఁ దృతీయాశ్వాస ప్రారంభమునందు హిమవత్పర్వత వర్ణనము గలదు. కాళిదాస కుమారసంభవము హిమవన్నగ వర్ణనముతోడనే ప్రారంభింపఁ బడినది. కాళిదాసు హిమవన్నగ వర్ణనమునకు శివపురాణ హిమవద్వర్ణనమునకు బోలిక లున్నట్లు భారవిని గూర్చిన ప్రకరణమునఁ జూపఁబడినది. నన్నెచోడుని హిమవన్నగ వర్ణనము పైరెంటికిని భిన్నముగాఁ గలదనియు నందుఁ గాళిదాసీయాను వాదములు కనరావనియు నా రెంటు వర్ణనములు చదివినఁ దెలియును.

నన్నెచోడుఁ డీ వర్ణనమును బదునైదు పద్యములచేఁ గావించినాఁడు. ఇందు హిమవంతుని సర్వపర్వతాతిశాయిత్వమును, పర్వతరాజత్వమును, రత్నవైభవమును, మనోహరముగా వర్ణింపఁ బడినవి.

శంకరునకు మామగారుకావలసినవాఁ డగుటచేఁ గాఁబోలు! కవిరాజీ క్రింది పద్యమున నాతనిని శివునితోఁ బోల్చి వర్ణించినాఁడు.

"సురవరవాహినీధరుఁడు, శుభ్రశరీరవిభాసి నీలకం
ధర పరిశోభితుండు, గుణధాముఁడు, తుంగతనుండు, భూధరా
భరణుఁడు మానసమన్వితుఁ డపారవిభూతి సమేతుఁడై మహే
శ్వరుఁడును బోలెనొప్పు హిమవంతుఁ డనంతమహత్వసంపదన్".
(3-4)

హిమవంతుఁ డన్నివిధముల నీశ్వరునితో సామ్యము గలవాఁడని వర్ణించుటచే నీశుని కాతనితోడి వైవాహిక సంబంధము యుక్తమయిన దనుటను గవిరాజు పై పద్యముచే సూచించినాఁడు.

"విలసితోత్తుంగ శశికాంత శిలలఁ గదిసి
యరుగు శశిఁగని శిలలెల్లఁ గరఁగి పెరిఁగి

తెలిలి పలుతెంచు వజ్జోడి తేలిపాలు
నుడు గణేశుండు వెండి పేరోడ వోలె". (3-11)

పై యొక్క చిన్న గీతముచే హిమవంతుని యౌన్నత్యమును, రత్నమయత్వమును మనోహరమగు కల్పనతోఁ జేర్చి చిత్రించినాఁడు కవిరాజు.

## 17. విరహ వర్ణనము

*పార్వతి పూర్వరాగము*

"విరహే తాప నిశ్వాస చింతా మౌనం కృశాంగతా
అబ్జశయ్యా నిశాజైర్ఘ్యం జాగరః శిశిరోష్మతా".

శృంగార రసము సంభోగ విప్రలంభ భేదముచే రెండు విధములు. "విప్రలంభము లేనిదే శృంగార రసమునకు పుష్టిలే"* దని యాలంకారికులు కొందఱి మతము. ఈ విప్రలంభము మఱల నాలుగు విధములని కొందఱు, నయిదు విధములని కొందఱును వచించిరి. మమ్మటుఁడు "అపరస్తు (విప్రలంభః) అభిలాష విరహేర్ష్యా ప్రవాస శాప హేతుక ఇతి పంచవిధః" అని వచింపగా విశ్వనాథ కవిరాజు "సచ (విప్రలంభః) పూర్వరాగ మాన ప్రవాస కరుణాత్మక శ్చతుర్ధాస్యాత్"అని వక్కాణించెను. శృంగార రసమును గూర్చి విశ్వనాథ కవిరాజీ క్రింది విధముగా వచించెను :

"శృంగం హి మన్మథోద్భేద స్తదాగమనహేతుకః
ఉత్తమ ప్రకృతి ప్రాయో రసః శృంగార ఇష్యతే
పరోఢాం వర్జయిత్వాతు వేశ్యాం చాననురాగిణీం
ఆలంబనం నాయికా స్స్యు ర్దక్షిణాద్యాశ్చ నాయకాః

* "న వినా విప్రలంభేన సంభోగః పుష్టి మశ్నుతే
కషాయితే హి వస్త్రాదౌ భూయాన్ రాగో వివర్ధతే".

చంద్ర చందన రోలంబరుతాద్యుద్దీపనం మతమ్
భ్రూవిక్షేప కటాక్షాది రనుభావః ప్రకీర్తితః
త్యక్త్వౌగ్ర్య మరణాలస్య జుగుప్సా వ్యభిచారిణః
స్థాయిభావో రతి శ్శ్యామ వర్ణోఽయం విష్ణుదైవతః"

(సాహిత్య దర్పణము)

శృంగార మొక్కటే రసమని భోజుఁడు సిద్ధాంతీకరించెను.§ అట్టి శృంగార రసమునకు విప్రలంభము లేనిదే పుష్టిలేదనియు విప్రలంభమున మొదటిది పూర్వరాగమనియు ముందే చెప్పితినిగదా! ఈ పూర్వ రాగమును విశ్వనాథ కవిరాజు

"శ్రవణా ద్దర్శనాద్వాపి మిథ స్సంరూఢరాగయోః
దశావిశేషో యోఽప్రాప్తౌ పూర్వరాగస్స ఉచ్యతే"

(సాహిత్య దర్పణము)

అని నిర్వచించెను. ఇందలి 'అప్రాప్తౌ' అనుదానిని "పరస్పరాఽసంగమే" అని శ్రీరామచరణ తర్కవాగీశ భట్టాచార్యుఁడు వ్యాఖ్యానించెను. విశ్వనాథుఁడు చెప్పిన పూర్వరాగమును మమ్మటుఁడు వచించిన యభిలాషయు నొక్కటిగానే భావింపవచ్చును. సంభోగమునకు ముందు కలుగు విప్రలంభము కావున దీనికి పూర్వరాగమని పేరు. కుమారసంభవమునందలి పార్వతి విప్రలంభము పూర్వరాగము.

ఈ పూర్వరాగము నందలి దశలను విశ్వనాథ కవిరాజే క్రింది విధముగా వచించినాఁడు:

"అభిలాష, శ్చిన్తా, స్మృతి, గుణకథనో, ద్వేగ, సంప్రలాపాశ్చ
ఉన్మాదోఽథ వ్యాధి, ర్జడతా, మృతిరితి దశాఽత్ర కామదశాః".

(సాహిత్య దర్ప.)

---

§ "శృంగార ఏవ మధురః పరః ప్రహ్లాదనో రసః" (ధ్వన్యాలోకము)

కుమారసంభవమునందుఁ బంచమాశ్వాసమునఁ బార్వతి పూర్వ రాగ విప్రలంభమును, చెలుల శైత్యోపచారములను మన కవిరాజు సుమారు డెబ్బది పద్యములచే వర్ణించినాఁడు.

శివుఁడు మన్మథుని దహింపఁజేసి సగణముగా నంతర్ధానమయి నాఁడు. దానితో నామె యప్పటిదనుకఁ బెంచుచు వచ్చిన ప్రేమవల్లిక యాలంబనము పోయి క్రిందపడినట్లయినది. తరువాత నామె పితృ గృహమును జేరినది మొదలామెకు విరహబాధ యారంభమయినది. ఆ విరహములోని యవస్థలను వర్ణించిన కవిరాజు పద్యముఁ గనుఁడు:

"తలఁపుల తిట్ట, భావములతానక, మాసల పుట్టినిల్లు, గో
ర్కుల నెలవీఁడు, పల్వగల కూట, మవస్థల జన్మదేశ, ము
మ్మలికలపెంట, వేదనలమందు, మనోభవు వేఁటపట్టు, మూ
ర్ఛల సహవాస, మన్విరహ సంతత తాపము పొందెఁ బార్వతిన్"
(5-106)

పై పద్యము విరహ స్వరూపము నామూలాగ్రముగా వర్ణించుచు నంతటి విరహబాధ పార్వతికిఁ గలిగినట్లు చూపుచున్నది.

పార్వతికి మన్మథుఁడన్నను, ఆతని బలగమన్నను వినినంతనే భయము కలుగునఁట! (5-107) అవును వాని మూలముననే యామెకీ విరహవేదన! వాఁడే బలఁగముతో నీశ్వరుని తపోవనమునకు రాకుండి నచోఁ దనకీ బాధయేలేదు! అంతేగాదు! వారిలో నేయొక్కరి పేరువిన్నను నామెకు మదనదహన కథ కన్నులకుఁ గట్టును! ఇదియు నామెకు బాధా కరమయినదే! పార్వతి విరహ మితరస్త్రీసామాన్యముగాదు గదా!

"ఆమెకు విరహబాధ యతిశయించినది, మన్మథుని బాణములచేఁ బ్రాణమే పోనున్నది! కాని యింతలో నామె శివునిఁ దలంచి యా బాధను దప్పించుకొన్నది! ఆతఁడు మృత్యుంజయుఁడుగదా! ఆతని దలఁచిన మృత్యుహరమగుట యరుదా?" (5-111) యని వర్ణించినాఁడు కవిరాజు.
"విరహము మనోభవు వేఁటపట్టేయయినను నాసలకుఁ బుట్టునిల్లుగదా!"

ఆమె కాఁబోవు జగన్మాత. ఇంతటి విరహావస్థలో నామె యేమను కొన్నదో చూడుఁడు :

"ఇదిగాకేమి వియోగ తాప మనఁగా నిట్లేర్చుఁ గాకేమి కౌ
ముది; యోషిత్తతి కింత బెట్టిదుఁడె ! కాముం; డంగనారాజికిన్
హృదయాధీశులఁ బాసియున్న విరహం బింతేచుఁడే" (5-113)

యని వారి వారి తత్వమ్మెరిగి విచారించినది. తరువాత నామె యా బాధను సహింపలేక యుద్యాన వనంబునకుఁ బోయి పరమేశ్వర దర్శనాభిలాష మిక్కుటముగాఁగా నాతని యాకారమును మనోహరముగాఁ జిత్రించి చూచుచుఁ గూర్చున్నది. ఇంతలో నామెను వెదకుచు చతురిక యను చెలికత్తె యక్కడికి వచ్చి పార్వతి యభిలాష నెఱిఁగి యామె విరహార్తిని పొగులుచున్న విషయము నెత్తగాఁ బార్వతి తనకట్టిస్థితి పట్టలేదని యే విధముగాఁ జెప్పినదో చూడుఁడు :

"ఆ దరహాస వాస లలితాస్య రుచుల్ దళుకొత్త నప్పు డా
హ్లాదముతోడఁ జూఁచిచనినప్పటి సమ్మదలీల రాగ నాఁ
డాదిగఁ బాయ కీశుఁ డెద నప్పటి కప్పటి కొక్కభంగి న
న్నాదటఁగూడియుండ విరహవ్యథ నాదెసఁ బొందనేర్చునే"(5-125)

"ఆమె శివభక్తురాలు. శివదర్శనమయిన దగ్గఱనుండి యాతని రూపామె హృదయమున నిండిపోయినది. అది యెడఁబాయదు. అట్టి తనకా విరహవ్యథ !"అని తన భావము నగజ కప్పఁబోయి బయల్పడఁ బలికినదఁట పార్వతి! వెంటనే తన రహస్యము బయలుపడెనని యామెకు సిగ్గు వచ్చినది. ముఖము వెలవెలఁబారినది. అప్పుడు చెలికత్తె యోదార్చి యామె శివు నెదనెంచుట కన్యకాజన విరుద్ధముకాదని వచించినది. కాని యప్పటికే పార్వతికి విరహబాధ యెక్కువయిపోయినది. కాన నామెకు శిశిరోపచారముల నొనర్చుట కితర సఖీజనంబులఁ బిలిచి తెచ్చినది. తరువాతఁ బార్వతికి వారు శిశిరోపచారము లొనర్చినారు. హృదయము కొంచెము చల్లఁబడి పార్వతి కొంచెము నిద్రించినది. కాని యేమి

లాభము! కలలోను శివుని రూపమే ప్రత్యక్షమైనది. వెంటనే యది నిజమని యెంచి పార్వతి లేచి చూచినది! శివుడేడీ! అబద్ధమని తెలిసిన వెంటనే మూర్ఛ! చెలికత్తెల యుపచారము! మఱల గొంచెము స్మృతి వచ్చి పార్వతి చంద్రుని, కాముని, నాతని పరిచారకులను నిందించినది.

అప్పు డా సంగతిచూచి భయపడిన చెలులు మలయానిలాదుల వలన నామెకు భయము లేదని యోదార్చిన విధమును వర్ణించిన కవిరాజు పద్యముఁ జూడుఁడు:

"బాల! నీ వేనలి కాలోరగంబని
మలయానిలంబు నీ వలనరాదు
కమలాస్య! నీ కనుంగవ చకోరములని
వెన్నెలసోకదు నీయున్న యెడకు
నబల! నీ యెలుఁగు పికారావ మని నీకుఁ
జూతమ్ముఁ గొమ్మలు సూపవెఱచుఁ
జపలాక్షి! నీ ముక్కు చంపకమను భీతి
నలులు నీపొడఁగని యలయఁబాఱు
వనిత! నీకుఁ బ్రాణవల్లభుండై మది
నొలసె శివుఁడు నాయకుండు ననియ
పేద మరుశరములు నీదెస రానోడు
వీనికేల నీవు వెఱచె దమ్మ." (5-165)

అవును తమ ప్రాణహాని కలుగుచోటి కెవ్వరైన పెడల నొప్పు కొందురా! ఎంత చక్కని భావము నిమిడ్చినాఁడు కవిరాజు! ఈ పద్య మింత మనోహరభావము కలది కావుననే తరువాతి ప్రబంధ కవులలో నుత్తముఁడైన రామరాజ భూషణుఁ డీతని ననుకరించి తన గ్రంథ మునఁ బద్యములను వ్రాసినాఁడు. (చూ. వసుచరిత్ర 3 ఆ. 128,129, పద్యములు)

చెలికత్తె లింతగా బోధించినను బార్వతి విరహ బాధ యుప శమింపలేదు సరిగదా! పైపెచ్చు పెచ్చుపెరిగినది. చెలులీవిషయము నిఁక హిమవంతునకుఁ దెల్పకుండుట సరికాదని యెంచి యాయన కీ విషయ మును విన్నవించినారు. ఆతఁడును గూతుఁ జూచుటకు వెంటనే వచ్చినాఁడు.

ఇది పార్వతి పూర్వరాగవర్ణనము. ఇందుఁబార్వతి యభిలాషయు (5-115); బాష్పమును (5-127); మూర్ఛయు (5-153); పులకలును (5-168); వైవర్ణ్యమును (5-167); అలస భావనయు (5-171); స్వప్న మును (5-151): చెలులామె కొనర్చిన శైత్యోపచారములును మనోహర ముగా వర్ణింపఁబడినవి.

### *శివుని విరహ వర్ణనము*

పార్వతి శివునకై ఘోరమగు తప మొనరింపఁగా దత్తపః ప్రభా వాకృష్టుఁడైన శివుఁడు పార్వతీ విరహవ్యథ గలవాఁడై దుఃఖపిల్లిన విష యము కుమారసంభవము షష్ఠాశ్వాసమున వర్ణింపఁబడినది. విశ్వనాథ కవిరాజు "ఆదౌవాచ్యః స్త్రియా రాగః పుంసః పశ్చాత్తదింగితైః" అని వచించినాఁడు. కవిరాజ శిఖామణి తదనుకూలముగానే ముందుఁ బంచ మాశ్వాసమునఁ బార్వతి యనురాగమును వర్ణించి షష్ఠాశ్వాసమున శివున కామెపైఁ గల యనురాగమును, అందుచేఁ గలిగిన విరహవ్యథను, ఆ విరహవ్యథవలనఁ గలిగిన పశ్చాత్తాపమును వర్ణించినాఁడు.

ఈ సందర్భమున నిట్లు శివునకు విరహము గలిగినట్లు కాళిదాస కుమారసంభవమున వర్ణింపఁబడలేదు. కాళిదాసీయమున శివుఁడు పార్వ తికిఁ బ్రత్యక్షమై వివాహవిధి కంగీకరించిన పిదప మాత్రమే వివాహము నకు ముందరి యాకాలమును విరహముతోఁ గడపినట్లు గలదు.*

* "పశుపతిరపి తాన్యహాని కృచ్ఛ్రాదగమయ దద్రిసుతా సమాగమోత్కః
కమపరమవశం న విప్రకుర్యుర్విభుమపి తం యదమీ స్పృశంతిభావాః".
(కుమా. 6 స. 95 శ్లో.)

ఉద్భటుని కుమారసంభవైకదేశమునందు మాత్రము శరత్ప్రభావము చేతఁ బార్వతీ విషయము తలంపునకువచ్చి శివునకు విరహావస్థకలిగినట్లు వర్ణింపఁబడినది.* నన్నెచోడ మహాకవి పై రెంటికిని సమన్వయము కుదుర్చువానివలెఁ బార్వతి తపోబలముచే నాకర్షింపఁబడిన చిత్తము గల వాఁడై శివుఁడు విరహబాధ ననుభవించినట్లు వర్ణించినాఁడు.

పార్వతీ విరహము ననుభవించు నీస్థితి శివునకు స్వకృతము. ఆతఁడు కోరితెచ్చుకొనినాఁడు దీనిని. కనుకనే యతఁ డంత సంయమి యయ్యును విరహబాధ ననుభవింపవలసివచ్చినది. అందుకనియే శివుని విరహావస్థయం దాతనికిఁ బశ్చాత్తాపమును వర్ణించినాఁడు,

ఏదే నొక యాటంకముచే నాగిపోయి కొంతకాలము నిలిచి పోయిన ప్రవాహ మా యాటంకము తొలఁగఁగనే యొక్కసారిగా - చాల సేపు కాకపోయినను- గట్లనంటి పాఱినట్లున్నదీ శివుని విరహావస్థా వర్ణనము.

ఇక్కడనున్నవి సంఖ్యలో నారు పద్యములే. కాని యొక్కొక్కటియే శివమూర్తి విరహబాధ నామూలాగ్రము వర్ణింపఁగలశక్తిగలపై యున్నవి. శివున కప్పటిస్థితియందుఁ బార్వతి తప్ప మఱొకటి కాన వచ్చుటలేదు.

"బొమ లల్లార్చుచు, లోచనద్యుతులు పై పూరించుచున్, మందహా
సమరీచుల్ దళుకొత్త, పల్కునొఱపుల్ సంధించుచున్, లోలభా

---

*చూ. ఉద్భటుని కావ్యాలంకార సంగ్రహములోని ఉపమాలంకారోదాహరణములు.

"ఇతికాలే కల్లోలాపి కాదంబకులసంకులే త్రిదశాధీశ శార్దూలః పశ్చాత్తాపేన ధూర్జటిః తాం శశిచ్ఛాయ వదనాం నీలోత్పల దళేక్షణాం సరోజకలికాగౌరీం గౌరీం ప్రతి మనో దధే."

వము సూచించుచు, నీళ్ళమోల నెలమిన్ వ (న?) ర్తింపఁ
జొచ్చెన్ మనో
రమణం బార్వతిరూప విభ్రమ మహోరాత్రంబు సాన్నిధ్యమై."
(6-161)

క్షణక్షణ ప్రవర్ధమానమయిన విరహానల మాతనిని మిక్కిలి వేగించినది.

"అలిధమ్మిల్ల, మృణాలహస్తఁ, గమనీయావర్తనాభిన్, మహో
త్పలగంధిం, గలహంసయాన, విలసద్బంధూక రక్తోష్ఠ, ను
త్పలనేత్రం, గమలాస్య, నంగజరసాంభఃపూరఁ, దత్పార్వతీ
జలజావాసముఁ జొచ్చి యాడక మనోజాతానలం బాఱునే." (6-165)

అని యగ్నితప్తుఁడైనవాఁడు వేగిరముగాఁ బరుగిడి నీటిలో మునుగ నెంచి నట్లు ఆతఁడు పార్వతిని జేరవలయునని భావించినాఁడు.

ఈ విరహ వర్ణనము చిన్నదయ్యును భావావేశముతో నొప్పినది.

## 18. దూత్యవర్ణనము

### దూత్యమా? ద్యూతమా?

"దూయతే ऽనేన పర ఇతి దూతః" అని శత్రువులకు పరితాపమును కలిగించువాఁడు దూత యని యాశబ్దమునకు వ్యుత్పత్త్యర్థము. వాని కర్మ దూత్యము. ఇది కావ్యమున నుండఁదగిన యష్టాదశవర్ణనములం దొక్కటి. దండి [1]కావ్యాదర్శనమునందును విన్నకోట పెద్దన [2]కావ్యాలంకార చూడామణియందును [3]నరస భూపాలీయమునందును

---

1. "మంత్ర దూత్య ప్రయాణాజి నాయకాభ్యుదయైరపి" (కావ్యాదర్శము)
2. "ప్రతిభయుఁ, బరమంత్ర విభేదితయును, బతిరక్తియును, దితిక్షయు, నిర్మొర్ఖతయును, నవ్యసునీతియుఁ, జతురతయును, దూత్యమునను జను నుతియింపన్." (కావ్యాలం. చూడా. 3 ఉల్లా. 133 ప.)
3. "పురసింధు....యాత్రాజి దౌత్యో విభువర్ణనముల్" (నరసభూ. 2 ఆ. 166 ప.)

నిది యిట్లే చెప్పఁబడినది. కాని వావిళ్ళవారి [4]ప్రతాపరుద్రీయమునందును [5]అప్పకవీయమునందును దీనికి బదులుగా "ద్యూతము" చెప్పఁబడి యున్నది. కావున నీరెండు వర్ణనలలో నేది మహాకావ్యమున వర్ణింప వలయునో విచారింపవలసి యున్నది.

పైనఁ బేర్కొనినవానిలో నప్పకవీయ ప్రతాపరుద్రీయములందుఁ దక్క కడమవానియం దన్నింటను దూత్యమే గలదని స్పష్టము గదా! నన్నెచోడ మహాకవి కుమారసంభవమునందును దూత్యమే యష్టాదశ వర్ణనములలోనిదిగాఁ జెప్పఁబడియున్నది[6] కావున "దూత్యమే" యష్టా దశవర్ణనలం దుండఁ దగినదని నిర్ణయింపవచ్చును.

ఇఁకఁ బ్రతాపరుద్రీయమునఁగల "ద్యూత" పాఠవిషయము నాలోచింతము. ఆలోచించిచూడఁగా నిందును "దూత్య" యను పాఠమే యుండవలయుననియుఁ బ్రమాదవశమునఁ గాని యనవధానతవల్లఁగాని "ద్యూత" పాఠము గ్రంథములోఁ జేరి యుండవచ్చుననియుఁ దోఁచు చున్నది. అందుకుఁ గారణము లీ క్రిందఁ జూపుదును.

ప్రతాపరుద్రీయమునందలి యష్టాదశవర్ణనల శ్లోకములకు మూలము దండి కావ్యాదర్శములోని శ్లోకములే యనుట నారెంటినిజూచినఁ దెలియఁ గలదు. అంతేగాదు ప్రతాపరుద్రీయ వ్యాఖ్యాతయగు కుమారస్వామి సోమపీథియును బై సందర్భమున వ్యాఖ్య వ్రాయుచు "తత్ప్రపంచస్తు కావ్యాదర్శే ద్రష్టవ్యః" అని వచించి విద్యానాథుని యీ వ్రాతకు మూలము కావ్యాదర్శమే యనుటను సూచించియున్నాఁడు. కావ్యాదర్శ మున నున్న పాఠము దూత్యమే యగుటచేఁ బ్రతాపరుద్రీయమునందును

---

4. "మంత్ర ద్యూత ప్రయాణాజి నాయకాభ్యుదయా అపి"
(ప్రతా. కావ్యప్ర. 70 శ్లో.)

5. "మంత్రంబు ద్యూతంబు పెదవ నద్భుత రణంబు" (అప్ప. 1 అ. 28 ప.)

6. కుమారసంభవ ముద్రిత ప్రతులన్నింటను "దూత్య" యను పాఠమే గలదు. "ద్యూత" యని యున్నచో ఛందస్సును కుదురదు.

సోమపీథిమతమున దూత్యపాఠమే యున్నదని యెంచవలయును. కావ్యాదర్శ ప్రతాపరుద్రీయములో భేద మున్నయెడల నాతఁడే యీ విషయమును చర్చించి యుండునుగదా!

ఇఁక మఱియొక విషయము. నరసభూపాలీయమను నామాంతరముగల కావ్యాలంకార సంగ్రహమునకు మూలగ్రంథము ప్రతాపరుద్రీయమే యనుట యెల్లరు నంగీకరించిన సత్యముగదా! అందును "దూత్య"మే చెప్పఁబడినది గాని ద్యూతముగాదు. దీనినిబట్టి మూర్తి కవి చూచిన ప్రతాపరుద్రీయమున సైతము "దూత్య" పాఠమే యున్నదని చెప్పవలసి యున్నది. పెద్దనాదుల వ్రాతలును నీవిషయమునే సమర్థించు చున్నవి గదా!

కావునఁ బ్రతాపరుద్రీయములోనిది దూత్యమేగాని ద్యూతము గాదనుట సారాంశము.

ఇఁక నప్పకవి "ద్యూత" మును వచించుటకుఁ గారణమేమో? చూతము. ఈతఁడు మంత్రమునకును రణమునకును మధ్య నీ "ద్యూతము"ను వచించినాఁడు. "రణము" తరువాత "విజయ" మును జెప్పినాఁడు. ఈ క్రమమునుబట్టి చూడగా నీతనిదియు "దూత్యమే" యయి యుండునని తోఁచుచున్నది. అప్పకవి ప్రాచీనులు చెప్పిన వర్ణనములను విడువక వానికిఁ గ్రొత్తవానిని జేర్చినవాఁడేకాని వానిని మార్చి క్రొత్తవానిని గల్పించినవాఁడు కాఁడని యాతని యష్టాదశవర్ణనల పద్యము సూచించుచున్నది. ఇంతకు నష్టాదశవర్ణనములందుఁ జెప్పఁదగినది దూత్యమేకాని ద్యూతము కాదనుట ముఖ్యవిషయము.

*సుమతి రాయబారము*

ఇది యిట్లుండుటచేతనే నన్నెచోడ మహాకవి దూత్యమును గ్రహించి దానిని వర్ణించినాఁడు. అదియే కుమారసంభవ దశమాశ్వాసమున యుద్ధమునకుఁ బూర్వము జరిగిన సుమతి రాయబారము. అందులోని చోడకవిప్రతిభ నరయుదము.

ఈ రాయబారమును నడుపుటలో నన్నెచోడ మహాకవి చూపిన చాతుర్య మాతనికి రాజ్యపరిపాలనము నందును, రాయబారముల సాగించుట యందును గల నైపుణ్యమును జాటుచున్నది.

దీనికి మూలము శివపురాణమునందుఁ గానరాకపోవుటవలన నిది కవి స్వయముగాఁ గల్పించినదని చెప్పుట యుక్తము.

కుమారుని సైన్యాధ్యక్ష పదవియందుఁ బట్టముగట్టి వారందఱును దారకాసురుని జయింపనెంచి క్రౌంచ పర్వతముకడకు వచ్చినారు. క్రౌంచమును సేనాని జయించినాఁడు. ఇఁక మఱలఁ బ్రయాణము కావలసియున్నది. అప్పుడు విష్ణువు ముందు చెప్పిపంపనిదే యుద్ధమునకుఁ జనుట యుచితము కాదను రాజనీతిని దెలిపినాఁడు. దానికిఁ గుమారుఁ డంగీకరించినాఁడు.

ఎవరిని పంపవలయునను ప్రశ్నము వచ్చినది. రాయబారి కుండవలసిన గుణము లీ క్రింది విధముగా నిశ్చయింపఁబడినవి.

"పతిహితుఁ గులవిప్రోత్తముఁ,
జతురుపధా శుద్ధుఁ*, గార్యసంవేదిఁ, బరేం
గితవిదు, ధైర్యాన్వితు, ని
ర్గతమతియుతు రాయబారిఁగాఁ బంపనగున్" (10-123

ఇది చోడునినాటి యాచారమయి యుండెనని యెంచవలయును. నన్నయభట్టు తన్ను రాజరాజ నరేంద్రుని కులబ్రాహ్మణునిఁగాఁ జెప్పుకొన్నాఁడు గదా! ఆతని కులబ్రాహ్మణత్వము రాయబారి పదవివంటి దనుటను పై నన్నెచోడుని పద్యము బలపఱచుచున్నది.

పై పద్యమునందలి వర్ణనమునకుఁ దగిన బృహస్పతి మనుమఁ డగు సుమతిని తారకాసురుని కడకుఁ బంపినారు. ఆతఁడు తారకునాస్థానమునకు వెళ్ళినాఁడు. ఇక్కడ జరిగిన వ్యవహారము కవిరాజు

* ధర్మార్థ కామ భయములు చతురుపధలు.

నాఁడు మన దేశమున జరిగిన రాయబారపు వర్ణనమా యనునంత వాస్తవముగాఁ జిత్రింపఁ బడియున్నది. ఆక్రమముఁ జూడుఁడు :

"సుమతి తారకాస్థానమునకు వచ్చినాఁడు. తారకుఁ డున్నత సింహాసనమునఁ గూర్చున్నాఁడు. ఆతని ప్రక్కనే మంత్రియగు శుక్రాచార్యుఁ డున్నాఁడు. ప్రతీహారి యొక యాసనమును జూపఁగా నందుప విష్టుఁడయిన సుమతిని శుక్రాచార్యుఁ డాతని రాకకుఁ గారణము నడిగినాఁడు. (తారకుఁడు కాదు.) అప్పుడు సుమతి తన దౌత్యమును నివేదించినాఁడు. సుమతివలన వారి సేనాని కుమారస్వామి యనుట విని శుక్రాచార్యుఁడు తారకాసురునకు నాశకాలము సమీపించినదని మనమునందు భావించుకొన్నాఁడు."

దేవతల పేరు విన్నంతనే కోపగించి తారకుఁడు మాతతో నేమని నాఁడో చూడుఁడు :

"ఏ మేమీ! మదినోట కండసెడి దేవేంద్రాదు లుద్వృత్తులై
నామీఁదం జనుదెంచిరే! నికమె! యిన్నాకీశ బృందారక
స్తోమం బెన్నఁడుఁ దొల్లిమార్చలసి రెచ్చోఁ దొల్లిపోటొగ్గి సం
గ్రామోద్యోగము సేసి రిప్పు డెదురంగాఁ గారణం బేమియో!"

(10-138)

పై పద్యము తారకాసురుని స్వభావమును, దేవత లిదివఱ కనుభవించిన దైన్యమును, వివరించునదిగా నున్నది. దీనికి సమాధానముగా సుమతి పల్కిన వాక్యములు చూడుఁడు :

"త్రిదశేంద్రాదులు స్రుక్కి కాజికెదు రేతేనెంత నీ కోడరే!
యది లేదంటిమె! తొంటివేల్పులని నీకాదర్పముల్ పల్కఁ బ
ట్టదు సుమ్మీంకఁ బురారి నందనుఁడు షడ్వక్త్రుండు తోతెంచి బ
ల్లిదుఁడై నిన్నని నోర్చి దేవతల నేలించుం ద్రిలోకమ్ములన్".

(10-141)

అని వారలు తొంటి వేల్పులు కారనియు, వారికిప్పుడు సేనాని సాహాయ్యము గలదు కనుక తారకున కపజయము స్థిరమనియు వచించి సుమతి కుమారాదులు చెప్పిన సంధినియమములను తారకునకు నివేదించెను. తారకుఁడీ సంధి కంగీకరింపఁ దలఁచినచో "వెంటనే చెఱఁబట్టిన దేవతలను విడిచి కుమారస్వామి చెప్పినట్లు నడచుకొనవలెను. లేదా యుద్ధమునకు నడచి ప్రాణములమీఁద నాశ వదలుకొనవలెను." ఈ మాటలు విన్న తారకునకుఁ గోపము వచ్చినది. రాజామణీ ! "నిన్నఁగాక మొన్నఁ బుట్టిన బుడుతఁడేమి ! తనతో సమానునివలె రాయబారము పంపుట యేమి !" ఇంతకోపము వచ్చినను నాతఁడు వివేకమును గోల్పోవలేదు. యుక్తిగా నాతఁడు దూతతో వచించినవిధ మరయఁ దగినది. "దేవతలను చెఱవిడువుమని యడుగుటకు వారి నెవ్వరును తనకడ నిల్లడపెట్టిపోలేదు. తాను భుజబలముతో వారిని చెఱఁబట్టినాఁడు. వారి నెవ్వరేని విడిపించవలయునన్నఁ దన్ను జయింపవలెను. అంతేగాని వా రెవరో తనను చెఱ విడువుమని యడుగుట యుక్తము కాదు. వారు తెలివిమాలి యడిగినను తాను విడువరాదు." ఇది యాతని సమాధానము. ఇందాతని భుజపరాక్రమమే గాదు. రాజనీతిజ్ఞతయు యుక్తివాదమును బ్రస్ఫుటముగాఁ గలవు గదా ! ఇఁకఁ గుమారుఁడు తారకుని జయించునా ? జయింపఁ డనియే తారకుని నమ్మకము! ఇందు కాతఁడు చూపిన కారణ మరయుదము.

"బహుముఖ మఱె తన రాజ్యము
బహుదోషాఢ్యుఁ డఱె తాను బాలుం డఱె వాఁ
డు హుఠంబైనను నీతి వి
రహితం బిది యిట్టి పతికి రణజయ మగునే ?" (10-147)

"కుమారుని రాజ్యము బహుముఖము, (ఆఱు ముఖములు గలవాఁడనుట) కుమారుఁడు బహు దోషాఢ్యుఁడు, (దోషములు కలవాఁడు, బాహువులు

కలవాఁడు) అంతేకాదు బాలుఁడుకూడ. ఇన్ని యవలక్షణము లున్నచో వాఁడు శివుఁడయినను వానికి రణమున జయము గలుగదు". ఇది నీతి.

రాజ్యము ఏకముఖముగా నుండవలెను. రాజునందు దోషము లుండరాదు, బాలుఁడు కారాదు. ఇందులో నే యొక్కటి లోపించినను నట్టివారి రాజ్యముల సుకరముగా జయింపవచ్చును. వీని కుదాహరణములు చరిత్రయందుఁ గావలసినన్ని కానవచ్చుననుట మనకుఁ దెలియనిదిగాదు. ఇట్టి కుమారస్వామిని గూర్చి తారకాసురునకు భయముండుట సంభవించునా ? కావుననే యాతఁడు దేవదూత వాక్యములను లక్ష్యపెట్టక వానిని వెడలిపొమ్మని యాజ్ఞ యిచ్చినాఁడు. కాని వచ్చినవాఁడు సామాన్యుఁడా ? దేవత లేరి కోరి పంపిన దూతగదా ఆతఁడు : కావుననే తారకుని యాక్షేపమునకుఁ దగిన విధముగా ధైర్యముతో సమాధాన మిచ్చి యాతనివలెనే మఱల శ్లేషపద్యముతోఁ దారకు నాక్షేపించినాఁడు :

"ఇనుఁ డుదయింపక ముందఱ
ఘనముగ వర్తించుఁ దారకప్రభ మాకై
యినుఁ డుదయించిన పిమ్మటఁ
గనుఁగొన లోకమునఁ దారకప్రభ గలదే" (10-125)

ఈ యాక్షేపమును విన్న తారకుఁ డొడలుమఱచి కోపముతో సుమతిని జంపివేయుఁడని సేవకుల నాజ్ఞాపించినాఁడు. కాని నడుమ శుక్రుఁడు కల్పించుకొని దూతలఁ జంపించుట రాజనీతి కాదని వచింపగాఁ దారకుఁడు తన పూనికి మాని సుమతిని పరిభవింపక వెళ్ళగొట్టెనఁట.

ఇది యంతయు మన మహాకవి చక్కని యనుభవముతో వ్రాసిన దానివలె నున్నదిగదా !

ఇఁకఁ దరువాత జరిగిన విషయ మరయుదము. సుమతి వెడలి పోయిన పిదపఁ దారకుఁ డొక దూతను బిలిచి వానిని కుమారస్వామి కడకుఁబంపి యట తన పరాక్రమాదులను వర్ణించి హిమవదుత్తర భూభాగము యుద్ధరంగముగాఁ జెప్పిరమ్మని యాదేశించెను. ఇది కుమారుఁడు

పంపిన రాయబారమునకుఁ బ్రతి రాయబారము. ఇందు ముందొక పక్షము వారు యుద్ధమున కాహ్వానించుటకు తమ రాయబారిని బంపఁగా రెండవ పక్షమువారు యుద్ధరంగమును నిర్దేశించుటకు మఱలఁ దమ రాయబారిని బంపినట్లు పై వర్ణనమున గలదు. ఇదియును నన్నెచోడునినాటి స్థితినే సూచించుచున్న దనవలెను.

ఉత్తర హరివంశమున నాచన సోమనాథ మహాకవి యీ కవిరాజ శిఖామణి ననుకరించియే జనార్దన రాయబారమును, తరువాత సాత్యకి ద్వారా ప్రతి రాయబారమును, బంపినట్లు వర్ణించినాఁడు. అందును హంస డిభకులు కృష్ణుని యుద్ధమున కాహ్వానింపగాఁ గృష్ణుఁడు సాత్యకిద్వారా యుద్ధరంగ నిర్దేశమును జెప్పి పంపినాఁడు.

కుమారసంభవమునందలి యీ ప్రతి రాయబారముగూడ మఱల సుమతి రాయబారమంత విపులముగా వర్ణింపఁబడినది.

సుమతి తారకునియాస్థానమున నెట్టి మర్యాదల నందివచ్చినాఁడో దానవ దూతయుఁ గుమారునికడ నంతటి మర్యాదనందియే తిరిగి వచ్చినాఁడు.

ఈ యిరువురు రాయబారులును శత్రువులముందుఁ దమ యేలికలను గూర్చి పలికిన పలుకులు వారి ధైర్యసాహసములను, సమయోచిత స్ఫూర్తిని, రాజనీతి నైపుణ్యమును చక్కఁగా వివరించుచున్నవి.

అందును సుమతి కవిరాజు వర్ణించిన రాయబారి గుణముల కుదాహరణముగాఁ జిత్రింపఁబడినట్లున్నాఁడు.

## తదితర వర్ణనములు

నన్నెచోడ మహాకవి కావ్యాదిని తన గ్రంథమున నష్టాదశ వర్ణనములున్నవని వచించెనని చెప్పి వానిలోని విశేషముల వివరించితిని. ఇట్లు చూపుటచే నాతని కావ్యమున నితర వర్ణనలు లేవని చెప్పుటకాదు. అప్పకవి ప్రబంధమునం దుండఁదగినవని చెప్పిన వానిలోఁ బైవర్ణనలు పోగా మిగిలినవి (1) వేట (2) మౌనీంద్ర పుణ్యాశ్రమము (3) కన్యాంగ

సౌందర్యము (4) దౌహృదము అను వాని వర్ణనలు. వీని నన్నింటినిఁ గవిరాజు కుమారసంభవమున సందర్భోచితముగా వర్ణించియున్నాఁడు.

షష్ఠాశ్వాసమున "పాయక వేరు వెల్లకియు" నను పద్యమున (6-35 ప.) నాటవిక జనులవేట సూచింపఁబడినది. ఆ పిమ్మట ఆయాశ్వాసముననే మున్యాశ్రమ వర్ణనము సుమారు ముప్పది పద్యములచేఁ గావింపఁబడినది. (51 ప. నుండి 80 ప. వఱకు)

అట్లే తృతీయాశ్వాసమునందును మఱల నష్టమాశ్వాసమునందును కన్యయగు పార్వతి సౌందర్యము విపులముగా 52 పద్యములలో వర్ణింపఁబడినది. (3 ఆ. మున 3 పద్యములు, 88 ఆ. మున 14 ప. లు) ఇవికాఁగా మిగిలినది దౌహృదము.

దౌహృదమునకు గర్భిణికిఁగల వేవిళ్ళనియు, చెట్లకాలమునఁ బుష్పించుటకై చేయు దోహదము లనియు నర్థము. కుమారసంభవమునందు తృతీయాశ్వాసమున గర్భిణియగు మేనక వేవిళ్లు వర్ణింపఁబడినవి. అట్లే నవమాశ్వాసము 122 వ పద్యమున చెట్లదోహదక్రియలును వర్ణింపఁబడినవి.

ఇఁక సాహిత్యదర్పణకారునిచేఁ జెప్పఁబడిన మఱికొన్ని విశేష వర్ణనములును కుమారసంభవమునఁ గలవు. అందు ద్వితీయాశ్వాసారంభమున దక్షుని "యధ్వర" వర్ణనమును, అష్టమాశ్వాసమున ప్రదోష, (89, 90, 91 ప. ములు) రజనీ, (92-95 ప. ములు) ధ్వాంత (97-99 ప, ములు) ప్రాతఃకాల (182-188 ప. ములు) వర్ణనములును మనోహరముగా రచింపఁబడినవి. ఈ వర్ణనల నన్నింటిని వివరించుట కిక్కడ స్థలము చాలదు. పాఠకులకు విసువును గలుగవచ్చును. కావున నొక్క విషయమును మాత్రము వచించి యీ ప్రకరణమును ముగింతును.

పార్వతి యూరువుల వర్ణించు పద్యమున (3-48) "స్మరమందిరమ"ను పదమశ్లీలార్థ ద్యోతకముగా నున్నదని శ్రీ శ్రీపాదలక్ష్మీపతి శాస్త్రిగారు భావించినారు. (చూ. కుమా. విమ. 155 పుట) ఇక్కడ

స్మరమందిరము పార్వతిదేహమేకాని, యన్యము కాదు. "దేహో దేవాలయః ప్రోక్తో జీవో దేవస్సనాతనః" అను వచనమును దీనితో నను సంధించుకొనవలెను. అట్లనుటచే ననౌచిత్యదోషము తొలంగఁగలదు.

కవిరాజు వర్ణనము లన్నియు సందర్భోచితములై బహురమణీయములుగా నున్నవని వచించుచు నీ ప్రకరణమును ముగించుచున్నాను.

## కుమారసంభవ మాంధ్రభాషలోని ప్రథమ ప్రబంధము

ఆంధ్ర వాఙ్మయమునఁ బ్రబంధము లొక ప్రత్యేకశాఖగాఁ బరిగణింపఁబడు చున్నవి. ఈ ప్రబంధశాఖకు మనుచరిత్రము ప్రతినిధిగా నెంచఁబడుచున్నది. తరువాత మనుచరిత్ర ననుసరించి యా ఫక్కికనే వ్రాయఁబడిన వసుచరిత్రాదులను నేఁడు మనము ప్రబంధములని వ్యవహరించుచున్నాము.

నేఁడు మనము ప్రబంధములని వ్యవహరించు వానియందుఁ గొన్ని లక్షణము లీ క్రింది విధముగా నుండునని చెప్పవచ్చును.

ప్రబంధములో నితివృత్తమున వస్త్వైక్య ముండవలయును. ఆ యితివృత్తము పురాణాదులనుండి గ్రహింపఁబడవలయును. ఇందు ప్రధానరసము శృంగారము. వీరరస మంగరసముగా నుండవచ్చును. కడమ రసములు సమయానుకూలముగా నుండవచ్చును. ఇతివృత్తము చిన్నదైనను మధ్యమధ్య (18 లేదా 22) వర్ణనలనుంచి దానినే పెద్ద దానినిగాఁ జేయవలయును. నాయికానాయకుల పరస్పరానురాగమును, సంభోగ విప్రలంభావస్థలును వర్ణింపఁబడి చివరకు మోదాంతముగాఁ గావ్యము ముగియవలయును. ఇది స్థూలముగా మన "ప్రబంధ" స్వరూపము. ఇందు కుదాహరణములు మను వసు చరిత్రాది గ్రంథములు. (మను చరిత్రమున వస్త్వైక్యమున్నదా ? లేదా ? యను వివాదములోనికి దిగుట మనకుఁ బ్రస్తుతాంశము కాదు.)

పైనఁ జెప్పిన లక్షణములు గలవి ప్రబంధవాఙ్మయశాఖకుఁ జెందిన గ్రంథములని మనము భావించినచో నన్నెచోడుని కుమారసంభవమును బ్రబంధమేయని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. నన్నెచోడుఁడే "భంగిగ విస్తరించెదఁ *బ్రబంధము* సద్రస బంధురంబుగాన్" అని (1-48) తన కుమారసంభవమును "బ్రబంధము"గా వ్యవహరించెను.

కుమారసంభవమున శృంగారమే ప్రధానరసము. వీరరసమంగ రసముగానే వర్ణింపబడినది. తదితర రసములును లేకపోలేదు. (చూ. శ్రీ శ్రీ. ల. శాస్త్రిగారి కుమా. విమ. లోని రసవిషయక ప్రకరణములు) ఇతివృత్తము శివపురాణమునుండి ప్రబంధానుకూలములగు మార్పులతో గ్రహింపఁబడి సమయానుకూలములగు వర్ణనలతోఁ బెంపొందింపఁ బడినది. నాయికానాయకులగు పార్వతీపరమేశ్వరుల పరస్పరానురాగమును, విప్రలంభసంభోగములును వర్ణింపఁబడినవి. కావ్యము మోదాంతముగానే యున్నది. కావుననే తెలుఁగులోని ప్రబంధశాఖ కాద్యగ్రంథ మీ కుమారసంభవమని విమర్శకులు తలంచినారు.

## ప్రబంధశబ్ద విచారము

ఇక్కడ నీ ప్రబంధశబ్దమునుగూర్చి కొంచెము వచించుట యప్రస్తుతము గాదని యెంతును. నేడు మనము "ప్రబంధము" లని వ్యవహరించు వానిని బూర్వు లేమనిరి? పూర్వులు ప్రబంధశబ్దము నెట్లు వాడిరి? అను విషయముల విచారించుటయే యది.

అందు మొదటఁబూర్వు లీ ప్రబంధశబ్దము నెట్లేయర్థమునవాడిరో యరయుదము.

నన్నయభట్టు "కవివృషభులు మహాకావ్యమని యెంచి"నను తాను మహాభారతమును సంహితగానే రచియింప నెంచినాఁడు. నన్నయ భట్టారకుఁడు ప్రబంధ శబ్దము నుపయోగించినట్లు కానరాదు.

నన్నెచోడుఁడు తన కృతిని "దివ్యసుకృతి" (1-34) యనియు, "దివ్యకథ" (1-45,1-67) యనియు, "సద్రసబంధురమగు ప్రబంధము" (1-48) అనియు, "ఉత్తమ కావ్యము" (1-56) అనియు, "దివ్య కావ్యము" (1-69) అనియు వచించినాఁడు. ఇంతకుముం దాంధ్రమునఁ బ్రబంధ శబ్దము నెవ్వరును బ్రయోగించినవారు లేకపోవుటచే నీ శబ్దమును మొట్టమొదటఁ బ్రయోగించినవాఁ డీతఁడే యని చెప్పవలసి యున్నది. ఈతఁడు వాడిన విధమునుబట్టి ప్రబంధ శబ్దమునకు "కావ్యము" అని యర్థమని నిర్ణయింపవచ్చును.

నన్నెచోడుని తరువాతఁ దిక్కన తన తొలి కృతియగు నిర్వచనోత్తర రామాయణమును "కావ్యము" (1-9) అనియు, "కథ" యనియు (1-45) "మహాకావ్యము" అనియు (ఆశ్వాసాంత గద్యలలో) వచించెను. ఇందుఁ బ్రబంధ శబ్దము కానరాదు. తరువాతిదగు మహాభారతమును తిక్కన (విరాట ప. 1ఆ. 8 వ ప. మున) "ప్రబంధ మండలి" యనియు "పుణ్యప్రబంధములు" (విరాట 1ఆ. 31 ప.) అనియు "మహాకావ్యము" (విరా. 1ఆ. 37 వ.) అనియుఁ బేర్కొనెను.

తరువాత నెఱ్ఱయ తన నృసింహపురాణమును మహాప్రబంధము (పీఠి. 14, పీఠి. 27) అనియు. "ప్రబంధము" (పీఠి-20) అనియు, "నుదాత్తప్రబంధము" (1-5) అనియు, "పురాణ కథ" (1-1) యనియు వ్యవహరించెను.

శ్రీనాథుఁడు నైషధమును "మహాప్రబంధమని" (1-45) వ్యవహరించి కాశీఖండనమునట్లు వ్యవహరింపలేదు. రాయ లాముక్తమాల్యదను, (1-50) పెద్దన మనుచరిత్రమును (1-48) రామరాజభూషణుఁడు వసుచరిత్రమును (1-90) నంది తిమ్మయ పారిజాతాపహరణమును (1-34) మహాప్రబంధములుగా వ్యవహరించిరి.

చేమకూర వేంకటకవి "విజయవిలాసము"ను (పీఠి-65) ముద్దుపళని "రాధికా సాంత్వనము"ను, (1-43) కూచిమంచి జగ్గకవి "శివ

లీలావిలాసము"ను (1-13) "శృంగారరస ప్రబంధము"లుగా వ్యవహరించిరి.

పై వివరణమువలనఁ దేలిన సారాంశమే మనఁగా నేఁడుమనము "ప్రబంధ"ము నేయర్థమున వాడుచున్నామో ? పూర్వకవులా యర్థమున దానిని వాడలేదనుటయే. అంతేగాదు వారు దానిని "కావ్యము" అను నర్థమున మాత్రమే వాడినట్లును స్పష్టమే.

సంస్కృతాలంకారికులగు [1]విద్యానాథుఁడును, [2]వామనుఁడును, [3]రాజశేఖరుఁడును, [4]ఆనందవర్ధనాచార్యుఁడును, [5]క్షేమేంద్రుడును నీ ప్రబంధశబ్దమును దమ గ్రంథములందు వాడినారు. వారందఱు నీ శబ్దమును "కావ్యము" అను నర్థమునందే వాడియున్నారు. రాజశేఖరుఁడు ప్రబంధశబ్దమునేగాక "మహాప్రబంధ"శబ్దమునుగూడ "మహాకావ్యము" అను నర్థమున వాడినాఁడు.[6]

---

1. (ఎ) "యద్వ్యప్యసా ప్రబంధేషు ప్రాచాం సాధునిరూపితా" (ప్రతాపరుద్రీయ నాయక ప్రకరణము)

   (బి) "అథమహాకావ్యాదయః ప్రబంధా నిరూప్యన్తే" } కావ్య ప్రకరణము
   (సి) "అథక్షుద్రాః ప్రబంధా నిరూప్యన్తే" }

2. సూ॥ సందర్భేషు దశరూపకం శ్రేయః ॥౩౦॥ వృత్తి: సందర్భేషు ప్రబంధేషు దశరూపకం నాటకాది శ్రేయః, (వామనుని కావ్యాలంకార సూత్ర వృత్తి 1 అధి. 3 అధ్యా.)

3. "నిక్షేపో విక్రయో దానమ్ దేశత్యాగో ఒల్పజీవితా । తృటికో. వహ్నిరంభశ్చ ప్రబంధోచ్ఛేదహేతవః ॥...ప్రబంధ వినాశకారణాని. (రాజశేఖరుని కావ్య మీమాంస. కవిరహస్యము. 9 అధ్యా.)

4. చూ. ధ్వన్యాలోకము 3 ఉద్ద్యోతములోని 28 శ్లోక వివరణము.

5. "ప్రబంధస్ఫుతరాంభాతి యథాస్థానం నివేశితైః" (సువృత్తతిలకము)

6. "ముక్తకే కవయోఽనంతాః సంఘాతే కవయశ్శతమ్
   మహాప్రబంధేతు కవి రేకో ద్వౌ దుర్లభా త్రయః" (కావ్య మీమాంస. కవి రహస్యము 10 అధ్యా.)

దీనినిబట్టి చూడఁగాఁ బ్రాచీనాంధ్రకవులును గీర్వాణాలంకారికులును ప్రబంధ శబ్దమును కావ్యమను నర్థమునను, మహాప్రబంధ శబ్దమును మహాకావ్యమను నర్థమునను వాడినట్లు స్పష్టముగా విదితమగుచున్నది. చిన్నకోట పెద్దనయు నీ ప్రబంధ శబ్దము నిట్లే వాడినాఁడు.[7] మహాకావ్యమను నర్థమున "భవ్యప్రబంధము" అను పదము నాతఁడువాడినాఁడు.[8] ఇదియుఁ బై విషయమునే బలపఱచుచున్నది.

పైవిషయములన్నింటిని బట్టి చూడఁగా మను వసు చరిత్రాదులు నేఁడు మనము వ్యవహరించుచున్నట్లు ప్రబంధ మాత్రములు కావనియు నవి మహాప్రబంధములనియుఁ జెప్పవలసియున్నది. వానియందు నట్లే కలదు కదా :

కాని యప్పకవీయమున మాత్రము ఏమికారణముననోగాని మహాకావ్యపదమునకుఁ బర్యాయముగాఁ బ్రబంధ శబ్దము వాడఁబడినది.[9] నేటి మన వ్యవహారమున కప్పకవి వ్రాతయే మూలమై యుండెననుఁ దెల్పుచున్నది.

ఇంతవఱకుఁ జేసిన సారాంశము నేఁడు మనము ప్రబంధమని వ్యవహరించునది మహాకావ్యముగాని మహాప్రబంధముగాని యగుననుట. మహాకావ్యలక్షణములు కుమారసంభవమున కెంతవఱకు సరిపడునో పరిశీలింతము.

---

7. "ధరఁ జాటుకృతులలోనం బరఁగు నుదాహరణమను ప్రబంధము......"
(కావ్యా. చూ. 4 ఉల్లా. 11 ప.)
8. నగర ముఖ్యాష్టాదశ వర్ణనలచేతఁ బరఁగునదియును "భవ్యప్రబంధముల"
(కావ్యా. చూ. 3 ఉల్లా. 91 ప.)
9. (క) "అట్టి కావ్యంబు ద్వివిధమై యతిశయిల్లుఁ బరవడిఁ బ్రబంధ నామ ప్రబంధములందు సర్గములు సంస్కృతమున, నాశ్వాసములందు దెనుఁగునఁ బ్రబంధములందు తనరు కృష్ణ."
(ఖ) "సీ....ఇరువదిరెండు వర్ణనలుగూర్చి చెప్పవలయుఁ బ్రబంధంబు శ్రీనివాస!" (అప్పక. 1ఆ. 27,28 ప.లు)

# కుమారసంభవము మహాకావ్యము

సాహిత్య దర్పణమున విశ్వనాథ కవిరాజు మహాకావ్య లక్షణము నీ క్రింది విధముగా వచించెను :

"సర్గబంధో మహాకావ్యం తత్రైకో నాయక స్సురః
సద్వంశః క్షత్రియోవాఽపి ధీరోదాత్త గుణాన్వితః
ఏకవంశభవా భూపాః కులజా బహవోఽపి వా
శృంగార వీరశాంతానా మేకోంగీరస ఇష్యతే
అంగాని సర్వేఽపి రసాః సర్వే నాటకసంధయః
ఇతిహాసోద్భవం వృత్త మన్యద్వా సజ్జనాశ్రయమ్ .
చత్వార స్తస్యవర్గాః స్యు స్తేష్వేకం చ ఫలం భవేత్
ఆదౌ నమస్క్రియాశీర్వా వస్తు నిర్దేశ ఏవ వా
క్వచిన్నిందా ఖలాదీనాం సతాంచ గుణకీర్తనమ్
ఏకవృత్తమయైః పద్యైరవసానేఽన్య వృత్తకైః
నాతిస్వల్పా నాతిదీర్ఘాః సర్గా అష్టాధికా ఇహ
నానావృత్తమయః క్వాపి సర్గః కశ్చన దృశ్యతే
సంధ్యా సూర్యేందు...............
వర్ణనీయా యథాయోగ్యం సాంగోపాంగా అమీ ఇహ".

(సాహి. దర్ప. 6 పరి. 315-324)

"మహాకావ్యమున నాయకుఁడు దేవతాజాతికిఁ జెందినవాఁడు కాని, యుత్తమ క్షత్రియుఁడు కాని కావలెను. ధీరోదాత్తుఁడై యుండవలెను. ఒకే వంశమునఁ బుట్టినవారు పలువురైనను నాయకులు కావచ్చును. శృంగార వీరశాంతములలో నొక్కటి ముఖ్యరసమై యితర రసము లంగములుగా నుండవలెను. నాటకమునందువలె నిందును పంచసంధులు (ముఖ, ప్రతిముఖ, గర్భ, విమర్శ, పసంహృతులు) నుండవలెను. ఇతివృత్తము ఇతహాసాదులనుండి (పురాణమునందుఁ

జేరును) గ్రహింపఁ బడవలెను. లేదా సజ్జనాశ్రయమయి యుండవలెను. ధర్మార్థ కామమోక్షములలో నొక్కటి కావ్యమునకు ఫలమయి యుండ వలయును. కావ్యాదిని మంగళాచరణ ముండవలెను. కుకవి నిందయు సత్కవి స్తుతియు నుండవచ్చును. సంస్కృతమునందైన సర్గలు, ప్రాకృతాది భాషలందైన నాశ్వాసములు నుండవలెను. ("ప్రాకృతై ర్నిర్మితే తస్మిన్సర్గా ఆశ్వాస సంజ్ఞకాః" సా. ద. 6 పరి. 326 శ్లో.) అవి యేకవృత్త మయములుగాఁ గాని, భిన్నవృత్తములుగాఁ గాని యుండ వలెను. ఆ యాశ్వాసము లెనిమిదికన్న నెక్కువగా నుండవలెను. (ముప్పదికి మించరాదు. "అష్టసర్గా న్నతున్యూనం త్రింశత్సర్గా చ్చనాధి కమ్। మహాకావ్యం ప్రయోక్తవ్యమ్ మహాపురుష కీర్తియుక్" ఈశాన సంహిత) అష్టాదశ వర్ణనలు (సా. ద. కారుని మతమున నింకను నెక్కువయే) నుండవలెను."

ఇది మహాకావ్య స్వరూపము. ఈ లక్షణములన్నియుఁ గుమార సంభవమున కన్వయించును.

కుమారసంభవమున నాయకుఁడగు శివుఁడు దివ్యుఁడు. ధీరో దాత్తుఁడు.("మహాసత్త్వోఽతి గంభీరః కృపావానవికత్థనః"అని ధీరోదాత్త లక్షణము) ప్రధానరసము శృంగారము. ఇతర రసములు అంగములుగా నక్కడక్కడ వర్ణితము లైనవి. ఇతివృత్తము పురాణాంతర్గతము. కావ్యాది నాశీరూపమగు మంగళాచరణమును, గుకవి నిందయు, సత్కవి జనుల స్తుతియుఁ గలవు. కుమారసంభవ వర్ణనల విషయము విపుల ముగా నిదివఱకే వివరింపఁ బడినది గదా!

కుమారసంభవమున పన్నెండాశ్వాసములు గలవు. ఇందుఁ బన్నెండాశ్వాసములే యుండుట కొక కారణము గలదు. చోడుఁడు "సతి జన్మంబున్.... తారకుంబోరఁగెల్వున్" (1-68) అను పద్యముచేఁ గుమారసంభవ కథా సూత్రమును వివరించినాఁడు. ఇందు మొత్తము పన్నెండు విషయము లున్నవి. ఒక్కొక్క విషయమున కొక్క

యాశ్వాసము చెప్పునఁ బన్నెం డాశ్వాసములుగా గ్రంథము నాతఁడు వ్రాయనెంచి యుండవచ్చును. కాని తరువాతఁ గొన్ని విషయములను సంగ్రహపఱచుటయు మఱికొన్నింటిని పెంచుటయు జరుగవలసి వచ్చుటచే నా విషయక్రమము ననుసరింపజాలకపోయి యుండవచ్చును. ఆశ్వాసాంతమును శివునితోఁ గూర్చు ప్రణాళికయు దీనికిఁ గొంత కారణము కావచ్చును.

మహాకావ్యమునకు ధర్మార్థ కామమోక్షములం దొక్కటి ప్రయోజనముగా నుండవలెనని యాలంకారికులు వచించినారు గదా! కుమార సంభవ మహాకావ్యమునకీ నాలుగు పురుషార్థములును ప్రయోజనములయి యుండుట కవిరాజు పుణ్యవిశేషము. ప్రకృతి పురుషులగు పార్వతీ పరమేశ్వరుల చరిత్రము కర్తకును పాఠకులకును ధర్మార్థ కామమోక్షములను బ్రసాదించు ననుటలో విప్రతిపత్తి లేదుగదా! కావ్యమునందుత్తమ ధర్మబోధయు, నుత్తమ కామమును, తత్త్వనివేదనము, మోక్షోపాయమును విస్తృతములై యుండుటచే మహాకావ్య ప్రయోజన మందుఁ బూర్తిగాఁ బాటింపఁబడెనని వేరుగాఁ జెప్పఁబనిలేదు.

ముఖ, ప్రతిముఖ, గర్భ, విమర్శ, నిర్వహణములని సంధులైదు. ముఖసంధియందు కథారంభమును, ప్రతిముఖమునఁ గార్య ప్రయత్నమును, గర్భమునఁ గార్య ప్రాప్త్యాశయు, విమర్శమున, కార్య నియతాప్తియు, నిర్వహణమునఁ గార్య ఫలాగమమును వర్ణితము లగును. కథ నుపక్రమోపసంహారములతోఁ జక్కగా నిర్వహించుటయే యీ సంధి పంచకము నేర్పఱచుటలోని ముఖ్య ప్రయోజనము. నారదాగమమున నారంభమయి పార్వతిచే సపర్య మూలమునఁ బ్రయత్నింపబడి, తపస్సుచే ప్రాప్త్యాశ కలిగి, ప్రత్యక్షమున నియతాప్తి నిర్ణయింపఁబడి వివాహముచేఁ గార్యము నిర్వహింపఁ బడుట కుమారసంభవమునఁ గాననగును.

ఈ విధముగాఁ గుమారసంభవమును సర్వలక్షణ సంపన్నమయిన మహా ప్రబంధముగా నిర్ణయింపనగునని వచించుచు నీ ప్రకరణమును ముగింతును.

## నన్నెచోడుని కవితాదృష్టి

నన్నెచోడ మహాకవి కుమారసంభవ పీఠికయందు దాతనికి కవిత యెడఁగల యభిప్రాయములను పదిపద్యములచే వివరించినాఁడు. అందు ముఖ్యములగు వాని నుదాహరింతును :

"సరళముగాఁగ భావములు జానుతెనుంగున నింపు పెంపుతోఁ
బిరిగొన, వర్ణనల్ ఫణితిఁ బేర్కొన, నర్థము లొత్తగిల్ల, బం
ధురముగఁ బ్రాణముల్ మధుమృదుత్వ రసంబునఁ గందళింప, న
క్షరములు, సూక్తు లార్యులకుఁ గర్ణరసాయన లీలఁ గ్రాలఁగాన్."
(1-35)

"మృదుమతిఁ సూక్తులింపొదవఁ బల్కఁ బెల్లి
భావమ్ము నెలమిఁ గ్రీడావహముగ,
మెఱుఁగులఁ గన్నులు మిఱుమిట్లు వోవంగఁ,
గాంతి సుధాసూతి కాంతిఁ జెనయ,
వర్ణనలెల్లచో వర్ణన కెక్కంగ,
రసములు దళుకొత్తి రాలువాఱ,
దేశిమార్గంబులు దేశీయములుగా, న
లంకారములఁ దా నలంకరింప
నాదరించి విని సదర్థాతిశయమున
బుధులు నెమ్మనమున నిధులు నిలుప
వలవదే సమస్త వస్తుకవీశ్వర
నూత్నరుచిరకావ్య రత్నపీఠి." (1-36)

"ఓలిన కరచన నఱువది
నాలుగు విద్యలను నేర్పు నైసర్గికమై
వాలిన సుకవులకుంగా
కేలతరమె కృతులుచెప్ప నెవ్వరికైనన్." (1-42)

పై పద్యము లాధారముగా నీ క్రింది విషయముల నేర్పఱచుకొని వానిని గుఱించి కవిరాజు భావమును దాని నాతఁడు కుమారసంభవమునఁ బాటించిన విధమును బరిశీలింతము. (1) భావములు, (2) వర్ణనలు, (3) అర్థములు, (4) ప్రాణములు, (5) అక్షరములు, (6) సూక్తులు, (7) రసములు, (8) దేశిమార్గములు, (9) అలంకారములు, (10) చతుష్షష్టి విద్యలు. వీనిలో నొక్కొక్కదానినే సంగ్రహముగా వివరింతును.

## 1. భావములు

కవిశక్తిని కొలచుట కుపయోగించువానిలో భావము ముఖ్యమైనది. ఏదేని ఒక విషయమును సామాన్యులు భావించినట్లు కవి భావింపఁడు. ఆతఁడు దానిని చూడఁగానే యొక యపూర్వభావ మాతనికిఁ గలుగును. వాని నాతఁడు చెప్పినప్పుడు సహృదయులు తెలిసికొని యానందింతురు. నన్నెచోడ మహాకవి కట్టి భావనాబలము కలదనుట కాతని గ్రంథమున నుదాహరణములు వందలు. నేనట్టివానిని వర్ణనములఁగూర్చి వచించు సందర్భమునఁ గొన్నింటిని వివరించినాను.

## 2. వర్ణనలు

నన్నెచోడుఁడు తా నష్టాదశవర్ణనలు గావింతుననెను. వానిలోని క్రమము నిదివఱకే నేను విపులముగా వివరించినాను.

## 3. అర్థములు

అర్థము శబ్దాశ్రయము. వాని సంబంధము విడదీయరానిది. కవిరాజాయర్థములు శబ్దములతో నొత్తగిల్లియుండవలయునని వచించినాఁడు.

శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారి యీ క్రింది వాక్యములు చిత్తగింపుఁడు:
"పదములలో...చోడుని యర్థము శబ్దోత్పత్తికి దగ్గఱించి యున్నది...."

## 4. ప్రాణములు

ఈ ప్రాణములఁగూర్చి కవిరాజు పై పద్యములందేగాక "దశ ప్రాణంబుల సప్రాణంబై" (1-45) యని మఱియొకచోటఁగూడ వచించినాఁడు. ఈ ప్రాణములసంఖ్య పది. ఇవి కావ్యగుణములు. దండ్యాచార్యుని యీ క్రింది పలుకు లరయుఁడు :

"శ్లేషః, ప్రసాద, స్సమతా, మాధుర్యం, సుకుమారతా,
అర్థవ్యక్తి, రుదారత్వ, మోజః, కాంతి, సమాధయః
ఇతి వైదర్భమార్గస్య *ప్రాణా దశగుణాః స్మృతాః.*"
(కావ్యాద. 1 పరి. 41, 42 శ్లో.)

విన్నకోట పెద్దనయు వీనిని ప్రాణములనియే వ్యవహరించెను. ఆతని పద్యము చూడుఁడు :

"క్రమమున నౌదార్యశ్లేషములును...*దగు దశప్రాణములై*"
(కా. చూ. 4 ఉ. 79 ప.)

ఈ ప్రాణములు వైదర్భికి ప్రాణములవంటివి. వైదర్భి రీతులుమూటియందొక్కటి. ఇదియే రీతులందు గ్రాహ్యమని వామనుఁడు కావ్యాలంకారసూత్రవృత్తియందు వచించినాఁడు. "చూ. సమగ్రగుణావైదర్భీ" (1-2-11) "తాసాం పూర్వాగ్రాహ్యా. గుణసాకల్యాత్" (1-2-14) "న పునరితరే. స్తోకగుణత్వాత్" (1-2-15) కా. సూ. వృత్తి.

రీతులు శైలికి సంబంధించినట్టివి. రసానుకూలమగు పదబంధము లేనిచో కావ్యము శోభింపదు. నన్నెచోడుఁ డొక్కొకచోట దీర్ఘమయిన సమాసమును వాడి, మఱియొకచోటఁ జిన్నచిన్న పదములనుంచి రససృష్టిని గావించెను. క్రోధ, గాంభీర్యాదులను వర్ణించుటకు దీర్ఘసమాసము

లుపయోగించుటయు, సౌకుమార్య సౌందర్యాదులను వర్ణించుటకు లలిత పదముల నుంచుటయుఁ గుమారసంభవమునఁ గాననగును.

ఈ శైలిని సంభాషణాత్మకమనియు, వర్ణనాత్మకమనియు, కథా కథనాత్మకమనియు మూఁడు విధముల విభజించుటగూడ గలదు. నన్నియది ప్రధానముగాఁ గథాకథనాత్మకము, తిక్కన సంభాషణాత్మకశైలికి పేరందినవాఁడు. నన్నెచోడుని కుమారసంభవమునం దీమూఁడు విధములు నున్నవి. దక్షాధ్వరమునందలి సతీదక్షుల సంభాషణమును, రతీ మన్మథుల సంభాషణమును, ఇంద్ర మన్మథుల సంభాషణమును బ్రహ్మ చారి పార్వతితోడి సంభాషణమును, పీరుల విస్రంభాలాపములును, (వీనిని శ్రీ దేపరపల్లివారు పద్యనాటిక లనిరి.) మఱికొన్ని ఘట్టములును చోడుని సంభాషణాత్మకశైలికి చక్కని యుదాహరణములు. వర్ణనములం దన్నిం టను, ముఖ్యముగా యుద్ధవర్ణనమునందును, చోడుని వర్ణననైపుణ్యము గాననగును. కడమచోట్ల కథాకథనశైలి కనిపించును.

## అక్షరములు సూక్తులు

నన్నయయు "ఇతరు లక్షరరమ్యత నాదరింప నానారుచిరార్థ సూక్తి నిధి" యని తన కవిత్వమున నక్షరరమ్యతయు సూక్తులును గలవని వచించెను. పద్యము శ్రవణసుభగమై వినినంతనే హృద్యముగా నుండుట యక్షరరమ్యత. అర్థావబోధనమునకుఁ దోడ్పడి సంభాషణమునకుఁ బుష్టి నొసఁగునవి సూక్తులు. కొన్ని మహాకవులు ప్రతిభాయుతముగా వ్రాసిన వాక్యములు సూక్తిత్వము నందుట యన్ని భాషల సాహిత్యములందును గాననగును. ఆంగ్లమున షేక్స్పియరు మహాకవి వాక్యముల కట్టిశక్తి కలదు. సంస్కృతమునఁ గాళిదాస మహాకవి వాక్యము లట్టివి. ఆంధ్ర మున నన్నయ పలుకులు నట్టివే. చోడుని కవితయందును సూక్తులు విరివిగా వాడఁబడినవి. చూ. "కనక వర్ణోత్కర మ్మొరగంట నొరసి చూచి కాకెర్గవచ్చునే సుద్దజాత" (1-32) "వెలయాలికూటముం బూవుల

షేలికంపు తమ పొందునకా కటమీఁద నిల్చునే" (8-158) ఇట్టివే వలసి నన్ని. అక్షరములును సూక్తులును నార్యులకుఁ గర్ణరసాయన లీలఁ గ్రాల వలెనని చోడుని వచనము. అది యాతని కవితయందుఁ జక్కఁగాఁ బాటింపఁబడినది.

## రసములు

కుమారసంభవమునఁ బ్రధాన రసము శృంగారము. "విభావై రనుభావైశ్చ సాత్త్వికై ర్వ్యభిచారిభిః, ఆనీయమానస్స్వాదుత్వం స్థాయీభావో రసః స్మృతః" అని ధనంజయవచనము. విభావము రెండు విధములు (1) ఆలంబన విభావము, (2) ఉద్దీపన విభావము. కుమారసంభవ కావ్యమునందలి శృంగార రసమునకుఁ బ్రకృతి పురుషు లాలంబనము. వారి వయోరూపాలంకరణములును మలయానిలాదులు నుద్దీపనములు. కటాక్షాదు లనుభావములు. స్తంభాదు లెనిమిది సాత్త్వికభావములు. నిర్వేదాదులు వ్యభిచారి భావములు. వీని నన్నింటిని కుమారసంభవ కర్త సముచితముగాఁ దన కావ్యమున వర్ణించినాఁడు. అంగరసములలో నిందు వీరము ముఖ్యమయినది. గ్రంథమునం దుత్తర భాగమున దీనిని కవి చక్కఁగాఁ బోషించినాఁడు. తదితరములగు రసములును సమయానుకూలముగాఁ గుమారసంభవమున వర్ణింపఁబడినవి. ఈ విషయమునే చోడుఁడు "నవరసభావ భరితంబై" యని పీఠికయందు వచించినాఁడు.

## దేశి మార్గములు

వీనినిగూర్చి పండితులలో భేదాభిప్రాయము లున్నవి. కొందఱు సంస్కృత కవిత మార్గకవితయనియు తెనుఁగు కవిత దేశికవితయనియు భావించుచున్నారు. మఱి కొందఱు నన్నయాదులది మార్గకవితయనియు నన్నెచోడాదులది దేశికవితయనియు నెంచుచున్నారు. ఈ భేదములను జోదకవితప్ప నింకెవ్వరును జెప్పినట్లు కానరాదు. సంస్కృతమున "రీతి"

యను నర్థమున దండిచే "మార్గ" శబ్దము వాడఁబడినది.[1] కాని యాయర్థ మునసే చోడుఁడు దీనిని వాడెననుట కవకాశములేకున్నది "దేసి" శబ్దమును చోడుఁడు "మనోహర" మను నర్థమునఁ జాలసారులు కుమారసంభవ మునం దుపయోగించెనుకాని యాయర్థమిటసరిపడదు.[2] దేశికవితయనఁగా దేశీయ సంప్రదాయసిద్ధమగు కవితాపద్ధతియనియు మార్గ కవిత యనఁగా సంస్కృత సాహిత్య సంప్రదాయసిద్ధమగు దేశభాషా కవిత యనియు విశ్వవిద్యాలయప్రతియం దర్థములు వ్రాయఁబడినవి. కాని యట్లని భావిం చుటకొక యాటంకముగలదు. నన్నయకుఁ బూర్వము లభించిన వాఙ్మ యము దేశి వాఙ్మయమేకాని మార్గ వాఙ్మయము గాదు నన్నయది మార్గ కవితయన్నచో ముందు దేశి వాఙ్మయ ముండఁగాఁ దరువాత మార్గకవిత బయలుదేరెనని చెప్పవలసి యుండును. చోడుఁడట్లు చెప్పలేదు కదా! (చూ, కుమా. 1 ఆ. 23 ప.) సంగీత నాట్యశాస్త్ర సంప్రదాయమునుబట్టి యీమార్గదేశి శబ్దములకు సంప్రదాయ బద్ధమయినదనియు, రుచివైచిత్ర్య మునుబట్టి దేశానుకూలముగా మాఱినదనియుఁ గ్రమముగా నర్థములేర్పడు చున్నవి.[3] చోడుఁడు మార్గ కవిత లోకమున వెలసినట్లును, దేశి కవిత ఆంధ్రవిషయమునఁ బుట్టినట్లును జెప్పినాఁడు. (1-23) దీనినిబట్టి మార్గ కవిత కేవలము దేశభాషాకవిత కాక మఱియేదో యైనట్లూహింపవలెను.

---

1. "ఇతి వైదర్భమార్గస్య ప్రాణాదశగుణాః స్మృతాః" (కావ్యాదర్శము)
2. (క) వాసన గాశివాగమము.........దేసిగ".... (6-79)
   (చ) అనులేపనములు......లేకయు......అంగములంతదేసి యగునే"(6-52)
   (ట) నడుమసదింత....కన్నులు వీనులదాసి దేసియై" (8-16)
3. (క) "మార్గితత్వా ద్విరించేన ప్రయుక్తత్వాత్త తర్షిణా
   మహోదయనిమిత్తత్వా న్నియతో మార్గ ఉచ్యతే." (కుంభః)
   భరతకోశము 486 పుట.

   (చ) "తదేవ రుచివైచిత్ర్యా చ్చిత్తరంజన హేతవే
   ప్రయుక్తం స్వస్వదేశేయత్ తతో దేశీతి కీర్తయేత్." (కుంభః)
   భరతకోశము 281. పుట.

అట్లయిన సంస్కృతకవిత మార్గకవితయనునదే సమంజసమేమో? యని యనవలసి యున్నది. అప్పుడు నన్నయదికూడ దేశికవితయే యగును. నన్నెచోడునిదియు దేశి కవితయే యగును. అయినను వీరిరువురికవితలోఁ గొంత భేదము లేకపోలేదు. చోడుని కవితలోఁ గొంచెము దేశి పాలెక్కువ. నన్నయలోఁ గొంచెము తక్కువ. "దేశి మార్గమ్ములు దేశీయములుగా" నని చోడుఁడు వచించినాఁడు. అనఁగాఁ జోడుని కవిత యందును మార్గకవితా సంప్రదాయములు కలవన్నమాట. ఏమయినను వీని నిదమిత్థముగా నిర్ణయించుట కష్టమయిన పని.

## అలంకారములు

"షట్త్రింశదలంకారాలంకృతంబై" తన కావ్యము రమణీయమగునని చోడుఁడు వచించినాఁడు. ఇది యుద్భటుని యలంకార సంఖ్యకు సరిపడుచున్నదని యిదివఱకే చెప్పఁబడినది. కావ్యాలంకార చూడామణి కారుఁడగు విన్నకోట పెద్దనయు, పాల్కురికి సోమనాథుఁడును నలంకారములను ముప్పదియాఱుగానే వచించినారు. దీనినిబట్టి యిది యానాటి సంప్రదాయమనియు ఈ సంఖ్య క్రమక్రమముగాఁ బెరిగినదనియుఁ జెప్పవలయును. వీని కన్నిటికిని కుమారసంభవమునుండి యుదాహరణముల నిచ్చుట గ్రంథవిస్తారహేతువు కావున వదలివేయుచున్నాను.

## చతుష్షష్టి విద్యలు

కవి యరువది నాల్గు విద్యలందు నేర్పు గలవాఁడై యుండవలెనని చోడుఁడు పీఠికయందు వచించినాఁడు. వానిలోఁ గొన్ని కుమారసంభవమున నెక్కడ వర్ణింపఁబడినవో చూపి యీ ప్రకరణమును ముగింతును. వివరముగా వ్రాయుట కిట స్థలము చాలనందున పాఠకులే వానిని జూచుకొన వేడుచున్నాను. చోడుని గజశాస్త్ర పరిజ్ఞానము 1 ఆ. 90 పద్యమునను, 11 ఆ. 134 వచనమునందును కాననగును.

కవిశకునశాస్త్ర పరిచయమునకు 4-60, 5-11 పద్యములును, జ్యోతిశ్శాస్త్ర పరిచయమునకు 1-24, 12-137 మొ. పద్యములును, రసవాదమునకు 6-146 పద్యమును, సంగీతజ్ఞానమునకు 9-135, 2-24, 8-180 మొ. పద్యములును, నాట్యశాస్త్ర పరిచయమునకు 6-103, 8-180, 9-38, 11-200, 12-147 పద్యములును, ధనుర్విద్యా కౌశలమునకు 12-157 వచనమును, కామశాస్త్ర పరిచయమునకు సురత వర్ణనములు, వైద్యశాస్త్ర పరిచయమునకు 8-99 పద్యమును, చిత్రకళా కౌశలమునకు, 5-119 6-166 పద్యములును, దోహద విజ్ఞానమునకు 9-122 వ పద్యమును, రత్నశాస్త్రమున కోషక్షేత్రస్థ వర్ణనమును, కృషి విషయిక పరిజ్ఞానమునకు 7-94, 95, 6-126 పద్యములును నుదాహరణములు. ఇట్లే నన్నెచోడ మహాకవి కడమవానిని సైతము సమయానుకూలముగాఁ దన కావ్యమున వర్ణించిచూపినాఁడు.

## ఉపసంహారము

ఈ విధముగా నన్నెచోడ మహాకవి ప్రతిభ యెక్కడఁ జూచినను నీ కుమారసంభవమునఁ జక్కగాఁ గానవచ్చుచుండును. ఆముక్తమాల్యదకు శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారి వలె నీ కవి మహాకావ్యమునకును సమగ్రమయిన వ్యాఖ్య వ్రాయవలసిన యవసర మెంతేనిఁ గలదు. అట్టి పని జరిగినప్పుడే నన్నెచోడ మహాకవి చాతుర్యము సర్వజనులకు సులభజ్ఞేయ మగును. నన్నెచోడుని కావ్యమున నన్వయ కాఠిన్యముగల పద్యములు గొన్ని యున్నమాట నిజమే! కాని ప్రత్యంతరములు లభించి, పాఠ నిర్ణయము జరిగి, యర్థ నిర్వచనము గావించికొని యెవ్వరేని సమగ్ర వ్యాఖ్య వ్రాసియుంచినచో నా పద్యములు నయితము చోడకవి భావనాబలమును లోకమునకుఁ జాటి యాంధ్ర సాహిత్యమున నీ మహాకవికి నిక్కముగా లభింపఁదగిన స్థానమును లభింపఁ జేయఁ గలవనియే నేను నమ్ముచున్నాను.

"లోకా స్సమస్తా స్సుఖినో భవన్తు"

★

# BIBILIOGRAPHY

## తెలుఁగు


1. కుమారసంభవము (వావిళ్ళవారి ముద్రణము) నన్నెచోడ మహాకవి
2. కుమారసంభవము (మద్రాసు విశ్వవిద్యాలయ ముద్రణము) నన్నెచోడ మహాకవి
3. డిటో 1. 2 భాగ. (శ్రీ మానపల్లి రామకృష్ణకవిగారి ముద్రణము,) నన్నెచోడ మహాకవి
4. ఆంధ్రమహాభారతము కవిత్రయము
5. బసవపురాణము (శ్రీ బండారు తమ్మయ్యగారి పీఠికతో) పాల్కురికి సోమనాథుఁడు
6. పండితారాధ్య చరిత్ర (డా॥ చిలుకూరి నారాయణరావుగారి పీఠికతో) పాల్కురికి సోమనాథుఁడు
7. కవిజనాశ్రయము రేచయ
8. ఉత్తరహరివంశము నాచన సోమనాథుఁడు
9. నిర్వచనోత్తర రామాయణము తిక్కన
10. శృంగారనైషధము శ్రీనాథుఁడు
11. కాశీఖండము శ్రీనాథుఁడు
12. శృంగార శాకుంతలము పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు
13. మనుచరిత్రము అల్లసాని పెద్దన
14. వసుచరిత్రము రామరాజ భూషణుఁడు
15. ఆముక్తమాల్యద కృష్ణరాయలు
16. పారిజాతాపహరణము నంది తిమ్మన
17. రాధికాసాంత్వనము ముద్దుపళని
18. విజయవిలాసము చేమకూర వేంకటకవి
19. శివలీలావిలాసము కూచిమంచి తిమ్మకవి
20. నృసింహ పురాణము ఎఱ్ఱాప్రెగ్గడ
21. కావ్యాలంకార చూడామణి విన్నకోట పెద్దన
22. వాసిష్ఠ రామాయణము మడికి సింగన
23. నరసభూపాలీయము (శ్రీ సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారి వ్యాఖ్యతో.) మూర్తికవి

24. అప్పకవీయము
అప్పకవి
25. బాల వ్యాకరణము
చిన్నయసూరి
26. కుమారసంభవ విమర్శనము
శ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు
27. విమర్శన తరంగిణి
శ్రీ నడకుదుటివీరరాజు పంతులుగారు
28. శివతత్వసారము
పండితారాధ్యుఁడు
29. పాలకురికి సోమనాథుఁడు
శ్రీ బండారు తమ్మయ్యగారు
30. ఆంధ్రకవితరంగిణి
కీ॥ శే॥ శ్రీ చాగంటి శేషయ్యగారు
31. ఆంధ్రభారత కవితావిమర్శనము
శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు, M.A.
32. దేశ-భాషా సారస్వతములు
శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు, M.A.
33. ఆంధ్రసాహిత్యచరిత్ర సంగ్రహము
Prof. శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనము గారు, M. A.
34. ఆంధ్రవాఙ్మయ చరిత్రము
డా॥ శ్రీ దివాకర్ల వేంకటావధాని గారు, M.A., (Hons.) Ph. D.
35. శతకకవుల చరిత్రము
శ్రీ వంగూరి సుబ్బారావుగారు
36. కవుల చరిత్రము
శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారు
37. తెలంగాణా శాసనములు
శ్రీ ఆదిరాజు వీరభద్రరావుగారు సంపాదించినది
38. నన్నెచోడ కవిచరిత్ర
శ్రీ దేవరపల్లి కృష్ణారెడ్డిగారు
39. తెనుఁగుకవుల చరిత్ర
శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు, M. A.
40. ఉషా నాటకము
శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు
41. బొబ్బిలియుద్ధ నాటకము
శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు
42. శబ్దరత్నాకరము
శ్రీ బ॥ సీతారామాచార్యులుగారు
43. వావిళ్ల నిఘంటువు
44. రాజరాజనరేంద్రుని పట్టాభిషేక సంచిక
45. భారతి సంపుటములు
46. పరిశోధన సంచికలు

## సంస్కృతము

1. ఆంధ్రశబ్ద చింతామణి
2. కావ్యాలంకార సూత్రవృత్తి
వామనుడు
3. కావ్యమీమాంస
రాజశేఖరుఁడు
4. కావ్యాదర్శము
దండి

5. కావ్యప్రకాశము
   మమ్మటుఁడు
6. ప్రతాపరుద్రీయము
   విద్యానాథుఁడు
7. సువృత్త తిలకము
   క్షేమేంద్రుఁడు
8. శివపురాణము
   వ్యాసమహాముని
9. శ్రీమద్రామాయణము
   వాల్మీకి
10. కావ్యాలంకార సంగ్రహము
   ఉద్భటుఁడు
11. కిరాతార్జునీయము
   భారవి
12. కుమారసంభవము
   కాళిదాసు
13. అభిజ్ఞాన శాకుంతలము
   కాళిదాసు
14. మాళవికాగ్నిమిత్రము
   కాళిదాసు
15. ముద్రారాక్షసము
   విశాఖదత్తుఁడు
16. మృచ్ఛకటికము
   శూద్రకుఁడు
17. దశకుమార చరిత్రము
   దండి
18. సాహిత్యదర్పణము
   విశ్వనాథకవిరాజు
19. అమరకోశము
   (సుధావ్యాఖ్య, గురు బాల ప్రబోధికలతో)
20. శబ్దకల్పద్రుమము(ఆంగ్లార్థములతో)
   జీవానంద విద్యాసాగరుఁడు
21. సంస్కృతాంగ్ల నిఘంటువు
   వి. యస్. అప్టే
22. హర్ష చరిత్రము
   బాణభట్టు
23. కాదంబరి
   బాణభట్టు
24. ఋగ్వేదసంహిత
   (సాయణభాష్య సహితము)
25. రతిరహస్యము
   కొక్కోకుఁడు
26. వాత్స్యాయన కామసూత్రములు
   (జయమంగళుని వ్యాఖ్యతో)
   శ్రీ పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు సంపాదించినది
27. ధ్వన్యాలోకము
   ఆనందవర్ధనాచార్యుఁడు
28. భరతకోశము
   శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు. M. A.
29. మహావీర చరితము
   భవభూతి

## ENGLISH

1. Saivism and Andhra Desa
   Prof. K. Sitaramiah, M.A.
2. A History of Sanskrit Literature
   Sri Varadachari, M. A.
3. Classical Sanskrit Literature
   Dr. M. Krishnamachariar, M. A. M. L., PH. D.
4. A Vedic Concordance
   Maurice Bloomfield

## కన్నడము

1. కవిరాజ మార్గము — నృపతుంగుఁడు



